# సాహిత్య సురభి

(ఆచార్య కె. సర్వోత్తమ రావు అభినందన సంపుటి)

సంపాదకుడు

**డా॥ గల్లా చలపతి**

ఆచార్య కె. సర్వోత్తమరావు అభినందన సమితి

తిరుపతి

ఆగస్టు 2000

# సాహిత్య సురభి

(ఆచార్య కె. సర్వోత్తమరావు అభినందన సంపుటి)

సంపాదకుడు

**డా॥ గల్లా చలపతి**

ఆచార్య కె. సర్వోత్తమరావు అభినందన సమితి
తిరుపతి

ఆగష్టు 2000

# సాహిత్య సురభి
(ఆచార్య కె. సర్వోత్తమరావు అభినందన సంపుటి)

సంపాదకుడు :

డా॥ గల్లా చలపతి.
తెలుగు అధ్యయనశాఖ
యస్.వి. యూనివర్శిటీ
తిరుపతి - 517 502

ప్రథమ ముద్రణ : ఆగష్టు, 2000

ప్రతులు : 500

ప్రచురణ : ఆచార్య కె. సర్వోత్తమరావు అభినందన సమితి, తిరుపతి

ప్రతులకు :

డా॥ సి. గోవింద రాజు
అసిస్టెంట్ ప్రొఫెసర్ ఆఫ్ తెలుగు
ఓరియంటల్ రీసెర్చి ఇన్స్టిట్యూట్
శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయం
తిరుపతి - 517 502

మూల్యం : రు. 180/-

ముద్రణ : కీర్తి ఆఫ్‌సెట్, 103, ప్రకాశం రోడ్, తిరుపతి.

సంపాదక వర్గం :

డా.. మేడసాని మోహన్

డా.. సి. రమణయ్య

శ్రీ ఎం. నాగన్న

డా.. సి. గోవింద రాజు

# ముందుమాట

మెత్తని హృదయం, మాత్సర్యం లేని స్వభావం, పరోపకార గుణం, అరమరికలు లేని వర్తనం, బహుభాషా పాండిత్యం, ఉత్తమ అధ్యాపకత్వం, నిశిత పరిశోధన పాటవం, అందరినీ కలుపుకొనే సౌమనస్యం, శిష్యవాత్సల్యం నిండుగా మూర్తీభవించిన సహృదయులు ఆచార్య కె. సర్వోత్తమరావుగారు. ఇరవై ఆరు సంవత్సరాలు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం తెలుగు శాఖలో అధ్యాపకత్వం నెరపి 30-6-2000 న పదవీ విరమణ చేశారు. వారి విద్యార్థులు, మిత్రులు, అభిమానులు కలిసి పదవీ విరమణ సందర్భాన్ని పురస్కరించుకొని 11-8-2000 న వీడ్కోలు సమావేశం ఘనంగా నిర్వహించాలని నిర్ణయించారు. ఆ సమయంలో 'సాహిత్య సురభి' పేరుతో వారి పేరు మీద ఒక అభినందన సంపుటిని ముద్రించి విడుదల చేయాలని కూడా సంకల్పించారు. సాహిత్యంలో నిష్ణాతుడైన ఒక ఆచార్యునికి సుప్రసిద్ధ పండితులు రచించిన వ్యాసాలను ఒక గ్రంథంగా ముద్రించి అంకితం చేయడం సముచితమైన నిర్ణయం.

ఈ నిర్ణయం తరువాత అందరికీ ఉత్తరాలు పంపి వ్యాసాలడగడం నుండి వ్యాసాలు సేకరించే వరకు ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపినవారు డా|| సి. గోవిందరాజు (అసిస్టెంట్ ప్రొఫెసర్ ఆఫ్ తెలుగు, ఓరియంటల్ రీసెర్చి ఇన్స్టిట్యూట్, యస్. వి. యూనివర్సిటీ, తిరుపతి) గారు ఈ పని సమర్థవంతంగా పూర్తి కావడానికి అభినందన సమితిలోని వ్యక్తులంతా బాధ్యతలో పాలుపంచుకున్నారు.

ఈ నిర్ణయాన్ని అమలు చేయడానికి, పదిహేను రోజులలో ఈ కార్యం యావత్తూ పూర్తి చేయడానికి 'ఆచార్య కె. సర్వోత్తమ రావు అభినందన సమితి' నిర్విరామంగా కృషి చేసింది. ఆర్థిక సమస్యలను అవలీలగా పరిష్కరించుకో గలిగింది. అందరూ ఉదారంగా ఆదుకున్నారు. పనులను పంచుకొని ఫలవంతం చేశారు. ఈ కార్యక్రమం ఇంత బాగా జరగడానికి నిర్వహణ మెలకువలు తెలిసిన, తెలుగు అధ్యయనశాఖకు

చెందిన కీలక వ్యక్తులు డా|| జి. డి. నాయుడు, డా|| కె. దామోదరనాయుడు గార్ల కృషి ఎంతగానో దోహదం చేసింది. వీరికి అభినందన సమితి పక్షాన కృతజ్ఞతలు.

అభినందన సంపుటిని తయారు చేసి ప్రకటించడానికి ఐదుగురు సభ్యులతో కూడిన సంపాదక వర్గం ఏర్పడి చురుకుగా పని చేసింది. అందులో నాకు ప్రధాన సంపాదకత్వ బాధ్యతను అప్పగించడం జరిగింది. సాహిత్యానికి చెందిన వివిధాంశాలలో నిష్ణాతులైన వివిధ విశ్వవిద్యాలయ పండితులను వ్యాసాలు రాసి పంపవలసిందిగా కోరాం. రెండు వారాలు గడువులోనే చాలామంది వ్యాసాలు పంపి సహకరించారు. ఈ సంపుటిలో వ్యాసాలను ఒక క్రమంలో అమర్చాం. సర్వోత్తమరావు వ్యక్తిత్వ విశేషాలను చిత్రించే చిరుకానుక, గురుకృపలను ముందుంచాం. తరువాత ప్రాచీన పద్య సాహిత్యానికి సంబంధించిన వ్యాసాలు, ఆ తరువాత పద సాహిత్యానికి సంబంధించిన వ్యాసాలు కనిపిస్తాయి. వీటి వెంట తులనాత్మక సాహిత్యానికి చెందిన వ్యాసాలున్నాయి. తరువాత అలంకారశాస్త్రం, తెలుగు నవల, కథానిక, కవితలకి సంబంధించినవి ; తరువాత భాషకు సంబంధించినవి అమర్చబడినాయి. చివర నాలుగు ఆంగ్ల వ్యాసాలున్నాయి. వస్తువైవిధ్యాన్ని, క్రమ వికాసాన్ని దృష్టిలో పెట్టుకొని చేసిన అమరిక ఇది.

వ్యాస కర్తలు వారివారి సాహిత్య రంగాలలో నిపుణులు కావడం వల్ల ఆయా వ్యాసాలలో ప్రామాణికత సిద్ధించడమే గాక నూతనాంశాల ఆవిష్కరణ కూడా జరిగింది. వ్యాసాలన్నిటా ఒకే రకమైన భాషా శైలిని సమకూర్చడానికి కొంత ప్రయత్నం చేశాం. ఆర్థిక వనరులను బట్టి కొంతవర్కైనా పుటలను తగ్గించవలసిన అవసరమున్నందున పెద్ద వ్యాసాలను కొంత తగ్గించవలసి వచ్చింది. అయితే ఆయా వ్యాస కర్తలు ప్రతిపాదించిన విషయం ఏమాత్రం పోకుండా, సందిగ్ధతకు తావు లేకుండా, స్పష్టత చెడకుండా జాగ్రత్తపడ్డాం. వ్యాసాలలో వ్యక్తమయిన అభిప్రాయాలకు పూర్తిగా వ్యాసకర్తలే బాధ్యులు. సకాలంలో వ్యాసాలు పంపి సహకరించినందుకు సంపాదక వర్గం వారికి కృతజ్ఞతలు తెలియజేస్తున్నది.

ఈ సంపుటికి ఈ రూపు రావడానికి అనేకుల సహకారం అవసరమైంది సంపాదక వర్గానికి అన్ని రకాల సహాయం చేసిన వారున్నారు. అన్నీ ఒక ఎత్తైయితే 'ప్రూపులు' చూడడం పెద్ద పని అయింది. తన సలహాలతో ఈ సంపుటి విలువను పెంచడమే గాక మిగిలిన అన్ని విషయాలలో సహకరించిన డా॥ మేడిపల్లి రవికుమార్ (తెలుగుశాఖ, ఎస్ వి. యూనివర్శిటీ, తిరుపతి) గారికి అభినందన సమితి పక్షాన, సంపాదక వర్గం పక్షాన కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

ఈ సన్మాన కార్యక్రమం ఏర్పాటు చేస్తున్నామని చెప్పగానే బలవంతం మీద ఒప్పుకొని గ్రహించిన వారు ఆచార్య కె. సర్వోత్తమరావు గారు. వారికున్న శిష్య వాత్సల్యం, మిత్రుల మీదగల అభిమానం ఈ కార్యక్రమాన్ని వద్దని చెప్పడానికి వీలు లేకుండా చేశాయి. వారికిది తగిన సత్కారమని మేము భావించడం లేదు 'చంద్రునికో నూలుపోగులా' అభినందన సమితి నిర్వహించిన ఈ కార్యక్రమంలో పాల్గొని సన్మానం గ్రహించిన ఆచార్య సర్వోత్తమరావు గారికి, వారి శ్రీమతి గారికి అభినందన సమితి కృతజ్ఞతలు

ఈ కార్యక్రమ నిర్వహణకు ఆర్థికంగా హార్దికంగా చేయూత నిచ్చిన మహానుభావులందరికి పేరుపేరున అభినందన సమితి కృతజ్ఞతలు తెలుపుకుంటున్నది. ప్రధాన సంపాదకుడుగా ఉండి సంపుటి వ్యవహారాలు చూడడానికి నాకు అవకాశం కలిగించిన అభినందన సమితికి నా కృతజ్ఞతలు.

గల్లా చలపతి

సంపాదకుడు.

# విషయ వివరణ

పుట

# చిరుకానుక

శ్రీ ముదివర్తి కొండమాచార్యులు

సర్వోత్తమ రావునకున్
పర్వేందు సమాన కీర్తి భాస్వంతునకున్
గర్వ విదూరున కంజలి
ధూర్వహునకు బంధుమిత్ర తోయజ రవికిన్

తమిళ కర్ణాట సంస్కృతాంధ్రమ్ములందు
పండితుండు విమర్శన పరివృఢుండు
మహిత సద్గ్రంధ రచయిత మధురవాగ్మి
ఉత్తమాధ్యాపకుండు సర్వోత్తముండు

కవిజన సహకారవనీ
నవ చైత్రుఁడుదార గుణుఁడు నానా విబుధ
స్తవనీయ పుణ్య చరితుం
డవనీ సురముఖ్యుఁడతని కగుత శుభమ్ముల్

అరమరిక లేని చెలికార మనఘు తోడ
నెఱపినాఁడను నిండుగ నిరువఁదేండ్లు
మతి బృహస్పతి యాతండు మర్మములును
మాయ లెఱుఁగని ఘన ఋజుమార్గ వర్తి.

విమల విజ్ఞానమూర్తి శ్రీ వేంకటేశ
విశ్వ విద్యాలయమ్మున విద్యగఱపి
శిష్యుల తనంత వారలఁజేసినాఁడు
విజయ కేతనము లెగుర వేసినాఁడు

మృదు మధుర వచస్కుండును
సదయాంతః కరణుఁడైన సఖున కిడితి త
త్పదవీ విరామ వేళన్
మది రంజిల రెండు మంచి మాటల కాన్కన్

# గురుకృప

ఆచార్య ఎస్.ఎ.స్. బ్రహ్మానంద

"గురు కృపాంజన పాయో మేరోభాయి
రామ నామ బినా దేఖతే నాయి"

అన్నాడు కబీరు

గురుకృప కల్గినవాడికి భగవంతుడు సాక్షాత్కరిస్తాడు భగవత్కృప గురువు ద్వారా సువ్యక్తమవుతుందని సంప్రదాయజ్ఞులు చెబుతారు

నా బాల్యంలో మా తండ్రిగారు మొదటి గురువు కాగా మాకు తారసిల్లిన రెండవ గురువు సర్వోత్తమ రావు గారు. వెడల్పాటి తెల్లని ముఖం, కుదిమట్టమైన విగ్రహం, ప్యాంటు, శ్లాగులతో నిరాడంబరంగా కన్పించే 'సారు'(ఆ రోజులలో అలా పిలిచేవాళ్ళం) అంటే పుంగనూరు చుట్టుపక్కల గ్రామాల లోని పిల్లలందరికీ ఎంతో ఆదరాభిమానాలుండేవి

ఆ రోజులలో (1960లలో) పుంగనూరు చాలా చిన్న గ్రామం, కానీ అక్కడ ఉన్న బసవరాజు జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల మాత్రం అప్పటికే ఎనభై సంవత్సరాల చరిత్ర ఉన్న అధ్యయన కేంద్రం అప్పుడే ఆ పాఠశాల గ్రంథాలయంలో పాశ్చాత్య గ్రంధాలు, నిఘంటువులు, విజ్ఞాన సర్వస్వాలు, స్వాతంత్ర్య పోరాటానికి సంబంధించిన ఎన్నో పత్రికలు దొరికేవి ఆ స్కూల్లో చదివిన వారు ఆ రోజుల్లోనే చాలా పెద్ద పెద్ద ఉద్యోగాలకు వెళ్ళారు బడి వాతావరణం, క్రమశిక్షణ మార్గదర్శకంగా ఉండేవి ఈనాటి ఆంగ్ల మాధ్యమిక స్కూళ్ళకన్నా మంచి ఇంగ్లీషును బోధించిన మాష్టార్లు మాకు ఆ పాఠశాలలో లభించారు

శ్రీ సుబ్రహ్మణ్యం రెడ్డి గారని ఒక అజాను బాహుడు హెడ్‌మాష్టరుగా ఉండేవారు. నేను 6వ తరగతిలో హైస్కూల్లో ప్రవేశించేటప్పటికి (1961) శ్రీ సర్వోత్తమరావుగారు ఆరోగ్యవరం (మదనపల్లె దగ్గర ఉన్న ఆస్పత్రి) నుంచి వచ్చి జిల్లా పరిషత్ పాఠశాలగా ఉన్న మాస్కూల్లో చేరి ఉన్నారు.

దాదాపు 20 సంవత్సరాలు వయసున్న మాష్టారుగా ఎంతో వినయ విధేయలతో మంచి పేరు తెచ్చుకున్నారు

పద్యం చదివే తీరు, వివరణ ఇవ్వటం, వ్యాకరణాంశాలు, అలంకారం, ఛందస్సు - వీటినన్నింటిని ఒక క్రమ పద్ధతిలో బోధించడంలో వారు దిట్ట అని అప్పటికే ఆయనకు పేరు. లోయర్ తరగతులలో 6, 7ల వరకు సారు క్లాసులు చెప్పలేదు 8 నుంచి తరగతులు తీసుకునేవారు. కానీ, సారు వద్ద పరోక్షంగా నా శిష్యరికం ఆరవ తరగతి నుంచే ప్రారంభమైంది

ఆ రోజులలో శనివారం సాయంత్రం తప్పనిసరిగా 'మోరల్ ఇన్‌స్ట్రక్షన్ పేరుతో పాఠశాలకంతటికీ ఒక పిరియడ్ ఉండేది పెద్ద కళాకారులు, కవులు, పండితులు వచ్చి ఉపన్యాసాలు చెప్పేవారు స్థానికులైన పెద్దలూ వచ్చి పాల్గొనేవారు ఆ కార్యక్రమాల నిర్వహణలో శ్రీరాములరెడ్డి గారనే డ్రాయింగ్ మాస్టరు, శ్రీ సర్వోత్తమరావు గారు ప్రధాన పాత్ర వహించేవారు

ఆహ్వాన పత్రికలపై అడ్రస్సులు రాయడం వారి వారి ఇండ్లలో వాటిని ఇచ్చి ఆహ్వానించటం - సభ నిర్వహణలో డ్యూటిలు పంచుకోవటం - ఇవన్నీ మాష్టారు చేయించే వారు. అప్పుడు ఏర్పడిందే కార్యక్రమాల నిర్వాహణలో ఆసక్తి

నేనూ ఒకప్పటికి అలా ఉపన్యాసాలు చెప్పాలని, శాలువలు కప్పించుకోవాలని అస్పష్టంగానైనా ఒక కోరిక మొదలైంది.

సంగీతం వచ్చిన వాడిని కావడం వల్ల ప్రతి కార్యక్రమంలో మాష్టారు ప్రార్థన చేయటానికి నన్నే పిలిచేవారు. వ్యాస రచనలు ఎలా చేయాలో నేర్పించింది వారే. ఉపన్యాసం చెప్పడానికి ఎలా ప్రిపేర్ కావాలో నేర్పించింది వారే. పాటల పోటీల్లో ఏ పాట సెలెక్ట్ చేసుకోవాలో నేర్పింది కూడా వారే. సర్వోత్తమ రావు గారు మహా దాక్షిణ్యమూర్తి. ఆయన ఎప్పుడూ డామినేట్ చేయదల్చిన వారు కారు. వారు ఎక్కడో దాగి ఉండి శిష్యులను ప్రకాశంలోకి తెచ్చారు. ఇది సర్వోత్తముడైన గురువు యొక్క ధర్మంగా చెప్పవచ్చు.

మాష్టారు గారు సదా 'కష్టజీవి'. ఒకనాడైనా ఆయన సుఖంగా ఉండాలని, సంపాదించాలని పేరు ప్రతిష్ఠలు తెచ్చుకోవాలని కోరుకున్నవారు కారు. కానీ, నిరంతరం కృషి చేసేవారు విద్వాన్‌గా మాష్టారైన వారు B A., M.A లు పూర్తిచేశారు హిందీలో అన్ని పరీక్షలు పాసై మంచి హిందీ విద్వాంసులయ్యారు సంస్కృతంలో కూడా ఉన్నత పరీక్షలు పాసయ్యారు ఇవన్నీ వారి వ్యుత్పత్తిని నిరంతరం పెంచాయి

వారు పుంగనూరులో 1968 దాకా పనిచేశారు ఒకసారి పుట్టపర్తి నారాయణాచార్యుల వారి ఉపన్యాసాలు ఏర్పాటు చేశారు పాఠశాల పక్కభాగంలో కోనేరు వద్ద శ్రీ వేంకటేశ్వర స్వామి ఆలయం ఉంది. ఆ ఆలయంలో ఉపన్యాసాలు జరిగాయి. అప్పుడు వారి సమక్షంలో పాటపాడే అవకాశం నాకు మాష్టారిప్పించారు ఇలానే ఎంతోమంది విద్వాంసులను చూడగలిగే ఆ అదృష్టాన్ని అంత చిన్న గ్రామంలో కల్పించారాయన

19౹౹7లో తిరుపతికి వచ్చేశాము. మాష్టారు ఓరియంటల్ కళాశాలలో లెక్చరర్‌గా సెలెక్ట్ అయ్యి 1968లో తిరుపతికి వచ్చారు అప్పటినుంచి ఇప్పటివరకు మా ఇద్దరి సుదీర్ఘ బాంధవ్యం అలానే ఉండిపోయింది మహానుభావుల తోటి పరిచయం నిరంతరం దృఢతరమవుతుందని పెద్దలంటారు మాష్టారుతో నా అనుబంధం అలా పెరుగుతూనే వచ్చింది.

PUC అయ్యాక BAలో స్పెషల్ తెలుగు విద్యార్థిగా నేను శ్రీ వేంకటేశ్వర ఆర్ట్స్ కళాశాలలో చేరాను. 1966 ప్రాంతంలో మాష్టారు 'పద్మశ్రీ' వారి ప్రచురణగా పిల్లలకు పనికివచ్చే వ్యాకరణం, ఛందస్సు, అలంకారాల మీద ఒక మంచి గ్రంధాన్ని ప్రచురించారు కళాశాలలో కూడా ఆ గ్రంధాన్నే నేను చదివేవాడిని

ఆ సంవత్సరాలలో పేదరికాన్ని అనుభవించినా ఎంతోనిష్ఠతో, శ్రద్ధతో చదువుకున్నాం. గురువులు చూపిన దయ, వాత్సల్యాలు నా జీవన సోపానాలయ్యాయి

ఒకసారి కాదు, రెండుసార్లు కాదు, ఎన్నోసార్లు 'సారు' వారింటికి వెళ్ళటం - డబ్బులు తెచ్చుకోవటం మా అమ్మ మందులకో, ఇంటి బాడుగలకో

వాడుకోవటం జరిగేది ఎన్నిసార్లు వెళ్ళినా ఆయన మాత్రం నిరాకరించటమో, తక్కువచేసి మాట్లాడటమో - ఎన్నడూ జరుగలేదు

1973లో MA తెలుగు పాసై, లింగ్విస్టిక్స్ చదవడానికి నేను హైద్రాబాద్ వెళ్ళిపోయాను 1974లో మాష్టరుగారు S.VU. తెలుగుశాఖలో లెక్చరర్‌గా ప్రవేశించారు

ఆ రోజులలో చాలా రంగాలలో మాష్టారు కృషి ప్రారంభించారు కుమ్మరం వృత్తి మాండలికాన్ని ఆచార్యులు జి యన్.రెడ్డి గారు, నాగయ్య గారు పరిశోధిస్తున్న సమయంలో మాష్టారు పద పట్టికల తయారీలో ఎంతగానో కృషిచేశారు దాక్షిణాత్య భాషల్లో ఛందస్సుల పైన ప్రామాణికమైన Ph.D. సిద్ధాంత గ్రంథం రచించారు

1976లో నేను S.VU, P.G. Centreలో లెక్చరర్‌ని అయ్యాను. అప్పటినుంచి మాష్టారు మరింత సన్నిహితులయ్యారు. నా జీవితంలో ముగ్గుర్ని నేను అతి సన్నిహితులుగా భావిస్తాను తండ్రిగా జి ఎన్ రెడ్డి, అక్కగా నిర్మల, అన్నయ్యగా సర్వోత్తమ రావుగారు నా జీవితంలో జరిగిన ప్రతి సంఘటన లోనూ నాతో స్పందించారు నా అభ్యుదయానికి సంతోషించారు. నాకు ఎక్కడ ఇబ్బంది కలిగినా ఆ ఇబ్బంది నుంచి బయటపడే మార్గాన్ని సూచించారు. వీరి అవ్యాజమైన అభిమానాన్ని ఈ జన్మలో తీర్చుకోగలమా అని అన్పిస్తుంది ఇలాంటి వ్యక్తులు తారసిల్లిన నేను చాలా అదృష్టవంతుణ్ణి.

ప్రాచీన రచయిత్రులు రచించిన కావ్యాలలో కనిపించే స్త్రీ మనస్తత్వాన్ని గురించి వీరు రచించిన గ్రంథానికి తెలుగు విశ్వ విద్యాలయం ఉత్తమ గ్రంథరచన బహుమతిని ఇచ్చింది.

వారి జీవితాన్ని, ఆలోచనా విధానాన్ని గేయకవులు చాలాప్రభావితం చేశారు. చిన్నతనం నుంచి వారి తల్లిగారి ద్వారా ఎన్నోపాటలు నేర్చుకున్న వారికి బాగాపాడటం వచ్చు. నేను పాడలేను అంటూ బాగా పాడుతారాయన. పురందరదాసు, అన్నమయ్య, త్యాగయ్య రామదాసుల మీద మక్కువ ఎక్కువ. ఆయా వాగ్గేయకారుల మీద ఎన్నో పరిచయ గ్రంథాలు రాశారాయన. ప్రత్యేకించి అన్నమయ్య మీద చాలా పరిశోధన చేశారు. చేయించారు

కూడా. అన్నమయ్య రచించిన సంస్కృత కీర్తనల మీద ఆయన విమర్శ వెలయించారు

తమిళ కన్నడ హిందీ సంస్కృతాంగ్లాలు రావటం వల్ల తులనాత్మక సాహిత్యంలో మంచి కృషి చేయగలిగారు కోదండ రామయ్యగారు, చల్లారాధాకృష్ణ శర్మ గార్ల తరువాత తులనాత్మక సాహిత్యంలో మాష్టారుగారి కృషి చాలాగొప్పది

ఆచార్య జియన్‌రెడ్డి గారు, ఆచార్య సుబ్బారెడ్డి గారు, ఆచార్య జి నాగయ్య గారు పరమపదించిన తర్వాత తెలుగుశాఖ అంటే గుర్తుకువచ్చే వ్యక్తిగా మాష్టారే మిగిలారు. అన్ని విశ్వ విద్యాలయాల లోనూ S V యూనివర్శిటీ ప్రతినిధిగా వారు తెలుగు శాఖ ప్రామాణికతను ఉద్దీప్తంచేసి పేరు సంపాదించారు.

వారి జీవితంలో ఇలవేల్పయిన శ్రీవేంకటేశుని పాదాలను ఆయన త్రికరణ శుద్ధిగా విస్వసించారు, సేవించారు దాని ఫలితమే దేవస్థానం ఉద్యోగిని లలితమ్మగారు వారికి అర్ధాంగి కావటం. శ్రీవారి కృపవల్ల వారి అబ్బాయిలిద్దరూ మంచి విద్యాబుద్ధులు కలవారై జీవితంలో మాష్టారుకు ప్రశాంతమైన ఉద్యోగానంతర జీవితం లభించింది వారు తిరుమల తిరుపతి దేవస్థానముతో నలభై సంవత్సరాల అనుబంధం ఉన్నవారు. అన్నమాచార్య ప్రాజెక్ట్ తదితర అనుబంధ సంస్థలన్నిటితోనూ వారికి సంబంధం ఉంది. సాహిత్య సంబంధంగా ఆలయ నిర్వహణకు సంబంధించి వేసిన అన్ని కమిటీల లోనూ వారున్నారు దాదాపు అన్ని సభల లోనూ వారు పాల్గొంటున్నారు శ్రీవారి కళ్యాణోత్సవం మీద వారు రచించిన గ్రంథం పరమ ప్రామాణికంగా ఉంది.

వారికి ఉన్న శిష్యప్రీతి ఎలాంటిదో చెప్పడానికి ఒక సంధర్భాన్ని వివరిస్తాను. కొన్ని ఏళ్ళక్రితం ఆళ్వార్ దివ్య ప్రబంధ ప్రాజెక్ట్ వారు కూరత్తాళ్వార్ మీద అనంతపురంలో ప్రసంగించమని కోరారు. అప్పటికి ఆళ్వార్ సాహిత్యం గురించి నాకు తెలిసింది చాలాతక్కువ తిరుపతికి ఫోన్‌చేసి ఏదైనా గ్రంథం కావాలని అడిగాను వెంటనే మాష్టారుగారు ఒకచిన్న పాకెట్ డైరీలో రెండు గంటల ఉపన్యాసానికి సరిపడేంత విషయాన్ని రాసి నాకు కొరియర్‌లో పంపించారు. ఈ రోజులలో ఇంత ఓపిక ఎవరికి ఉంటుంది.

పోనీ నాకేనా అంటే ప్రతి ఒక్కరికీ ఆయన ఆలాగే సహాయం చేశారు ఎంతో మందికి గ్రంథ ప్రచురణకు డబ్బు ఇప్పించారు ఎన్నో గ్రంథాలకు పీఠికలు రాశారు. ఏ చిన్న కృషిని చూసినా కొండంత మెచ్చు కోవటం వారికి మాత్రమే సాధ్యమైనపని. అలాగని పక్షపాతం, వట్టి మెచ్చుకోలు వారిలో ఎక్కడా కనిపించవు. గుణదోషాలను రెండింటినీ బేరీజువేసి గుణాన్ని ప్రధానంగా గ్రహించి ప్రోత్సహించడం వారి విశిష్టత.

సాధారణంగా పండితులు మాత్సర్య గుణంతో ఉంటారు./ అందుకే విశ్వ విద్యాలయాలలో ఏ శాఖలోనూ పరస్పర సహకారం, ప్రశాంత వాతావరణం కనిపించదు. వైషమ్య స్థానాలుగా మారిపోయాయి. అయినా మాష్టారు తమ పరిధులను దాటకుండా ఇతరులను దూషించకుండా ఔచిత్యాన్ని వదలకుండా ఉద్యోగాన్ని నిర్వహించారు.

నా జీవితంలో వారిచ్చిన ప్రోత్సాహం సదా స్మరించదగినది. 1992లో నేను ప్రొఫెసర్ అయినప్పుడు 1999లో కార్యదర్శి అయినపుడు పరీక్షకులుగా వారే వచ్చారు. 'మా బ్రహ్మానంద' అంటూ పరిచయంచేసే వారి ఔదర్యాన్ని చూసి ఒకొకసారి సిగ్గవుతుంది. అంత ప్రేమించిన వారికి మనం ఏమిచ్చామని ఆలోచించినపుడు భయం కూడా కలుగుతుంది. తల్లితండ్రుల ఋణం లాగానే 'గురుకృపా' ఋణం కూడా తీర్చుకోలేమనిపిస్తుంది. వారి వద్దనేను నేర్చుకున్నది ఒక్కటే - మంచిని చూడటం, పెంచటం, ప్రోత్సహించటం.

మొన్న విజయవాడలో ఎవరో అన్నారు. ప్రపంచంలో ఏ కొద్ది మంది పేర్లో అర్థవంతంగా ఉంటాయి అని అంటూ సర్వోత్తమరావు గారిని ప్రస్తావించారు. నిజానికి అందరిలోనూ ఉత్తములు, అందరకీ ఉత్తములు, అన్నిటిలోనూ ఉత్తములు అని ముమ్మారు మనం ప్రశంసించ దగిన మహోన్నత వ్యక్తి ఆయన. అందుకే శ్రీనివాసుడు తన పాదాల చెంత వారికి సముచిత సేవా భాగ్యం ప్రసాదిస్తూనే ఉన్నాడు.

గత మాసంలోవారి ఉద్యోగ జీవితం సమాప్తమై వారు విశ్రాంతాచార్యులయ్యారు. ఒకరోజున పుంగనూరికి వెళ్ళి పాత జ్ఞాపకాలను నెమరు వేసుకోవాలని అనుకున్నాం. ధర్మ ప్రచారపరిషత్తు చిత్తూరు శాఖవారు వారి ఉపన్యాస కార్యక్రమాన్ని జూలై 6న పుంగనూరులో ఏర్పాటు చేశారు. శ్రీ

వేంకటేశ్వరస్వామి ఆలయంలోనే కార్యక్రమం జరిగింది సరిగ్గా ప్రచారం లేక పోయినా దాదాపు 200 మంది అప్పటికప్పుడు గుమిగూడారు. ఇప్పటికీ వారిశిష్యులు, ప్రశిష్యులు సర్వోత్తమరావు గారు అనే పేరును అంతగా గౌరవిస్తారని ఆ జన సముదాయం నిరూపించింది. శ్రీ వేంకటేశ్వరుని మీద, అన్నమయ్య మీద మాష్టారు ప్రసంగించారు

అంతలో సమయం చూసుకొని శ్రీనివాసులురెడ్డి గారింటికి వెళ్ళాము. మూడు సంవత్సరాల క్రితం వారు పరమపదించారు 'తొలిప్రొద్దు' అనే సాహిత్య పత్రికను నడిపిన వారాయన. గొప్ప కళాకారులు. నటుడు కూడా 'వారుపోయారుకదా' ఇక మీరు మా ఇంటికి రారేమో అనుకున్నానండి! అన్నారు శ్రీమతిరెడ్డి గారు.

ఆమాటవిని మాష్టారు చాలా బాధపడ్డారు. వారికి ఎవరిపట్లా అగౌరవ భావం లేదు ఎవర్నీ ఆయన కించపరచి ఎరుగరు. అలాంటివారు స్నేహితుడి కుటుంబాన్ని ఎలా మరవగలరు?

ఇలా దాదాపు నాలుగు దశాబ్దాలు గడిచినా ఇంకా మాష్టారును చూస్తే ఆనాటి 'సారే' గుర్తుకు వస్తారు.



# శ్రీలక్ష్మీసహస్ర కావ్యము

డా॥ ముదివేడు ప్రభాకరరావు

శ్లో॥ లక్ష్మీ చరణ రాజీవ లాక్షాలక్షిత వక్షసే ।
విశ్వసర్గాది లీలాయ వేంకటబ్రహ్మణేనమః ॥

ఎవని యొక్క వక్షస్థలం భగవతి శ్రీ లక్ష్మీదేవియొక్క చరణ కమలాల లాక్షారాగ చిహ్నితాలై ఉన్నాయో - అంటే ఆమె పాదాల పారాణిగుర్తులు కలిగివున్నాయో - అటువంటి పరబ్రహ్మస్వరూపుడైన శ్రీ వేంకటేశ్వరస్వామికి నమస్కరిస్తున్నాను.

ఈ శ్లోకం వ్రాసిందెవరు? వేంకటాధ్వరి ఆయనే శ్రీలక్ష్మీ సహస్ర కావ్యకర్త పైశ్లోకం ఆ కావ్యంలోని ఆరంభస్తబకంలో మొట్టమొదటి శ్లోకం. కవి కావ్య సృష్టికర్త దేవుడు విశ్వసృష్టికర్త అందుకే, 'విశ్వసర్గాది లీలాయ' అని కవి వాడినాడు. విశ్వమంటే ఈసకల చరాచర ప్రపంచం. సర్గమంటే సృష్టి. 'ఆది' శబ్దంచేత స్థితి, లయాలకు కూడ ఆయనే కర్త. ఈ మూడు పనులు ఆయనకొక లీల! ఈ లీల ఏమిటయ్యా! అంటే, పిల్లికి చెలగాటం, 'ఎలుకకు ప్రాణసంకటం' అన్నట్లు సృష్టిస్థితిలయాల్ని ఆయన హేలగా, అవలీలగా చేసి పారేస్తుంటే, మధ్యలో సంసారంలో చిక్కుకొన్న జీవుల ఆక్రందనల్ని వినే వారెవరైనా ఉన్నారా? అని ప్రశ్నిస్తే, ఉన్నారు, ఉన్నారని ఘంటాపథంగా చెబుతూ, మహాకవి వేంకటాధ్వరి, 'శ్రీలక్ష్మీదేవియే మనవంటి సంసారిచేతనులైన జీవులకు దిక్కు' అని నిరూపిస్తూ వ్రాసిన వేయి శ్లోకాల పై చిలుకు గ్రంథమే శ్రీలక్ష్మీ సహస్రకావ్యము.

ఈ మంగళాచరణ శ్లోకాన్ని బట్టి, శ్రీవేంకటాధ్వరి - శ్రీరామానుజ సంప్రదాయాన్ని అనుసరించే విశిష్టాద్వైతి అని స్పష్టమౌతున్నది శ్రీ వేంకటేశ్వరుడే సాక్షాత్ పరబ్రహ్మం! బ్రహ్మమొక్కటే పరబ్రహ్మ మొక్కటేనని అన్నమయ్య సంకీర్తించినట్లు, వేంకటాధ్వరి స్వామి 'లీల'ను ప్రశంసించాడు "లోకవత్తల్లీ లాకైవల్యమ్' అనే బ్రహ్మసూత్రాలలోని వాక్యాన్ని యిలా చెప్పాడన్నమాట! ఆయన లీల, నిర్గుణ బ్రహ్మయొక్క లీల కాదు. సగుణము, సాకారము, మాయావిశిష్ట చైతన్యము యొక్కలీల! అట్టి లీలా విశేషంగలవాడే శ్రీ రామానుజమతానుసారం జగత్తు యొక్క సృష్టిస్థితిలయాలకు

కారకుడౌతున్నాడు. ఇది ఆయనకొక విలాసం! అందుకే, సాకారుడు, సగుణుడైన స్వామి వక్షస్థలంపై లక్ష్మీదేవి పాదాల పారాణి గుర్తులు తగిలివున్నాయని చెప్పాడు. అంటే 'అమ్మవారికి స్వామి వశంవదుడు' ఆమె చెప్పినట్లువింటాడు అని ధ్వనింపజేస్తున్నాడు కవి ఎలా వింటాడయ్యా అంటే - ఒక తల్లి తనబిడ్డ తరపున వకాల్తా పుచ్చుకొని, భర్తదగ్గర పిల్లవాణ్ణిగురించి అనునయంగాచెప్పి, వాడిపట్ల ఆయనకుండే కోపాన్ని, అసహనాన్ని తగ్గించి, బిడ్డను తండ్రిచే ఏవిధంగా లాలింపజేస్తున్నదో అదేవిధంగా, వేయితప్పులు చేసి తలలు వంచుకొన్న మన ముఖాలు చూడనని భీష్మించుకొన్న అస్వామిని తన దివ్యమైన హావభావాలతో మైమరపించి, తన వైపు త్రిప్పుకొని, "ఇదిగో వీరందరూ మన బిడ్డలు ఏదో తెలియక తప్పు చేశారు ఇప్పుడు పశ్చాత్తాపపడుతున్నారు. నాకు తెలియక అడుగుతాను. అసలు సృష్టిలో తప్పుచేయనివాడెవ్వడు? నామాటవిని వారిని ఒక్కసారి కన్నెత్తి సాదరంగా చూడండి వారి పాపాలు పటాపంచలై పోతాయి" అంటుంది. అలా, స్వామివారి ముఖాన్ని మనవైపు తిప్పుతుంది. అంతే! మన పాపాలు ప్రక్షాళింపబడి మనకు ముక్తి లభిస్తూవుంది. ఈ పనిచేస్తున్నదెవరు? తల్లి - భగవతి లక్ష్మీదేవి! దీనికే 'పురుషకారము' అంటారు. శ్రీ వైష్ణవసంప్రదాయంలో ఈ లక్ష్మీపురుషకారం చేతనే చేతనులైన సంసారులు బతికి బట్ట కడుతున్నారు.

కవి మనకు ఏంచెబుతున్నాడిక్కడ? ఎవడు సాక్షాత్ పరబ్రహ్మమో, ఆయన మోక్షం యివ్వాలిగాని వాళ్ళూ, వీళ్ళూ యిస్తారటయ్యా! అయితే అ పరబ్రహ్మ మెవరు? ఎవరోకాదయ్యా! ఆ ఏడుకొండలపై వెలసిన శ్రీ వేంకటేశ్వరుడే! ఆయన పాదాలు పట్టుకోండి. మోక్షాన్ని సంపాదించండి" అంటున్నాడు

## కవి దేశకాలాలు

ఇటువంటి ఉత్కృష్టమైన ఉపదేశం చేసిన మహాకవి వేంకటాధ్వరిని గురించి సంక్షిప్తంగా రెండుమూడు విషయాలు తెలిసికొని మరలా గ్రంథంలోకి వస్తాము

వేంకటాధ్వరికే వేంకటాచార్యులని కూడపేరు ఈయన కంచికి సమీపంలోని 'అరిశాణపాలై' అనే ఊళ్లోజన్మించడంచేత ఈయనను "అరిశాణపాలై వేంకటాధ్వరి" అనికూడ పిలుస్తారు ఈయన తండ్రిపేరు రఘునాథుడు. తల్లిపేరు సీతాంబ. వీరిది ఆత్రేయ గోత్రం ఈయన తాతగారైన

శ్రీనివాసునికే అప్పయగురువనేపేరుంది. ఈ అప్పయగురువు కాంచీపురంలోని పంచమతభంజన తాతాచార్యుల మేనల్లుడు. అప్పయ్యదీక్షితుల సమకాలికుడు, శ్రీరామానుజుల శిష్యుడైన ప్రణతార్తిహరుని వంశపుకోవలో పుట్టినవాడు. వేదాంత దేశికుల గురువైన వాదిహంస బుధుడు, వేంకటాధ్వరి పూర్వీకులలో ఒకరు. ఇటువంటి ఉదాత్త వంశపరంపరలో పుట్టిన వేంకటాధ్వరి విశిష్టాద్వైతి కావడంలో ఆశ్చర్యంలేదు, సరికదా, ఈయన శ్రీవేదాంత దేశికుల అడుగుజాడల్లో నడచిన అనుయాయి ఈయన సాహిత్య సృష్టి నీలకంఠ దీక్షితులతో సమానంగా ఉండడం గమనించవచ్చు. వేంకటాధ్వరి క్రీ. శ. 17వ శతాబ్ది పూర్వార్ధంలో జీవించివుండగా, నీలకంఠ దీక్షితుడు 17వ శతాబ్ది ఉత్తరార్ధంలో జీవించి వున్నవాడు. వేంకటాధ్వరి కొంతకాలం ప్రళయకావేరి సంస్థానంలో ప్రధాన పండిత కవిగా పనిచేశాడు.

ఈయన వ్యాకరణం, న్యాయం, మీమాంస, సాహిత్యం, అలంకారశాస్త్రం, భక్తిరస శాస్త్రాలలో కృషి చేశాడు. వైష్ణవ తంత్రశాస్త్రాలలో గహనమైన పాండిత్య ప్రకర్షగలవాడు. ఈయన 108 గ్రంథాలు వ్రాసినట్లు ప్రతీతి ఉన్నదికాని ఈనాడు 16 గ్రంధాలు మాత్రమే లభ్యమౌతున్నాయి. వీటిలో లక్ష్మీ సహస్రమ్, శ్రీనివాససహస్రమ్ అనేవి స్తోత్రకావ్యాలు ఈయన వ్రాసిన విశ్వగుణాదర్శ చంపూ ఈలోకంలోని గుణావగుణాలకు అద్దంపట్టే విమర్శ కావ్యం

## రెండు ఐతిహ్యాలు

ఈ కవి 'లక్ష్మీసహస్రం' వ్రాయడంలో రెండుఐతిహ్యాలు చెబుతారు. ఒక ఐతిహ్యమేమంటే -'విశ్వగుణాదర్శచంపూ' కావ్యంలో లోకాన్ని నిశితంగా విమర్శించడంచేత ఆయనకు రెండు కళ్లుపోయాయని, స్థితిపాలకుని లోకాన్ని విమర్శించినందుకు దుఃఖించి లోకానికి రెండు కళ్లైన లక్ష్మీ శ్రీనివాసులను వేయి వేయి శ్లోకాలతో స్తుతించి తిరిగి నేత్రలబ్ధిపొందినట్లుగా చెబుతారు. రెండవ ఐతిహ్యం యిలావుంది. 'విశ్వగుణాదర్శం'లో ఈ లోకంలోని గుణాలను, దోషాలను సమానంగా ప్రతిపాదించినప్పటికీ దోషాలను చెప్పేటప్పుడు కవిమనస్సు చాలబాధపడింది. ఈ మనోదౌర్బల్యాన్ని పోగొట్టుకోవడం కోసం పరబ్రహ్మయొక్క ఐశ్వర్యాన్నైనా స్థిరంగా నిలబెట్టే శక్తిగల శ్రీమహాలక్ష్మీ దేవీస్తుతి ఒక్కటే దీనికి ఏకైక శరణ్యమని తలచి వేయిశ్లోకాలలో 'లక్ష్మీసహస్రమ్' వ్రాశాడంటారు.

## ప్రభావాలు

ఏది యేమైనప్పటికీ వేంకటాధ్వరి లక్ష్మీ సహస్రమ్, శ్రీనివాస సహస్రమ్ అనే రెండు స్తోత్రకావ్యాలు వ్రాయడంలో క్రీ శ. 8వ శతాబ్దంలోని జగద్గురు శ్రీ ఆది శంకరాచార్యులు వ్రాసిన సౌందర్యలహరి, శివానందలహరీ శతకాలు ప్రభావితంచేశాయని స్పష్టంగా చెప్పవచ్చు. శ్రీరామానుజులు (క్రీ శ 1017-1137) స్తోత్ర సాహిత్యం ఎక్కువగా వ్రాయలేదు దీన్ని దృష్టిలో పెట్టుకొనే శ్రీ వేదాంతదేశికులవారు (క్రీ శ 1269 - 1370) స్తోత్ర సాహిత్యాన్ని విరివిగా వ్రాయడమేగాక "శ్రీరంగనాథ పాదుకా సహస్రమ్" అనే స్తోత్రగ్రంథం వ్రాశారు

సహస్రసంఖ్యలో స్తోత్రకావ్యం వ్రాయడానికిది ప్రేరణకాగా, శ్రీరంగనాథులపైన తన గురుపరంపరలోని వేదాంతదేశికులు 'పాదుకాసహస్రమ్' వ్రాశారు కాబట్టి, శ్రీరంగం తర్వాత తిరువేంగడం అష్టోత్తర శతదివ్య దేశాలలో తలమానికం గనుక శ్రీనివాసునికూడ చేర్చి లక్ష్మీ శ్రీనివాసులకు కైంకర్యంగా ద్విసహస్రజిహ్వాలుగల ఆదిశేషుడు స్తుతిస్తే ఎలావుంటుందో అలాగా రెండువేల శ్లోకాలతో రెండు స్తోత్ర కావ్యాలను రచించాడు, వేంకటాధ్వరి.

ఈ శతాబ్దిలో పుట్టిన శ్రీవాసిష్ఠగణపతిముని (శ్రీరమణ మహర్షులవారిచే 'నాయన' అని పిలువబడినవారు) అమ్మవారిపరంగా శ్రీ శంకరుల సౌందర్యలహరి నూరుశ్లోకాలే ఉన్నాయని భావించి, "ఉమాసహస్రమ్" అనే అద్భుత స్తోత్రకావ్యాన్ని సంతరించారు ఆధునిక కాలంలో సురపురం సంస్థానంలోని మూడవ వేంకటాచార్యులు (కిరీటి వేంకటాచార్యులు) లక్ష్మీ శతకం వ్రాశారు. హొసదుర్గం కృష్ణమాచార్యులవారు సురభివేంకట జగన్నాథరావు (1850 - 1883)గారి ఆస్థానకవిగా "లక్ష్మీవిలాసచంపూ" కావ్యం వ్రాశారు.

వేంకటాధ్వరి లక్ష్మీసహస్రంపై రెండు వ్యాఖ్యలు కూడ వెలిశాయి. 1) క్రీ.శ 1850లో జీవించిన వేంకటశాస్త్రి వ్రాసిన వ్యాఖ్య 2) దేవరకొండ కుటుంబానికి చెందిన వెంకటస్వామి కుమారుడు వీరేశ్వరస్వామి 'సురభి' అనే పేరుతో వ్రాసిన వ్యాఖ్యలు ప్రసిద్ధమైనవి. (GOML, Madras, R 2210 - 2211)

## కావ్య పరిచయం

భగవతి లక్ష్మీదేవిని 25 స్తబకాలతో లక్ష్మీ సహస్ర కావ్యంలో స్తుతించాడు వేంకటాధ్వరి స్తబకమంటే 'పుష్ప గుచ్ఛం' పూలగుత్తి, ఒక్కొక్క శ్లోకం

ఒక్కో పుష్పం అలాంటి శ్లోకాలనే పుష్పాలను కలిపికట్టిన "శ్లోక పుష్పగుచ్ఛ" మన్నమాట స్తబక మంటే! తల్లి పాదాలను పుష్పాలతోనే కదా అర్చిస్తాము! భక్తుడైన కవికూడ సరిగ్గా శ్లోకాలనే పుష్పాలను తల్లిపాదాలకు సమర్పించాడు. ఒకటికాదు, రెండుకాదు, 1016 శ్లోకాలనే పుష్పాలను వీటిని 25 గుత్తులుగా కట్టాడు. కాబట్టి 'స్తబక' మనేపేరు సార్థకమైంది కనీసం ఆ స్తబకాల పేరైనా ఒక్కసారి స్మరిద్దాం!

ఆరంభ (29), ప్రాదుర్భావ (23), వక్షఃస్థలావస్థాన (26), కారుణ్య (23), కటాక్ష (64), ప్రయత్న (39), మంగళ (13), సౌందర్య 235), శృంగార (50), ఐశ్వర్య (19), క్షాంతి (30), ఉత్సవ (50), ఔదార్య (20), యమక (61), నక్షత్రమాలా (28), విచిత్ర (11), నామవైభవ (42), పద్మవైభవ (40), అభీతి (30), పరిసంఖ్యా (30), దశావతార (36), చిత్ర (58), సంకీర్ణ (30), నిర్వేద (12) ఫలస్తబకములు (17), శీర్షికల తర్వాతి అంకెలు శ్లోక సంఖ్యను సూచిస్తాయి మొత్తం 1016 శ్లోకాలు.

**ఆరంభస్తబకం**

'జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ" అని కాళిదాసు అన్నట్లుగా ఈయనకూడా-

**అసదృశ మరుణాబ్జ దృశం**
**ప్రస్ఫీత పయోధర స్ఫురన్మూర్తిమ్ |**
**మనసి దధీమహి సతతం**
**లోకానాం మాతరం చ పితరం చ ||**

జగజ్జనని మహాలక్ష్మీదేవిని, జగత్పిత శ్రీవేంకటేశ్వరస్వామిని మన మెల్లప్పుడు హృదయంలో పదిలపరచుకోవాలి. లక్ష్మితో సమానులైనవారు వేరెవ్వరూలేరు. ఆమె నయనాలు ఎఱ్ఱకలువలవలె నున్నవి. ఆమె ఉత్తుంగ స్తనద్వయములు శోభకు, కాఠిన్యానికి నెలవైనవి. శ్రీ వేంకటేశునితో సమానులైన వారెవ్వరూలేరు. సూర్యచంద్రులు ఆయన రెండు నేత్రాలు. జలముతో నిండిన నీలమేఘాన్ని స్ఫురింపజేసే నీలవర్ణంగల శరీరమాయనది.

**శ్లో|| లక్ష్మీనాథ సమారంభాం నాథ, యామున మధ్యమామ్|**
**అస్మదాచార్య పర్యంతాం వందే గురుపరంపరామ్||**

అనే శ్రీ వైష్ణవసంప్రదాయంలోని గురుపరంపరాశ్లోకాన్ని ఈ క్రింది విధంగా విపులీకరించారు వేంకటాధ్వరి.

శ్లో॥ ఆచక్రాయుధ మాచ మామక గురోరాచార్యవర్గం భజే
మధ్య స్తైరిహ నాథ, యామున ముఖైర్మా న్యైః సనాథీకృతమ్ ।
క్షీరాంబోధి సుతాపయోధర పయః పురా ఇవోది త్వరా
యద్వాచాం విసరా జగంతి నితరా ముజ్జీవయంతి స్స్వయమ్ ॥

భగవంతుడైన విష్ణునారాయణునితో ప్రారంభమై, నా గురువు వేంకటనాథుడనే వేదాంతదేశికుల పర్యంతముగల సకల ఆచార్య పరంపరకు నమస్కరిస్తున్నాను ఈ పరంపర మధ్యలోగల నాథముని, యమునాచార్యులనే మహాపురుషులను కలుపుకొన్నది ఈ ఆచార్య పురుషుల వాక్సమూహము క్షీరసాగర తనయయైన లక్ష్మీదేవి స్తనముల దుగ్ధ ప్రవాహాలతో సమానంగా ఉదయించినవి కావడంచేత సమస్తభువనాలు స్వయంగా ఎంతో ఆనందాన్ని అనుభవించాయి.

శ్లో॥ రసికాలిభిరాస్వాద్యం రమ్యం శ్రీకర విలసదలంకరణమ్ ।
వికసతు సూర్యాలోకాత్ పద్మనివాసే! సహస్ర పత్రమివ ॥

పద్మమే నివాసంగాగల పద్మావతీ! ఈ రమణీయమైన లక్ష్మీ సహస్ర స్తోత్రం వేయిరేకులు విచ్చుకొన్న పద్మం వంటిది. ఇది రసిక జనులనే తుమ్మెదల పంక్తులద్వారా ఆస్వాదమొనర్చుటకు యోగ్యమైనది. కావ్య శోభాకరాలైన అలంకారాలతో కూడుకొన్నది (సూర్య + ఆలోకము) సూర్యాలోకము ద్వారా పద్మమువలె వికసితమైన పద్మము (సూరి + ఆలోకము) పండితుల విమర్శ దృష్టి పడడంచే మిక్కిలి వికసించిన ఈ కావ్య పద్మం యొక్క సువాసనలు దశదిశల వ్యాపించునుగాక!

## సౌందర్యస్తబకం

శ్లో॥ వందే సౌందర్య పర్యాప్తి భూమిం కామపి దేవతామ్।
అబ్జం సహోదరం యస్యాః శంసత్యబ్జ శరం సుతమ్॥

సౌందర్యం యొక్క చరమసీమ, నిర్వచించడానికి వీలులేని అతిలోక సౌందర్యవతియైన లక్ష్మీదేవికి నేనునమస్కరిస్తున్నాను ఎందుకంటే ఆమె తమ్ముని చంద్రుడని, ఆమెకుమారుని కామదేవుడని పిలుస్తారు. అంటే మన్మథుడామె కుమారుడు ఆమె మన్మథుని కన్నతల్లి.

ఇది చాల అందమైన స్తబకం ఈ సౌందర్య స్తబకం వ్రాయడంలో శ్రీ ఆదిశంకరుల సౌందర్యలహరీ ప్రభావం స్పష్టంగా తెలుస్తుంది. ముందుగా శ్రీ శంకరుల శ్లోకాన్ని చెప్పి దానిని ఎన్ని విధాలుగా వేంకటాధ్వరి లక్ష్మీ పరంగా అన్వయించారో చెబుతాను

ధునోతు ధ్వాంతం నస్తులిత దలితేందీవరవనం
ఘనస్నిగ్ధ శ్లక్ష్ణం చికురనికురుంబం తవ శివే |
యదీయం సౌరభ్యం సహజ ముపలబ్ధుం సుమనసో
వసన్త్యస్మిన్మన్యే వల మథన వాటీ విటపినామ్|| (శ్లో. 43)

ఇది పార్వతీదేవి యొక్క నల్లని కేశపాశముల వర్ణన. 'ఓదేవీ' కల్పవృక్ష కుసుమాలు కూడ నీ యొక్క సహజ సుగంధ సంవాసితాలైన కేశపాశాలను పొందగోరిన విధంగా, మిక్కిలి చిక్కనైన నల్లని నీ కురులు వికసించిన నల్ల కలువల వలె ఉన్నాయి. అవి నాలోని తమోగుణాన్ని తొలగించునుగాక!

శ్రీశంకరులు కూడ ఈ రహస్యాన్ని ఎక్కడ నుండి పట్టుకొచ్చారు అంటే, తమిళనాడులోని మూడవసంగకాల సాహిత్యంలో మధురలో 'సంగప్పలహై' అనే కవుల కూటమి ఉండే కాలంలో 'నక్కీరర్' అనే మహాకవి దానికి అధ్యక్షుడుగా వుండేవాడు. ఆకాలంలో క్షామం ఏర్పడగా ఒక శివాలయ అర్చకుడు, గర్భదరిద్రుడు, శివానుగ్రహాన్నిపొంది, ఒక తాటాకుపై ఒక తమిళ కవితను శివుడే స్వయంగావ్రాసి యివ్వగా దాన్ని రాజసభకు తెచ్చి చదివాడు. బంగరు కాసులమూట రాజు యిస్తాడని ఆశపడ్డాడు. ఇంతకీ శివుడు వ్రాసిన ఆ తమిళ కవిత యిలావుంది.

కొంగుదేర్ వాళ్కై అంజిరైతుంబి
కామం శెప్పాదు కండదు మొళి మో |
పయి లియదు కెళియ నట్పిన్ మయిలియర్
సెరి ఎయిర్ రరివై కూందలిన్
నరియవుం ఉళవో నీయరియుంపూవే ||

'ఇరయనార్' అనేపేరు ఈ కవిత చివర వ్రాయబడింది.

"ఇప్పాడల్ శివ పెరుమాన్ నన్పాట్టు పులవనాయ్ సంగమేరి
ఎన్టపడి 'తరుమి' ఎన్నుం అందణన్ పొరుట్టు పాడియదు,
ఎన్టుం వరలారొన్టు వళంగుదలుం అరిగ".

సంగ కవులలో గొప్పగా కవిత్వం చెప్పేవాడిగా తన భక్తుడు రాణించాలని సాక్షాత్ శివుడే ఈ పాటను వ్రాసి 'తరుమి' అనే తన భక్తున కిచ్చాడని ఐతిహ్యం ఒకటి వినబడుతూవుంది ఇంతకీ ఈ పాట కర్థమేమి?

"ఓ తుమ్మెదా! నీ వెన్నో పుష్పాల మకరందాన్ని ఆస్వాదిస్తుంటావు కదా! నా భార్య కేశపాశాల కుండే సహజ సుగంధం వంటి సుగంధం ఏ పుష్పాలకు ఉన్నాయో చెప్పు చూద్దాం!" పార్వతీదేవి కేశపాశాలు సహజసుగంధ భరితాలట! ఈ కథనే గ్రహించి ధూర్జటి శ్రీ కాళహస్తి మాహాత్మ్యంలో- "సింధురరాజగమనాధమ్మిల్ల బంధంబు సహజ గంధంబు" అన్నాడు నక్కీరుడు సంగ కవుల సభాధ్యక్షుడన్నాముగదా! ఆ బ్రాహ్మణుని కవితను ఆక్షేపించి అవహేళన చేశాడు ఆ బాపడు అవమానంతో కుంగిపోయి శివునితో మొఱపెట్టుకున్నాడు శివుడే స్వయంగా పాండ్యరాజ సభకు వచ్చి 'సాహిత్యస్ఫురన్మాధురీ చారుప్రౌఢిమ' గల తన కవితను తప్పుబట్టిందెవరన్నాడు? నక్కీరుడు వెంటనే లేచి -"గిరి తనయా ఘనకచభారంబు సహజ గంధంబను మాట తప్పు" తల్లి పార్వతీదేవి విషయంలో నైతే నే నీ కవిత్వం చెల్లుతుందయ్యా! తుమ్మెద నుద్దేశించి నీ వడిగిన ప్రశ్న లోకంలోని స్త్రీల కందరికీ ఎలా వర్తిస్తుందయ్యా! కవిత్వ లోకానుభవానికి దగ్గరగ ఉండాలి" అన్నాడు శివుడు మూడో కన్ను తెరిచి శపించాడు నక్కీరుడు కుష్ఠువ్యాధి పీడితుడై, చివరికి కుమారస్వామి కృపతో దక్షిణకైలాసమైన శ్రీకాళహస్తి చేరి స్వర్ణముఖీ స్నానంచేసి శాపవిముక్తి పొందాడు చిట్ట చివరికి, శివుడు నక్కీరుని సాహిత్య వాదాన్నే అంగీకరించి "సాహిత్య శ్రీవర" అని సంబోధిస్తూ సాయుజ్యాన్ని అనుగ్రహించాడు

లలితా సహస్ర నామానికి సౌభాగ్యభాస్కర' మనే వ్యాఖ్య వ్రాసిన భాస్కరరాయలవారు, "చంపకాశోక పున్నాగ సౌగంధిక లసత్కచా" అనే తల్లిపేరును వ్యాఖ్యానిస్తూ పై తమిళ కవితను యిలాసంస్కృతీకరించారు

జానాసి పుష్ప గంధాన్ భ్రమర!<br>
త్వం బ్రూహి తత్త్వమ్ ।<br>
మే దేవ్యాః కేశకలాపే గంధః<br>
అత్ర కేనోపమీయతే ॥

ఈ సంగకాల కథాకమామీషు అంతాతెలిసిన శ్రీశంకరులవారు, శివుని మాటను ప్రమాణంగా గ్రహించి, "యదీయం సౌరభ్యం సహజ ముపలబ్ధుం

సుమనసో" అని వ్రాయగా ఈ ఒక్క వాక్యాన్ని పట్టుకొని దానిపై పదివిధాలుగా పది శ్లోకాలు అల్లినా వేంకటాధ్వరి లక్ష్మీ సహస్రంలో అందంగా వంకరలైన నీ నల్లని కురులపై తుమ్మెదలు ఎందుకు వాలుతున్నాయమ్మా' అని సూ-

శ్లో|| నత్వం దధాసి నవచంపకమాల్యమంబ
కర్తుం నిసర్గ సురభౌ కబరే సుగంధమ్|
కిం తర్హి కుంతల పరిమల సారలాభ
లోభ భ్రమ ద్భ్రమర లోక నివారణాయ|| శ్లో 5

శ్లో|| సుమ్మైర్దివ్యై రామ్రేడిత సహజ సౌరభ్య సుభగమ్
కచం తే కల్యాణి! భ్రమతి పరితో భృంగ నిచయః |
శ్లో 17

శ్లో|| క్షమ మిదం కలశోదధి కన్యకే
తవ కచస్థిర సౌరభ లోభతః
వికచ సూన విశేష పరమలం
జహ దిహ భ్రమతి భ్రమర వ్రజః|| శ్లో. 19

లక్ష్మికి, గౌరికి తత్త్వతః తేడాఏమీలేదు ఈ 'శ్రీవిద్యా' రహస్యాన్ని తెలియ జేయడానికే శ్రీ శంకరుల సౌందర్యహరీ శ్లోకాన్ని గ్రహించి వేంకటాధ్వరి వేయివిధాలుగా మలచి లక్ష్మీ సహస్రం వ్రాశారు పంచ విధ గౌరీమూర్తులున్నాయని విష్ణు ధర్మోత్తర పురాణం చెబుతున్నది

1 భృగు మహర్షి కుమార్తె కాబట్టి లక్ష్మికి 'భార్గవి' అనిపేరు

2. భర్గుని భార్యయైన పార్వతీదేవికి 'భార్గవి' అనిపేరు

ఏమిటీ రహస్య మంటే సర్వస్త్రీ దేవతలు శ్రీదేవీ వికారాలు అంటే రూపాంతరాలు, ఇది శ్రీ విద్యా రహస్యం దీనికొక ప్రమాణంచూపిస్తాను

నీలకంఠ దీక్షితులు శివోత్కర్షమంజరీ అనే గొప్పస్తోత్ర గ్రంథం వ్రాస్తూ ప్రప్రథమ శ్లోకంలోనే 'లక్ష్మీ' అనే పేరుతో ప్రారంభిస్తారు.

**"యా లక్ష్మీ స్త్రిజగచ్ఛరణ్యా చరణా తస్యాః పతిర్యచ్ఛిరో........."**

దీనికి శ్రీ శివానందతీర్థులు 'ఘటార్థ బోధ టీక వ్రాస్తూ -"శ్రీ దేవ్యాః త్రిజగచ్ఛరణ్యాత్వేమానం న గవేషణీయమ్" అని వ్రాశారు. శ్రీదేవీ చరణాలకు మూడులోకాలు శరణు పొందినవనే విషయంలో మరలా కొత్తగా శోధించి

చెప్పవలసిందేమీ లేదు." అన్నారాయన. మూడులోకాలకు అధీశ్వరి, పరాదేవత శ్రీదేవి. ఆమె ప్రతిరూపాలే త్రిమూర్తులభార్యలు వారి ముగ్గురికీ అభేదం!

శ్లో॥ పంచవట్యాం శూర్పణఖా
యత్సౌందర్య విమోహితా ।
పతి త్వం ప్రార్థయామాస
స రామః శ్రేయసేஉ స్తునః ॥

అని సౌందర్య స్తబకంలో ఒకశ్లోకం. పంచవటిలో శూర్పణఖ ఎవరి సౌందర్యాన్ని చూచి విమోహితురాలైంది? రామసౌందర్యాన్ని చూచి. మరి, సీత సౌందర్యవతి కాదా? అంటే, ఆమె శూర్పణఖ కంటే సౌందర్యవతియే కాని, స్త్రీ సహజమైన అసూయాబుద్ధిచేత, ఈర్ష్యచేత, శూర్పణఖ సీతసౌందర్యాన్ని చూచి ఓర్వలేక చుప్పనాతి తనం వహించింది ఆమె కేవలం రాముని మాత్రమే కోరింది, కాని, అపరిపక్వ, అసంస్కార చిత్తవృత్తి గల్గింది కాబట్టి సీతాదేవి ఎవరో తెలుసుకో లేక పోయింది. విష్ణు సహస్రనామాలకు తగిలివచ్చేట్లుగా, రాముణ్ణి మాత్రం "పుండరీక విశాలాక్షు"డని రావణుని దగ్గర చెప్పింది. ఈ సందర్భంలో వేంకటాధ్వరి ఏమంటున్నాడో చూడండి. శూర్పణఖ ఆ విధంగా రాముని సౌందర్యాన్ని చూచిమోహించి వివాహం చేసుకొమ్మని కోరగా, సీత ఏమనాలి? ఆమెకు కోపం రావాలికదా! రాలేదు. అదేమరొక స్త్రీ అయితే ఏం చేసేది? కాని, సీత జగజ్జనని. సర్వజీవుల అంతరమైన కోర్కె యొక్క యథార్థ స్వరూపం ఆమెకు తెలిసినంతగా మరొకరికి తెలిసే అవకాశంలేదు. అందుకే, మహాకవి వేంకటాధ్వరి యిలావ్రాశారు "పతి త్వం ప్రార్థయామాస"అని. ఆమె పతియైన రాముని ప్రార్థించిందట! ఏమని? ఎవరి తరపున? శూర్పణఖ కోర్కెలోని సామంజస్యాన్ని, సమీచీనత్వాన్ని సమర్థిస్తూ, రామునితో ఆమె కోర్కెను మన్నించమని ప్రార్థించిందట! లోకంలో ఇదెక్కడైనా జరిగేదేనా? అంటే సామాన్యుల మనోభావాలకు అందక, జీవుల ఆంతరస్వరూపవివేచన చేస్తున్నది వాల్మీకి రామాయణంలో ఈ ఘట్టం!

సీత శూర్పణఖ తరపున, ప్రార్థిస్తూ రామునితో ఆమె కోర్కెలోని సామంజస్యాన్నీ, సమీచీనతను ఎలా చెప్పిందో తెలియాలంటే, శ్రీ వైష్ణవ సంప్రదాయరహస్యంతో కూడుకొన్న ఈ కీలకమైన ఘట్టాన్ని రామాయణ కల్పవృక్షంలో విశ్వనాథవారెలా ఆవిష్కరించారో చదివితే తెలుస్తుంది. శూర్పణఖ అంటున్నది

చ|| బ్రతికితినే సహస్రములు వర్షము లింతటి యందగాడు, క
న్నతికిన మేలు లేదు గదరా! మఱి, యింతటి యందమెల్ల నీ
వితమున నీమెయే యనుభవించునె యొక్కతె! శేష సృష్టియౌ
వ్రతమును, వంచనంబునకు బట్టెదు జీవిత సారమందునన్.

ఆమె కోర్కెలోని యధార్థం తెలిసికొన్నసీత రామునితో అంటున్నది

చ|| అనవుడు భూమిజాత కసురాంగన మాటలు సాజమైన పా
యని కృపచే సహేతుకము లట్లనిపించి, హృదీశుతోడని
ట్లనె! ప్రభు! యీమె యెంత నిజమాడెను, నీ దగునందమే నొక
ర్తైన యనుభూతి గాంచి యవురా! కికురింతున జీవలోకమున్.

శూర్పణఖ జీవకోటిలోని ఒకస్త్రీ. ఆమె స్వామి వారి లోకమోహనసౌందర్యాన్ని చూచి మనసు పట్టలేక కాంక్షించింది. అందులో తప్పులేదు గోపికలందరూ శ్రీకృష్ణుని కామించారు 'కామోత్కంఠత గోపికల్ .. .' అన్నమాట ప్రసిద్ధమైనప్పుడు శూర్పణఖ రాముని మోహించడంలో తప్పేముంది? అది సర్వజీవులకు సహజమే జీవకోటికి అత్యంత సహజమైన ఈ కోర్కెను సీత బహుధా సమర్థించింది అక్కడే ఆమె యొక్క జగజ్జననీ స్వరూపాన్ని వేంకటాధ్వరి ఒక్క వాక్యంచేత ఆవిష్కరించారు. కల్పవృక్షంలో సీత రామునితో జీవుల కాంక్షాస్వరూపాన్ని ఎలా సున్నితంగా తెలియజేసిందో చూడండి..

ఉ|| ఈయమయందు దోస మొక యించుకయైనను గానిపింపదే
పాయక యల్ల సర్వఋషివాటిక లందున మౌని కామినుల్
తీయని దృష్టి నిన్ననుమతించిన నాకు స్ఫురింపలేదు, ని
న్నాయమ లెల్ల మోహకలితాక్షుల గాంచుట తెల్లమయ్యెడిన్

కం|| నిను స్వామివంచు ద్రిప్పిరి
మనసులు వారెల్ల, నీమె మానవి కామిన్
నిను నేను జూచినట్టుల
గనుచున్నది దోసమిందు గలదే స్వామి!

సర్వ ఋషి వాటికల్లోని మునిపత్నులే రాముని సౌందర్యాన్ని చూచి వ్యామోహితులైనారట! కాని, వారు సంస్కారంగలవారు కాబట్టి ఛీ! పాడుమనసు' అని మనసుల్ని ఆ భావన నుండి త్రిప్పుకొన్నారట! కాని, ఈమె దానవస్త్రీ కనుక మనసులోని కోర్కెను దాచుకోక నిర్భయంగా చెప్పింది. ఈమె సర్వజీవుల

కోరమని సీత చెప్పినా వినక ప్రాణాలు కోల్పోయాడు దీనినే పెరియ అచ్చాన్ పిళ్లై, రామాయణతనిశ్లోకి వ్యాఖ్యానంలో

"ఇవళ్ సన్నిధియాలే కాకం తల్లై పెట్రదు
అదిల్లామైయాలే రావణన్ మడిందాన్"

అని వ్రాశారు. వేంకటాధ్వరి శ్లోకంలో ఈ విషయం ప్రతిపాదింపబడింది

## ఫల స్తబకం - ఫలశ్రుతి

లక్ష్మీ సహస్ర కావ్యంలో ఇది చిట్టచివరి స్తబకం. అందులోని ఒక శ్లోకంతో ఈ వ్యాసాన్ని ముగిస్తాను.

శ్లో॥ దుగ్ధాం దుగ్ధాంబుధేః పుత్రీ
దురితాపహరా మమ |
శార్ఙ్గిణశ్చరణాం భోజ
శరణాగత సంపదామ్ ||

క్షీరసాగరంలో పుట్టిన లక్ష్మీదేవి నా యొక్కపాపాలను పటాపంటలు చేయడంలో సమర్థురాలు. శ్రీ మహాలక్ష్మి దేవియే శార్ఙ్గియైన శ్రీ మహావిష్ణువు చరణకమలాలకు శరణాగతి పొందిననాకు మోక్షలక్ష్మిని అనుగ్రహించగలదు

బహుభాషా కోవిదులు, కవి-పండిత విమర్శకులు విశేషించి సహృదయ వరేణ్యులైన ఆచార్య కె సర్వోత్తమరావుగారి వీడ్కోలు సమావేశ శుభసందర్భంలో ఈ సాహిత్యవ్యాసాన్ని వారికి ఉపాయనంగా సమర్పిస్తున్నాను



# శ్రీమద్రామాయణం లోని యుద్ధ తంత్రం

డా|| కానాల నలచక్రవర్తి

ఆదికవి వాల్మీకి రచించిన శ్రీమద్రామాయణం సంస్కృత సాహిత్యంలో తొలి కావ్యం వేల సంవత్సరాలనుండి రామాయణం ప్రపంచానికి దివ్య సందేశాన్ని అందిస్తూనే ఉంది. విశ్వవాఙ్మయంలో ఈ గ్రంథానికి గొప్ప ప్రశస్తి ఉంది. ఇందులో వాల్మీకి తాను ప్రతిపాదించిన రణ తంత్రాన్ని గూర్చి దాని గొప్పదనాన్ని గూర్చి అకావ్యం ప్రారంభంలోనే ఇలా చెప్పాడు

యావత్ స్థాస్యంతి గిరయః సరితశ్చ మహీతలే,
తావద్రామాయణ కథా లోకేషు ప్రచరిష్యతి రా. 237

ఈ శ్లోకం శ్రీమద్రామాయణ కావ్య ప్రాశస్త్యాన్ని తెలుపుతున్నప్పటికీ ఇది శ్రీమద్రామాయణం లోని రణతంత్రాన్ని గూడా చక్కగా తెలియజేస్తూ ఉంది. భూమండలంలో ఎంత వరకైతే కొండలు నదులూ ఉంటాయో అంతవరకు ఇందలి రణతంత్రం కూడా ఉంటుందని మనం భావించాలి.

ప్రపంచంలో ఇతర దేశాలలోని మానవులు అనాగరికులుగా, అజ్ఞానులుగా, ఆటవికులుగా ఉన్నదశలోనే మన భారతదేశంలో సువ్యవస్థిత యుద్ధవ్యవస్థ వుండేది. ఇందుకు ఆధారం శ్రీ మద్రామాయణమే.

శ్రీమద్రామాయణ కాలం నాటి యుద్ధతంత్రం నేటికీ ఆదర్శప్రాయం, ఆశ్రయణీయం, అత్యద్భుతం, ఆనాటి యుద్ధవిద్య ఈనాటికన్నా చాలా గొప్పది విశ్వామిత్రుడు, వశిష్ఠుడు, దశరథుడు, శ్రీరాముడు, లక్ష్మణుడు, వాలి, సుగ్రీవుడు, హనుమంతుడు, అంగదుడు, జాంబవంతుడు, సుషేణుడు, మైందుడు, రావణుడు, కుంభకర్ణుడు, విభీషణుడు, ఇంద్రజిత్తు, అకంపనుడు మొదలైనవారు యుద్ధ తంత్ర విశారదులు. నర సురాసుర యక్ష గంధర్వ కిన్నర కింపురుషులలో ఎవరూ వీరి ఎదుట నిలబడి యుద్ధం చేయడానికి అసమర్థులే.

రామాయణంలో జరిగిన యుద్ధం కేవలం ఒక స్త్రీ నిమిత్తమే జరిగింది సీతను పురస్కరించుకొని సీతాపహరణ కారణంగా నరాసురులకు యుద్ధం

యొక్క సహజమైన కోర్కెను ఈ విధంగా బహిర్గతంచేసింది అంతమాత్రంచేత దోషికాదు. అంగీకార యోగ్యయేనని, స్వామిని ఒప్పించడానికి ప్రయత్నించింది సీత. వేంకటాధ్వరి వ్రాసిన ఒక మాట వెనుక ఇంత అంతరార్థం యిమిడివుంది

"సర్వజీవులకు స్వామి అత్యంత సులభుడు"గా ఉండాలనేదే సీతాదేవియొక్క ఆంతర్యం. దానికే ఆమె రాముని ప్రార్థించింది, శూర్పణఖను స్వీకరించమని. రాముడు మనుధర్మ మెఱిగిన వాడు, పైగా, ఏకపత్నీవ్రతుడు కనుక శూర్పణఖ కోర్కెను తిరస్కరించాడు ఇక్కడ శ్రీ వైష్ణవ సంప్రదాయ రహస్యమేమిటి? అంటే, శ్రీ మద్రామానుజులు 'శ్రీ భాష్య' ప్రారంభంలోనే పరమేశ్వరస్వరూపాన్ని రెండు విధాలుగా వింగడించారు

1. నిరూపిత స్వరూప ధర్మాలు

2. స్వరూప నిరూపక ధర్మాలు

నిరూపిత స్వరూప ధర్మమంటే మనపూర్వులు భగవద్విషయ విచారణచేసి నిర్ణయించిన అనంత కల్యాణ గుణాలలో ఏ ఒకటో రెండో మన అనుభవంలోకి వచ్చినపుడు ఆక్షణంలో తాదాత్మ్యాన్ని పొంది, దాన్ని గుర్తించడం, రెండవది, భగవదవతారవేళ ప్రసక్తమైన అనేకానేక సన్నివేశాలలో స్వామి ప్రవర్తించిన తీరును బట్టి ఆయన గుణగణాలను బేరీజు వేసుకొని ఆదర్శంగా గ్రహించడం

ఇందులో మొదటిదైన నిరూపిత స్వరూపధర్మాలలో శ్రీరాముని పరత్వాన్ని ప్రకాశింపజేసింది శూర్పణఖ. ఆమె సర్వేశ్వరుని అసాధారణ స్వరూపధర్మమైన నిత్య యౌవనము, సౌందర్యంలో తన్మయురాలై ఒక్కక్షణకాలం భగవద్విభూతిని అనుభవించి, ఆ స్వామి పరత్వ నిర్ధారణను, రామలక్ష్మణులు తనకు అవమానం చేసినప్పటికీ తన అన్న రావణుని దగ్గర స్వామి సౌందర్యాన్నే ప్రశంసించింది దీనితో సీతాదేవి పట్ల ఆమె అనుచితంగా ప్రవర్తించినప్పటికీ ఆ దోషాలన్నీ పరాస్తాలై ఆమె పునీతమైనదని శ్రీ వైష్ణవ సంప్రదాయ వ్యాఖ్యాతలు వ్రాశారు మహాభాగవతపురాణంలో పూతన కూడ ఈ విధంగా చివరి దశలో పునీతయైనది

"స్వామి సర్వజీవులకు అత్యంత సులభుడ"నే శ్రీ వైష్ణవ సంప్రదాయ రహస్యాన్ని అన్నమయ్య, శృంగార సంకీర్తనల్లో చాలచోట్ల నిరూపించారు.

**చిరునవ్వు నీ పల్కు జిగురు చుట్టిన కండె**
**తెలివలకు నీ మోవి తెరువు పెసర**

పక్షుల్ని పట్టడానికి వేటగాళ్లు జిగురు పూసిన కండెను ... స్వామి చిరునవ్వు జీవులకు సమ్మోహనాస్త్రం వంటిదని అర్థం! పెసర చేనుగట్టు వెంట పోయే ప్రతివాడూ పెసరకాయనులాగి తింటూ వెళతాడు అలా ప్రతి స్త్రీకి అందుబాటులో ఉన్న పెదవులట స్వామి వారివి.

కాంత వలపులకు గాదె నీమేను
జలజాక్షుల ఎంగిలి కంచము నీమోవి
పట్టరాదు నీవయసు పడతుల కెల్ల
రచ్చకొట్టమాయె నిదివో నీ గొప్ప ఉరము

పై చరణంలోని వాక్యాలన్నీ సర్వజీవుల మనోవాంఛితాలన్నీ స్వామివారియందే నిమగ్నమై ఉన్నాయనే సార్వకాలిక సత్యానికి అందమైన వ్యాఖ్యానం! శూర్పణఖాదులు, పూతనలు, గోపికలు, సకలజీవులు అందరూ దీనిలో అంతర్భవిస్తున్నారు అన్నమయ్యకూ, వేంకటాధ్వరికీ, విశ్వనాథకూ ఈ రహస్యం తెలుసు కాబట్టే అలావ్రాయగలిగారు

వేంకటాధ్వరి 'కారుణ్యస్తబకం'లోకూడ మహాలక్ష్మి యైన సీతాదేవి మహత్త్వాన్ని స్థాపించారు. కరుణకు ఆలవాలం అమ్మవారని ఆయన విష్కర్ష.

శ్లో॥ రాఘవస్య హృదయం స్థిరాఽ ఘవ
    ద్వాయసం ప్రతి నవాఽఽయస క్రమమ్ ।
    దేవి జానకి! దయా రసాత్త్వయా
    పాదయోజన కృతా ద్రవీకృతమ్ ॥

దేవీ జనకనందినీ! మహాపాపియైన జయంతుడనే పేరుగల కాకిపట్ల శ్రీ రఘురాముని మనస్సు యినుమువలె మిక్కిలి కఠినమై ఉండగా, ఆయన చరణారవిందములకు నమస్కరించే నీవు, ఆ పాపియైన కాకియెడల రాముని హృదయాన్ని కరుణారస ప్రవాహంలో నింపివేశావు.

రామాయణంలోని కాకాసుర వృత్తాంతం అందరికీ తెలుసు కాకి సీతాదేవి పట్ల అపచారంచేసి ముల్లోకాలు తిరిగివచ్చి శ్రీ రాముని శరణుపొందగా అమ్మవారు దాన్ని క్షమించి వదలి వేయ మన్నది. అలా వాడు బతికి బయట పడ్డాడు. కాని, రావణుడు సీత పట్ల అపచారంచేసి రాముని శరణు

జరిగింది. ధర్మా దర్మాలకు జరిగిన యుద్ధమిది ధర్మ మార్గ పరంగానే జరిగిందీ యుద్ధం. ఆనాటి రణ తంత్ర వైశిష్ట్యాన్ని తెలుసుకోవడానికి పూర్వం యుద్ధ సంబంధమైన శస్త్రాస్త్ర విషయాలను, ఆయుధ ప్రకారాలను గూర్చి తెలుసుకొని ముందుకు వెళదాం

శస్త్రాస్త్రాలు :- "అస్యతే క్షిప్యతే యత్ తదస్త్రమ్" శత్రువులపై వేయబడుతుంది కాబట్టి ఇది అస్త్రం.

ఖడ్గ చర్మ ధనుర్బాణౌ శల్య భల్యా తథాపరౌ,
అర్ధచంద్రశ్చ నారాచః శక్తి యష్టీ తథాపరౌ
పరశు శ్చక్ర శూలే చ పరిఘశ్చైవమాదయః
అస్త్ర భేదాస్సముద్దిష్టాః శ్రీమద్భట్టోజ మహీభుజౌ (శబ్దార్థకల్పద్రుమం)

ఖడ్గం, చర్మధనుర్బాణం, శల్యం, భల్లం, అర్ధచంద్రం, నారాచం, శక్తి, యష్టి, పరశువు, గండ్రగొడ్డలి, చక్రం, శూలం, పరిఘం మొదలైనవి అస్త్రభేదాలు అస్త్రాలు రెండు రకాలు అవి 1) నిర్మాయాలు, 2) మాయికాలు ఖడ్గం మొ|| నిర్మాయికాలు. కాల్చునవి మాయికాలు.

**ఆయుధ రకాలు :**

ముక్తం, అముక్తం, ముక్తాముక్తం, యంత్రముక్తమని ఆయుధాలు నాల్గు రకాలు

1 ముక్తమనగా చేతులతో వేసే ఆయుధం ఉదా || గోళం, చక్రం, మొ||

2 అముక్తమనగా ఎప్పుడూ చేతిలో ఉంచుకొనే ఆయుధం ఉదా|| ఘడ్గం మొ||

3 ఒకసారి చేతిలోను ఒక సారి ఇతరత్ర ఉంచుకొనే ఆయుధం ముక్తాముక్తం ఉదా|| కుంతం మొ||

4. యంత్రాల సహాయంతో వేసే ఆయుధం. యంత్రముక్తంలో చేరుతుంది. ఉదా ||శతఘ్ని మొ||

మంత్ర ముక్తం పాణి ముక్తం ముక్తాముక్తం తథైవ చ,
అముక్తందే చ ధనుర్వేదే చతుష్పాచ్ఛస్త్రమీరితమ్ (ధనుర్వేదం)

ఏ ఆయుధం కేవలం మంత్రం ద్వారా ప్రయోగింపబడి ఉప సంహారం లేకుండా ఉంటుందో అది మంత్ర ముక్తం. ఏ ఆయుధం ధనుస్సు ద్వారా వదలబడుతుందో అది పాణిముక్తం. ఏ ఆయుధానికి ప్రయోగోప సంహారాలుంటాయో అది ముక్తాముక్తం మంత్ర మూలకంగా సాధింపబడ్డ ఆయుధం ఏదైతే ఉందో, దేన్ని చూచినంతనే శత్రువులు పలాయనమౌతాలో అది అముక్తం ఈ అయుధాలన్నీ రామాయణకాలంలో ఉన్నవే

## విభిన్న ఆయుధాల నిర్వచనాలు - వాటి కార్యాలు :-

ఆరాముఖేన చర్మచ్ఛేదనం, క్షురప్రేణ బాణకర్తనం, వా బహుకర్తనం, సూచీముఖేన కవచ భేదనమ్, భల్లేన హృదయ భేదనం, వత్సదంతే గుణ చర్వణం, ద్విభల్లేణ బాణావరోధనమ్, కర్ణికేవ లోహమయ బాణానాం ఛేదనమ్, కాకతుండేన వేద్యానాం వేధః కుర్యాత్.

(వసిష్ఠ ధనుర్వేదం. 1-65)

ఏ ఆయుధం చేత చర్మం ఛేదింప బడుతుందో అది "ఆరాముఖం."

శత్రువుల బాణాలను, చేతులను ఏది ఖండిస్తుందో దానికి "క్షురప్రం" అనిపేరు.

సాధారణంగా ఉపయోగించే ఆయుధం "గోపుచ్ఛం"

శత్రువుల శిరస్సులను, మెడలను, ధనుస్సులను ఛేదించే ఆయుధం "అర్ధచంద్రం"

శత్రువుల కవచాన్ని ఛేదించేది "సూచీ ముఖం"

శత్రువుల గుండెను చీల్చే ఆయుధం "భల్లం"

శత్రు ధనుస్సుల అల్లెత్రాళ్ళను తెంచే ఆయుధం. "వత్సదంతం."

లోహంతో తయారు చేయబడ్డ బాణాలను చీల్చే ఆయుధం "కర్ణిక"

మిక్కిలి కఠినమైన వస్తువును ఛేధించే ఆయుధం "కాక తుండం"

ఇలాంటి ఆయుధాలన్నీ రామాయణంలో ఉపయోగించబడ్డాయి.

అస్త్ర ప్రకారాలు

బ్రహ్మాస్త్రం ప్రథమం ప్రోక్తం ద్వితీయం బ్రహ్మదండకమ్||
బ్రహ్మశిరస్తృతీయంచ తుర్యం పాశుపతం మతమ్,
వాయవ్యం పంచమం ప్రోక్తమాగ్నేయం షష్ఠకం స్మృతమ్||
నరసింహం సప్తకఞ్చ తేషాం భేదాహ్యానంతకాః,
(వసిష్ఠ ధనుర్వేద సంహిత 2-79-81)

1. బ్రహ్మాస్త్రం, 2. బ్రహ్మదండకం, 3 బ్రహ్మశిరం, 4. పాశుపతం, 5 వాయవ్యం, 6. ఆగ్నేయం, 7 నరసింహం అని అస్త్రాలు 7 రకాలుగా పేర్కొనబడ్డాయి. వీటి భేదాలు అనంతాలు

యుద్ధాల రకాలు .- యుద్ధాల రకాలు చాలా ఉన్నాయి. వాటిని వసిష్ఠ ధనుర్వేద సంహిత ఇలా తెలియజేసింది

ధనుశ్చక్రశ్చ కుంతశ్చ ఖడ్గశ్చ క్షురికా గదా |
సప్తమం బాహు యుద్ధం స్యాత్ ఏవం యుద్ధాని సప్తధా ||
(వసిష్ఠ ధనుర్వేద సంహిత 1-8)

ధనుర్యుద్ధం, చక్రయుద్ధం, కుంతయుద్ధం, ఖడ్గయుద్ధం, క్షురికా యుద్ధం, గదాయుద్ధం, బాహుయుద్ధం అని 7 రకాలుగా ఉంది యుద్ధవిద్య. ఈ ఏడు రకాల యుద్ధాలే కాక ఇతర యుద్ధాలు కూడా రామాయణంలో ఉన్నాయి.

లోకోత్తర రణ తంత్ర వేత్త :- రామాయణకాలంలో వసిష్ఠుని చేతిలో ఓడిపోయిన విశ్వామిత్రుడు లోకోత్తర యుద్ధవీరుడు. ఈయన తపస్సుతో శంకరుని సంతోషపెట్టి సాంగోపాంగ సహితమైన ఉపనిషద్విద్యను సరహస్యమైన ధనుర్విద్యను అభ్యసించాడు. దేవ, మహర్షి -దానవ-గంధర్వ- యక్ష-రాక్షస-కిన్నర-కింపురుష-ఉరగులవద్ద ఏయే అస్త్రాలు ఉన్నాయో వాటినన్నింటిని, వాటికన్నా ఎక్కువగా ఈశ్వరునినుండి సంపాదించాడు విశ్వామిత్రుడు. అవి ఇలా ఉన్నాయి.

వారుణం చైవ రౌద్రం చ ఐంద్రం పాశుపతం తథా |
ఏషీకం చాపి చిక్షేప కుపితో గాధి నందనః (రామా బాల. 56 6)

మానవం మోహనం చైవ గాంధర్వం స్వాపనం తథా |
జృంభనం మాదనం చైవ సంతాపన విలాపనే || (రామా. బాల.56.7)

శోషణం దారణం చైవ వజ్రమస్త్రం సుదుర్జయమ్ |
బ్రహ్మపాశం కాలపాశం వారుణం పాశమేవ చ ‖ (రామా.బాల 56.8)

పినాకాస్త్రం చ దయితం శుష్కార్ద్రే అశనీ ఉభే |
దండాస్త్ర మథ పైశాచం క్రౌంచమస్త్రం తథై వ చ ‖ (రామా బాల 56 9)

ధర్మచక్రం కాలచక్రం విష్ణుచక్రం తథైవ చ |
వాయవ్యం మథనం చైవ అస్త్రం హయ శిరస్తథా ‖ (రామా.బాల 56.10)

శక్తి ద్వయం చ చిక్షేప కంకాళం ముసలం తథా |
వైద్యాధరం మహాస్త్రం చ కాలాస్త్ర మథ దారుణమ్ ‖ (రామా బాల56.11)

త్రిశూలమస్త్రం ఘోరంచ కాపాల మథ కంకణమ్ |
ఏతాన్యస్త్రాణి చిక్షేప సర్వాణి రఘునందన ‖ (రామా.బాల56.12)

విశ్వామిత్రుని వద్ద వారుణం, రౌద్రం, ఐంద్రం, పాశుపతం, ఐషీకం, మానవం, మోహనం, గాంధర్వం, స్వాపనం, జృంభనం, మాదనం, సంతాపనం, విలాపనం, శోషణం, దారణం, సుదుర్జయం వజ్రం, బ్రహ్మపాశం, కాలపాశం, వరుణపాశం, పైనాకం, దయితం, శుష్కాశనం, అర్ద్రాశని, దండం, పైశాచం, క్రౌంచం, ధర్మ చక్రం, కాలచక్రం, విష్ణుచక్రం, వాయవ్యం, మధనం, హయశీర్షం, కంకాళం, ముసలశక్తి, వైద్యాధరం, మహాస్త్రం, కాలాస్త్రం, త్రిశూలం, భీకర కపాళం, కంకణం, బల అతిబల జృంభకాస్త్రాలు, బ్రహ్మాస్త్రం మొదలైన మహా మహిమోపేతాలైన ప్రభావోత్పాదకాలైన శత్రు మర్మ భేదకాలైన అస్త్రాలు ఉన్నాయి. వీటన్నిటికి మించి అవసరమైతే నూతనాస్త్ర నిర్మాణంలో సమర్థుడాయన. ఇలాంటి ప్రతిభావంతుడైన రణ కోవిదుడు ఆనాడు మరొకడు లేడు. ఇలాంటి అపూర్వాయుధాలు ఆ కాలంలోగాని ఈ కాలంలోగాని ఏ వీరునికి, ఏ రాజ్యాధినేతకు, ఈరోజు అగ్రరాజ్యాలని పిలువబడే ఏ అగ్రరాజ్యానికి లేవు అనడంలో ఏ మాత్రం సంశయం లేదు.

ఈనాడు మనం 21 వ శతాబ్దంలో ఉన్నాం. నవ సహస్రాబ్దిలో అడుగు పెట్టినాం. విజ్ఞాన క్షేత్రంలో ఎంతో ప్రగతిని సాధించినాం. విశ్వాంతరాళంలో తిరుగుతున్నాం. క్షణాల్లో ఖండాంతర వార్తలను తెలుసుకుంటున్నాం. వైజ్ఞానికరంగాల్లో ఉన్నత శిఖరాల నధిరోహించినాం. అగ్ర రాజ్యాల పేరుతో అమెరికా, రష్యా, ఫ్రాన్స్, జర్మన్, జపాన్ దేశాలు కుప్పలు తెప్పలుగా అణ్వాస్త్రాలను ప్రోగు చేసినాయి. అయితే అగ్ర రాజ్యాలనీ విర్రవీగుతున్న

ఈ దేశాల్లో విశ్వామిత్రుని వద్ద ఉన్నన్ని శక్తి మంతమైన ఆయుధాలు లేవు ప్రయోగించిన ఆయుధాలవల్ల ఉత్పన్నమయ్యే పరిస్థితులను చక్కబెట్టడం కూడా తెలుసు. మనం ఈనాడు అణ్వాస్త్రాలను శత్రు దేశాల మీద వేయగలుగుతున్నామే గాని వాటివల్ల ఉత్పన్నమయ్యే ప్రమాదాలను నివారించలేక పోతున్నాం. విశ్వామిత్రుడు అలా కాదు అణ్వాస్త్రాలకు సైతం విరుగుడు అస్త్రాలను కలిగినట్టివాడు

ఇట్టి లోకోత్తర వీరుడైన విశ్వామిత్రుని శిష్యులు శ్రీరామలక్ష్మణులు వీరే రామాయణ యుద్ధానికి నాయకులు రామాయణకాలంలో ముఖ్యంగా 5 అగ్రరాజ్యాలు ఉండేవి. 1 అయోధ్య 2. కిష్కింధ. 3 లంక, 4 మిథిలా, 5 కేకయరాజ్యం అయోధ్యవీరులు శ్రీరామలక్ష్మణ భరత శత్రుఘ్నులు కిష్కింధావీరులు వాలిసుగ్రీవ అంగద-హనుమంత , జాంబవంతులు లంకా వీరులు రావణకుంభకర్ణ-ఇంద్రజిత్-అకంపన ప్రభృతులు మిథిలావీరులు జనకరాజు కేకయవీరులు కేకయ రాజు యుధాజిత్తులు

వానరులు వృక్షాలతోను, పర్వతాలలోను, పర్వత శిఖరాలతోను, బండ రాళ్ళతోను యుద్ధాలు చేసే వాళ్ళు. ముఖ్యంగా రామలక్ష్మణులు, రావణేంద్రజిత్ కుంభకర్ణ అకంపనులు శస్త్రాస్త్ర విద్యల్లో నిపుణులు. ఇరువర్గాల వారు గొప్ప ఆయుధ సంపత్తి కలవారు. రాక్షసుల వద్ద కల ఆ యుధాలన్నీ రామలక్ష్మణుల వద్ద బలాదూరైనాయి. వీరి వద్ద ధర్మం ఉంది. వారి వద్ద ధర్మం లేదు యుద్ధంలో రాక్షసులు గట్టి పోటీ ఇచ్చినా ధర్మం వల్ల రామలక్ష్మణులే గెలిచినారు

అస్త్రాలు-ప్రత్యస్త్రాలు :- ఒక అస్త్రానికి ప్రత్యస్త్రం ఉండాలి లేకుంటే అది యుద్ధం కాదు. యుద్ధంలో శత్రువుకూడా విజేత అంతటి వాడై ఉండాలి లేకపోతే యుద్ధం రక్తి కట్టదు. యుద్ధంలో రామలక్ష్మణులు, రాక్షసులు ప్రయోగించిన అస్త్రాలు ప్రత్యస్త్రాలు ఇలా ఉన్నాయి

| అస్త్రాలు | - | ప్రత్యస్త్రాలు |
|---|---|---|
| లక్ష్మణుడు | - | అతికాయుడు. |
| అగ్నిబాణం | - | సూర్యబాణం. |
| ఆగ్నేయాస్త్రం | - | సూర్యాస్త్రం |
| ఐంద్రాస్త్రం | - | ఐషీకాస్త్రం |
| వాయవ్యాస్త్రం | - | యమాస్త్రం |

| లక్ష్మణుడు | | ఇంద్రజిత్ |
|---|---|---|
| వారుణాస్త్రం | | రౌద్రాస్త్రం |
| పౌరాస్త్రం | | ఆగ్నేయాస్త్రం |
| మహేశ్వరాస్త్రం | | అసురాస్త్రం |
| శ్రీరాముడు | | రావణుడు |
| ఆగ్నేయాస్త్రం | | |
| గాంధర్వాస్త్రం | | రౌద్రాస్త్రం |
| | | సౌరాస్త్రం |
| గాంధర్వాస్త్రం | | గాంధర్వాస్త్రం |
| దైవాస్త్రం | | దైవాస్త్రం |
| గారుడాస్త్రం | | రాక్షసాస్త్రం |
| మహాశక్త్యాయుధం | - | మహాశూలం |

ఇలా అస్త్రాలకు ప్రత్యస్త్రాలను ఎక్కుపెట్టి శత్రువులను ముప్పతిప్పలు పెట్టి యుద్ధభూమిలో అసువులు బాసి అమరవీరులైన వారున్నారు ఈ విధంగా రామాయణ రణ తంత్రం ప్రసిద్ధి కెక్కి కనిపిస్తుంది.

**రామాయణకాలంలో ఆధునికత :-** రామాయణకాలం నాటి ఆధునిక సాంకేతిక జ్ఞానం ఈనాటికి ఏమీ తీసిపోదు. లంకాపట్టణాన్ని తీసుకుంటే అందలి యుద్ధ సంబంధమైన సాంకేతిక విజ్ఞానం మనకు ఆశ్చర్యం కలగజేస్తుంది

**తత్రషూపల యంత్రాణి బలవంతి మహాంతి చ |**
**ఆగతం పరసైన్యం తు తత్ర తైః పరిహన్యతే ||** (రామా. యుద్ద 3 12)

**ద్వాంషు సంస్కృతా బిమాః కాలాయస మయాశ్శితాః |**
**శతశో రచితా వీరైశ్శతఘ్న్యో రక్షసాం గణైః ||** (రామా.యుద్ధ3.13)

**ద్వారేషు తాసాం చత్వారస్సంక్రమాః పరమాయతాః |**
**యంత్రైరుపేతా బహుభిర్మహద్భిర్గృహ పంక్తిభిః ||** (రామా యుద్ధ 3 16)

**త్రాయంతే సంక్రమాస్తత్ర పరసైన్యాగమే సతి |**
**యంత్రైస్తైరవకీర్యంతే పరిఘాసు సమంతతః ||** (రామా యుద్ద 3 17)

**పరిఖాశ్చ శతఘ్న్యశ్చ యంత్రాణి వివిధాని చ |**
**శోభయంతి పురీం లంకాం రావణస్య దురాత్మనః ||** (రామా యుద్ధ 3 23)

లంకా పట్టణానికి నాలుగు వైపులా నాలుగు పెద్ద బాణమోచక యంత్రాలు, శిలామోచక యంత్రాలు ఉండేవట శత్రుసైన్యాలు అక్కడికి వచ్చినపుడు ఆయంత్రాల నుంచి బాణాలను, శిలలను వర్షంగా కురిపించి వెనుకకు మరలింప జేసేవారట. ఇనుంతో తయారుచేసిన భయంకరమైన శతఘ్నులు అక్కడ వందలకొద్దీ అమర్చబడి ఉండేవట ఆ శతఘ్నులను ప్రయోగిస్తే ఒక్కొక్క శతఘ్నికి ఒక వంద మంది హతులయ్యే వారట లంకా పురంలోగల నాలుగు ద్వారాలకు నాలుగు చెక్కతో చేసిన వంతెనలు ఉండేవట ఆ వంతెనలను అవసరమైనప్పుడు పరచడానికి అవసరం లేనప్పుడు ఎత్తివేయడానికి అనేక యంత్రాలు అమర్చబడి ఉండేవట ఈ విధంగా యంత్రాలు, శతఘ్నులు, వంతెనలు రామాయణ కాలపు సాంకేతిక జ్ఞానానికి ఉదాహరణలుగా కనిపిస్తాయి

ఈ విధంగా రామాయణంలో కనిపించే యుద్ధ విద్య సాంకేతిక జ్ఞానం, శస్త్రాస్త్రాల నైపుణ్యం, యుద్ధ వీరుల పరాక్రమ ప్రాభవాలు యుద్ధ నైపుణ్యాలు, అస్త్ర ప్రత్యస్త్రాలు మనల్ని ఆశ్చర్య పరుస్తాయి.



# శ్రీమదాంధ్ర మహాభారతం - ఆశ్రమవాసపర్వ విశిష్టత

డా॥ జి.డి. నాయుడు

## భారత ప్రశస్తి :

మానవులను ధర్మ మార్గ ప్రవర్తకులుగా మోక్షగాములుగా, సత్యవంతులుగా, నీతి మంతులుగా తీర్చిదిద్దడానికి జ్ఞానం అవసరం. అట్టి జ్ఞానాన్ని లోకానికి అందివ్వడానికి పూనుకొనిన వారిలో వ్యాసుడు ప్రథముడు. వేదాలలోని జ్ఞానం అందుకోవడం అంత సులభం కాదు. ఆ జ్ఞానాన్ని అందించడానికే కృష్ణద్వైపాయనుడు భారతేతిహాసాన్ని రచించాడు మొదట భారతం 24 వేల శ్లోకాలు కలిగిన 'జయ' మని పండిత విమర్శకుల అభిప్రాయం. సుమంత, జైమిని, పైల, వైశంపాయన, సూతాదులచేతిలో సంస్కృత భారతం లక్ష శ్లోకాలకు పెరిగింది. అట్టి భారతాన్ని కవిత్రయం వారు తెలుగు చేశారు.

కవిత్రయంలో ఒకరు ఆదికవి, వాగను శాసనుడు; మరొకరు కవిబ్రహ్మ, ఉభయకవి మిత్రుడు; ఇంకొకరు ప్రబంధ పరమేశ్వరుడు, శంభుదాసుడు. వీరే నన్నయ, తిక్కన, ఎర్రనలు. కొమ్మనామాత్య పుత్రుడు, అమలోదాత్తమనీషి హరిహర నాథోపాసకుడు, సోమయాజి అయిన కొట్టవరపు తిక్కనగారు తెలుగున నాటకీయ శైలికి ఆద్యులు. పాత్రచిత్రణలో గడుసరి. సంభాషణా రచనలో సిద్ధహస్తుడు. అల్పాక్షరాలతో అనల్పార్థ రచన చేయడం అతని ప్రత్యేకత. అలతి అలతి మాటలతో తెలుగు నుడికారపు ఒంపు సొంపులు చూపడం తిక్కన మాత్రమే నేర్చిన విద్య.

ధర్మాన్ని ఏల పాటించవలె అనే ప్రశ్నకు ధర్మాన్ని ధర్మం కొరకె పాటించాలి అని సమాధానం. ధర్మి ధర్మం వీటి యొక్క అద్వైతస్థితిని తెలియ జేసేది భారతం. సంస్కృత భారతం యితిహాసం. తెలుగు భారతం కావ్యం.

భారతం భారత వీరుల చరిత్రను తెలియ జేసేగ్రంథం. "భా" అంటే వెలుగు. వెలుగు సత్యగుణ సమన్వితం. "భా" అంటే సత్వగుణ ప్రసిద్ధమని,

"ర" అంటే రజోగుణ ప్రసిద్ధమని "త" అంటే "తమో" గుణ ప్రసిద్ధమని అర్థం. అనగా సత్వ రజస్తమో గుణాలు కలిగిన పాత్రలతో నిర్మితమైనది భారతమని కొందరి అభిప్రాయం దానితో శ్రీ కృష్ణుని చరిత్ర కలసినపుడు అది మహాభారతం అవుతుంది భారతంలో ఆశ్రమవాస పర్వానికి ఒక ప్రత్యేకత ఉంది

## ఆశ్రమవాస పర్వం :

ఆశ్రమ వాస పర్వాన్ని తెలుగున అనువదించిన వాడు తిక్కన ఆదిపర్వం లో నన్నయ సంస్కృత భారతంలోని నూరు పర్వాలపేర్లను 'పర్వానుక్రమణిక' క్రింద తెలియ జేసి అటు తరువాత అందులోని ఏయే పర్వాలు తెలుగులో ఏయే పర్వాలలో చేర్చాలో తెలియజేస్తూ "పర్వ సంగ్రహాన్ని" తెలిపినాడు సంస్కృతం లోని నూరు పర్వాలలోని కథను, తెలుగులో పదునెనిమిది పర్వాలలో వింగడించి విభాగించిన వాడు నన్నయ్య

నన్నయ పర్వ సమగ్రంలో ఆశ్రమవాస పర్వాన్ని గూర్చి "ధృతరాష్ట్రుండును గాంధారియు రాజ్యంబు విడిచి విదుర సంజయ సహితంబుగా నాశ్రమ వాసంబునకు జనుటయు, సకల రాజ్యభార ధౌరేయులయిన కొడుకుల విడిచి కుంతీదేవి గురు శుశ్రూషపరయయి వారి పిఱుందన పోవుటయు, సమరనిహతలయిన పుత్త్రపౌత్త్రుల నెల్ల ధృత రాష్ట్రుండు వ్యాస పర ప్రసాదంబున గాంచి విగత శోకుండయి గాంధార కుంతీ విదుర సంజయులతో పరమ సిద్ధికిం జనుటయును, పాండవులు నారదువలన నిఖిల యాదవ వ్యసనం బెరుంగుటయు నను వృత్తాంతంబుల నొప్పి వేయి నూటయాఱు శ్లోకంబులు కలిగి :- (1-63)

కం|| అమితార్థయుక్తితో నా
శ్రమవాసాదిత్రిపర్వ సహితంబయి యా
శ్రమవాస పర్వ మత్యు
త్తమ కథలను వెలయు పంచదశ పర్వంబై" (1-64)

అని తెలిపినాడు

నన్నయ్య ఆశించినట్లు గానే తిక్కన ఆశ్రమ వాస పర్వాన్ని నిర్మించాడు సంస్కృతంలో ఈ పర్వానికి సంబంధించి 1106 శ్లోకాలు వున్నాయి తెలుగులో ఆశ్రమవాస పర్వం రెండు ఆశ్వాసాలు కలిగి 362 పద్యగద్యలతో వుంది

## ఆశ్రమ వాస పర్వ విశిష్టత :

పర్వ సంగ్రహంలో ఆశ్రమ వాస పర్వ విషయ ప్రస్తావన సందర్భంగా నన్నయ తెలిపిన అంశాలు ముఖ్యంగా మూడు. ఒకటి-తెలుగు భారతంలో ఈ పర్వం పదైదవది రెండు-ఈ పర్వంలో అత్యుత్తమ కథలు వున్నాయి మూడు-ఈ కథల అవగాహనకు అమితార్థయుక్తి అవసరం.

భారతంలోని పర్వాల పేర్లలో కూడా విశిష్టత గోచరిస్తుంది. కొన్ని పర్వాలు వ్యక్తుల పేరుతో (ఉదా|| భీష్మ పర్వం, కర్ణ పర్వం, శల్య పర్వం) కొన్ని ప్రదేశ నామాలతో (ఉదా|| సభాపర్వం, అరణ్యపర్వం, విరాట పర్వం, ఆశ్రమవాస పర్వం) కొన్ని ప్రయోజన ఉద్దేశాలతో (ఉదా|| అశ్వమేధ పర్వం, శాంతిపర్వం, అనుశాసనిక పర్వం) కొన్ని వస్తు నామాలతో (ఉదా - మౌసల పర్వం) కనిపిస్తాయి. ఆశ్రమవాస పర్వం ఒక ప్రదేశం కేంద్రంగా జరిగిన కథల్ని సూచిస్తుంది. ఆశ్రమం అంటే పర్ణశాల, మఠం, అడవి, అనే అర్థాలున్నాయి. మునులు అడవులలో పర్ణశాలలు వేసికొని తపం చేసేవారు. ఆమునుల పేర్లతో ఆశ్రమాలు పిలువబడతాయి. అలాగే ధృతరాష్ట్రాదులు ఆశ్రమం వేసికొని వాసం చేసిన నాటి కథల్ని చెప్పే పర్వం ఆశ్రమ వాస పర్వం

ధృత రాష్ట్రాదులు విరక్తులై హస్తిన వదలి అడవి దారి పట్టడం, పర్ణశాలలు ఏర్పాటు చేసుకోవడం, వారిని చూడడానికి పాండవులు రావడం, కొంతకాలానికి వేదవ్యాస మహర్షి కృపతో మరణించిన కౌరవుల పత్నులు గంగలో పడి దివ్యత్వం పొందడం ఆతరువాత ధృతరాష్ట్రులు యోగ సహాయంతో శరీరం వదలడం అనే అంశాలున్న కథ కావడం వల్ల ఈ పర్వ నామం సార్థకం.

## భీష్ముడు చెప్పిన వాన ప్రస్థాశ్రమ ధర్మం :

ఆశ్రమాలలో వాన ప్రస్థాశ్రమం మూడవది. మహాభారతంలో భీష్ముడు ధర్మరాజుతో ఆశ్రమ ధర్మాల్ని వివరిస్తూ వాన ప్రస్థుల విధుల్ని వివరించాడు.

"తానున్ భార్యయు నేగు పేరడవికిం దానొక్కడైనం జనున్
మానాహంకృతులూడ్చు నింద్రియములన్ మర్దించు నచ్చో జడల్

పూనున్ దాపస శాస్త్రముల్ సదువు సల్పుంగోష్ఠి తత్ జ్ఞాళితో
వాన ప్రస్థ విధా ప్రవిష్టుడు ప్రజా వాత్సల్య నిష్ఠాత్మతన్

**ఆశ్రమవాస మెందుకు:** అసలు ఆశ్రమవాసం ఎందుకు అనేది కుతూహలం కలిగించే ప్రశ్న. మొదటిది వయో ధర్మం. రెండవది రాజ ధర్మం. మూడవది వ్యక్తి గతంగా ఇంకా సంసారంలో పడడమెందుకని ఆలోచించడం. ఇవన్నీ అందరికీ సమానమైనా ప్రత్యేకించి ధృతరాష్ట్రుడు భీముని సూటి పోటి మాటలకు తట్టు కోలేక పోవడం. భీముని చూచినప్పుడల్ల ధృతరాష్ట్రునికి తన పుత్రులు గుర్తుకు రావడం. ఇంక నాల్గవది- కుమారుల సుగతి కోసం ఏదో చేయాలన్న తపన.

## ధర్మాలు :

ఆశ్రమ వాస పర్వమంతా ధర్మ తత్త్వమే. "ధర్మతత్త్వజ్ఞులు ధర్మ శాస్త్రంబని" చెప్పడం ఈ పర్వానికి చక్కగా సరిపోతుంది. ఈ ధర్మాలు ఆరు రకాలు మొదటిది ఆశ్రయ, ఆశ్రిత ధర్మం. రెండవది రాజధర్మం మూడవది ఆచార ధర్మం నాల్గవది కుటుంబ ధర్మం. ఐదవది పరిజన ధర్మం. ఆరవది సందేశాత్మక ధర్మం.

**ఆశ్రయ-ఆశ్రిత ధర్మం :-** ఒక వ్యక్తిని అంటి పెట్టు కొన్న వారు ఆ వ్యక్తి క్షేమం చూడడం సహజమే. అంతే కాకుండ తన్ను ఆశ్రయించిన వారి బాగోగుల్ని ఆశ్రయ దాతలు పట్టించు కోవడం చాల అవసరం. ఈ ధర్మం ఆశ్రమ వాసంలో చక్కగా సూచించబడింది.

ధృతరాష్ట్రునితో కుంతి గాంధారి విదుర సంజయులు అడవికి కదలి వెళ్ళారు వీరిలో గాంధారి రావడంలో ఆశ్చర్యం లేదు. పై పెచ్చు గాంధారికి ధృతరాష్ట్రుని మనస్సు తెలుసు. అందుచేత గాంధారి అభ్యంతర గృహంబున కరిగి సుఖాసీనుండైయున్న నమ్మానవనాథుతో 'దేవా! వనంబున కెపుడు విచ్చేయు వాడవు' (1-81) అని హెచ్చరించింది కూడ. కుంతిని రమ్మని గాంధారీ ధృత రాష్ట్రులు అడగ లేదు అది కుంతి ఐచ్ఛిక కాంక్ష జీవితంలో చాల భాగం వారితో గడిపింది కనుక కుంతి కదలడంలో వింతలేదు. వారితో విదుర సంజయులు రావడం విశేషం. ఇతరుల్ని వారించిన ధృతరాష్ట్రుడు వీరిని వారించలేక పోయాడు. ఒకడు తమ్ముడు. మరొకడు

సన్నిహితుడు. అందుచేత అడవిలో వీరిద్దరి క్షేమం పట్టించుకొన్నాడు కాని క్రమంగా విదురుడు మరో దారి పట్టడం చూశాడు అవధూత లక్షణాలతో తిరగడం గుర్తించాడు ఏనాటికైనా ఎవరి దారి వారిదేనని తెలుసు కొన్నాడు

ఇక సంజయుడు ప్రాజ్ఞుడు తపస్సు చేయగలవాడు. తపోనిష్ఠకు ఓర్చేవాడు 'మేము తలంచినపుడు వచ్చు' అని తన అనుచర గణాన్ని గూర్చి ధృతరాష్ట్రుడు ధర్మ రాజుతో విశదంగా చెప్పాడు దర్భశయనాది సౌకర్యాలు కల్పించడం, పర్ణశాలలు ఏర్పాటు చేయడం లాంటి వాటిని ప్రత్యేకంగా ప్రశంసించాడు తమ్ముకార్చిచ్చు చుట్టుకుంటే ఆశక్తులయితే సంజయుడు రక్షించడానికి ప్రయత్నిస్తే, చివరకు ఆత్మహత్యకు కూడా సిద్ధమయితే దూరంగా వెళ్ళ వలసిందిగా ఆజ్ఞాపించాడు తనతో ఆశ్రితులు బాధ పడకూడదనే ధర్మం ఈ చర్యవల్ల స్పష్టమౌతుంది

**రాజ ధర్మం :** రంజించువాడు రాజు. ప్రజారంజనం రాజుల పరమ కర్తవ్యం రాజు ఎంత స్వతంత్రుడైనా ప్రజలకు విరుద్ధమైన పనులు చేయ కూడదు. ప్రజానుమతి రాజుకు అవశ్య కర్తవ్యం. ఈ ధర్మం తెలిసినవాడు కావడం వల్లనే ధర్మరాజుతో ధృతరాష్ట్రుడు

"ఏకార్యమైనను నెవ్వడేనియు జేయ
దొడగునప్పుడు వినుపుడమి తేని
చే ననుజ్ఞాతుడైకాని తొడరంగ గాదు (1-27)

అని రాజే గురువు, గురు ఆజ్ఞాపాలనం ఇహపరలోక హితకారి అన్నాడు.

**ఆచార ధర్మాలు :-** ఆశ్రమ వాస పర్వంలో లెక్కలేనన్ని ఆచార ధర్మాలు చెప్పబడ్డాయి. ప్రత్యేకించి శ్రాద్ధ క్రియాదులు. ధృతరాష్ట్రుడు చేసిన, చేయ దలచుకున్న శ్రాద్ధక్రియల వర్ణనలు ఈ పర్వంలో కనిపిస్తాయి. తన పెదతండ్రి మెప్పుకోసం ధర్మరాజాదులు ఇబ్బడిముబ్బడిగా చేయడంలో ప్రీతి, బాధ్యత రెండు కనిపిస్తాయి.

శ్రాద్ధ దివసంబులందు పుత్ర వ్రజమున
కాంబికేయుండు గోకనకాదిదాన
కీర్త్యముగ పారలౌకిక క్రియలు చేయు (1-13)

ధృత రాష్ట్రాదులు యోగంతో తనువులు పరిత్యజించినారని నారదుడు చెప్పగా విని ధర్మరాజు అపరక్రియలు చేసినాడట.

"అశుచిత్వం అపనయించుటకుం బుర బహిరంగణంబున పటకుటీర ప్రకరంబుల వసియించిరి" (2-169)

ఇవేకాక మరికొన్ని చిన్న అంశాల పట్ల కూడా ధృతరాష్ట్రుడు తీసికొన్న జాగ్రత్తలు ఆశ్చర్య పరుస్తాయి. ధర్మరాజు తన సోదరులతో 'తనకు నెయ్యేది ఆహారమయ్యే నాతిథ్యంబు దానన నడుపుట ధర్మ సరణి'గా భావించాడు. ఫలహారాదులతో ఆతిథ్యం ఇవ్వడం ఒక ధర్మం. అలాగే మునులు ధృతరాష్ట్రునితో కలిసి మాటలాడుతుంటే -

"ఇనుండు నభోమధ్య గతుండయ్యె
మీకు మధ్యందిన కృత్యంబు లాచరింప వలయు
విజయం చేయుడు 2-68

అనడంలో ధర్మ నిష్ఠ సువ్యక్తమవుతుంది.

కౌటుంబిక ధర్మాలు :- ఉమ్మడి కుటుంబంలోని సమస్యలు ఆయా వ్యక్తులవి కావు. అందరివి కష్టసుఖాలు అందరివి అందుచేతనే ధర్మరాజు ధృతరాష్ట్రాదుల్ని తనతో ఉంచుకొన్నాడు. కారణం ఒక రకంగా కృతజ్ఞత చిన్ననాడు ఋషులు పాండవుల్ని సభకు అప్పగించితే తమ్ముని కొడుకు లని గౌరవించినవైనం గుర్తుకు రావడం వల్ల. రెండవది రాజధర్మం. దిక్కులేని వారిని కాపాడ వలసిన ధర్మం ఉండడం వల్ల. మూడవది మానవతా వాదం. అందుచేతనే ఎవరుగాని ధృతరాష్ట్రాదులతో గడచిన వృత్తాంతం చెప్పకుండా ధర్మరాజు ఆజ్ఞ జారీ చేశాడు తనను చూడ డానికి వచ్చే వారిని ముందు ధృతరాష్ట్రాదులు చూచే విధంగా కట్టడి చేశాడు. అన్ని విషయాలు అప్పడప్పుడు ధృతరాష్ట్రునితో చర్చ చేయడం పెద్దరికానికి ఇచ్చిన గౌరవం.

ఏ కుటుంబంలో అయినా ఒక వ్యక్తి మాటలకు విలువ వుంటుంది. ఆ వ్యక్తి మాటలకు ఎదురు చెప్పడం వుండదు. ఆశ్రమ వాసంలో వేదవ్యాసునిది అటువంటి పాత్ర ధర్మరాజు ధృతరాష్ట్రునితో అరణ్య గమనం తగదన్నాడు

తానూ అరణ్యావాసం చేస్తానన్నాడు. కాని సమస్య కొలిక్కి రాలేదు. వేదవ్యాసుడు ఈ పరిస్థితిని గమనించాడు. కుటుంబపెద్దగా ఇలా అన్నాడు.

"కేవల తపః క్రియాసం,
సేవన తాత్పర్య మిపుడు చిత్తంబునయం
దావేశించినయది యీ
భూవరునకు నితని ననిచి పుచ్చు మడవికిన్ (1-52)

అని పరిష్కారం చెప్పాడు. అంతే గాకుండా అరణ్యంలో ధృతరాష్ట్రాదుల్ని కలిసి వారి కోరిక విని దివ్యదృష్టి యిచ్చి కౌరవుల సుగతిని కనిపింప జేశాడు. ఇది కుటుంబంలో ఒక పెద్ద తరహాలో ఉన్న వ్యక్తి పెద్దరిక నిర్వాహకం.

ఒక పెద్దకుటుంబంలోని మమకార బంధనం చిత్రమయిన అంశం. సహదేవుడు తన తల్లి కుంతిని చూడాలని తన కోరికను బయట పెట్టడం, అన్నగా ధర్మరాజు సరే ననడం, అడవిలో అల్లంతదూరం వుండగా సహదేవుడు శీఘ్రగామియై చని తల్లి కాళ్లపై పడి ఏడవడం (2-34) లాంటివి ఉదాహరణాలుగా చెప్పవచ్చు.

అరణ్యంలో ధర్మరాజు ధృతరాష్ట్రాదుల్ని చూచి వారు "చిక్కిపోవడాన్ని" గుర్తించి ఇతరులు సేవచేస్తున్నారా అని ప్రశ్నించడం ఔపచారికం మాత్రం కాదు. కులధర్మం. ఇదొక ఉదాత్త మానసిక ధర్మం.అందుచేతనే సహదేవుడు "నే తపమాచరించెద వీరలందరకును శుశ్రూష సేయుచు" అని బాధతో చెప్పాడు. చివరకు సహదేవుని పట్టుదల గుర్తించి కుంతి ఓదార్చి చివరకు "మీయునికి తపంబునకు విఘ్నంబు" (2-14) అని వారించడంతో సమస్య విడిపోతుంది.

ఏకాంతంలో, తమ తమ బాధల్ని ఏకరువు పెట్టడం మానవధర్మం. కుంతి వ్యాసునితో కర్ణ జన్మాన్ని వివరించింది. ఏ పరిస్థితిలో తాను ఆపని చేయ వలసి వచ్చిందో చెప్పింది. వ్యాసుడు అంతావిని ఓదార్చడంతో కుంతి గుండె బరువు తగ్గింది.

## పరిజన - పరిచయ ధర్మం :

ఒక వ్యక్తికి గాని, కుటుంబానికి గాని సన్నిహితుడయిన వ్యక్తి ఆచరించవలసిన కనీస ధర్మ దృష్టికి నారదుడు ఉదాహరణ ఇతడే ధృతరాష్ట్రునికి శతయూపుని గొప్పతనం చెప్పాడు. రాజర్షుల కథలు చెప్పాడు స్థాన మాహాత్మ్యం చెప్పాడు. చివరకు ధృతరాష్ట్రాదుల నిర్యాణాన్ని ధర్మరాజుకు చెప్పినవాడు కూడా నారదుడే అగ్నికి ధృతరాష్ట్రాదులు ఆహుతి అయ్యారని విని ధర్మరాజు అగ్నిదేవుని దూషించాడు. అగ్నిదేవుని కృతఘ్నతను తూర్పార పట్టినాడు. కాని చివరకు ధృతరాష్ట్రాదులు తమ అగ్నులు వదలి పెట్టడం వల్ల కలిగిన పరిణామాలు తెలిసికొని శాంతించాడు

సందేశ ధర్మం :- ఈ అశ్రమ వాస పర్వం అనేక సందేశాలకు నికేతనం. పగకు ఫలితం దుఃఖం అని ఒక సందేశం. వృద్ధ జనుల సేవ వల్ల దుఃఖోపశమన మవడం రెండవది. ప్రతివ్యక్తి ఆశ్రమ ధర్మాలు పాటించాలని చెప్పడం మూడవది దుష్టునిపై మమకారం పెంచుకుంటే అనర్థాలే అనడం నాల్గవది. వైయుక్తిక కాంక్షలు, కుటుంబ ధర్మాలు, రాజ ధర్మాల మధ్య సంఘర్షణలు చెలరేగితే పరిష్కరించ వలసిన విధానం చెప్పడం ఐదవది

ఆశ్రమవాస పర్వం అంతర్మథన పరులకు సందేశం అపరిష్కృత సమస్యలకు మార్గదర్శకం.



# శ్రీమద్భాగవతం - ధ్యానయోగం

డా॥ మేడసాని మోహన్

శ్రీమద్భాగవతం భగవద్భక్తిని ప్రేరేపించే మహేతిహాసం. సకల జగన్నియామకుడైన సర్వేశ్వరుని అనంత లీలావిభూతిని ప్రతిపాదించే వాఙ్మయ కళాఖండం. ప్రధానంగా భక్తితత్త్వాన్ని ప్రబోధిస్తూ ఉన్నా భగవంతుని పాదారవిందాలపై భక్తినిశ్చలతను సంధానింప జేసే ధ్యాన యోగ విశేషాలను కూడ భాగవతం తెలుపుతూ ఉంది. భక్తుని అంతరంగం ధ్యాన ధారణ సమాధి యోగ బంధురమైన నైశ్చల్యానికి ఆలవాలమైనపుడే భాగవతోత్తమత్వం సిద్ధిస్తుంది. సత్త్వగుణానికి ప్రాణాలైన సహనం, సంయమనం, సత్యపథావలంబనం - ఇత్యాది సద్గుణాలన్నీ ధ్యాన యోగాభ్యాసంతో ముక్షువులకు సిద్ధిస్తాయి.

కపిలుడు దేవహూతికి తత్త్వప్రబోధం చేసే సందర్భంలోని ఈ మాటలను పరిశీలిద్దాం

శ్లో॥ అనిమిత్త నిమిత్తేన స్వధర్మేణామలాత్మనా
తీవ్రయా మయి భక్త్యాచ శ్రుత సంభృతయా చిరమ్.
జ్ఞానేన దృష్ట తత్త్వేన వైరాగ్యేణ బలీయసా
తపోయుక్తేన యోగేన తీవ్రేణాత్మ సమాధినా.
ప్రకృతిః పురుషస్యేహ దహ్యమానాత్వహర్నిశమ్
తిరోభవిత్రీ శనకై రగ్నేర్యోనిరివారణి (3 - 121 to 123)

తా॥ అగ్ని యొక్క ఉత్పత్తిస్థానమైన అరణి తనయందే ఉత్పన్నమైన అగ్నితోనే మండి నశించేట్లుగా నిర్మల ధార్మిక హృదయంతో చేయబడిన నిష్కామమైన తపోయోగవిధానంతో అజ్ఞానం నశిస్తుంది. ధ్రువుడు కూడా ధ్యానయోగ మిళితమైన భక్తియోగం తోనే భగవంతుని మెప్పించాలని పేర్కొంటాడు. ధ్యానయోగసముపలబ్ధమైన ఏకాగ్రతతో హరిచరణారవిందాలను హృదయంలో పదిలంగా ప్రతిష్ఠించుకోగలగడంలో ఎంత ఔన్నత్యముందో ఈ ధ్రువుని మాటల్లో తెలుస్తుంది.

"యా నిర్వృతిస్తను భృతాం తవ పాదపద్మ
ధ్యానాద్భవజ్జన కథాశ్రవణేన వా స్యాత్.
సా బ్రహ్మణి స్వమహి మన్యపినాథమాభూత్
కిం త్వంతకాసి లులితాత్ పతతాం విమానాత్" (4 - 9 - 10)

ఈ శ్లోకానికి అనువాదమైన ఈ క్రింది పద్యం చూద్దాం.

"అరవిందోదర! తావకీన చరణధ్యానానురాగోల్లసత్
చరణా కర్ణన జాత భూరి సుఖముల్ స్వానందక బ్రహ్మమం
దరయన్ లేవట! దండభృద్భట విమానాకీర్ణులై కూలు నా
సురలోకస్థుల జెప్పనేల! సుజనస్తోమైక చింతామణీ!" (4 - 283)

శుకమహర్షి పరీక్షిన్మహారాజునకు భాగవత ప్రబోధం చేస్తూ ప్రారంభంలోనే యోగ వైశిష్ట్యాన్ని నొక్కి వక్కాణించాడు పరమ భాగవతోత్తములు పాటించే యోగమార్గాన్ని స్పష్టంగా తెలిపాడు

"ఏకాంత శుచి ప్రదేశంబున విధివత్ప్రకారంబునం గుశాజిన చేలంబులతోడం గల్పితాసనుండై మానసంబున నిఖిల జగత్పవిత్రీకరణ సమర్థంబై యకారాది త్రివర్ణకలితంబై బ్రహ్మబీజంబయిన ప్రణవంబు స్మరించుచు, వాయువుల జయించి, విషయంబుల వెంటనంటి పాఱెడి యింద్రియంబుల బుద్ధి సారథియై మనోనామకంబులైన పగ్గంబుల బిగ్గబట్టి మ్రొగ్గం దిగిచి, దట్టంబులైన కర్మ ఘట్టంబులు నిట్టట్టు మెట్టెడి మనంబును శేముషీ బలంబున నిరోధించి భగవదాకారంబు తోడ బంధించి నిర్విషయంబైన మనంబున భగవత్పాదాద్యవయవంబులు క్రమంబున ధ్యానంబు సేయుచు రజస్తమోగుణంబుల చేత నాక్షిప్తంబగు చిత్తంబు ధారణావశంబునం దద్గుణంబుల వలన నయ్యెడి మలంబుల బోనడచి నిర్మల చిత్తంబునం బరమంబైన విష్ణుపదంబునకుంజను. ధారణా నియమంబు గలుగ సుఖాత్మకంబగు విషయంబు నవలోకించు యోగికి భక్తి లక్షణంబైన యోగాశ్రయంబున వేగంబ మోక్షంబు సిద్ధించు....." (2 - 12)

ఇదివిన్న పరీక్షిన్మహారాజు ధ్యాన ధారణయోగాభ్యాసం ఎలా అవలంబించాలో, ఎలాంటి ధ్యాన ధారణలతో శ్రీమన్నారాయణుని దివ్య మంగళ విగ్రహాన్ని ఎలా మనస్సులో ప్రతిష్ఠించుకోవాలో తెలుపవలసిందిగా కోరాడు. శుకమహర్షి ఇలా చెప్పాడు.

"పవనము నియమించి పరిహృతసంగుడై
యింద్రియముల వర్గమెల్ల మాపి
హరివిశాలరూపమందు చిత్తముఁ జేర్చి
నిలుప వలయు బుద్ధి నెఱపి బుధుఁడు" (2-15)

అని యోగమార్గం తెలుపుతూ హరి దివ్య మంగళ విగ్రహాన్ని ఎలా ధ్యానయోగంతో హృదయానుసంధానం చేసుకోవాలో ఇలా తెలిపాడు.

"విజ్ఞానసంపన్నులై యున్న ప్రపన్నులు మాయాపన్నులు గాక విన్నాణంబున దమతమ హృదయాంతరాళంబులం బ్రాదేశమాత్ర దివ్యదేహుండును, దిగిభరాజశుం డాదండ సంకాశదీర్ఘచతుర్బాహుండును, కందర్పకోటి సమానసుందరుండును, ధృతమందరుండును, రాకావిరాజమాన రాజమండల సన్నిభ వదనుండును, సౌభాగ్య సదనుండును, ప్రభాతకాల భాసమాన భాస్కరబింబ ప్రతిమానవిరాజిత పద్మరాగరత్నరాజవిరాజమాన కిరీటకులడలుండును, శ్రీవత్స లక్షణ లక్షితవక్షో మండలుండును, రమణీయకౌస్తు భారత్న ఖచిత కంఠికాలంకృత కంధరుండును, నిరంతర పరిమళ మిళిత వనమాలికా బంధురుండును, నానావిధ గంభీర హారకేయూర కటక కంకణ మేఖలాంగుళీయక విభూషణవ్రాత సముజ్జ్వలుండును, నిటల తటవిలంబమాన విమల స్నిగ్ధనీలకుంచిత కుంతలుండును, తరుణచంద్ర చంద్రికా ధవళమందహాసుండును, పరిపూర్ణకరుణావలోకన భ్రూభంగ సూచిత సుభగసంతతానుగ్రహలీలా విలాసుండును, మహాయోగిరాజ విలసిత హృదయ కమల కర్ణికామధ్య సంస్థాపిత చరణ కిసలయుండును, సంతతానంద మయుండును, సహస్రకోటి సూర్య సంఘాత సన్నిభుండును, విభుండును నైన పరమేశ్వరుని మనో ధారణావశంబున నిలిపికొని తదీయ గుల్ఫచరణ జాను జంఘాద్యవయవంబులం గ్రమంబున నొక్కొక్కటిని ప్రతిక్షణంబును ధ్యానంబు సేయుచు నెంతకాలంబునకుఁ బరిపూర్ణ నిశ్చలభక్తియోగంబు సిద్ధించు నంతకాలంబునుం దదీయ చింతా తత్పరులై యుందురు." (2-26)

ఈ విధంగా భక్తియోగ ధ్యానయోగాలను విశ్లేషణాత్మకంగా ప్రబోధిస్తూ చివరగా

"పరమ భాగవతులు పాటించు పథమిది
యీ పథమున యోగి యేగెనేని
మగిడిరాడు వాడు; మఱి సంశయము లేదు
కల్పశతములైన కౌరవేంద్ర"

అని భాగవతులు పాటింపవలసిన యోగమార్గాన్ని విశదీకరించాడు మహర్షి.

శ్రీమన్నారాయణుని నాభికమలం నుండి సముద్భవించిన బ్రహ్మకూడా ఈ ధ్యాన యోగంతో కూడిన భక్తియోగం తోనే హరిని ప్రసన్నం చేసుకొని సకల సృష్టి కార్యాలు నిర్వర్తించే శక్తియుక్తులు సముపార్జించినట్లుగా కూడ భాగవతం పేర్కొంటూ ఉంది.

"అట్లు గ్రమ్మఱఁ జేరి యయ్యబ్జపీఠ
మందు నష్టాంగ యోగక్రియాను రక్తిఁ
బవను బంధించి మహిత తపస్సమాధి
నుండి శతవర్షములు సనుచుండ......." (3 - 282)

"కనియెన్ నిశ్చల భక్తియోగ మహిమన్ కంజాత గర్భుండు శో
భనచారిత్రు..................... (3 - 284)

బలి చక్రవర్తిని పాతాళానికి వెళ్ళవలసిందిగా ఆదేశించిన శ్రీహరి అక్కడ ఆ భాగవతుని ధ్యానయోగం అవలంబింపవలసిందిగా కూడ ఆజ్ఞాపిస్తాడు.

"దానవ దైత్యుల సంగతిఁ
బూనిన నీ యసుర భావమునుఁ దోడ్తోమ
ద్ధ్యానమునఁ దలఁగి పోవును
మానుగ సుతలమున నుండుమా! మాయాజ్ఞన్" (8 - 668)

ఈ విధంగా భాగవతంలో ఏ భక్తుని కథ చూచినా, ఏ ఉపాఖ్యానం యొక్క సారాంశాన్ని పరిశీలించినా భక్తి ధ్యాన యోగాల ప్రాధాన్యం తెలుస్తూ ఉంది.

"కామోత్కంఠత గోపికల్, భయమునన్, గంసుండు వైరక్రియా
సామగ్రిన్ శిశుపాల ముఖ్యనృపతుల్, సంబంధులై వృష్ణులున్
ప్రేమన్ మీరలు; భక్తినేము నిదె చక్రిం గంటి, మెట్లైనను
ద్దామ ధ్యానగరిష్ఠుడైన హరిఁజెందన్ వచ్చు ధాత్రీశ్వరా" (7-18)



# ఆంధ్ర మహాభాగవతం ... – శిక్ష

శ్రీ యం. నాగన్న

'నేరం' అనే మాటకు అపచారం, అపరాధం, తప్పిదం, దోషం, నెరసు అనే అర్థాలున్నాయి అలాగే 'శిక్ష' అనే మాటకు దండనం, నిగ్రహం, వేదాంగాలలో ఒకటి అనే అర్థాలున్నాయి. 'శిక్షించు' అనడానికి జాడించు, దండించు, దిద్దు, శాసించు అనే అర్థాలున్నాయి. పండితునికి, ఉపాధ్యాయునికి శిక్షకుడు శిక్షాకారుడనే అర్థాలున్నాయి.

తెలుగువారి పుణ్య తపఃఫలం ఆంధ్రమహాభాగవతం. ఈ మహాభాగవతంలో ఎన్నో ఉపాఖ్యానాలున్నాయి. ఆ ఉపాఖ్యానాలలో ఆయా వ్యక్తుల నెరసులు వాటికోసం శిక్షలు కనిపిస్తాయి వాటిని విశదీకరించడం ఈ వ్యాస ప్రధానోద్దేశ్యం!

భాగవతంలోని శిక్షలు ప్రధానంగా మూడు రకాలు. మొదటిది స్వశిక్షలు. రెండవది పరశిక్షలు. మూడవది అమలుకాని శిక్షలు.

స్వశిక్ష అంటే తనకు తాను విధించుకొనే శిక్ష. స్వయంకృతాపరాధం ఈ శిక్షకు ప్రధానకారణం. ఈ శిక్షకు తగిన ఉదాహరణ సతీదేవి దేహత్యాగం.

దక్షుడు యాగం చేయడానికి సిద్ధమయ్యాడు. అల్లుడయిన రుద్రుని ఆహ్వానించలేదు. అయినా 'సర్వదిక్కులవారు' యాగానికి కదిలారు. అప్పుడు దాక్షాయణి భర్తతో 'నీ విబుధగణం కూడా యాగానికి వెళుతున్నారు. నాకు వెళ్ళాలని వుంది. మనం తప్పక వెళ్ళాలి 'అన్నది. పరమేశ్వరుడు వారించాడు. తండ్రి యింటిలోని సంబరాలు తనయలు చూడాలికదా అని మరల ప్రార్థించింది. 'మద్వచనాతిక్రమంబునంజేసి యరిగితివేని యచట నీకు పరాభవంబు సంప్రాప్తంబగు' అని హెచ్చరించాడు. అయినా దాక్షాయణి కదిలింది. గౌరవం అటుంచి అగౌరవమే ఆహ్వానించింది. చివరకు సతీదేవి 'జలంబు ఆచమనంబు చేసి శుచియై మౌనంబు ధరియించి, జితాసనయై భూమియందాసీనయగుచు యోగమార్గంబునం జేసి శరీరత్యాగం చేసింది భర్త అయిన భవుడు హెచ్చరించినా సతి వెళ్ళడం నేరం. ఆ నేరం స్వయంకృతం. అందుచేత సతీదేవి తనకు తానే శిక్ష విధించుకొంది.

రెండవది పరశిక్షలు. ఈ శిక్షలు నాలుగు రకాలు. మొదటిది దేవతలిచ్చే శిక్షలు. రెండవది రాక్షసులిచ్చే శిక్షలు. మూడవది మానవమాత్రులిచ్చే శిక్షలు నాల్గవది మునులిచ్చే శిక్షలు.

దేవతలిచ్చే శిక్షలకు తగిన ఉదాహరణ చిత్రకేతువుకు భవాని ఇచ్చిన శాపరూపక శిక్ష.

చిత్రకేతువు విద్యాధరాధిపతి అతడు ఒకసారి కైలాసానికి వెళ్ళాడు అక్కడ గౌరిని కౌగిట చేర్చుకొని కొలువులో ఉన్న పరమేశ్వరుని చూశాడు. పకపకనవ్వాడు. ధర్మసభలలో ఇంతులతో మెలగే విధానాన్ని పరిహసించాడు. పరమేశ్వరుడు ఊరుకొన్నాడు. చిరునవ్వు నవ్వాడు. కాని పార్వతి ఆ విద్యాధరుని అనౌచిత్య సంభాషణకు అసహ్యించుకొంది. ఆగ్రహంతో

``ఎగ్గుపల్కిన పాపాత్ము డెల్ల భంగి
దండనారుండు గాకెటు తలఁగగలఁడు" 6 496

అంటూ `పాపస్వరూపంబయిన రాక్షస యోనింబుట్టుము' అని శపించింది. ఇది పరులిచ్చిన శిక్ష. ఈశ్వరుని తక్కువగా భావించి ఆడిన మాటలకు భవాని ఇచ్చిన శిక్ష. తనకంటె అధికులయిన వారిని తప్పుపట్టడం నేరం

ఇంక రెండవది రాక్షసుల శిక్షలు. రాక్షసులు గో బ్రాహ్మణులను పీడించడం, వారిని హతమార్చడం లాంటివి ఈ కోవలో చేరతాయి బ్రాహ్మణులు యాగనిష్ఠులు. ఆ యాగాలు విష్ణు సంబంధి కావడం రాక్షసులకు అయిష్టం. విష్ణుకీర్తన రాక్షసులపట్ల నేరం. అంచేత పీడించడం సహజం. ఇదే కాక రాక్షసులే తన బంధుగణానికి శిక్షలు వేయడం, దండించడంలాంటివి భాగవతంలో కనిపిస్తాయి. దీనికి చక్కని ఉదాహరణ ప్రహ్లాద చరిత్ర. ప్రహ్లాదుడు చేసిన నేరం తనతండ్రిని తప్పుపట్టడం గురువు చెప్పినట్లు వినకుండడం, విష్ణ్వాధిక్యం ప్రకటించడం. ఇవి సహించరాని నేరాలు. అందువల్ల తండ్రి `నానా హింసలు' పెట్టాడు. తాను శిక్షించిన విధానాన్ని

``ముంచితి వార్ధులం గదల
మొత్తితి శైలతటంబులందు ద్రో
బ్బించితి శస్త్రరాజి పొడి
పించితి మీఁద నిభేంద్రపంక్తిఁద్రొ

క్కించితి ధిక్కరించితి శ
పించితి ఘోరదవాగ్నులందు ఇద్రో
యించితి పెక్కుపాట్లనల
యించితి జావఁడిదేమి చిత్రమో"

అని భయంతో ఉద్వేగంతో ఆక్రోశించాడు కూడా.

మూడవది మానవమాత్రులిచ్చిన శిక్షలు. మానవజన్మ ఎత్తినవారు కావచ్చు లేదా మానవవేషధారులూ కావచ్చు. దీనికి చక్కని ఉదాహరణ కంసుడు బాలకృష్ణుని చంపించడానికి చేసిన ప్రయత్నాలు. వత్సాసుర, బకాసుర, అఘాసుర, ధేనుకాసురులను పంపి హతమార్చడానికి చేసిన ప్రయత్నాలు. అయితే ఇక్కడ కృష్ణుడు చేసిన నేరమేమీలేదు. కాని తనకు ప్రాణాపాయం కలుగుతుందని భయపడి కంసుడు చేసిన దుష్కృత్యాలు కూడా దండనాప్రాయమే

నాల్గవది మునులు ఆయా వ్యక్తులకిచ్చిన శాపరూపదండనలు సనకసనందనాదులు జయవిజయులుకిచ్చిన శాపం, కలశజుడు ఇంద్రద్యుమ్నునికిచ్చిన శాపం ఈ కోవలో చేరతాయి.

వైకుంఠంలోని శ్రీ మహావిష్ణువును సేవించడానికి సనకసనందాదులు విచ్చేశారు. వారిని జయవిజయులు వారించారు అపుడు దౌవారికుల స్వభావాన్ని మునులు విశదపరిచారు. తమకు అడ్డులేదన్నారు. తమ్ము పంపించినా శిక్షపడదన్నారు. కాని వారు వినలేదు. ఆగంతకుల ఔన్నత్యం గుర్తించకపోవడం నేరం. అంచేత మునులు శపించారు.

ఇంద్రద్యుమ్నుడు రాజు. అచ్యుత భక్తుడు. అనవరత విష్ణుధ్యాన తత్పరుడు. ఒకసారి కలశజుని రాకను గుర్తించలేకపోయాడు. కలశజునికి కోపం వచ్చింది. ఏనుగు కమ్మని శపించాడు. మునులు, పెద్దలు ఎప్పుడు వచ్చినా గౌరవించడం విధి. గౌరవం ఇవ్వకపోవడం, పరాఙ్ముఖత్వం ఇంద్రద్యుమ్నుని నేరం. `కరివి' కమ్మనడం శిక్ష. ఆ ఇంద్రద్యుమ్నుని మహావిష్ణువు రక్షించాడు. హాహా హూహూ నామకుడయిన మొసలిని సంహరించాడు.

సాంబుడు యాదవుడు. అతనికి తోటి యాదవులు ఆడవేషం వేయించారు ద్వారకకు వచ్చిన విశ్వామిత్ర వసిష్ఠ నారదాదులతో `ఈసుదతి భారవు గర్భమునందు పుత్త్రుడొ ఏకతమందు బాలకియొ యేర్పడఁజెప్పుడని అడిగారు.

మునులు ఈ పరిహాసాన్ని పసిగట్టారు. యదుకుల నిర్మూలకరంబయిన ముసలం పుడుతుందని శపించారు. శ్రీ కృష్ణుడు రాజ్యమేలే ద్వారకలో యాదవులకు ఈ ఆలోచన రావడం చిత్రం ఋషులను తక్కువవారినిగా చూడడం నేరం. అంచేత శాపం అనివార్యమయింది ఈ శాపం సాంబాదులకు మాత్రం కాకుండా కులానికంతాకావడం ఊహించరానిది. పరశురాముడు క్షత్రియులనందరిని పరశుతో సంహరించడం కూడా వంశనిర్మూలన దండన అవుతుంది.

భాగవతంలోని మరో కథ వేనుని కథ. తన యీడు కుమారుల్ని పశుప్రకారంలాగా చంపడం అతని బాల్యక్రీడ. అరాచకంగా పరిపాలించడం అతని స్వభావం. మునులు చెప్పినా వినకుండడం నేరం చివరకు మునులందరు నిర్లజ్జుడయిన హరిదూషకుని హననంబు సేయవలయు (4-429) అని హుంకార మాత్రంతో విగత జీవుని చేశారు అరాచకపాలనం నేరం. రాజ్యసంక్షేమం కోసం మునీశ్వరులు చంపడం శిక్ష.

దండనలు అనేక రకాలు కాయక దండనం ఇది దేహానికి సంబంధించింది దీనికి సరి అయిన ఉదాహరణ శ్రీకృష్ణుడు తన బావకు చేసిన సత్కారం శ్రీకృష్ణునితో పోరాడేవేళ రుక్మి బంధితుడయ్యాడు. అప్పుడు కృష్ణుడు

**`బావా! రమ్మని బఱునగవు నగుచు, వీనిం బట్టి బంధించి గడ్డంబును మీసంబునుం దలయును రేవులువాఱ గొఱిగి విరూపిం జేసెనట 10-146**

చిత్రకేతువుకు భార్యలనేకులు. కాని సంతానం కలుగలేదు. ఒకరోజు అంగిరసుడను ముని వచ్చి కృతద్యుతికి సంతానం కలుగుతుందని వరమిచ్చాడు సంతానం కలిగింది. కాని సవతులు సహించలేకపోయారు ప్రత్యేకించి చిత్రకేతువు కృతద్యుతిని, సంతానాన్ని నెత్తికి ఎక్కించుకోవడం వారికి సుతరాము గిట్టలేదు. ఇది రాజు చేసిన నేరం. అందుచేత కుమారునికి విషం ఇచ్చి చంపారు నేరం ఒకరిదయితే మరొకరికి శిక్షపడడం ఈ కథలోని ప్రత్యేకత

వాచికారూపమయిన దండనలు కూడా భాగవతంలో ఉన్నాయి. ఇతరుల్ని చులకనగా చూడడం మాటలాడడం ఈకోవలో చేరిన అంశాలు బలిచక్రవర్తి కథ దీనికి చక్కటి ఉదాహరణ.

బలి రాక్షసరాజు. అతడు హిరణ్యకశిపుని మరణానంతరం విజృంభించాడు రాక్షసుల్ని కట్టుదిట్టం చేశాడు. వారు మంచివారయ్యారు అందుచేత లక్ష్మి

తన దేవీగణంతో బలిరాజ్యంలో నిలిచింది. దేవతలకిది నచ్చలేదు అదితితో తన ఆవేదన చెప్పుకున్నారు. అదితి మహావిష్ణువును ప్రార్థించింది. మహావిష్ణువు అదితిగర్భంలో పుడతానని వరం ఇచ్చాడు. దేవతలు సంతోషించారు. దేవతల అకారణ సంతోషానికి ఆరా తీశాడు బలి. ప్రహ్లాదుని అడిగాడు. ప్రహ్లాదుడు `అదితి గర్భంలో మహావిష్ణువు అవతరించనున్నాడని చెప్పి స్తుతించాడు బలికి కోపం వచ్చింది. తన దగ్గర దుర్జయులయిన రాక్షసులున్నారని, వాసుదేవుడు తన్ను ఏమీ చేయలేడని అన్నాడు ప్రహ్లాదుడు నచ్చచెప్పాడు కాని బలి తన వైఖరి మానుకోకపోవడంతో రాజ్యభ్రష్టుడవు కమ్మని శపించాడు చివరకు బలి వేడుకుంటే విష్ణుభక్తి పరాయణుడవు కమ్మని అనుగ్రహించాడు హిరణ్యకశిపాదుల దుర్గతులు తెలిసికూడా తన బలంపై నమ్మకముంచి మాటలాడడం బలి చేసిన నేరం అతని నిష్ఠురోక్తికి `వాచా' దండన ఇవ్వడం తగిన శిక్ష

ఇంద్రుడు త్రిలోకాధిపతి పుష్కలావర్త మేఘాలను తన కనుసన్నల్లో ఉంచుకొన్నవాడు. గోపాలకులు తనకు వేడుక జరపకుండా కృష్ణుని ఆనతో గోవర్థన పర్వతానికి పూజలు చేయడం ఇంద్రునికి నచ్చలేదు వర్షం కురిపించాడు కాని కృష్ణుడు గోవర్ధనోద్ధరణం చేసి గోవుల్ని, గోపాలకుల్ని రక్షించాడు. ఇంద్రుడు కాళ్ళబేరానికి వచ్చాడు.

నావంటి వెఱ్ఱివారిని
శ్రీవల్లభ! నీవు శాస్తి చేసితి వేనిం
గావరము మాని పెద్దల
త్రోవల జరుగుదురు బుద్ధితోడుత నీశా! 10-937

అని సాగిలబడ్డాడు అపుడు శక్రునకు చక్రి -

అమరాధీశ్వర! లక్ష్మితోఁదగిలి యి ట్లంధుండవై యున్న నీ
సమదోద్రేకముఁద్రుంచి వైచుటకు నీ జన్నంబుఁదప్పించితిన్
బ్రమదశ్రీకుడు దండధారినగునన్ భావింపఁడెవ్వాని ని
క్కము రక్షింపఁదలంతు వాని నధనుం గావింతు జంభాంతకా 10-943

అని హెచ్చరించాడు. ఇది కూడా వాగ్రూపమయిన కట్టడి

ఇక చివరి విభాగం ``ఆగిన దండనలు"

దీనికి సరిఅయిన ఉదాహరణ శ్రీరామావతారంలో శ్రీరాముడు సముద్రునితో దారి యిమ్మని అడుగగా, సముద్రుడు మిన్నకుండినవేళ విల్లుచేపట్టడం, అప్పుడు సముద్రుడు అంజలి ఘటించి ప్రార్థించడం ఈ కోవలో చేరే అంశం

మెల్లని నగవున నయనము
లల్లార్చి శరంబు విల్లు నందినమాత్రం
గుల్లలు నాఁచులుఁజిప్పలుఁ
బెల్లలునై జలధి పెద్ద బీడైయుండెన్ 9-280

పరాత్పరుని గుర్తించకపోవడం సముద్రుని నేరం. విల్లుచేపట్టేదాక ఊరకుండడం నేరం. అయినా చివరకు అంజలితో `దండన' తప్పిపోయింది

అంబరీషోపాఖ్యానంలో కూడా తప్పిపోయిన దండన విధానముంది. అంబరీషుడు ఏకాదశీవ్రతం చేశాడు. కార్తికమాసంలో మూడు రాత్రులుపవాసం చేశాడు. కాళిందీజలంలో సుస్నాతుడయ్యాడు. హరిని అభిషేకించాడు పుష్పాలతో పూజించాడు పారణం చేయడానికి సిద్ధమైనాడు. అపుడే దుర్వాసుడు వచ్చాడు. తన యింట అన్నపానీయాలు సేవించవలసిందిగా అంబరీషుడు ప్రార్థించాడు. దుర్వాసుడు కాళిందికి వెళ్ళి ఆలస్యం చేశాడు. ద్వాదశి తిథి గడిచి పోతుండడంతో బ్రాహ్మణజనుల అనుజ్ఞతో అంబరీషుడు సలిలభక్షణం చేశాడు. కాని ఈచేత దుర్వాసునికి నచ్చలేదు కృత్యను ప్రయోగించాడు. అప్పుడు హరి భక్త సంరక్షణార్థం చక్రం ప్రయోగించాడు. దుర్వాసుడు బ్రహ్మను శరణువేడినాడు మహాదేవుని ప్రార్థించాడు. చివరకు భవుని అనతితో వైకుంఠునే వేడినాడు. తదనంతరం అంబరీషుని చరణస్పర్శచేశాడు అంబరీషుడు చక్రస్తవం చేసి శాంతింపచేశాడు. అంబరీషుని కరుణతో దుర్వాసుడు బయటపడ్డాడు. ఇది కూడా ఆగిన `శిక్షకు' దండనకు ఉదాహరణ

నేరము, దండన రెండూ మానసికస్థితికి సంబంధించిన అంశాలు. నేర ప్రవృత్తి కొన్ని వేళల సహజం. మరి కొన్ని వేళల పరిసరాలవల్ల ప్రేరేపితం అట్లే దండన కూడా వ్యక్తినిష్ఠం. కొన్ని వేళల్లో నేరానికి తగిన శిక్ష అయితే మరికొన్ని వేళల్లో నేరం ఆవగింజంత శిక్ష గుమ్మడికాయంత. నేరం, శిక్ష రెండూ ఒక నాణెం బొమ్మాబొరుసులనడం సమంజసం.



# నాచన సోమన - శ్రీకృష్ణ పాత్ర చిత్రణ

డా॥ యం. గోవిందస్వామి నాయుడు

ఆంధ్రకవులలో కవిత్రయం తరువాత కీర్తింపబడిన కవి చక్రవర్తి నాచన సోమన (క్రీ.శ 1285 - 1355). చిన్నయసూరి నీతి చంద్రికలో -

క. "ఘను నన్నయ భట్టును, ది
క్కన, నెఱ్ఱాప్రెగడఁ బొగడి యలికంబున న
క్షిని డాఁచినట్టి సర్వ
జ్ఞుని నాచన సోమనాథుస్తుతి యొనరింతున్"

అని కవిస్తుతి చేసి ఉండడం గమనార్హం. తెలుగు కావ్య రచనా ధోరణిని పురాణ ఫక్కీనుంచి ప్రబంధ ధోరణికి మార్చడంలో సోమన పాత్ర గణనీయం ఈయన ఉత్తర హరివంశం ఆరాశ్వాసాల కావ్యం. హరిహరనాథాంకితం. ఇది ప్రబంధరచనా మార్గంలో సాగిందనడం అతిశయోక్తి కాదు

సంస్కృత హరివంశం వ్యాసకృతం. భారత ఖిలపర్వ ప్రసిద్ధం. హరి మహిమాప్రతిపాదకం. దీన్ని మూలంగా గ్రహించి సోమన పలువర్ణనలను, కల్పనలను చేర్చి రసవత్కావ్యంగా తీర్చిదిద్దాడు. ఈ కావ్యంలో నాయకుడయిన శ్రీకృష్ణుని ఘనతను, ఆయన విరాట్ వ్యక్తిత్వాన్ని ఆవిష్కరించేందుకు సోమన ప్రయత్నించాడు. కృతకృత్యుడయ్యాడు. కావ్యంలోని ఆరాశ్వాసాల్లోనూ శ్రీకృష్ణునికి సంబంధించిన ఆరు వృత్తాంతాలు చోటు చేసుకున్నాయి. అవి నరకాసురవధ, విప్రకుమార రక్షణం, ఘంటాకర్ణ వృత్తాంతం, పౌండ్రక వధ, హంసడిభకోపాఖ్యానం, బాణాసుర గర్వభంగం.

ఉత్తర హరివంశంలో కృష్ణుడు ప్రధానంగా అనుసరించిన విధానాలు రెండు. మొదటిది శత్రు నిగ్రహం. రెండోది ఆశ్రితానుగ్రహం. కృష్ణుడు తన నలుగురి శత్రువుల్ని నిగ్రహించాడు. తక్కిన వారిని యథోచితంగా శిక్షించాడు ధర్మస్థాపన కోసం నరకుడ్ని హతమార్చగా పౌండ్రక, హంసడిభకులు తనను ఇబ్బంది పెట్టారన్న మిషతో వారిని పరిమార్చాడు. కృష్ణుడు అనుగ్రహించిన వారిలో ద్వారకా పౌరుడయిన విప్రుడు, పిశాచ వల్లభుడయిన ఘంటాకర్ణుడు

పేర్కొదగ్గవారు శ్రీకృష్ణుడు విప్రుని మృతబాలకుల్ని తెచ్చియిచ్చి అతని వంశాన్ని నిలబెట్టాడు ఘంటా కర్ణుడ్ని ఉద్ధరించి అతనికి ఇంద్ర పదవినిచ్చాడు బాణాసురుని గర్వాన్ని తుదముట్టించి అతనిలో భక్తిని ప్రజ్వరిల్లజేసేందుకు అతనిని శిక్షించాడు.

కృష్ణుని అవతార ప్రయోజనాలలో దుష్టశిక్షణ, శిష్టరక్షణ, ధర్మ సంస్థాపన ప్రధానమయినవి. కృష్ణుడే స్వయంగా భగవద్గీతలో ఈ అంశాన్ని తెలియజేశాడు

పరిత్రాణాయ సాధూనాం
వినాశాయ చ దుష్కృతామ్
ధర్మ సంస్థాపనార్థాయ
సంభవామి యుగే యుగే. -(భగవద్గీత 4-8)

నరకుడు దుష్టుడు. ఋషులను ఇబ్బంది పెట్టాడు. దేవతలను జయించి కడగండ్లపాలు చేశాడు భూలోకంలోని రాజులను హింసించాడు పదారువేల వందమంది అప్సరాంగనల్ని చెరపట్టాడు అతని ఆగడాలకు అంతం లేకపోయింది. అట్టి నరకుడ్ని శిక్షించి బాధితులను రక్షించవలసిన బాధ్యత శ్రీకృష్ణుని మీద పడింది. సత్యభామను వెంట బెట్టుకొని సమరానికి వెళ్లాడు ముందుగా నరకుని అనుచరులను తుద ముట్టించాడు. నరకునితో ఘోర యుద్ధం చేసి చివరకు చక్రప్రయోగంతో అతనిని హతమార్చాడు. నరక సంహారం ద్వారా భూచర ఖేచరులందరికీ ఎనలేని ప్రమోదాన్ని ప్రసాదించాడు ఇక్కడ ఒక అంశం గమనించవలసి ఉంది నరకుడు భూదేవి కుమారుడు. విష్ణువు వరాహావతారం ధరించి భూదేవిని కౌగిలించుకున్నప్పుడు ఆమెకు నరకుడు జన్మించాడు. ఒక విధంగా చెప్పాలంటే నరకుడు విష్ణువు కుమారుడే. నరకుడు తన కుమారుడయినప్పటికీ విష్ణుదేవుని అంశ అయిన కృష్ణుడు అతన్ని ఉపేక్షించ లేదు. అది, తన భార్యగా పరిగణింప దగిన భూదేవికి దుస్సహమని తెలిసినప్పటికీ పట్టించుకోలేదు. ధర్మచ్యుతికి కారకుడయి ఇతరులకు శోక కారకుడయిన నరకాసురుని నిర్దాక్షిణ్యంగా వధించాడు ఆయన కర్తవ్యదీక్ష అట్టిది. కర్తవ్య నిర్వహణలో బంధుప్రీతికి కానీ, మమకారానికి కానీ, ఇష్టాయిష్టాలకు కానీ చోటివ్వకూడదని తన యీ నిష్పాక్షిక కృత్యం ద్వారా కృష్ణుడు లోకానికి తెలియజేశాడు.

సజ్జనులకు దుర్జనులకు ఎప్పుడూ ఎక్కడా పొసగదు. 'ప్రకృత్య మిత్రాహిసతామ సాధవః' అని భారవి సూక్తి. సజ్జనులకపకారం చెయ్యడం

ద్వారా వారిని సంతాపానికి గురిచేసి సంతోషాన్ని పొందడమే దుర్జన స్వభావం దుర్జనులు నిష్కారణంగానే సజ్జనులకపకారం చేస్తారని భాస్కర శతకకారుడు కూడా తెలియజేసి ఉండడం గమనార్హం.

ఉ. "ఊరక సజ్జనుండొదిగి యుండిన నైన దురాత్మకుండు ని
ష్కారణ మోర్వలేక యపకారము చేయుట వాని విద్యగా
చీరెలు నూఱుటంకములు చేసెడివైనను బెట్టెనుండగా
జేరి చినింగి పోఁగొఱుకు చిమ్మట కేమి ఫలంబు భాస్కరా"

(భాస్కరశతకం - పద్యం 18)

శ్రీ కృష్ణుని ఘనతను గురించి ఆయన మహిమాదులను గురించి విని కొందరు అసూయాగ్నికి ఆహుతయ్యారు వారిలో ప్రముఖంగా పేర్కొదగినవారు పౌండ్రకుడు, హంస డిభకులు. వీరు అసుర స్వభావులు కావడం చేత హరిని అకారణంగానే ద్వేషించారు ఆయన అభ్యున్నతిని చూసి ఏమాత్రమూ ఓర్చుకోలేక పోయారు పౌండ్రకుడు కృష్ణుడ్ని చులకన చేసే విధంగా అతని పంచాయుధాలను ధరించాడు తానే వాసుదేవుడని స్వయంగా ప్రకటించుకొన్నాడు. కృష్ణుడ్ని తక్కువచేసి మాట్లాడడం నిత్య వ్రతంగా పెట్టుకొన్నాడు. కృష్ణభక్తుల్ని హింసించడం అతని నిత్య నియమం. పౌండ్రకుడు కృష్ణుడు లేని సమయంలో ద్వారకను ముట్టడించి అక్కడి ప్రజలకు హడలెత్తించాడు. కృష్ణుడు నారదునివల్ల ఈ వృత్తాంతం విని ద్వారక చేరుకొని పౌండ్రకునితో యుద్ధంచేసి అతన్ని హతమార్చాడు. తపస్సు కోసం బదరికాశ్రమం వెళ్లిన కృష్ణుడు పౌండ్రకుని ద్వారకముట్టడిని గురించి విని వెంటనే వచ్చి ద్వారకావాసులను ఆదుకొన్నాడు. తన పని కన్నా తనను నమ్మి ఉన్న ప్రజలను రక్షించడమే ప్రథమ కర్తవ్యంగా కృష్ణుడు భావించిన వైనం ఇక్కడ బోధపడుతుంది.

సాళ్వ దేశాధిపతి బ్రహ్మదత్తుని కుమారులు హంస డిభకులు. వీరు శివానుగ్రహ సంభూతులయినప్పటికీ దురహంకార దుర్మతులు. వేటకు వెళ్లినప్పుడు అకారణంగా రుద్రాంశ సంభూతుడయిన దుర్వాస మహర్షిని దురపిల్ల జేశారు. ఆయనను అవమానించి ఆయన కోపానికి గురయ్యారు. అకారణంగా కృష్ణుని ద్వేషించారు. మిత్రుడయిన జనార్దనుడ్ని రాయబారిగా యాదవ నగరానికి పంపారు. తమ తండ్రి తలపెట్టిన రాజసూయ యజ్ఞానికి ఉప్పుకప్పంగా పంపుమనీ, తమ ఆధిక్యతను అంగీకరించుమనీ, లేదా యుద్ధానికి

సన్నద్ధం కమ్మని కృష్ణునికి సవాలు విసిరారు. దురహంకారులు బుధ జనులకు అవిధేయులు సాధు కంటకులయిన హంస డిభకులను మట్టుబెట్టేందుకు అదను అదేనని హరి భావించాడు. ఆహవానికి సిద్ధమయ్యాడు ఘోరాజిలో హంసుణ్ని యమునలో ముంచి అణగదొక్కాడు. అన్న మరణం దుర్భరం కాగా తమ్ముడు డిభకుడు యమునలో దూకి ఆత్మాహుతి చేసుకొన్నాడు అన్నదమ్ముల అనుబంధానికి ప్రతీకలయినప్పటి హంస డిభకుల్ని హతమార్చి మదోన్మత్తత మరణ ప్రదాయకమని మానవాళికి తెలియజేశాడు దౌర్జన్యం కొంతకాలం శోభించినా అంత్యకాలం దానికి అత్యంత సమీపంలోనే ఉంటుందని అందరికీ అవగతమయ్యేట్లు చేశాడు. నరక, పౌండ్రక, హంస డిభకులు నలుగురూ వధ్యులు నరకుడు లోక కంటకుడు కాగా, తక్కిన ముగ్గురూ కృష్ణ ద్వేషాన్ని పెంచుకొని కృష్ణాంతాన్ని కాంక్షించి ఆయనకు కీడుచేయ సమకట్టారు. అందువల్ల వారి ఉనికి కృష్ణోపద్రవకారకమే గాక లోకోపద్రవ కారకంగా కూడా పరిణమించే అవకాశముంది కాబట్టి కృష్ణుడు వారిని సంహరించి శత్రు శేషాన్ని నిశ్శేషం చేసుకోవడమేగాక లోకానికి రానున్న ఉపద్రవాన్ని ముందుగానే అరికట్టాడు

కృష్ణునితో శత్రుత్వం వహించి పోరిన మరోవీరుడు బలికుమారుడు బాణాసురుడు. ఇతడు శివభక్తుడయి శివానుగ్రహాన్ని పొందాడు. శివుణ్ని తనకు రక్షకుడుగా పొందడంతో ఇతని అహంకారం అవధులు దాటింది అది శివుడ్నే సవాలు చేసింది. వంద బాహువులున్నాయన్న గర్వం అతన్ని మదోన్మత్తుడ్ని చేసింది పర్యవసానంగా బాణుడు విర్రవీగాడు. ఆ మిడిసిపాటు అతనికి ఘోర ఆపదను తెచ్చిపెట్టింది.

కృష్ణ పౌత్రుడయిన అనిరుద్ధుణ్ని బాణపుత్రిక ఉష వలచింది. తనకు చెలికత్తె, మంత్రి కుంభాండుని కుమార్తె అయిన చిత్రరేఖ సాయంతో అనిరుద్ధుణ్ని తన అంతః పురానికి తెప్పించుకొంది. బాణుడు అనిరుద్ధుణ్ని నాగపాశబద్ధుణ్ని చేయడంతో ద్వారకకు, శోణిత పురానికి బద్ధ శత్రుత్వ మేర్పడింది. కృష్ణుడు బలరామ ప్రద్యుమ్న సమేతుడయి బాణుని మీదికి యుద్ధానికి వెళ్లాడు. అతనికి సహాయంగా వచ్చిన శివశివగణాలను నిర్జించాడు అసురులను హతమార్చాడు బాణుని భుజాలలో రెంటిని మాత్రం మినహాయించి తక్కినవాటిని తన చక్రంతో ఖండించాడు బాణాసురుడ్ని వధించ లేదు అతని గర్వాన్ని మాత్రమే రూపు మాపాడు. బాణుడు లోక కంటకుడు

కాడు. దోషికాడు. కృష్ణునితో అతడు ఏర్పరచుకొన్న పగకూడా నిర్హేతుకం కాదు. అతడు అహంకారి మాత్రమే. అందువల్ల బాణుడు శిక్షార్హుడే కానీ వధార్హుడు కాడు. పైగా అతడు తన భక్తుడయిన ప్రహ్లాదుని వంశానికి చెందిన వాడు. తనకు ప్రియం చేకూర్చిన బలిచక్రవర్తి కుమారుడు. కాబట్టి కృష్ణుడతన్ని సంహరింపక సంస్కరించాడు.

కృష్ణుని క్రోధాగ్నికి అయిదు మంది గురయితే ఆయన అమృతావలోకనానికీ, అనుగ్రహానికీ ఇద్దరు పాత్రులయ్యారు. వారిలో మొదటి వ్యక్తి పుత్రులను పోగొట్టుకొన్న విప్రుడు రెండోవాడు ఘంటాకర్ణుడు ద్వారకానగరంలోని ఒక విప్రుని కుమారులు పుట్టిన వెంటనే అకాల మృత్యువు పాలయ్యారు. తన యీ దుస్థితిని బ్రాహ్మణుడు కృష్ణునికి నివేదించి శరణు జొచ్చాడు కృష్ణుడు ఆబ్రాహ్మణునికి అర్జునుడ్ని సాయంగా పంపినప్పటికీ ఫలితం లేకపోయింది. కృష్ణుడు అర్జునుడ్ని వెంటబెట్టుకొని అవాఙ్మానస గోచర మార్గంలో పయనించి, విష్ణుసన్నిధిలో ఉన్న విప్ర కుమారులను తీసుకవచ్చి, విప్రుని కప్పగించి, ద్వారకానగర పాలకుడుగా తన కర్తవ్యాన్ని నిర్వర్తించాడు ఆపన్నులను ఆదుకోవడం, శరణుజొచ్చిన వారిని కరుణతో కాపాడడం వంటి ఉత్తమ గుణాలకు ఉనికి పట్టుగా కృష్ణుడు ఇక్కడ మనకు గోచరిస్తాడు. అనితర దుర్గమ మార్గంలో పయనించి తేజోపురుషునిలో ప్రవేశించి బ్రాహ్మణ మృత బాలకుల్ని తీసుకురావడం సామాన్యులకు సాధ్యమయ్యే పనికాదు. ఇది అసంభవాన్ని కూడా సంభవం చేసే కృష్ణుని శక్తిని, మహిమను తెలియజేస్తుంది.

కృష్ణానుగ్రహానికి పాత్రులయిన వారిలో రెండోవాడు ఘంటాకర్ణుడు. ఘంటాకర్ణుడు పిశాచమయినప్పటికీ ప్రజా కంటకుడు కాదు. పైగా విష్ణు భక్తుడు. ముముక్షువు. ఘంటాకర్ణునిలో సత్వగుణం అధికంగా ఉన్నప్పటికీ పైశాచిక స్పర్శ లేకపోలేదు. తనకుపయోగ యోగ్యమయిన మాంసాహారాన్నే కృష్ణునికి నివేదించాడు. సమాధి స్థితుడయి తాను దర్శించిన విష్ణు రూపానికీ, తనకు బాహ్యంగా కనిపించిన కృష్ణ రూపానికీ అభేదాన్ని గుర్తించాడు. కృష్ణుడే విష్ణువని తెలుసుకొన్నాడు. ఘంటాకర్ణుడు కృష్ణునికి తన్నుతాను పరిచయం చేసుకొంటూ తాను శివభక్తుడని చెప్పుకొన్నాడు. ఇక్కడ శివ విష్ణువులిద్దర్నీ సమానంగా ఆరాధించే సమున్నత స్వభావం ఘంటాకర్ణునిలో ఉండడం విశేషం. ఇన్ని మంచి అర్హతలున్నందువలననే ఘంటాకర్ణుడు కృష్ణానుగ్రహానికి పాత్రుడయ్యాడు. కృష్ణుడతనికి ఇంద్ర పదవిని, తదనంతరం వైకుంఠ ప్రాప్తిని ఇచ్చి సత్కరించాడు. ఘంటాకర్ణ సాహచర్యం వల్ల అతని

తమ్ముడు కాలాంతకుడు కూడా పునీతుడయ్యాడు. అన్నలాగే దైవానుగ్రహానికి పాత్రుడయ్యాడు. ఇతన్ని కూడా కృష్ణుడు ఉద్ధరించాడు

కృష్ణుడు సర్వ సమర్థుడు, సర్వ శక్తిమంతుడు. ఎక్కడ కానీ అతనికి అసాధ్యమేదీ లేదు అంతటి కృష్ణుడు రుక్మిణి కోరిక మేరకు సంతానార్థం శివుణ్ని ఉద్దేశించి తపస్సు చెయ్యడానికి వెళ్లాడు శివుణ్ని పరిపరి విధాలా ప్రార్థించాడు. శివానుగ్రహంతో బాటు శివ ప్రశంసను కూడా పొందాడు కృష్ణుడు ఇలా తపస్సుకు వెళ్లడంలో రెండు ప్రయోజనాలు కనిపిస్తాయి శివుని కంటి మంటలో కాలిపోయిన మన్మథుణ్ని పునర్జీవితుణ్నిచేసి లోక కల్యాణం చేకూర్చడం మొదటి ప్రయోజనం. అణకువతో పెద్దలను ఆశ్రయించి ప్రయోజనాన్ని పొందవలసిన ఆవశ్యకతను లోకానికి వెల్లడించడం రెండో ప్రయోజనం. శ్రేష్ఠులయిన వారు లోకానికి ఆదర్శంగా జీవించాలని కృష్ణుడే భగవద్గీతలో పేర్కొవడం ఇక్కడ గమనార్హం

"యద్యదా చరతి శ్రేష్ఠ
సత దేవేతకో జనః
స యత్ప్రమాణం కురుతే
లోకస్తదను వరతే" -(భగవద్గీత 3-21)

గొప్పవాడు ఏ కర్మను చేస్తాడో దాన్నే తక్కినవారూ చేస్తారు. అతడు దేన్ని ప్రమాణంగా గైకొంటాడో తక్కిన వారూ దాన్నే అనుసరిస్తారని భావం

అనేక లీలల్ని ప్రదర్శించి అనేక ధర్మాలను ఆచరణ ద్వారా ఆవిష్కరించిన కృష్ణుని ఘనత గొప్పది. ఎవరు ఏ దృష్టితో పరికిస్తే వారికి ఆ దృష్టికి అనుగుణంగా గోచరించే మహత్వమాయనది. అందువల్ల ఉత్తరహరివంశ కావ్యగత పాత్రలు కొన్ని కృష్ణుణ్ని కృష్ణునిగానే దర్శించాయి మరికొన్ని విష్ణువుగానే విలోకించాయి. ఇంకొన్ని కృష్ణునిగానూ విష్ణువుగానూ భావించాయి. మరికొన్ని పాత్రలు కృష్ణ విష్ణువులకు భేదం లేని వైనాన్ని ప్రదర్శించాయి.

కృష్ణుడు మాయా మానుష విగ్రహుడు. 'కలయో వైష్ణవ మాయయో' అని కృష్ణుని నోటిలో లోకాలను చూసిన యశోద మరుక్షణం లోనే మాయకు వశమై కృష్ణుణ్ని తన బిడ్డగానే భావించింది. ఇలాగే మరెందరో కృష్ణుని మహత్వాన్ని గుర్తించక కేవల మానవ మాత్రునిగానే గుర్తించారు. వీరిలో పేర్కోదగిన వ్యక్తి దేవేంద్రుడు. దేవనేత విశేష వేత్త అయినప్పటికీ విష్ణువు

విషయంలో పప్పులో కాలు వేశాడనే చెప్పాలి. శ్రీకృష్ణుడ్ని సామాన్య బాలునిగా భావించి, శిలావర్షం కురిపించి అవమానం పాలయిన సంగతి పాఠకులకు విదితమే అలాంటి దేవేంద్రుడే నరకాసురుని బాధలకోర్చుకోలేక సాయం కోసం కృష్ణుని దగ్గరకు వచ్చి, కృష్ణుడ్ని కేవలం కృష్ణునిగానే కొనియాడాడు.

క. ఈ వైనతేయు నెక్కినఁ
గావింపఁగరాని పనులుఁగలవే నీకున్
గోవింద! తిరుగు నీతడు
దేవతలకుఁదిరుగ రాని తెరువున నైనన్.

-(ఉత్తరహరివంశం 1-136)

వసుంధర తన కుమారుడయిన నరకుడ్ని కోల్పోయింది. ఆబాధ ఒకవైపు, భర్తయిన విష్ణువు కృష్ణ రూపంలో తనముందు నిలువగా కలిగిన సంతోషం మరోవైపు ఆమెను ఉక్కిరిబిక్కిరి చేశాయి. జగత్పాలకుడయిన విష్ణువు తన కుమారుని పట్ల మాత్రం పాలక ధర్మం నెరవేర్చ లేదని ఆరోపించింది ఇక్కడ త్రిమూర్తులకు కూడా ఉత్పత్తి కారకుడయిన పరబ్రహ్మగా, విష్ణువుగా భూదేవి కృష్ణుడ్ని కీర్తించింది.

క. అట్టిల జగము లన్నియు
బుట్టింపం బెంపఁద్రుంపఁబురుషులు ముగ్గురై
పుట్టిన వేలుపువఁట నా
పట్టి యెడందగునె నడిమి పని మానుటకున్.

- (ఉత్తరహరివంశం 1-186)

కృష్ణుడు కైలాసం వెళ్తూ బదరికాశ్రమం చేరుకొన్నప్పుడు అక్కడి ఋషులు అతనికి అర్ఘ్యపాద్యాది పురస్సరంగా అతిథ్యమిచ్చారు. ఆ సందర్భంలో వారు కృష్ణుడ్ని విష్ణువుగా అభివర్ణించారు. పలువిధాలా స్తుతించారు.

సీ. ఆకాశగంగ నీయడుగునఁబొడమె నీ
కిట్లర్ఘ్యపాద్యంబు లిచ్చుటెంత
నిఖిలంబు రక్షింప నీరజోగుణమూర్తి
పని నీకుఁ గుశల సంప్రశ్న మెంత
కమలంబు నీ నాభి కన్నది నీ కిట్లు
పుష్పాంతరంబుల పూజ యెంత

యమృతంబు నీచేత నమరులు గుడిచిరి
నీకు వన్యాహార నియతి యెంత -(ఉత్తరహరివంశం 2-115)

హంసడిభక వధానంతరం పుష్కర సరస్తీరస్థ ఋషులు కృష్ణుడ్ని అభినందించారు. విష్ణువుగా వినుతించారు.

సీ. చక్రంబు మేదినీ చక్రంబు నేదేవు
దక్షిణ బాహు సౌందర్య మొసగు
జలజంబు నొకపాణి జలజంబు నేదేవు
సవ్య భుజంబుతో సరసమాడు
రత్నంబు గామినీ రత్నంబు నేదేవు
వక్షస్థ్సలంబున వన్నెమిగులు
నోఘంబు దానవార్యోఘంబు నేదేవు
చరణ పల్లవ సమాశ్రయము నొందు
తే. భాను మండలమును సుధాభాను మండ
లంబు నేదేవు కన్నుల లావు వడయు
దేవ దేవు నద్దేవుని఼ దెలియు వారు
దేవదేవుని రూపంబు఼దెలియువారు. -(ఉత్తరహరివంశం 4-316)

హరివంశంలో కొందరు కృష్ణుడ్ని కృష్ణునిగానూ కీర్తించారు వీరిలో ప్రముఖంగా పేర్కొదగినవాడు జనార్దనుడు. ఈయన విష్ణ్వంశ సంభూతుడు హంస డిభకుల మిత్రుడు. మిత్రసహుని కుమారుడు. బాల్యంనుంచీ ఇతనికి విష్ణుభక్తి మెండు. కాబట్టి ఇతడు కృష్ణుడ్ని కృష్ణుని గానే గాక విష్ణుసదృశునిగా కూడా భావించాడు. కృష్ణునితో వైరం హానికరమని హంస డిభకులకు తెలియజేస్తూ కృష్ణుని ఘనతను కీర్తించాడు.

సీ. నరకాసురప్రాణ నాళోత్తరణ కేళి
రణకేళి వలకేళి రమణఁజూపెఁ
గంసదానవ శిరః కమల కృత్తన మేలు
తనమేలు చేయి పెద్దలకు నొసఁగెఁ
జాణూరముష్టి కక్షతజ కీలాలంబు
నాలంబులో నెల్ల నలవు వఱపె
మురహయగ్రీవాంత్ర మూల ఫేనావలి
నావలి దలఁగఁజీకాకు పఱచె

తే. వీరంసపార కాసార విహరణంబు
విష్ణునకు నొప్పునతనితో విగ్రహింప
దొరకొనిన వచ్చు మనకు ముద్దులు మునింగి
పాఱ వెంపల్లు తమ కెంతబంటి యనుట.

-(ఉత్తరహరివంశం 4-124)

కృష్ణుడు, విష్ణువు వేర్వేరు కారనీ ఒక్కరేనని భావించిన వారిలో ఘంటాకర్ణుడు, ఈశ్వరుడు పేర్కోదగిన వారు. పిశాచ వల్లభుడయిన ఘంటాకర్ణుడు బదరికాశ్రమంలో విష్ణువునుద్దేశించి తపస్సు చేశాడు కృష్ణుడ్ని చూడగానే అతనికి విష్ణువును చూసినట్లయింది. అందువల్ల కృష్ణుడు, విష్ణువు ఒక్కరేనని భావించాడు మురారిని దర్శిస్తే భవాలన్నీ పటాపంచలవుతాయని గాఢంగా విశ్వసించాడు

సీ. తొమ్మండ్రు కొడుకుల ౘదొలివేలుపుల ౙేయఁ
బొడమించు నేదేవు బొడ్డుఁ దమ్మి
మూఁడుత్రోవలఁ బాఱి మున్నీటి గరిత గాఁ
బరఁగు నే దేవుని పాద తటిని
పండ్రెండు రూపులై పగలింటి రాజుగా
వలఁతి యే దేవుని వలనుఁగన్ను
వేయి మానికపు దివ్వెలతోడఁబడగలు
మ్రాల్చు నేదేవునిమలక పాన్పు

తే. మునులకెల్ల నేదేవుని మూర్తి వెలుగు
హృదయ గేహంబులో దీపమెత్తినట్లు
హరి మురారి నద్దేవు మహానుభావు
మనసులోఁగంటి భవములు మాను నంటి

-(ఉత్తరహరివంశం 2-144)

కృష్ణుడు సంతానార్థం కైలాసంలో శివుడ్ని గురించి తపస్సు చేశాడు. శివుడు ప్రత్యక్షమయ్యాడు. శివ కేశవులిద్దరూ పరస్పర సంభావన కుశల ప్రశ్నానంతరం ఒకరినొకరు వినుతించుకొన్నారు. ఈ సందర్భంలో ఈశ్వరుడు కృష్ణుడ్ని విష్ణువుగానే కొనియాడాడు. ఆయన నామ వ్యుత్పత్తి విశేషాలను వివరిస్తూ కృష్ణుని ఘనతను కొనియాడాడు.

సీ. విశ్వలోకవ్యాప్తి విష్ణునామముఁదాల్తు
మధువింద్రియములు తన్మర్దనమున
మధుసూదనుండవు మా యన విద్య త
త్పతివి మాధవుఁడవు తపము చేత
నగుదు తపస్వివి హరణ మింతకుఁజేసి
హరివైతి నారంబు లన జలంబు
లం దయనంబు నీకగుట నారాయణ
త్వము వహించితి బృహత్త్వంబు బృంహ
తే. ణమును జూపుట బ్రహ్మవైనాడ వింద్రి
యములగు హృషీకములు తదీ శాఖ్యఁగలిగి
నది హృషీకేశపదము శమ్మది సుఖం బ
ఖిలమునకుఁ జేసి శంకరాకృతి భజింతు.

-(ఉత్తరహరివంశం 2-207)

నాచన సోమన తన ఉత్తర హరివంశంలో శ్రీ కృష్ణుని పాత్రకు అధిక ప్రాధాన్యాన్నిచ్చాడు. దుష్ట శిక్షకుడుగా, ఆశ్రిత రక్షకుడుగా కృష్ణుడీ కావ్యంలో గోచరిస్తాడు. స్వపరభేదాలను గానీ, ఇష్టాయిష్టాలను గానీ పరిగణన లోకి తీసికోకుండా దుష్టశిక్షణ చేసే ధీరుడుగా ఆదర్శ ప్రాయుడుగా కనిపిస్తాడు. కృష్ణుడ్ని కృష్ణునిగానే గాక విష్ణువుగా, పరబ్రహ్మ స్వరూపునిగా కూడా కొన్నిపాత్రల చేత కొనియాడజేసి హరి ఆధిక్యాన్ని సోమన ఆవిష్కరించాడు.



# శ్రీనాథుని దౌత్యము - అవచి తిప్పయ్య ఔచిత్యము

ఆచార్య యార్లగడ్డ బాలగంగాధరరావు

శ్రీనాథుని హరవిలాస కావ్యము అవచి తిప్పయకు అంకితమనుట లోక విదితము. ఇది అంకితము లేక రచన గావించునప్పుడు అవచి తిప్పయ కంచిలో నివాసమున్నాడు. దీనికి పెక్కు ఆధారములు హరవిలాసమునందే గలవు. శ్రీనాథుడు కృతి కర్తను ఈ విధముగా సంబోధించి యున్నాడు.

1. కాంచీపుర నివాస 2) కావేరీశా, 3) శ్రీ కావేరీ వల్లభ 4) కావేరీ వల్లభా 5) కావేరి వల్లభ ఇందు మొదటి ఉదాహరణము స్పష్టమైనది. రెండవది కొంత సంధిగ్ధతకు తావిచ్చును. అవచి తిప్పయను కావేరీ వల్లభుడు, అధీశుడనుటకు కారణము ఏమై యుండును. అందరికి తెలిసిన కావేరీ పురము పేరుతో తమిళనాట మూడు గ్రామములున్నవి అందొకటి కంచికి కడు సమీపము. అవచి తిప్పయ తాత ఒకరు "కావేరి గట్టించె, గార్పాసరాసుల సుబ్బి చోడడు మెచ్చ" అనికూడ చెప్పబడినది. ఇది కంచికి సమీపమున గల చిన్న ఏరు. దానికి తిప్పయ తాతగారొకరు అడ్డుకట్ట వేయించి, నీరుపారించి, భూములను వ్యవసాయయోగ్యము గావించెననుట దీని అర్థము. ఆ సమీపగ్రామమే కావేరిపాక్కమే అనుగ్రామము. ఇది అవచి వారికి సర్వమాన్యమై యుండవలెను. అందువలననే, తిప్పయను "కావేరి వల్లభ" అని పేర్కొనుట జరిగియుండ వలెను. ఏమైనను గ్రంథ రచనా కాలము నాటికి తిప్పయ కంచి పురవాసి యనుట స్థితిస్థాపకము. ఇక గ్రంథ రచనము కూడ అచ్చటే జరిగినదని చెప్పుటకును గ్రంథము నందే సాక్ష్యము గలదు. 'అవచి దేవయతిప్పప్రభుండొక్కనాడాస్థాన మంటపంబున సుఖోపవిష్టుండై' శ్రీనాథునితో 'బాల సఖుడవు శైవ ప్రబంధమొకటి యవధరింపుము నా పేర నంకితముగ' అని చెప్పుట వలన అది స్పష్టమగు చున్నది. అయిన ఇంతకు శ్రీనాథుడు కంచికి ఏల వెళ్లవలసి వచ్చినది. పై శీర్షికకు సమాధానము ఈ ప్రశ్నకగు సమాధానమందిమిడి యున్నది గనుక దీనిని పరామర్శింప వలసి యున్నది.

హరవిలాస రచనకు పూర్వము శృంగార నైషధమును వెలయించి యున్నాడని గ్రంథస్థ సాక్ష్యము కలదు. 'ఆంధ్రభాషా నైషధాబ్జభవుని' అని

చెప్పుట దీనికగు సాక్ష్యము. అయితే అప్పటికే మరుత్తరాట్చరిత్ర, శాలివాహన సప్తశతి అనుకృతులను రచించి యుండెనని ఇతర సాక్ష్యముల వలన తెలియును. కాని వాని నిచ్చట పేర్కొనలేదు. అట్లే వానిని పేర్కొన్న కాశీఖండము నందు, హరవిలాసమును పేర్కొన లేదు. దీనికి కొన్ని కారణములు గలవు. వానిని వేరుగ చర్చింప వలసి యున్నది ప్రస్తుతమునకది అక్కర లేదు. నైషధము మామిడి సింగనకు అంకితము ఈ మామిడి సింగన అప్పటికి చందవోలు (నేటి చందోలు) రాజధానిగా నేలుచున్న పెద కోమటి వేముని మంత్రి. పేద కోమటి వేమునికి కొండవీడు రాజధానిగా పాలించుచున్న కుమారగిరికి రెడ్డిరాజ్య సింహాసనాధిపత్య విషయమై వైరము కలదు. దానికొక పరిష్కారమును సూచించిన వాడు కుమారగిరి బావమరిది కాటయ వేముడు. కాటయవేముడు సూచించిన పరిష్కారము కుమారగిరి యనంతరము కొండవీడుపై ప్రభుత్వం పెదకోమటి వేమునకు సంక్రమింప జేయుట. అది అట్లే జరిగిన వివాదముండెడిది కాదు హరవిలాస కావ్యము కూడ రచింపబడి యుండెడిది కాదేమో. దీని నేపథ్యమట్టిది చర్చా సంబంధ కాలము నాటికి, కుమారగిరికి సజీవ పుత్రసంతానము లేదు. దాని వలన కాటయ వేముని సూచనను కోమటి వేముడంగీకరించెను. పిదప కాటయ వేముడు సింహాచలము వరకు జయించుట జరిగినది. దీనిని మెచ్చి కుమారగిరి జయించిన రాజ్యము నంతను రాజమహేంద్రవరము రాజధానిగా నేలుకొమ్మని కాటయ వేమునకు ధారాదత్తము చేసినాడు. ఇది పేద కోమటి వేమునకు ఆగ్రహ కారణ మైనది. కుమారగ్రిరితో యుద్ధమునకు సిద్ధమైనాడు. కాని అతనికి కొండంత అండ బావయైన కాటయవేముడు. బంధుత్వ విషయకముగ విజయనగర రాజుల ప్రాపును గలదు ఈ కారణములుగ, కుమారగిరిని జయించుట పెదకోమటి వేమునకంత సులభము కాదు. కాని ఉపాయాంతరము గలదు కాటయ వేముడు ప్రస్తుతమున కొండవీడు నందు లేడు. కొండవీడుకు, రాజమహేంద్రమునకు కడుదూరము. రెండు నదులను దాటవలసి యున్నది అంతేగాక అతనిని నిలువరించుటకు వెలమల సాయము పొందవచ్చును మొదట యుద్ధవార్తలను చేరనీకుండ కట్టుదిట్టము చేయవచ్చును. కారణము కొండవీడుకు, రాజమహేంద్రమునకు నడుమ తానున్నాడు. కొండపల్లిలో అతని ప్రభుత్వము చెల్లు చున్నది. కనుక ఇరువైపుల నుండి ఇబ్బంది లేదు. కాటయ వేమునకు కబురందు లోపల తాను కొండవీడు నాక్రమింప గలడు కాని విజయనగరము నుండి బంధుత్వ కారణముగ కుమారగిరి

రెడ్డికి లభింపగల సాయమును నిలువ రించుట. ఎట్లు? ఇది సాధ్యమైన, కొండవీడును సాధించుట పెద్ద లెక్కలోనిది కాదు. అంతేగాక, ఒప్పందమున్నను, కుమారగిరి అనంతరము మాత్రము కొండవీడు తనకు (పెదకోమటి వేమునకు) దక్కునని ఎట్లు భావింప వచ్చును విజయనగరము వారి అండతో, తన వియ్యంకుడైన అల్లాడరెడ్డి (కాశీఖండ కృతిభర్త వీరభద్రారెడ్డి తండ్రి) సాయముతో కాటయ వేముడు తననే కడతేర్ప వచ్చును. కనుక, వైరమెట్లును తప్పుట లేదు కనుక తానే అవకాశమును తీసుకున్న ఎట్లుండును. అవకాశమును తీసికొనవలెనన్న విజయనగరము వారిని ఏదో ఒక ఉపాయముతో సాయము రాకుండ నిరోధింప వలయును ఇచ్చట హరవిలాస కావ్యరచనకు వలయు నేపథ్య మేర్పడినది. పైచెప్పిన వానికన్నింటికి చరిత్ర యందు సాక్ష్యములు గలవు. ఇక ముందు చెప్పబోవు విషయము పండితులు ఊహించినది. అది ఎట్టిదో చూతము

పెదకోమటి వేమునికి గల తక్షణ కార్యము విజయనగరము నుండి సాయము రాకుండ చూచుట. కొండవీటికి తూర్పున తానున్నాడు. పశ్చిమమున విజయనగర మున్నది. కనుక సైన్య బలముతో దానిని నిరోధింప లేడు. మరి ఉపాయాంతరమేది? వారిని అసలు రాకుండ చేయుట. ఇది ఎట్లు సాధ్యము? బంధుత్వ కారణముగ కుమారగిరి వారికి కబురుపెట్టును గదా! కబురు వెళ్లినను వారు రాకుండ తాటస్థ్యము వహింప వలయును. వారు తాటస్థ్యము వహించునట్లు చేయుట ఎట్లు? ఎవరుచెప్పిన వారట్లు చేయుదురు? ఇచ్చట పండితుల ఊహ సాగినది. వారికి చెప్పగలవాడు అవచి తిప్పయ. తిప్పయకు చెప్పగలవాడు అతని బాల్యసఖుడు శ్రీనాథుడు. అతడిప్పుడు పెదకోమటి ప్రోపుననున్నాడు. ఈ ప్రోపునకు కారణము, శృంగార నైషధమునకు కృతిపతి యైన మామిడి సింగన పెదకోమటి వేముని మంత్రియగుట. కనుక వారి అభ్యర్థనముపై శ్రీనాథుడు కంచికి ప్రయనమై, తిప్పయను దర్శించి యుండును. అతని అభ్యర్థనపై హరవిలాసము చెప్పెను. శ్రీనాథుని అభ్యర్థనముపై తిప్పయ, విజయనగరాధీశుడైన హరిహరరాయలు, పెదకోమటి వేమ, కుమారగిరుల యుద్ధమున తాటస్థ్యము వహించి యుండును. ఇదీ ఊహ ఇది ఇట్లే జరిగి యుండవచ్చును. కారణము విజయనగరము వారి సాయము రాలేదు. కుమారగిరి రాజ్యభ్రష్టుడై రాజమహేంద్రవరము చేరుట, పెదకోమటి వేముడు కొండవీటి సింహాసనము నధిష్ఠించుట చారిత్రక సత్యములే కనుక శ్రీనాథుడు దౌత్యము చేసెనని ఊహించుటలో విప్రతిపత్తి కానరాదు.

బాలసఖుని అభ్యర్థనము, మీదు మిక్కిలి, ప్రస్తుతము తనకు కావ్యమునంకిత మిచ్చుట అను వానిని బట్టి, తిప్పయ గావించిన సాయమందు ఔచిత్యము గలదని స్థూల దృష్టితో భావింప వచ్చును కాని ఇందు ఒకటి రెండు సందేహములకు తావున్నది. జరిగినది అంతేననుటలో విప్రతిపత్తి లేకున్నా అది ఎట్లు పొసగినదో పరిశీలింప వలసి యున్నది

స్థూలదృష్టితో ఈ పొసగుటకు కారణములు చెప్పబడినవి కాని సందేహము లెట్టివో చూతము

1. అవచి తిప్పయ, శ్రీనాథునికి బాల సఖుడైనంత మాత్రమున, తనకు గల జ్ఞాతి వైరమున అతడు తమకనుకూలముగ విజయనగరమున కేగి హరిహర రాయలు తాటస్థ్యము వహించునట్లు చేయునని పెదకోమటి వేముడెట్లు తలచెను ?

2 విషయమెంతో సంక్లిష్టము తనకు బాల సఖుడైనంత మాత్రమున తిప్పయ దీనికంగీకరించునని శ్రీనాథుడెట్లు తలచెను ?

ఈ రెండు ప్రశ్నలకు సమాధానము ప్రశ్నయందే యిమిడియున్న బాలసఖ్యత్వమని సరిపెట్టుకొన గలమా! సరిపెట్టుకున్నను మరికొన్ని ప్రశ్నలు దయించును

3 హరిహర రాయనికి చెప్పి ఒప్పింప గల కూర్మి, అతని యొద్ద తిప్పయకు కలదా? కలదనుటకు గ్రంధస్థ సాక్ష్యమే గలదు. 'హరిహరరాయ......' ఇత్యాదిగా గల పద్యము దీని కుపబలకము కనుక ఈ ప్రశ్న నిలుచునది కాదు. సరియే! అయినను -

4. కుమారగిరికి, అవచి తిప్పయకు గల అనుబంధము ఈ నాటిది కాదు. అది సామాన్యమైనది కూడా కాదు. ఇది శ్రీనాథునికి తెలియని విషయము కాదు హరవిలాసముననే పెక్కుతావుల ఈ విషయము పేర్కొనబడినది. కుమారగిరి రెడ్డి నిర్వహించు వసంతోత్సవములకు వలయు సమస్త సంభారములు సమకూర్చెడివాడు అవచి తిప్పయ్య. అతని చేత ప్రభు లాంఛనములందిన వాడు తిప్పయ. అట్టివాడు కుమారగిరికి నష్టము కలిగించుపని తిప్పయ చేయునని ఎట్లుభావించెను?

5. శ్రీనాథుడిట్లు భావించినను, పైకారణములచే తనకాప్తుడైన కుమారగిరికి వ్యతిరేకముగ తిప్పయ ఎట్లు వర్తించెను?

6 నేను చెప్పునదెట్టి న్యాయము అని తిప్పయ శ్రీనాథుని ఏల మందలింప లేదు?

శ్రీనాదుడు దౌత్యమొనరించి యుండునని ఊహించిన పండితకోటి మదిలో ఈ ప్రశ్నలు పొడమినట్లు కానరాదు. అట్టివానిని గూర్చి ఇప్పటికెట్టి సమాచారమును లేదు పై సందేహములే ఈ వ్యాసరచనమునకు కారణము ఏమైననేమి, కార్యము జరిగినది కదా! యనువారికి చెప్పవలసిన పనిలేదు పై సందేహములను పరిశీలింతము అయితే క్రమము మారవచ్చును

పెదకోమటి వేమునికి, అతని మంత్రికి కావలసినది తమకనుకూలమైన చర్య దానికి తమకు గల సాధనము శ్రీనాథుడు. అతనికి బాలసఖుడు అవచి తిప్పయ తిప్పయకు హరిహరరాయునికి సఖ్యము గలదు. అంతే! నిర్వహణమెట్లు అనునది వారికనవసరము. వారికి వలసినది ఫలితము. కనుక శ్రీనాథుణ్ణి ప్రయోగించినారు అతడందుల కంగీకరించి నాడు. ఈ అంగీకరించుటలో బాల సఖ్యతమొక్కటేనా యిమిడి యున్నది? తిప్పయకు, కుమారగిరికి గల కూరిమి తానెరిగినదే కదా! మాట మాత్రము తిప్పయ ఇది నేనెట్లు చేయుదునని భావించితివన్న శ్రీనాథుని పరిస్థితి ఏమి? అట్లనక పోగా మిత్రకార్యము నిర్వహించుటకు సమకట్టిన తిప్పయ ఔచిత్య మెట్టిది. అంతకు ముందుగ అనుకొన వలసినది మరి యొకటి గలదు. శ్రీనాథుడు, అధ్వర్యుడు, వేదశాఖాధీతి నిష్ణాతుడు, అగమజ్ఞాననిధి, తత్త్వఖని, బహుపురాణజ్ఞుడు, శుభభవ్యమతి బ్రాహ్మీదత్తవరప్రసాది, ఈశ్వరార్చన కళాశీలుడు. ఇంతటి వాడు తనకాశ్రయమిచ్చినంత మాత్రముచేత జ్ఞాతి వైరములో చిక్కుకున్న పెదకోమటి వేముని మాట శిరసా వహించినాడా! అతని వివేక మీపాటిదా! తనకాలము వారుకాని, అనంతర కాలము వారలు గాని దీనిని అపహరిస్తారని కూడ తలప లేదా శ్రీనాథుడు. కనుక తాను సమ కట్టినది సబబేనని అయనకు తోచి యుండవలయును గదా! అది ఎట్టిది అనునదొక ప్రశ్న. ఈ ప్రశ్నలన్నింటికి సమాధానము రాబట్టవలసి యున్నది. అది ఇట్టిది.

ఈ పేర్కొనబడిన గ్రామములన్నియు సమీప గ్రామములు అవచి తిప్పయ తాతతండ్రులు అద్దంకిలో రెడ్డి రాజ్య స్థాపనము నాటి నుండి కుమారగిరి రెడ్డి వరకు వాణిజ్య ప్రముఖులుగా నుండిరి. హరవిలాసము నాటికి అవచి తిప్పయ కంచి యందున్నను, అంతకు పూర్వము లేక కనీసము వసంతోత్సవ సమయములందైనను (కుమారగిరి రెడ్డి పాలన

కాలమున, తిప్పయ సోదరుడు తిరుమలశెట్టి కొండవీడు - నందున్నాడు) కొండవీటి యందుండుట తటస్థించినది. ఆ పరిచయము కారణముగ తాను, స్వయముగా గాని, లేక శ్రీనాథుని అభ్యర్ధనపై గాని, అన వేమారెడ్డి (కుమారగిరి తండ్రి) ఆస్థానమున శ్రీనాథుడు ప్రవేశమునకై ప్రయత్నించి యుండ వచ్చును. ఈ ప్రయత్నమున మంత్రి యైన మామిడి పెద్దన సాయమును కూడ తీసికొని యుండవచ్చును. కాని ఆ ప్రయత్నము నెరవేరినట్టు కనిపించదు. అయితే పెద్దన కుమారుడైన వేమనకు, 'మరుత్తరాట్చరిత్ర' అంకితమిచ్చి యుండవచ్చును. 'ఆరాధ్యచరిత్ర'ను వేమన సోదరుడగు ప్రగడయ్యకు అంకిత మిచ్చాడు. వీరి మరియొక సోదరుడు సింగన్న. ఈ సింగన్నకు అంకితము నైషధము ఈ సింగన్న పెదకోమటి వేముని మంత్రి మామిడి వారి కుటుంబముతో గల అనుబంధమునకు మూలమైనది - అవచి తిప్పయతోడి బాల సఖ్యత్వము కొండవీడులో ఆశ్రయము లభింప కున్నను. తన మిత్రునకు చందోలులో రాజాశ్రయము లభించినది గదా యని అవచితిప్పయ సంతోషించి యుండును. కాలక్రమమున వార్ధక్యమున, తిప్పయ కంచికి చేరి యుండును ఇది కథ కాలమునాటి స్థితి ఇట్టి సమయమున పైన వివరించిన పరిస్థితులు సంభవించినవి పై వృత్తాంతము ఒక ప్రశ్నకు సమాధాన మీగలదు అదియేమన, తిప్పయ 'నాకు కుమారగిరి కావలసిన వాడు. అతనికి వ్యతిరేకముగ నేను వర్తింతునని నీవెట్టు భావించితివి' అను ప్రశ్న. దీనికి శ్రీనాథుని వైపు నుండి గల సమాధానము - "నిజము కుమారగిరిరెడ్డి నీకు మిత్రుడే మరి నేను బాల సఖుడను ఈ సంసర్గమునకు (పెదకోమటి వేమునితోగల) ను నీవే కారణము నీ వలననే కదా నే నచ్చట చేరినది మరి నన్నేలిన ప్రభువు సన్నిధి కోరినాడు. నేనేమి చేయవలయును" అనునది పై ప్రశ్నకు గల సమాధానము అనగా కంచికి ప్రయాణమై వెళ్లుటకు, వెళ్లి తిప్పయతో కార్యము నివేదించుటకు, శ్రీనాథుని వైపు నుండి తన్ను తాను సమర్థించు కొనుటకు అనువేర్పడినది.

అయినను ఇది చాల సున్నితమైన సమస్య తిప్పయ తానిది చేయకున్న తన బాల్య మిత్రునకు పెదకోమటి వేముని ఆస్థానము నుండి ఉద్వాసన జరుగ వచ్చును ఇది బాధాకరమైన విషయమే. అని కార్యమునకు పూనుకున్న తాత తండ్రుల నుండి తనకును కుమార గిరికిని అనుబంధ మున్నది. వారి వైపున వీరు, వీరివైపున వారు అభివృద్ధి చెందినారు. ఇప్పుడును తనతమ్ముడు తిరుమల నాథుడు అచ్చటనే వ్యాపారము చూచుచున్నాడు. వీరిదింకను ఉమ్మడి కుటుంబమే. తన కుటుంబ ప్రయోజనమట్లుండ, తానట్లు చేసిన

అది మిత్ర ద్రోహము కాదా! కృతఘ్నత కాదా! అని తిప్పయకు అనిపించలేదా! మరియెట్లు పూనుకొనెను సాధారణ లౌకిక విషయమున అది అట్లే బాసించును గదా! లోక నిందయు తప్పదు మరి తిప్పయ దీనినెట్లు సంభాళించు కొనెను దీనిని పరిష్కరించిన సర్వము తెల్లమగును అంతేగాక అంతటి మహానుభావుడైన శ్రీనాథునికి మాత్రము ఇది సమంజసమని ఎట్లనిపించినదో కూడ తెలియ వచ్చును.

శ్రీనాథుడు హరవిలాసమున తిప్పయను వాచాగోచర వివేకవైయాత్యుడని! యుగంధర చాణక్యనీతిగతి నిపుణుండని సంభావించెను. ఇవి కేవలము పొగడ్తలని భావింతమా! లేక తిప్పయ యట్టివాడేనా! శ్రీనాథుని మాటను సాధారణముగ గ్రహింప లేము అతడు అట్టి గుణములు లేనివాడైన వానిని స్తుశింపడు మరి ఇతర విశేషణములతో సంభావింప లేడా! ఇందు 'వాచాగోచర వివేక వైయాత్య' అను విశేషణమును శ్రీనాథుడు పరమేశ్వరుని పరమున కూడ ఉపయోగించి యున్నాడు. అనగా శ్రీనాథుని దృష్టిలో ఆ విశేషణము విషయమున, పరమేశ్వరుడు తిప్పయలు సమానులగుచున్నారు. తిప్పయ అందుకు పాత్రుడు కాకున్నచో, పరమేశ్వరుని సంభావించిన విశేషముతో అతనిని సంభావించునా! కనుక శ్రీనాథుడు సాభిప్రాయముగనే భావించె ననవలెను. అంతేగాక, అందే తాను విన్నవించు కార్యము, అందలి సున్నితత్వము, దానిని నిర్వహించుటలో, (కుమార గిరికి వ్యతిరేకముగా వర్తించుట) తిప్పయకు, తనను గల వెఱవులను త్రోసి రాజని, కార్యనిర్వహణము నందలి సమంజసత్వమును గూర్చిన ప్రబోధము ఇమిడి యున్నది.

తిప్పయ సాధారుణుడు కాదు. వివేకము గలవాడు అంతేకాదు. అందు వైయాత్యత గలవాడు. వివేక శబ్దము సమమైన నిర్ణయము, సరియైన వివక్ష, యధార్థ జ్ఞానము (విషయమును స్వస్వరూపమున విచారించుట) అను నర్థములు కలది. వైయాత్య శబ్దము వియాత పదమునకు తద్ధిత రూపము ఈ వియాత శబ్దము జంకు గొంకు లేక ఉన్నదున్నట్టు చెప్పెడి విషయమున, లేక ఆచరించెడి దాని యందు మనమున ఎట్టి సిగ్గును, సంకోచమును లేక వర్తించుట అను నర్థముల నిచ్చును. అనగా కార్య నిర్వాహకుని దక్షతకు ప్రతీకగా నిది వర్తించును. ఫలితార్థము విషయమును వివేచించుట, దాని నుండి తేలిన దానిని ప్రవర్తింప జేయుట యందు మరియొక ఆలోచనము లేకుండుట. ఈ లక్షణము అవచి తిప్పయ యందుండి యుండవలెను

లేకున్న అంతటి వాణిజ్య నిర్వహణమెట్లు చేయును. దానికి తోడై నిలిచినది యుగంధర చాణక్య నీతి గతి నిపుణత్వము పరమేశ్వరుని విషయమున పై వివేక వైయాత్యమే చాలును. కారణము అతని కార్యములు అలౌకికములు. కాని తిప్పయ వర్తనము లౌకికము లౌకిక కార్య సాధన విషయమున ఈ రెండవ దాని ప్రాముఖ్య మెంతో అంత. అదిగో అంతటి గుణ విశేషములు ఇప్పుడు శ్రీనాధుని అభ్యర్థనము తీర్చుటకు అవసరమైనవి. ముందు అంతటి శ్రీనాధుడు దీనికి పాల్పడుటకు మనసెట్లొప్పినది అని ప్రశ్నించు కుంటిమి దీనికిని ఇదియే సమాధానము తిప్పయ వివేక వైయాత్యుడైన శ్రీనాధుడు కాకుండునా! అదియే ఆయనను ఈ విషయమున కంచికి నడిపించినది మీద, పెదకోమటి వేముని ఆస్థానమున గల తన యునికిని భద్రమొనర్చు కొనుట యను లౌకిక విషయమడ్డును గలదు. దీనిని కథాకాలము నాటి కన్వయింతము.

వంశ పారంపర్యముగ రెడ్డి రాజ్యము కుమారగిరి రెడ్డికి దక్కినది కాని పెదకోమటి తన కందు హక్కుగలదని నాడు కాదనుటకు వీలులేని స్థితి యున్నది. కనుకనే, కాటయవేముడు కుమారగిరి యనంతరము రాజ్యము నేలుకొన వచ్చునని మధ్యేమార్గము సూచించినాడు కనుక అతని హక్కులోని సమంజసత్వము లోక విదితము. ఇది తిప్పయకు తెలిసిన విషయమే. అంగీకారము ప్రకారము రాజ్యమంతయు ఏకపాలన నందుండ వలయును దీనికి, కుమారగిరి రాజమహేంద్రవర రాజ్యమును కాటయవేమున కిచ్చుటతో విఘాతము కలిగినది దీని నెవరు నివారింప వలయును. ఒప్పందమును తీర్చిదిద్దిన కాటయ వేముడే దీని నుల్లంఘించి రాజమహేంద్రవర సింహాసన మాక్రమించినాడు. మరి ఏది దారి. కనుకనే, పెదకోమటి వేముడు తన హక్కును సుస్థాపితము చేసుకొనుటకు ప్రయత్న మారంభించి నాడు ఇందతని దోషము లేదు. కాని నిర్వహణము అంత తేలికైనది గాదు. ఎదిరి కుమారగిరి దుర్బలుడే కాని, కాటయ వేమునితో సంబంధ బంధుత్వము గల విజయ నగరము వారు బలవంతులు. వారిని రాకుండ ఆపగలిగిన తన కార్యము నెరవేరును. దాని కొరకై శ్రీనాథుని సాయము నపేక్షించినాడు పెద కోమటి వేముడు ఇది అవచి తిప్పయతో కాగలదను భావనతో శ్రీనాథుడు బయలుదేరినాడు పై రాజ్యము నందలి హక్కు విషయమై, తిప్పయ శ్రీనాథుల వివేక వైయాత్యత ప్రవర్తిల్లినది. అనగా కుమారగిరి యందు దోషమును సంస్థాపించుట వరకు. ఇక రాజ్య ప్రజా శ్రేయము ననుసరించి చూచినను

కుమారగిరి దుర్బలుడు. అతను సరస సంగీత సాహిత్య వేత్త రాజ్య దురంధరుడు కాడు కనుక నేడు కానీమన్నాను సమీప భవిష్యమున అరాచకము ప్రబలును అతని అనంతరము కాని పెద కోమటి వేముడు పాలకుడు కాలేడు. ఒప్పందము ప్రకారము కాటయ వేముడు బలవంతుడే. కాని అతడిచ్చట లేడు రాజమహేంద్రమున నుండి, అతడు కార్య నిర్వహణము చేయ జాలడు. కనుక కుమారగిరినే కొనసాగనిచ్చిన లౌకికరాజ్య నిర్వహణమున లోటుపాట్లేర్పడు ననుట స్పష్టముగా నున్నది ఈ నిర్ణయమునకు వచ్చుటకు తోడ్పడినది వివేక వైయాత్యత. ఇక విజయనగరము వారికి ఏమిచెప్పి వారినిటురాకుండ చేయ వలయును కాటయ వేమునితో సంబంధ బంధుత్వము గలవారు ఈ బంధుత్వము అతనితో కుమారగిరికి గలదు ఇది సున్నితమైన వ్యవహారము. రాజనీతి యిచ్చట అవసరము. విజయనగరము వారికి గల ప్రత్యక్ష బంధుత్వము కాటయ వేమునితో గాని కుమారగిరితో కాదు. కాటయ వేమునితో పెదకోమటి వేముడు తలపడుట లేదు. రాజ్యమా, అరాచకము ప్రబలుటకు అవకాశము గలదగు చున్నది. రాజ్యముపై పెదకోమటి వేమునకు హక్కులేదాయనిన, ఉన్నదని అంగీకరించినది తమ యల్లుడైన కాటయ వేముడే ప్రస్తుత పరిస్థితి యిట్లేయున్న, తమకాప్తుడైన తిప్పయ కుటుంబ వాణిజ్యమునకును విఘాతము కలుగును. అతని అభ్యర్థనము కాదందుమన్న, మోటుపల్లి రేవుపై, ఒక విధముగ తూర్పు సముద్ర వ్యాపారమంతయూ తిప్పయ అధీనమున నున్నది. ఇట్టి సంకట పరిస్థితి కల్పించినది తమకు సంబంధము లేని చోట కలిగిన సంక్షోభము. తాము మిన్నకుండిన ఏమి కానున్ననది యగును. తిప్పయమాట పాటించి నట్లగును. ఈ పరిస్థితి లోనికి వారిని నెట్టి వేసినది తిప్పయ యుగంధర చాణక్య నీతిగతి నైపుణ్యము. కనుక శ్రీనాథుని దౌత్య విషయమై పండితుల ఊహావెనుక గల నేపథ్యమిట్టిదని, దానిపై తిప్పయ ఔచిత్యమిట్టిదని భావింప నైనది. ఈ రెంటిని పట్టి యిచ్చినది శ్రీనాథుడు. తిప్పయ విషయమై ఉపయోగించిన వివేక వైయాత్యము, యుగంధర చాణక్య నీతిగతి నిపుణత యను రెండు విశేషణములు విజ్ఞాలాలోచింతురు గాక.



# పదసాహిత్యంలో వాత్సల్యభక్తి

ఆచార్య సి. రమణయ్య

నిఘంటువులలో వాత్సల్యమనే మాటకు పుత్రాదులపట్ల ప్రదర్శించే స్నేహమనే అర్థం కనిపిస్తుంది వత్సము అంటే దూడ దూడకు జన్మనిచ్చిన తల్లి ప్రాణికి ఉన్న అనుబంధాన్ని దృష్టిలో పెట్టుకుని వత్సల, వాత్సల్యం లాంటి పదాలు వ్యాప్తిలోకి వచ్చాయి. కుమారుని 'వత్సా' అని పిలవడం కూడా ఈలాంటిదే

అలంకారశాస్త్ర గ్రంథాలలో 'వత్సల' రసానికి సంబంధించిన చర్చ చాలినంత ఉంది. భరతుడు తన నాట్యశాస్త్రంలో 'రసాభినయం'ఎలా చేయాలో వివరిస్తూ 'స్వరచర్చ'చేశాడు 'కరుణ వాత్సల్య భయానకేషు అనుదాత్తస్వర కంపితైః వర్ణైః పాఠ్యమేవ ముపదయతి' అన్నాడు. అయితే ఎనిమిది రసాలలో 'వత్సలరసాన్ని' చేర్చలేదు అయితే సాహిత్యదర్పణంలో 'వత్సల రసం' చెప్పబడింది ఈ రసం 'మునీంద్ర సమ్మత'మని వ్యాఖ్యానం కూడా విశ్వనాథుడు చేశాడు. అంతేకాదు వత్సలం చమత్కార ప్రదమని, వాత్సల్యం దాని స్థాయి భావమని, వాత్సల్యమంటేస్నేహమని, కొడుకులు, తమ్ముళ్ళు, అన్నలు ఆలంబనమని, వారి చేష్టలు నిద్రాది అంశాలు ఉద్దీపనాలని, ఆలింగనం, గాత్రసంస్పర్శం, శిరశ్చుంబనం, పులకలు, ఆనంద బాష్పాలు అనుభావాలని వివరణ కూడా ఇచ్చాడు.

ఇక భక్తి సంబంధి లక్షణగ్రంథాలలో వాత్సల్యానికి సంబంధించి సమగ్రచర్చ కనిపిస్తుంది నారదుడు తన భక్తి సూత్రాలలో భక్తి 11 రకాలని అన్నాడు. దాస్యాసక్తి, కాంతాసక్తితో పాటు వాత్సల్యాసక్తి కూడా చెప్పాడు భగవంతుణ్ణి పుత్రునిగా భావించి లాలించడం వాత్సల్యాసక్తి. రూపగోస్వామి 'హరిభక్తి రసామృత సింధువు' అనే గ్రంథంలో భక్తి మూడు విధాలని' అవి-సాధన, భావ, ప్రేమ భక్తులని వర్గీకరించి భావభక్తిలో శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య మధురభక్తి భేదాలను చెప్పాడు కృష్ణుని ఆధారంగా చేసుకొని 'ఉజ్జ్వల నీలమణి' అనే అలంకారశాస్త్ర గ్రంథం వ్రాశాడు 'ఉజ్జ్వల' అంటే శృంగార రసమని అర్థం నీలమణి అంటే శ్రీకృష్ణుడు. ఈ రూపగోస్వామి

'షట్ సందర్భం' అనే మరో గ్రంథంలో ఆరు సంప్రదాయాలు అంటే శాంత, వాత్సల్య, దాస్య, సఖ్య, మాధుర్య, మహాభావ మనే సంప్రదాయాలలో 'వాత్సల్యం' చేర్చి వివరించాడు.

మనిషి జీవితంలో ఆరు అవస్థలుంటాయి. శైశవం, బాల్యం, కౌమారం, యౌవనం, ప్రౌఢత్వం, వృద్ధాప్యం. వీటిలో బాల్యదశ మనోహరం. ఈ ధర్మాన్ని దేవతలకు కూడా అన్వయించి ఆరాధించడం ఆర్ష సంప్రదాయం. బాలరాముడు, బాలకృష్ణుడు, బాలగంగాధరుడు, బాలసుబ్రహ్మణ్యుడు లాంటి మాటల్లో ఈ అభిప్రాయం గర్తించవచ్చు.

సంప్రదాయ సాహిత్యంలో వాత్సల్యవర్ణన లేకపోలేదు. 'రాక్షససంహారార్థం' రామలక్ష్మణుల్ని విశ్వామిత్రుడు పంపవలసిందిగా కోరేవేళ దశరథుడు పసిబాలురిని పంపడమెలాగా అని పరితపించడం వాత్సల్యం. అలాగే రాముడు తన తమ్ముడయిన లక్ష్మణుని సేవలను తలచుకొని, ఎక్కడయినా సరే కళత్ర ప్రాప్తికి అవకాశముంది. ఎక్కడయినా సరే బంధువర్గముంటుంది. కాని సహోదరుడయిన తమ్ముడు కానరాడని పరితపించాడు. ఇక భారతంలో అయితే భీమాదులు యక్షప్రశ్నలకు నిలువలేక మూర్ఛితులై పడినవేళ, తమ్ముళ్ళెందుకు రాలేదో అని ధర్మరాజు బాధపడడంలో 'వాత్సల్యం పేగుల్ని కదలిస్తుంది. ఇంక భాగవతంలో శ్రీకృష్ణుని బాల్యవర్ణనల్లో వాత్సల్యం వంకై, వాగై పొంగి పొరలుతుంది.

ప్రాచీనాంధ్ర వాఙ్మయంలో కూడా వాత్సల్య భక్తికి ఉదాహరణలు కోకొల్లలు కనిపిస్తాయి. బసవపురాణంలో బెజ్జమహాదేవి పడిన ఆవేదన 'వాత్సల్యానికి' పరాకాష్ఠ.

'ఎల్ల నియోగంబులెల్ల బాంధవులు
ఎల్ల వారుండగా నిట్లు భర్గునకు
తల్లి లేకుండుట తా విచిత్రంబు'

అంటూ తల్లి ఉంటే విషం త్రాగనిస్తుందా, తల్లివుంటే తల జడలు గట్టిలా వదలివేస్తుందా, తల్లివుంటే బూడిద పూసుకోనిస్తుందా, తల్లిలేని కారణం వల్లనే శివుడు పడరానిపాట్లు పడ్డాడని ఆవేదన పడింది.

అలాగే తరిగొండ వెంగమ్మ తన జలక్రీడా విలాసంలో వాత్సల్య వర్ణన చాల చక్కగా రమ్యణీయంగా చేసింది. నడివయసు దాటాక పిల్లలు

పుడితే ఆ తల్లిదండ్రులు ముందుగా కోరుకొనేది ఆపిల్లలు ఆయుష్మంతు ఉండాలని ఇదే భావనను 'గొడ్డురాలనగుచు నేను గోడు గుడుచుచుండ బిడ్డను నాకిచ్చినాడు బిసరుహాక్షుడూ దేవుళ్ళందరిటకు వచ్చి దీర్ఘాయు కలిగి సుతుడు జీవింపుచునుండుట కాశీర్వదింపుడీ' అన్నది యశోద

పసిపిల్లవాడు పాలుతాగక పోతే తల్లిపడే బాధ ఇంతింత కా కృష్ణుడు ఆటలకు మరిగొ లేదా ఆరోగ్యం సరిగా లేకనో తినడం, త్రాగ మానేసరికి తల్లి క్రుంగిపోయింది.

నాపట్టికిట్లజీర్ణంబు పుట్టించె
ఈ పాపడిట్లైన ఎట్లు వృద్ధినొందు

అని డీలాపడింది. పసిపిల్లవాని చేష్టలు ముచ్చటయినా, అల్లరికి త కోవడం సాధ్యంకాని పని. పాలు త్రాగకుండా కృష్ణుడు పరుగెడుతుం తల్లి యశోద -

పరువులెత్తలేను నిన్ను పట్టలేను రారా
చిన్నవాడవని కొట్ట చెయ్యాడ కను
నిన్ను మన్నింపగా నీ వింతమించి
తలకొని గోపకాంతలు చెప్పినటుల
చెలరేగి దుడుకులు చేయుచున్నావు
నా తండ్రి యీ చిన్నవాడు నీకింత
ఆరడి వచ్చె నేమందు నా విధిని
ఊరివారెల్ల నిన్ను వుప్పతించినను
నే వినవలసె నీ నెత్తిన బ్రహ్మ
దేవుడీ రీతి మోదింపుచు వ్రాసె

అని భావించింది.

సంస్కృత వాఙ్మయంలో మధురాతి మధుర మయిన గ్రంథం కృష్ణ కర్ణామృతం. లీలాశుకుడు కృష్ణుని శైశవ రూపాన్ని, బాల్యరూపాన్ని మాత్రమే ఎక్కువగా వర్ణించాడు. అసలు ఈ కర్ణామృతం బాలకృష్ణుని శైశవ వర్ణనతో మొదలవుతుంది. 'అఖిలోదారం కిశోరాకృతి " అనే శ్లోకంతో ముగుస్తుంది.

అన్ని దేవతలలో గొప్పదయిన బాలరూపం ధరించిన ఒకవస్తువు వుంది. అది అప్సరసలు పూజించిన పుష్పాలలో మునిగిపోయింది. చెవికి ఇంపయిన వేణుగోపాలుని గానంవల్ల సుఖపారవశ్యంలో మరచిపోతూ వుంది పదే పదే జారిపోతూ కాళ్ళకు అడ్డుపడుతున్న కోకలతో అందగించిన వేన వేల గోపికలతో చుట్టుకోబడివుంది. తనకు మొక్కే భక్తులకు అరచేతిలో వైకుంఠాన్ని ప్రసాదిస్తుంది అదే ఆ బాలకృష్ణమూర్తి. కృష్ణకర్ణామృత కారుడు వటపత్రశాయి శైశవ కృష్ణుణ్ణి, తల్లి పాలు త్రాగుతున్న బుల్లి కృష్ణుణ్ణి, కాలి అందెలు చప్పుడు చేసుకుంటూ వ్రేపల్లెలో నడుస్తున్న కిశోర కృష్ణుణ్ణి, వెన్నదొంగ కృష్ణుణ్ణి, పెరుగుదొంగ కృష్ణుణ్ణి, లేగదూడలు కట్టివేస్తున్న చిన్ని కృష్ణుణ్ణి. అలాగే యశోదను ఏడిపించే ముద్దు కృష్ణుణ్ణి వర్ణించాడు. మచ్చుకు ఒక ఉదాహరణ-

పగటి పూట ఆవుపాలకోసం తల్లిదగ్గర మారాం చేస్తున్నాడు బాలకృష్ణుడు. వారి సంవాదం ఈలావుంది.

అమ్మా
ఏమిరా నారాజా
నా పాలగిన్నె తీసుకురా
దానితో ఏంపని?
పాలుత్రాగడం కోసం
పాలు ఇప్పుడు లేవు
మరి ఎప్పుడుంటాయి?
రాత్రిపూట.
రాత్రంటే ఏమిటి?
చీకటి పడడం
అలాగా

అంటూ కృష్ణుడు కళ్ళుమూసుకున్నాడు. రాత్రి వచ్చేసింది. నాపాలగిన్నె తీసుకురా అన్నాడు.

వాత్సల్యభక్తి వర్ణనలలో తమ అనుభూతిని అనేకరకాలుగా వ్యక్తీకరించిన భక్తకవివరేణ్యులు తమిళంలో పెరియాళ్వార్, హిందీలో సూరదాస్. పసిపిల్లవాని

చేతలకు మురిసినట్లు, ఆకతాయి పనులకు విసిగినట్లు రకరకాల భావనలతో పెరియాళ్వార్ వ్రాశాడు. అలాగే హిందీలో సూరదాసు అయితే సూరదాస్ రచనల్లో సంయోగ, వియోగ పక్షాలు రెండూవున్నాయి తెలుగు కవులలో ప్రత్యేకించి అన్నమయ్య పదాలలో సంయోగ వర్ణనలే ఎక్కువ

పదసాహిత్యమొక అమృతధార. తేనెవాక. ఈ సాహిత్యంలో 'వాత్సల్యం' అతివేలం పదకవితా పితామహుడయిన అన్నమయ్య తానే తల్లిగా కృష్ణునికి జోలపాట పాడాడు. 'నీవు దొంగవని సతులు పొంగి పోతున్నారా' అంటూ హాయిగా నిదురపొమ్మన్నాడు. పసి పిల్లవాని మురిపాలకు మురిసిపోతూ రేపల్లెలో ప్రతివ్యక్తి బాలకృష్ణుని త్రిప్పుతుంటే, తానే తల్లిగా ఒక వైపు, పరవశంతో మరోవైపు ఆదుర్దాతో ఎన్నో హెచ్చరికలు చేయడం అన్నమయ్య సంకీర్తనల్లో కనిపిస్తాయి.

సారెకు నంటకురే జడనందురు
ధీరుడాతడున్నతపు దేహియట
బయట పెట్టకురే పక్షులు పారెడిప్రొద్దు
వోయమ్మా బాలులకు నొప్పదందురు
మాయపు పులుగొకటి మచ్చిక నీబాలుని
చేయిచ్చి యెక్కించుకొన చేరీనట
పంచల ద్రిప్పకురే పాములు వెళ్లేవి ప్రొద్దు
కొంచెపు బాలుల పైకొనునందురు
మించిన పామొకటి మెరసి యీ బాలుని
దించక ఎక్కించుకొన తిరిగీనట.

ఈ పాటలో 'పక్షి' మరెవరో కాదు. గరుత్మంతుడు. పాము ఎవరోకాదు ఆదిశేషుడు స్వామి సేవార్థం కాచుకొన్న భక్తులు, నిత్యులు, ముక్తులు. ఈలాంటిదే మరొక కీర్తన 'కనరాటె పెంచరాటె కటకటా బిడ్డలను' - తల్లి ఎంత కాలము ఇతరుల ఫిర్యాదులు వింటుంది. చివరకు కొంగుముడిచింది కొప్పు సవరించింది వడివడిగా అడుగులు వేసింది. మీ ఇంట్లోని వస్తువులు మీరు జాగ్రత్తగా పెట్టుకోవడం మీ బాధ్యతకాదా అని ఎదురు దాడి చేసింది. తన పిల్లవాని తప్పు అసలేదీ లేదని గదమాయించింది చివరకు గోపికలు వెనుతిరిగారు.

పసిపిల్లవాని విచిత్ర, వినూత్న, విశిష్ట చేతలను తలచుకొని మురిసిపోవడం, ఆశ్చర్యపడడం, కూడా వాత్సల్యంలో ఒక భాగమే ఇలాంటివర్ణన 'చందమామ పాడి' అనే కీర్తనలో చూడవచ్చు. తల్లి యశోద చందమామ పాటపాడింది. పసిబాలుల్లో బాలకృష్ణుణ్ణి, దగ్గరికి తీసుకుంది. 'ముద్దొచ్చినప్పుడే చంక ఎక్కాలి' అనే సత్యం పసిపాపలకు చెప్పపని లేదు తల్లిని ఆటపట్టించాలనుకున్నాడు. తల్లి చందమామ పాటపాడింది కదా తన కోసం కాదని చంద్రుణ్ణి చూచి కనుసైగచేశాడు. మరి అధికారి కనుసన్నల్లో సేవకులుండాలి కదా. చంద్రుడు చక్కావచ్చి నిలబడ్డాడు. అనుకోని ఈ పరిణామానికి ఆ తల్లి భయపడింది దిగాలు పడింది చివరకు దిష్టి తీసింది కూడా.

వైష్ణవ పదకవులలో 'రామదాసు' ప్రసిద్ధుడు ఇతని పదాలలో కూడా వాత్సల్యవర్ణన కనిపిస్తుంది.

బాలకృష్ణుడు అల్లరివాడు. పసిపిల్లవాని అల్లరకు తల్లి విసిగిపోయింది బూచివాడు వస్తాడని బెదరించింది కన్నయ్య కాస్త బెదిరినట్టు కనిపించాడు. సరే తాను పడుకొంటానన్నాడు. తల్లి కన్నయ్యను జోలతో పడుకోపెట్టింది. కాని కన్నయ్య కునుకు తీయలేదు. చేతులు నొప్పిపుట్టాయి. గొంతెండి పోయింది. అయినా నిదురపోలేదు. పైగా మారాం మొదలెట్టాడు.

మదించిన ఏనుగును తెచ్చి చిన్నతిత్తిలో కుక్కి నెత్తిమీద పెట్టమన్నాడు అయినా ఎదెలా సాధ్యం. కాసంత అన్నం తింటే కన్నయ్యకు ఒళ్ళు పడుతుందనుకుంటే చిరుతిళ్ళకు ఎగబడతాడు. అన్నం పెడితే వెన్న కావాలంటాడు. అంచేత విసిగి వేసారి చివరకు రోలుకు కట్టి ఇంటిపనులు చేసుకుందామను కొందట తల్లి. ఆ భావమున్న కీర్తన -

"బూచివాని పిలువబోతె వద్దు వద్దనేవు
ఆ చిచ్చి జోలపాడి అయి ఊరినే నిదురపోవు
మత్తగజము తెచ్చి చిన్నతిత్తిలో నమర్చినాడు
నెత్తి మీద పెట్టి నన్ను ఎత్తుకోమనేవు కృష్ణా
అల్లమూరగాయ పెరుగు అన్నమారగించమంటె
తల్లి వెన్నపాలు నాకు తెమ్ముతెమ్మనేవు
రోలుగట్టివేతు కృష్ణ! రామదాస వరద! నీవు
మాటి మాటికిట్లు నన్ను మారాము చేసితేను"

తనకు సాక్షాత్కరించిన స్వామిని కళ్ళారా చూసి చివరకు స్వామికి దిష్టి తగులుతుందేమో లేదా తగిలిందేమోనంటూ పెరియాళ్వారు "పల్లాండు పల్లాండు"అని మంగళా శాసనం చేసినట్లు, పరమ వైష్ణవుడయిన రామదాసు-

దుష్టులు నినుచూడ దృష్టితాకును ఏమో
దృష్టి తాకును ఏమో శ్రీరామా

అని జంకినట్లు వ్రాశాడు. ఈ భావం త్యాగయ్యలో కూడా లేకపోలేదు. 'రక్షపెట్టరె దొరకు రక్షపెట్టరె' అనడం మంగళాశాసనం లాంటిదే

వాగ్గేయకారులలో 'త్యాగయ్యది'పెద్దపీట. అతనిది ప్రధానంగా రామభక్తి అయినా అన్నమయ్యలాగే 'తల్లీబిడ్డ' ఉపమానాలను చాలా చోట్ల ప్రయోగించాడు.

తల్లి గొట్టితే సరగున బాలుడు పద
పల్లవముల విడుచునా
తనయుని ఏజాతియైన ప్రోవని
తల్లియు భువిని కలదా
తల్లి తండ్రి ప్రోవకుంటే
తనయునికే త్రోవ

త్యాగయ్య 'రామరామ లాలి శ్రీరామ' అనే సంకీర్తనలో సంవాదాత్మకంగా వాత్సల్య వర్ణన చేశాడు రాముడు తల్లితో ఫిర్యాదు చేస్తున్నట్టు సాగడం 'ం.

"అమ్మా! నన్ను ఆటకు రమ్మని, ఆ తరువాత వద్దన్నాక

ఆ! వద్దన్నారా! ఎందుకు? వాళ్ళే పిలిచారని చెప్పావుగా నీవేదో అల్లరి చేసుంటావ్‌లే అయినా ఏ ఆట ఆడాలని పిలిచారు.

దాగుడు మూతలాడటానికి

ఓహ్! అంతా అర్థమయిందిలే నీకళ్ళు చేరడేసివి. నీ స్నేహితుల చేతులేమో చిన్నవి. అంచేత కళ్ళు మూయలేక పోయారు. నీవేమో నలువైపుల చూస్తున్నావ్. దాక్కొన్న వారిని వెంటనే పట్టేస్తున్నావ్. అంతేగా, పోనీలే! ఒళ్ళంతా చెమట పట్టిందేమిట్రా

నన్ను ఆటలో చేర్చుకోలేదుగా! నాకేమో చిన్నతన మనిపించింది. మనసు నొచ్చుకొంది, చెమట పట్టిందమ్మా

పోనీలే. నీ ముత్యాల సరాలు చిక్కుపడ్డా యెందుకు?

కాళ్ళకు కట్టిన అందియలు నొక్కులు పడ్డా యెందుకు?

ఆటలో సాటివారిని పట్టుకోవడానికి పరుగెత్తుతుంటే హారాలు చిక్కుపడ్డాయి ఓడిపోయినవాళ్ళు నా పాదాల పడ్డప్పుడు అందియలు నొక్కుపడ్డాయి ”

తన్ను రామ కుటుంబంలో ఒకడుగా భావించుకోవడం కూడా 'వాత్సల్యభక్తి' లో ఒక భాగం. 'సీతమ్మమాయమ్మ' అనే కృతిలో రాముని తండ్రిగా, సీతను తల్లిగా నిర్దేశిస్తూ తన్ను ఆకుటుంబంలోని వ్యక్తిగా చెప్పుకున్నాడు ఇది ఇంచుమించు 'మాతాచ పార్వతీదేవీ పితాదేవో మహేశ్వరః బాంధవాః శివభక్తాశ్చ స్వదేశో భువనత్రయం' లాంటిది

త్యాగరాజు కాంచీపురాధీశ్వరి కామాక్షీ దేవిని 'వినాయకుని వలెను బ్రోవవే' అనే కీర్తనలో, అమ్మా! నన్ను నీకుమారుడయిన గణపతిలాగా చూసుకో, అనే కీర్తనలో వాదాడుచు, బాలురు, ఎచ్చటివాడో , నిలురా, బుద్ధిలేదు యన తాలిమి కలవారై, తల్లిదండ్రులు చూచి, మోదముతో, తనయులనుచును ముద్దు పెట్టి కౌగిలి కూర్పలేదా యటునేగాదా ప్రోవవే అని దీనంగా వేడుకున్నాడు.

శ్యామాశాస్త్రి తన్ను కుమారునిగా భావించుకొని కాపాడమని 'నిన్నేనమ్మినాను' అనే కృతిలో

కన్నతల్లి గాదా అంబా
బిడ్డయని కనికరమింతైనా లేదా

అన్నాడు.

మాయమ్మయని నే పిలిచితీ
మాట్లాడరాదా

అని బ్రతిమాలినాడు.

తెలంగాణాలో తిరునామాలు అనుపేరుతో ప్రసిద్ధ పదసాహిత్యముంది ఆ తిరునామాల్లో భగవంతుని పట్ల కాకుండా ఆచార్యుల పట్ల వాత్సల్యం, గౌరవం చూపడం వర్ణించారు. వైష్ణవంలో ఆచార్యుల స్థానం దైవస్థానం కంటేకూడా సమున్నతం ఒక కవి దేవుణ్ణి చూచి 'దేవుడా నీ వెవరో తెలియదు. నీ ఉనికి చూపిన నా ఆచార్యుడే గొప్ప అని అన్నట్లు వైష్ణవ ఆచార్యులు తరచూ సభలలో చెబుతుంటారు. రామానుజుల కాలం నాడు తాను బ్రతికివుంటే సేవలు చేసేవాణ్ణి కదా అని కైంకర్యంతో వాత్సల్యం ప్రదర్శించే కీర్తన ఒకటి చూడండి

'అడుగులకు మడువులిత్తుగద
ఎడమడ భుజముల ఎత్తుకుందుగద
బాలక్రీడలు పలికింతును గద
పాలు వెన్నెల లర్పణ సేతును గద
లాల పాడుతూ లాలింతును గదా
మేలిమి సూక్తుల మేల్కొల్పుదు గదా"

పదసాహిత్యంలో 'వాత్సల్యభక్తి' చెలమనీరు లాంటిదనడంలో సందేహం లేదు.

ఈ వాత్సల్య భక్తిని వాగ్గేయకారులు చాలవరకు బాలభాషలో, జానపద గేయ సరణిలో, ప్రకృతివర్ణనల నేపథ్యంలో వర్ణించారనటం సబబు.



# అన్నమయ్య - శ్రీనివాసతత్త్వం

డా॥ గల్లా చలపతి

తాళ్లపాక అన్నమాచార్యులు మొదట స్మార్త సంప్రదాయానికి చెందిన వాడైనా వైష్ణవుడైన తరువాతనే వాగ్గేయ కారుడయినాడు. వేంకటశైల వల్లభ రతి క్రీడా రహస్యాలను ప్రతిపాదించే వేలకొలది శృంగార సంకీర్తనలను, వేంకట పతినే పరతత్త్వంగా భావిస్తూ వేలకొలది అధ్యాత్మ సంకీర్తనలను రచించాడు అన్నమయ్య మొదట దార్శనికుడైన కవి తరువాతనే వాగ్గేయకారుడు. ద్వంద్వాత్మకమైన మానవ జీవిత వ్యాఖ్యానమే శృంగార ఆధ్యాత్మ సంకీర్తనల సారం. ఈ సంకీర్తనలన్నీ శ్రీ వేంకటేశ్వరునికి అంకితాలు. ప్రతి సంకీర్తన చివరి చరణంలో వేంకటపతి పదముద్ర కనిపిస్తూ అన్నమయ్య భక్తిని చాటుతున్నది వేంకటపతే తిరుమలవాసుడు. శ్రీనివాసుడు. శ్రీ కి నిలయమైనవాడు, లేక శ్రీని తన వక్షస్థలంలో పదిలపరచు కొన్నవాడు శ్రీనివాసుడు శ్రీనివాస తత్త్వమంటే లక్ష్మీనారాయణ తత్త్వమే. శ్రీ వైష్ణవం లక్ష్మీనారాయణ తత్త్వాన్ని విశేషంగా ప్రతిపాదించి సర్వసృష్టిని ఈ దివ్యదంపతుల లీలా ప్రవృత్తిగా వర్ణించింది. వేంకటపతి సశ్రీకుడుగానే అన్నమయ్యకు కనిపించాడు. వైష్ణవ సంప్రదాయం భగవంతునికి ఐదు స్థితులున్నట్లు వివరించింది అని పర, వ్యూహ, విభవ, అంతర్యామి అర్చాస్థితులు పరమంటే శ్రీ వైకుంఠంలోని శుద్ధ సత్త్వమయమైన పరవాసుదేవ స్థితి నిత్యులు, ముక్తులే ఈ స్థితిని దర్శించ గలుగుతారు. వ్యూహమంటే వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్న అనిరుద్ధ వ్యూహాలు. విశిష్టాద్వైతంలో ఈ వ్యూహ నిర్మాణపద్ధతి జీవుడు క్రమంగా అధిరోహించే సోపానాల క్రమం విభవమంటే దుష్టశిక్షణ శిష్టరక్షణార్థం శ్రీనివాసుడు వైకుంఠంలోని నిత్యవిభూతి నుండి ఏదో ఒక రూపాన్ని ధరించి లీలా విభూతిలోకి రావడం. దీన్నే అవతార మంటారు అంతర్యామి అంటే చరాచరాత్మకమైన జగత్తంతా వ్యాపించినవాడని అర్థం. దీనినే వాసుదేవ తత్త్వమంటారు 'సర్వస్యచాహం హృది సన్నివిష్టః (గీత 15-1), ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి (గీత 18-61) అనే గీతా వాక్యాలు దీనికి ప్రమాణం. అర్చ అంటే భక్తుడు పూజించుకోడానికి వీలుగా విగ్రహ రూపంగా వెలసిన మూర్తి విశేషం అంతర్యామి తత్త్వం నిరాకారం, నిర్గుణం, అవ్యక్తం. అర్చారూపం సాకారం,

సగుణం, వ్యక్తం. అన్నమయ్య ఈ అర్చారూపం లోని శ్రీనివాసునే సంకీర్తన సుమాలలో అర్చించాడు

అన్నమయ్య భావించిన శ్రీనివాసతత్త్వం రెండు రకాలుగా కనిపిస్తుంది 1 అంతర్యామి తత్త్వం 2 అర్చామూర్తి తత్త్వం. అంతర్యామి అనిపేరే అది లోపలి తత్త్వమని స్ఫురింప జేస్తున్నది. అర్చా అనేపేరు అర్చించుకొనే విగ్రహంగా అర్థమవుతున్నది. అనిర్వచనీయమైన శ్రీనివాస తత్త్వాన్ని అర్చాతత్త్వంగా రూపొందించుకొని ఆయన అనంత కల్యాణ గుణాలను సంకీర్తనలుగా పాడి ఆరాధించాడు అన్నమయ్య అర్చ రూప విషయం కాబట్టి. జగత్తు నామ రూపాత్మకమైంది కాబట్టి నామజపాన్ని కూడా అర్చాతత్త్వం గానే భావించ వలసి ఉంది భగవంతుని అనంత నామాలను కీర్తించడం. ఈ వివిధ భక్తిమార్గాలలో 'కీర్తనం' మార్గానికి చెందుతుంది అందుకే అన్నమయ్య శ్రీమన్నారాయణుని నామాలను జపించి తరించాడు

"తలచరోయీతని పుణ్యనామములు
సులభముననే సర్వ శుభములు గలుగు"నని ప్రకటించాడు.

శృంగార సంకీర్తనలలో జీవేశ్వరుల శృంగారాన్ని మధుర భక్తిగా వ్యాఖ్యానించాడు అన్నమయ్య. ఆధ్యాత్మ సంకీర్తనల్లో జీవేశ్వరుల అనాది సంబంధాన్ని భగవంతునికి జ్ఞాపకం చేస్తూ 'అంతర్యామి'గా అందరిలో ఉన్ననీవే అర్చామూర్తిగా వెలసిన వేంకటేశ్వరస్వామివని నిష్కర్షగా చెపుతాడు.

అంతర్యామి తత్త్వాన్ని అనుభూతిలోకి తెచ్చుకొని దేవుని నిరాకార నిర్గుణత్వ అవ్యక్తాలను భావించడం ఎంతో క్లిష్టమైన పని. ఇది పరమ భక్తులకు కాని సాధ్యం కాదు ఇది అద్వైత పద్ధతి మరి అన్నమయ్య విశిష్టాద్వైతిగా, రామానుజ మత ప్రవర్తకుడుగా ఎన్నో సంకీర్తనల సారాన్ని బట్టి అర్థమవుతున్నది.

పురుషుండని శృతి పొగడీనట ఆపురుషుడు నిరాకారమట
విరస వాక్యము లొండొంటికి నివి వింటే నసంబద్ధములు
మొగమున బ్రాహ్మలు మొలిచిరట - ఆ మూరితి అవయవ రహితుడట
తగు బాహువులను రాజులట ఆతత్త్వమె యెంచగ శూన్యమట

,.......... .......... .......... .......... ..........

పంతపు శ్రీ వేంకట పతిమాయలు పచారించిన నివియట
(అధ్యాత్మ 2-252)

ఈ సంకీర్తనలో అద్వైత విశిష్టాద్వైతముల సమన్వయముంది. వ్యక్తదశలో శ్రీనివాసుడు సాకారుడుగా, అవ్యక్త దశలో నిరాకారుడుగా అన్నమయ్య భావంలో నిలవడం దీనికి కారణం. శ్రీనివాసుని అనంత కల్యాణ గుణాలతోపాటు శ్రీమన్నారాయణుని వివిధ రూపాలను కూడా అన్నమయ్య ఎన్నోసంకీర్తనలలో తనివి తీరా వర్ణించాడు. శ్రీ వేంకటేశ్వర స్వామిని పరాదైవంగా భావించే అన్నమయ్యకు స్వామికి సంబంధించిన ఇతర అర్చామూర్తులందరూ సాక్షాత్కరించాడు. అన్నమయ్యచేసిన దశావతార వర్ణనలన్నీ ఈ మూర్తులను అర్చించినవే నృసింహ శ్రీరామ శ్రీ కృష్ణాది అవతారాలను, చెన్న కేశవ విట్ఠలాది అర్చామూర్తులను శ్రీనివాసునికి అభేదంగా వర్ణించాడు. అన్నమయ్య నృసింహ శ్రీరామ శ్రీకృష్ణులను వర్ణించిన సంకీర్తనల సంఖ్య అధికం.

హరి కర్ఘ్యము లీయరో జయంతి పండుగ సేయరో
కెరలి శ్రీ వేంకటాద్రి కృష్ణుడితడు (అ సం. 4-1)

మిగుల శ్రీ వేంకటాద్రి మీది దైవమితడా
తగి రామ కృష్ణావతారమందె నిప్పుడు (అ సం. 4-6)

శ్రావణ బహుళాష్టమి జయంతినేడు
సేవించరో నరులాల శ్రీ కృష్ణుడితడు
అలిమేల్మంగకుఁబతియట్టె శ్రీ వేంకటాద్రి
నిలపై జన్మించినాడు యిదె కృష్ణుడు (అ.సం. 4-139)

రామచంద్రుడితడు రఘు వీరుడు-కామిత ఫలము లియ్యగలిగె నిందరికి
కలడన్నవారి పాలికన్నులెదుట మూరితి వెలయ శ్రీ వెంకటాద్రి విభుడీతడు
(అ.సం. 4-147)

వినోదకాడవు విఠలేశ్వరా - వినుతించనెయివచ్చు విఠలేశ్వరా
బల్లిదపు శ్రీ వేంకటపతివై పాండురంగాన - చల్లగా నెలకొంటివి
జయ విఠలేశ్వర (అ.సం. 4-171)

ఇత్యాది సంకీర్తనలన్నింటిలో ఒకే తత్త్వానికి చెందిన అర్చామూర్తులు శ్రీ వేంకటపతిలో సమన్వయం పొందడం కనిపిస్తుంది అన్నమయ్య శ్రీనివాస తత్త్వంలోని ప్రధానాంశమిది. హనుమంతాది భక్తులు శ్రీనివాసుని బంట్లు కావడంవల్లనే ఘనమైనపనులెన్నో చేయగలిగారని కూడా చెపుతాడు అన్నమయ్య.

"ఎక్కడ నెదురులేక ఈ రేడు లోకములందు
వొక్కడే నిలిచెనమ్మ వుగ్ర హనుమంతుడు"

అంటూ హనుమంతుని గొప్పతనాన్ని వర్ణించి దానికి కారణం శ్రీపతి బంటు కావడమేనంటాడు వైష్ణవంలో భాగవతుడు లేదా భక్తుడు కూడా భగవంతునితో కొన్ని విషయాలలో సమానుడవుతాడు. భాగవతులు కూడా అర్చారూపంలో పూజింప బడడం దీనికి నిదర్శనం. ఇలాంటి భాగవతులైన అర్చారూపాలను పూజిస్తే ఫలితమిచ్చేవాడు శ్రీనివాసుడే అందువల్ల శ్రీనివాస తత్త్వంలో అన్నమయ్యకు వివిధ అర్చారూపాలు కనిపించడం, లేక అన్నిటిలో ఏకోనారాయణతత్త్వం స్ఫురించడం సాధారణ విషయం.

'పురుషుడని శ్రుతి పొగెడెనట - ఆ పురుషుడు నిరాకారమట' అనే సంకీర్తనలో అన్నమయ్య భావించిన సమన్వయం అద్వైత విశిష్టా ద్వైతములకు అందకుండా పోతున్నందువల్లనే అవన్నీ వేంకటపతి మామూలుగా చెప్పడం జరిగింది. అన్నమయ్య శ్రీనివాస తత్త్వం ఈపాటలో ఇంకా బాగా ఫలవంతమై కనిపిస్తున్నది

పరమాత్ముడు సర్వ పరిపూర్ణుడు
సురలకు నరులకు చోటయి యున్నాడు
కన్నులఁగంటానే కడు మాటలాడు తానే
తన్నుఁగాని వానివలె దాఁగి యున్నాడు
అన్నియు వింటానే అట్టె వాసన గొంటానే
వన్నెల నూనె కుంచము వలె నున్నాడు -
తనువులు మోచియు తలఁపులు దెలిసియు
యెనసియు నెనయక యిట్లున్నాడు
చెనకి మాయకుమాయై జీవునికి జీవమై
మొనసి పూసల దారమువలె నున్నాడు
వేవేలు విధములై విశ్వమెల్లా నొకటై
పూవుల వాసనవలెఁ బొంచి యున్నాడు
భావించ నిరాకారమై పట్టితే సాకారమై
శ్రీ వేంకటాద్రిమీద శ్రీపతై యున్నాడు - ఈ సంకీర్తనలో

అన్నమయ్య అంతర్యామి తత్త్వాన్ని దర్శించాడు 'పరమాత్ముడు సర్వపరిపూర్ణుడు' అనేవిషయం 'యచ్చ కించి జ్జగత్సర్వం దృశ్యతే

శ్రూయతేఽపివా - అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణ స్థితః' అనే శ్లోక భావాన్ని తాకుతున్నది మనకు ఈ సర్వజగత్తులో ఏది కనబడుతున్నదో, ఏది వినబడు తున్నదో, వాటి లోపల బయటా కూడా వ్యాపించి ఉన్నవాడు ఆనారాయణుడేనని ఈ శ్లోకార్థం దేవతలకు అతడే దిక్కు - దిక్కులేనివారికి అతడేదిక్కు అంటూ మానవులే గాక దేవతలు కూడా ఉపాసించేదైవం వెంకటాద్రి పతేనని చెపుతున్నాడు అన్నమయ్య. దేవుడు మాయకు మాయగా, జీవునికి జీవమై ఉన్నాడట తానే మాయ. తానే జీవుడు అంటే జీవుని ఆవరించిన మోహపు పొరయైన మాయగాను, జగత్తును పరివేష్ఠించిన వైష్ణవ మాయగాను తానున్నాడు రెండవ చరణంలోని 'పూసలలో దారమువలె' అనే విషయం ముఖ్యమైంది ఇది -

మత్తః పర తరం నాన్యత్ కించిదస్తి ధనంజయ
మయి సర్వమిదం ప్రోక్తం సూత్రేమణిగణా ఇవ (భ గీ. 7-7)

అనే శ్లోకభావాన్ని స్ఫురింప జేస్తుంది నాకంటె ఉత్కృష్టమైనదేదీ లేదు

పూసలు దారంలో గుచ్చబడినట్లు ఈ భూత జాలమంతా నాయందు గుచ్చబడి ఉంది పూసలు నిలవడానికి అందులో కానరాకుండా ఉండే సూత్రం ఆధారమైనట్లు వ్యక్తమైన ఈ ప్రాణికోటిలో అవ్యక్తంగా నేను వ్యాపించి ఉన్నాను అని తన అంతర్యామి తత్త్వాన్ని గురించి గీతలో భగవంతుడే చెప్పాడు. దీనిని అన్నమయ్య ఈ సంకీర్తనలో వివరించి తన భావాన్ని ఇంకా స్పష్టంగా

**భావించ నిరాకారమై, పట్టితే సాకారమై**
**శ్రీ వేంకటాద్రి మీద శ్రీ పతై ఉన్నాడు**

అని చెప్పాడు భగవత్తత్త్వం అనుభూతి దశలో నిరాకారం. అభివ్యక్తి దశలో సాకారం. ఉపాసన లేక భక్తి నిర్గుణోపాసనగా సగుణోపాసనగా ఉంటుంది. నిరాకారం నిర్గుణోపాసనకు, సాకారం సగుణోపాసనకు చెందుతాయి. అద్వైతం నిర్గుణ నిరాకార అవ్యక్త తత్త్వానికి ప్రాధాన్య మిస్తే, విశిష్టాద్వైతం సగుణ సాకార వ్యక్త తత్త్వానికి ప్రాధాన్యమిచ్చింది వైష్ణవ మతపరంగా చూస్తే భగవంతుడు అనుభూతి దశలో అంతర్యామి - నిరాకారుడు, నిర్గుణుడు అవ్యక్తుడు. - అభివ్యక్తి దశలో అర్చామూర్తి-సాకారుడు సగుణుడు, వ్యక్తుడు.

అద్వైతం చెప్పిన నిర్గుణత్వాన్ని విశిష్టాద్వైతం ఈ దశలో తనలో ఇముడ్చుకొంది ఈ విధంగా అభివ్యక్తీకరింప బడిన పరమాత్మ శ్రీ వేంకటాద్రిమీద శ్రీపతై యున్నాడు అని అన్నమయ్య స్పష్టీకరించాడు ఇది బాహ్యాభ్యంతర సమన్వయం ఈ సమన్వయ సూత్రంతో అన్నమయ్య వేలకొలది సంకీర్తనలు రచించాడు ఇలా పరిశీలిస్తూ పోతే అన్నమయ్యది అంతర్యామి అర్చాతత్త్వాల సమన్వయ మనిపిస్తుంది ఇదే ఆయన భావించిన శ్రీనివాసతత్త్వం.

అన్నమయ్య ఇలా ఆలోచించడం వల్లనే 'అంతర్యామి' అనేమాట ఎన్నో సంకీర్తనలో కనిపిస్తున్నది. అన్నమయ్యకు శ్రీవేంకటేశ్వరుడే అంతర్యామి భవబంధాలు తెంచమని ఆస్వామినే శరణు పొందాడు. జీవితమంతా భవ బంధాలు తెంచుకోడానికి ప్రయత్నించి అది సాధ్యపడకపోగా చివరకు శ్రీపతి తెంచితేనే అవి తెగుతాయని నమ్మి అంతర్యామినే శరణుపొందిన పరమభక్తుడు అన్నమయ్య సర్వప్రాణి కోటికి శరణాగతి తత్త్వాన్ని విశదపరచే ఈ సంకీర్తన ఆయన అంతర్యామి - అర్చాతత్త్వాల సమన్వయానికి ఒక గొప్ప తార్కాణం

అంతర్యామీ అలసితి సొలసితి
ఇంతట నీ శరణిదే చొచ్చితిని
కోరిన కోర్కెలు కోయని కట్లు
తీరవు నీవవి తెంచకా
భారపుఁబగ్గాలు పాపపుణ్యములు
నేరుపుల బోవు నీవు వద్దనకా
జనుల సంగములఁ జక్కరోగములు
వినువిడువవు నీవు విడిపించకా
వినయపు దైన్యము విడువని కర్మము
చనదది నీవిట సంత పరచకా
మదిలో చింతలు మయిలలు మణుగులు
వదలపు నీవవి వద్దనకా
యెదుటనె శ్రీ వేంకటేశ్వర నీవదె

అదన గాచితివి అట్టిట్టనకా. ఈసంకీర్తన నిర్మాణం కూడా అన్నమయ్య అంతర్యామి అర్చాతత్త్వాల సమన్వయాన్నే నిరూపిస్తుంది. 'అంతర్యామి' అని ప్రారంభమైన ఈ కీర్తన శ్రీ వేంకటేశ్వరా అని ముగియడం ఈ

నిర్మాణంలోని సొగసు 'కోరిన కోర్కెలు కోయనికట్లు - తీరవు నీవని తెంచకా' అనేపాదాన్ని వివరిస్తే - అప్పటి కప్పుడు కలిగే కోరికలు బ్రతుకును బంధించిన దారాల ముడులు. కోరికల తీవ్రత హెచ్చే కొద్దీ ముడులు ఇంకా బిగుసు కుంటాయి జీవితాంతం ప్రయత్నించినా ఈ ముడులు వీడవు ఈ ముడుల చిక్కులు తొలగించగల నేర్పరి శ్రీనివాసుడొక్కడే ఆయన సర్వాంతర్యామి. ఆ సర్వాంతర్యామి తెంచాలనుకుంటే ఆ ముడులు వీడడం చిటికెలో పని. కాని ఆయన అనుకోవాలిగదా! ప్రాణులు శరణు పొందినపుడే ఆయన ఆ ముడుల బంధాలు సడలింపజేసి ముక్తిని ప్రసాదిస్తాడు ఇంతటి విషయ గాంభీర్యం కలిగి ఉన్నా శ్రీనివాసుని జగదేక తత్త్వాన్ని ఈ సంకీర్తన అతి సులభంగా అందరికీ బోధించే రీతిలో ఉంది. ప్రాణులు శారీరక బలంతో మోహపు మదితో చేసే పనులన్నీ తమ శక్తి సామర్థ్యాల ఫలితమేనని భ్రమించడం సహజం. శరీరాన్ని - దానికి కావలసిన బలాన్ని, కోరికను - దానిని నెరవేర్చుకొచే పద్ధతిని వేంకటపతే ప్రాణికి సమకూర్చుతున్నాడు తెలుసుకుంటే 'సర్వం విష్ణుమయం జగత్' అనే విషయం అర్థమై శ్రీనివాసుని లోకనాయకత్వాన్ని భావిస్తూ ప్రతిప్రాణి శాంత స్థితిని పొంది తద్వారా జీవిత గమ్యాన్ని చేరుకోగలదని అన్నమయ్య -

"మనసు నీవిచ్చితివి మాటలు నీవిచ్చితివి
తనువు నీ విచ్చితివి అంతర్యామీ

సత్తువ నీవిచ్చితివి చలము నీవిచ్చితివి
తత్తర మిచ్చితివి అంతర్యామీ

మాయలు నీవిచ్చితివి మదము నీవిచ్చితివి
ఆయపు శ్రీ వేంకటాద్రి అంతర్యామీ" (అ సం. 4-396)

అనే సంకీర్తనలో స్పష్టం చేశాడు.

అన్నమయ్య విశిష్టాద్వైతి. విశిష్టా ద్వైతులకు అష్టాక్షరి మూలమంత్రం 'ఓం నమో నారాయణాయ' అని జపించే వీరికి ఇతర దేవతల స్ఫురణ కలుగదు. కలిగినా వారిని శ్రీమన్నారాయణుని శరీరానికి చెందిన వారుగా భావించడం ఉంది. ఆయన శరీరి ఇతర ప్రకృతి, మానవులు, దేవతలు అందరూ ఆయనకు శరీరం. శ్రీ మన్నారాయణుడే శ్రీనివాసుడుగా, శ్రీనివాసుడే సకల ప్రాణులకు అంతర్యామిగా, ఆ అంతర్యామి తత్త్వమే అభివ్యక్తిదశలో

అర్చామూర్తియైన వేంకటేశ్వరస్వామిగా అన్నమయ్య ఎలా భావించాడో ఇప్పటికే మనకు తెలుసు శ్రీనివాస తత్త్వం తన కాలం వరకు భక్తులకు అర్థమవుతూ వచ్చిన తీరును అన్నమయ్య గుర్తించాడు. శ్రీనివాసుడు శివతత్త్వమని, శక్తితత్త్వమని ఆయన కాలానికి ప్రచారంలో ఉంది రామానుజులవారు ఎన్నో పురాణాలనుండి ఉపనిషత్తులనుండి ఉపపత్తులు చూపించి తిరుమల దైవం వైష్ణవ దైవమే నని నిరూపించినా లోకంలో కొన్ని సందేహాలు ఆనాటికి మిగిలే ఉండినాయి ఇలాంటి సందేహాలు రావడానికి కారణం ఆళ్వారుల అభిప్రాయాలు. తొండపడిప్పొడి ఆళ్వారు, మధురకవి ఆళ్వారు తప్ప మిగిలిన ఆళ్వార్లందరూ తిరుమలను తిరుమల నాథుని తమ దివ్య ప్రబంధాలలో కీర్తించారు. 'పేయాళ్వారు చల్లని కొండ కాలువలో రమణీయమైన వేంకటాచలంపై వేంచేసియున్న స్వామికి తలపై జటలు, కిరీటం చేతిలో గొడ్డలి, చక్రం, మొలలో నాగాభరణం బంగారు మొలతాడు ఉండడంవల్ల ఈయన హరిస్వరూపి హర స్వరూపిగా కూడా భావింప బడుతున్నాడు" అని ఒక పాశురంలో వర్ణించాడు. తిరుమలను పేర్కొన్న మొదట ఆళ్వారు ఈయనే. ఆళ్వార్ అంటేనే విష్ణుభక్తుడని అర్థమున్నపుడు ఆళ్వార్లు స్వామిని శివుడంటారా? స్వామి విరాడ్రూపంలో ఇతర దైవాంశాలన్నీ సమన్వయం పొంది కనిపించినట్లు వీరి అనుభూతి 'పేయాళ్వార్ ఆలోచన కూడా ఇదే. తమిళదేశంలో శైవం వైష్ణవం ఇంచు మించు ఒకేకాలంలో ప్రాచుర్యం పొందడం కూడా దీనికి కారణం. అందువల్ల ఆళ్వారుల దృష్టిలో స్వామి శ్రీనివాసుడేగాని శివుడుకాదు అయితే ఈ తత్త్వాన్ని అర్థంచేసుకోవడంలోని వ్యత్యాసాల కారణంగా ప్రజలలో ఈ రకమైన అభిప్రాయాలు ఏర్పడి అవి అన్నమయ్య కాలం దాకా కొనసాగాయి. ఈవిషయాలన్నిటిని అన్నమయ్య గమనించాడు శ్రీనివాసుని వివిధ రూపాలతో అర్చించే భక్తులను కూడా ఆయన చూశాడు. కొందరు శివుడని, కొందరు శక్తియని భావించడం ఆయంశాలన్నీ పరబ్రహ్మలో అంతర్లీనంగా ఉన్నవేనని నమ్మిన అన్నమయ్యకు వింతగా తోచలేదు. శ్రీనివాసుని ఇలా వివిధ రూపాలుగా చూడడం అవసరం లేదని ఆయన శ్రీమహావిష్ణువేనని ఋజువు చేయ వలసిన అవసరం ఉందని అన్నమయ్య భావించలేదు. వివిధ రూపాలలో కనిపించే దేవతలకు జరిగే పూజలన్నీ మహా విష్ణువుకే చెందుతాయన్నది వైష్ణవ సిద్ధాంతం. అందువల్ల స్వామిని ఇతర రూపాలుగా భావించి అర్చించడంలో తప్పులేదని అన్నమయ్య మతం. ఈ విషయాన్ని తెలిపే ఒక ప్రధానమైన సంకీర్తనను ఆయన రచించాడు

ఎంత మాత్రమున నెవ్వరు దలచిన అంత మాత్రమే నీవు
అంతరాంతరము లెంచి చూడఁ బిండంతే నిప్పటి యన్నట్లు ||పల్లవి||

కొలుతురు మిము వైష్ణవులు కూరిమితో విష్ణుడని
పలుకుదురు మిము వేదాంతులు పరబ్రహ్మంబనుచు
తలతురు మిము శైవులు తగిన భక్తులను శివుడనుచు
అలరి పొగడుదురు కాపాలికులు ఆదిభైరవుండనుచు ||ఎంత||

సరినెన్నుదురు శాక్తేయులు శక్తిరూపు నీవనుచు
దరిశనములు (ల) మిము నానా విధులను తలపుల కొలదుల భజింతురు
సిరుల మిమ్మునే యల్పబుద్ధిఁ దలచిన వారికి నల్పం బవుదువు
గరిమల మిము నేఘనమని తలచిన ఘనబుద్ధులకు ఘనుడవు ||ఎంత||

నీ వలన గొరతే లేదు మరి నీరుకొలది తామెరవు
ఆవల బాగీరథి దరి బావుల ఆజలమే వూరిన యట్లు
శ్రీ వేంకటపతి నీవైతే మముఁజేకొని వున్న దైవమని
యీవలనే నీ శరణనియెదను యిదియే పరతత్వము నాకు ||ఎంత||

అన్నమయ్యకు శ్రీ వేంకటేశ్వరుడే పరతత్త్వం. ఆ పరతత్త్వాన్ని వైష్ణవులు విష్ణుడని, శైవులు శివుడని, కాపాలికులు భైరవుడని, శాక్తేయులు శక్తియని పిలిచారు. ఈ యంశాలన్నీ సమన్వయం పొందిన పరతత్త్వం వేదాంతులు దర్శించే పరబ్రహ్మ స్వరూపం. శివుడు, భైరవుడు శైవతత్త్వానికి చెందిన అంశాలు. శైవతత్త్వంలో శాంతరూపం శివుడైతే క్రోధరూపం భైరవుడు. శివుడు శుభంకరుడు భారతదేశంలో శివతత్త్వం అనాదిగా ఉంది. ఋగ్వేదంలో అభవ, శివ, రుద్ర అనే రూపాలు కనిపిస్తాయి. అందుకే అన్నమయ్య ఆదిభైరవుణ్ణి పేర్కొన్నాడు సృష్టిని నియంత్రించేది శక్తి. శక్త్యారాధకులు శాక్తేయులు. ఈమె స్త్రీ దేవత ఉత్కృష్టమైన పర తత్త్వానికి స్త్రీ పురుష భేదం లేదు. ఈ భేదం ఉపాసకుని దృష్టి ననుసరించి ఏర్పడింది. అన్నమయ్యకు స్వామి శివుడుగా, భైరవుడుగా శక్తిగా కనిపించ లేదని, ఆయన మనోదృష్టిలో ఎప్పుడూ భువనసుందరుడైన శ్రీమన్నారాయణుడు గానే గోచరమైనాడని ఆయన వ్రాసిన అనేకానేక పాటలు నిరూపిస్తాయి. ఇలా అన్నాడంటే అది ఆనాడు సంఘంలో నలుగుడు పడుతున్న కొందరి అభిప్రాయ ప్రకటనమేనని భావించాలి. అన్నమయ్య నాటికి స్వామిని గురించి ఇలాంటి ఆలోచనలున్నాయని ఈపాట వ్యక్తం చేస్తున్నది. అప్పటి నుండి శ్రీ

వేంకటేశ్వరుడుగా ఆరాధింపబడే తిరుమల దైవం వైష్ణవ దైవమేననీ అభిప్రాయం లోకంలో ఒకవైపు స్థిరపడినా స్వామి శివుడనే అభిప్రాయం కూడా కొనసాగుతూ వచ్చింది. ఎవరు ఎలా భావిస్తే స్వామి వారిని అలా ఉద్ధరిస్తూ రావడంవల్ల ఆ అభిప్రాయాలకు తావు లేకుండా పోయింది. ఇది వేంకటాచల మాహాత్మ్యం శ్రీనివాసుని సంకల్పం.

అయినా స్వామిని శైవ దైవమని భావించేవారు ఇప్పటికీ లేకపోలేదు 1-6-1904లో వెంకయ్య అనే శాసన పరిశోధకుడు ఆనాటి ప్రభుత్వ ప్రధాన కార్యదర్శికి పంపిన శాసన వార్షిక నివేదికలో తిరుచానూరు దేవాలయానికి సంబంధించిన ఆసక్తి కరమైన విషయాలున్నాయి ఈ నివేదిక ప్రకారం పద్మావతీదేవి ఆలయం ప్రాచీన కాలంలో తిరువిళం గోయిల్ అని, 20వ శ. ప్రారంభంలో ఇదే ఆలయం సుందరరాజ పెరుమాళ్ ఆలయంగా పిలువబడేదని తెలుస్తున్నది. 1904కు కొన్ని సంవత్సరాల ముందు కూల్చబడిన ఈ దేవాలయం తిరువేంగడంలో కొలువున్న దేవునికి అనుబంధంగా నిర్మింపబడినట్లు కూడా ఈ నివేదిక పేర్కొంటున్నది సుందరరాజ పెరుమాళ్ శైవదైవం కాబట్టి తిరువేంగడంలోని దేవుడు కూడా శైవదైవమే నన్న అభిప్రాయం. ఇందులో ధ్వనిస్తున్నది. వెంకయ్య చెప్పిన ఈ విషయం ఆనాటి ప్రజల వ్యవహారంలో ఉండిన ఒక అభిప్రాయం కుంఫిణీ ప్రభుత్వం 21-4-1843లో తిరుచానూరు పద్మావతీ దేవాలయాన్నికూడా శ్రీహతీరాంజీ మఠానికి అప్పగించినట్లు చరిత్ర చెపుతూ ఉండడం వల్ల పద్మావతీ దేవాలయం అప్పటికే బాగా ప్రసిద్ధి చెందిన దేవాలయంగా ఉండినట్లు అర్థమవుతుంది. ఈ దేవాలయాన్ని వెంకయ్య 'Comparatively Recent one' అన్నాడు అంటే 1904 నాటికి సుమారు వంద సంవత్సరాల ముందుదిగా అనుకోవచ్చు మరి అప్పటి నుండి తిరుమలలో కూడా శ్రీనివాసుడు వైష్ణవ దైవంగా అర్చింపబడుతూ రావడం ఇతర దైవాంశాలనే సందేహం లేక పోవడం గమనింప దగిన విషయం.

ముందే చెప్పినట్లు అన్నమయ్య మొదట దార్శనికుడైనకవి- ఆపైన వాగ్గేయకారుడు. ఈ కవి - వాగ్గేయ కారునిలో ఒక తాత్త్విక జిజ్ఞాసువు అంతర్గతంగా ఉన్నాడు. 'ఏకం సద్విప్రా బహుధా వదన్తి' అనేది తాత్త్విక సిద్ధాంతం. చూచే చూపును బట్టి చేసే ఆలోచనను బట్టి వస్తుతత్త్వం ఆవిష్కృత మవుతుంది. ఇది దార్శనికత ఏ కొద్దిగానైనా ఉన్న ఎవరి విషయంలో నైనా సత్యమే. అందు వల్లనే అన్నమయ్యకు శ్రీనివాస తత్త్వం అనంత ముఖాలుగా విస్తరించి ప్రత్యక్షమైంది. ఒక మూర్తి నుద్దేశించి ఇన్నివేల

సంకీర్తనల్లో ఇన్నివేల రకాలుగా ఆలోచించి భావాలను రూపు కట్టించడం అందరికీ సాధ్యమయ్యే పని కాదు. సృష్టి స్థితి లయములకు హేతుభూతుడు నారాయణుడే నని నమ్మి ఆయన అనంతత్త్వాన్ని ప్రకృతి అంతటా దర్శించ గలిగిన అన్నమయ్యకే అది సాధ్య మైంది. చూచే చూపును బట్టి దివ్యత్వం రూపు దాల్చి కనిపిస్తుందని చాటడానికి రాసిన ఈ సంకీర్తనను చూడండి.

చూచే చూపొకటి సూటిగురి యొకటి
తాచి రెండు నొకటైతే దైవమే సుండీ
యేనుగ దలచితే యేనుగై పొడచూపు
బట్ట బయలు దలచ బయలై పొడచూపు
శ్రీ వేంకటాద్రి మీద శ్రీపతి దలచితేను
శ్రీ వేంకటాద్రిమీద శ్రీపతై పొడచూపు
భావమే జీవాత్మ ప్రత్యక్షము పరమాత్మ
తావు మనో గోచరుడు దైవమే సుండీ

ఈ సంకీర్తన అన్నమయ్య దార్శనికతను పట్టి చూపు తున్నది శ్రీనివాసుని సర్వ వ్యాపకత్వం, సర్వేశ్వరత్వం అన్నమయ్య సంకీర్తనల నిండా కనిపిస్తూ ప్రాణుల మానసాలలో భక్తి భావాన్ని నింపు తున్నవి. అన్నమయ్యలోని అంతర్యామి శ్రీనివాసుడు తన ఉనికిని సంకీర్తనల ద్వారా ప్రకటించు కొన్నాడు అన్నమయ్య గొంతుక భక్త జనులను తరింప జేయడానికి ఒక వాహికగా మారింది. ఈ ఘనకార్యాన్ని సాధించడానికి స్వామి అన్నమయ్యను ఎన్నుకోవడం అన్నమయ్య చేసుకొన్న సుకృతం. అన్నమయ్యకు శ్రీనివాస తత్త్వం ఒక దివ్యతత్త్వం. ఆ తత్త్వంలో సర్వమూ అన్నమయ్యకు గోచరమైంది. అన్నమయ్య శ్రీనివాసుతత్త్వం అంతర్యామి-అర్చా తత్త్వాల సమన్వయం. భక్తులందరూ ఈ తత్త్వాన్ని దర్శించి తరించాలని ఆ వాగ్గేయకారుని సంకల్పం.

## ఉపకరించిన వ్యాసాలు


1 అన్నమయ్య భక్తిసూత్రం - అంతర్యామి, అర్చాతత్త్వాల సమన్వయం. డా॥ ముదివేడు ప్రభాకరరావు, ఋషి పీఠం (భారతీయ మానసపత్రిక) సంపుటి 1, సంచిక 8,9; మార్చి,ఏప్రిల్ 2000, పుటలు,14-15, 20-21.

2. ఒక అన్నమయ్య పాట - చారిత్రక విశేషాలు
చూ॥ వ్యాస భండారం (పరిశోధక వ్యాసాలు) డా॥ గల్లా చలపతి ప్రచురణ, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి, 1999. పుటలు 15- 41.


*

# అన్నమయ్య సంకీర్తనల్లో స్త్రీ స్వభావ చిత్రణ

డా॥ పొన్నా లీలావతి

**1.1.** ప్రస్తావన : అన్నమయ్య మధురభక్తి పూరితమైన శృంగార సంకీర్తనలు, వైరాగ్యభక్తి సంపన్నమైన అధ్యాత్మ సంకీర్తనలు రచించాడు శృంగార సంకీర్తనల్లో ప్రకృతి స్వరూపిణి అయిన స్త్రీపాత్రకు అధికప్రాధాన్యం ఇచ్చాడు ఈ ఆధునిక కాలంలో స్త్రీ విద్యావంతురాలై, ఉద్యోగస్థురాలై ఆర్థికంగా, సాంస్కృతికంగా అన్నిరంగాల్లో వ్యక్తిగా బలపడుతున్నాగానీ కుటుంబంలో, సమాజంలో, ఉద్యోగ స్థానంలో స్త్రీకి రావలసినంత సముచిత స్థానం రావడంలేదు. అలాంటిది పదిహేనవ శతాబ్దంలో స్త్రీ జీవిత పరిస్థితి ఎంతో దయనీయంగా వుండి వుంటుంది. ఈ దుస్థితిని పోగొట్టడానికి స్త్రీజీవితాన్ని నిశితంగా పరిశీలించి స్త్రీ జాతికి సమున్నతస్థానం చేకూర్చడం కోసం సంకీర్తనల్లో వివిధ రకాల స్త్రీ పాత్రల్ని సృష్టించి వివిధ స్వభావాల్ని అన్నమయ్య చిత్రించాడు.

**1.2.** అధ్యాత్మ సంకీర్తనల్లో స్త్రీ స్వభావ చిత్రణ : అన్నమయ్య అధ్యాత్మ సంకీర్తనల్లో విష్ణుమూర్తి అవతారవిశేషాలు, విష్ణు మహిమలు, భక్తి, జ్ఞాన, మానవత్వ, నీతి ప్రబోధాలతోపాటు స్త్రీ స్వభావ చిత్రణ కూడా చేశాడు కుటుంబంలో, సమాజంలో స్త్రీ పురుషుల మధ్య అసమానతల్ని అన్నమయ్య గమనించి ఎంతో ఆవేదన చెంది వుంటాడు. అందుకే స్త్రీకి పురుషునితోపాటు సమానంగా స్వేచ్ఛా స్వాతంత్ర్యాల్ని అభిలషిస్తూ-

'పొలఁతులు జీవులే పురుషులు జీవులే
తలఁప భావభేదములే కాని
బలిమి స్వతంత్రముఁ బరతంత్రమొకరికి
యెలమి నిందులోఁ జెల్లే హీనాధికములే' (2-78)

అంటూ స్త్రీ పురుషులిద్దరూ సమానులేనని, ఒకరికి స్వతంత్రం, మరొకరికి పరతంత్రం విధించడం తగదని తెలియజెప్పాడు. అయితే ఈ అధ్యాత్మ సంకీర్తనల్లోనే కొన్ని చోట్ల స్త్రీని దుష్ట స్వభావం కలిగిన భయంకరమైన వ్యక్తిగా చిత్రించాడు. దీనికి కారణం మోక్షసాధకుడైన పురుషుడు ధన, కనక, కాంతాదులపై మితిమీరిన వ్యామోహం కలిగి వుంటే అవి అతనికి

కీడు చేస్తాయని చెప్పడానికి ఇలా చిత్రించి వుండవచ్చు. మన పూర్వులు 'వెలది, జూదంబు, పానంబు, వేట, పలుకు ప్రల్లదనంబు' అంటూ సప్త వ్యసనాల్లో స్త్రీని కూడా చేర్చారు. కాబట్టి స్త్రీని వ్యసనంగా మార్చుకుంటే పురుషజీవితం వినాశమవుతుందని హెచ్చరిక చేయడం కోసం అలా చిత్రించి వుండవచ్చు. మధుర పదార్థాలనైనా విషమని గట్టిగా చెప్పి భయ పెట్టక పోతే రోగులు వాటిని తినడం ఎలా మానలేరో అవిధంగానే స్త్రీని అలా చిత్రించకపోతే కాంతా కాముకులు భయపడరని అన్నమయ్య భావించి వుండవచ్చు. సుందరాంగుల లేడి చూపులు ఎంత రమ్యంగా వుంటాయో అంత ప్రాణాంతకమైన పనుల్లాగా వుంటాయంటూ-

'ఏణ నయనల చూపులెంత సొబగైయుండు
ప్రాణ సంకటములగు పనులు నట్లుండు' (1-99)

అని హెచ్చరిక చేశాడు

స్త్రీల రతి సౌఖ్యాల ఆశల్లో ఈదులాడే మనుషులు ఎంగిలిమనుషులని, అలాంటి వాళ్ళకు జంకూ కొంకూ వుండదని -

'అంగనల రతుల యాసలనీదేటి
యెంగిలి మనుజులకెగ్గేది' (1-432)

అంటూ నిరసించాడు

స్త్రీల వల్ల కలిగే ఆనందం ఇనుప గుగ్గిళ్ళను నమలడం వంటిదని, దీనికన్నా నారాయణునిసేవే స్థిరమైన పదవి అంటూ, స్త్రీలతో నవ్వులు చందమామ గుటుకలని, వారిని గూర్చి మనసులో తలచు కోవడం ఎండమావుల్లో నీళ్ళని, వారికోసం పడే విరహవేదన తాటిమానినీడని, వారుచూపే భక్తి నీటిపై వ్రాత అని, వారు చూపే ప్రేమ గోడమీది సున్నమని, వారి వేడుకలు వడగండ్ల గుళ్ళని స్త్రీల చేష్టలన్నీ శాశ్వతమైనవి కావని, మాయాపూరితమైనవని అంటూ స్త్రీలను చంచల స్వభావులుగా చిత్రించాడు

ఇందువల్ల నేమి గద్దుయినుప గుగ్గిళ్లింతే
ఇందిరా రమణుసేవే యిరవైన పదవి||

సతులతో నవ్వులు చందమామ గుటుకలు
మతి తలపోంత లెండ మావుల నీళ్ళు
రతులతో మాటలు రావిమాని పువ్వులు
తతి విరహపు కాక తాటిమాని నీడ||

కొలఁది లేని ననుపు గోడమీఁది సున్నము|
పడఁతుల వేడుకలు పచ్చివడఁగండ్ల గుళ్ళు|| (2-268)

ఉత్తముడైన శ్రీహరిని ధ్యానించడానికి అలవాటు పడిన ఆఁ భ్రాంతిమతులైన స్త్రీలను తలచుకోవచ్చా అంటూ జీవుని చీకొట్టడంలో స్త్రీని అధమ స్వభావం కలిగిన వ్యక్తిగా భావించడం కనిపిస్తుంది.

'ఛీ ఛీ వో జీవుఁడా చింతించుకో జీవుఁడా
ఆ చందానకీ చందము అరుహమా జీవుఁడా||
వుత్తముఁడైన హరి వుండేటి యాతుమలోన
తత్తరపుఁగాంతలను తలపోసేదా|| (2-115)

స్త్రీలు విష్ణుమాయలని, వారి చూపులు అవయవాల్ని గుచ్చుకొని చిల్లులు చేస్తాయని, స్త్రీల రతిపరవశాలు మూర్ఛరోగాల వంటివని, స్త్రీస్తనాలు కాల్చివేసే మందుగుండ్లనీ, వారి మంచి మాటలు మాయపుటురులని (మాయాపాశాలు), సంసార సంబంధం పాముతో స్నేహం వంటిదని, వారి ప్రేమలు విషం అని స్త్రీల మనసులు, మాటలు, చేష్టలు ముప్పు కలిగిస్తాయని, శ్రీహరిని ధ్యానించి స్త్రీమాయనుంచి తప్పించుకొని జీవించాలని చెప్పిన సంకీర్తనలో స్త్రీస్వభావం భయంకరమయిందిగా చిత్రించాడు.

ఇందిరా పతి మాయలు యింతులు సుండీ
మందలించి హరిఁగొల్చి మనుదురుగాని||

అతివలచూపులే ఆయాలు దాఁకీఁ జుండీ
రతి పరవశములు రాఁగిన మూర్ఛలు సుండీ
మతిలోఁ దప్పించుక మనుదురుగాని||

మెఱయించే చన్నులే మించుఁబెట్లు గుండ్లు సుండీ
మఱిమంచి మాటలు మాయపుటురులు సుండీ
మఱవక తప్పించుక మనుదురుగాని||

బలుసంసారము పొందు పాము తోడి పొత్తు సుండీ
వెలలేని వలపులు విషము సుండీ
యెలమితో శ్రీ వేంకటేశ్వరు మఱఁగుచొచ్చి
మలయుచు సొలయుచు మనుదురుగాని|| (1-494)

భగవంతుని మాయా ప్రభావంవల్ల స్త్రీలను చూచి ఈ జన్మ కామించిందని, చపలాక్షులైన స్త్రీలను మోహించి తన మనసు చంచల మయిందని, స్త్రీల తీపుమాటలకు లోబడినందువల్ల తన బ్రతుకు తరితీపుల పాలయిందని (కష్టాలపాలు), స్త్రీలపొందు కోరడం వల్ల తనకు సుఖశాంతులు నశించాయని, చివరికి శ్రీ వేంకటేశ్వరుని దర్శించి సుజ్ఞాని నయ్యానని భక్తుడు విన్నవించుకున్న సంకీర్తనలో స్త్రీలను కపట స్వభావం కలిగిన వారుగా చిత్రించాడు.

ఏమిసేతు దేవదేవయింతయును నీ మాయ
కామినులఁజూచి కామించే భవము||

చంచలపుఁగను దోయి సతుల బారికిఁజిక్కి
చంచల మందెను నాదిచ్చరి మనసు||

తీపుల మాటల మించి తెఱవల భ్రమఁదరి
తీపుల పాలాయఁబో నాతెలివెల్లాను||

కూటమి సతులపొందు కోరి కోరి కూడికూడి
కూటువనా విరతెందో కొల్లఁ బోయెను
నీటున శ్రీవేంకటేశ నినుఁగని యింతలోనె
జూటరినైయింతలోనె సుజ్ఞానినైతి|| (1-401)

మరో సంకీర్తనలో స్త్రీలు అనే సర్పాల అధరాలు కఱచి మన్మథ విషం తలకెక్కిందని, హద్దుమీరిన రతులలో దేహాలు మొద్దు బారాయని, మతిమరపు వచ్చిందని, స్త్రీలు అనే మహాభూతాలు సోకి తల మొలలతో దిగంబరులై వున్నారని, వారి తాకిళ్ళచేత అవయవాలు రక్కిపోయాయని, స్త్రీల కౌగిళ్ళనే తాపజ్వరాలవల్ల శరీరమంతా కరిగి కారిపోయిందని, ఇందుకు ముందు, మంత్రం, యంత్రం ఏమిటో, నీవేలోకులకు దిక్కు అంటూ భక్తుడు విన్నవించుకున్న సంకీర్తనలో స్త్రీలు సర్పాల్లా విషస్వభావం కలిగినవారుగా, మహాభూతాల్లా పీడించే స్వభావం కలిగిన వారని చిత్రించాడు.

భవరోగవైద్యుడవు పాటించనీ వొకఁడవే
నవనీత చోర నీకు నమోనమో||

అతివలనెడి సర్పాలధరాలుగఱచిన
తతి మదన విషాలు తలకెక్కెను
మితి లేని రతులఁ దిమ్మరివట్టి దేహాలు
మతి మఱచెనిందుకు మందేదొకో||

పొలఁతులనెడి మహాభూతాలు సోఁకిన
తలమొలలు విదిబిత్తలైయున్నారు
అలరు చెనకుల చే నంగములు జీరలాయ
మలసి యిందుకు నిఁక మంత్రమేదొకో||

తరుణులకాఁగిలనేతాప జ్వరాలు వట్టి
కరఁగి మే నెల్లదిగఁ జారఁజొచ్చెను
నిరతి శ్రీ వేంకటేశ నీవే లోకులకు దిక్కు
అరుదు సుఖాన నుండే యంత్రమేదొకొ|| (3-356)

**1.2.1.** పరస్త్రీ స్వభావచిత్రణ : మానవుడు ధర్మబద్ధంగా అర్థకామాలను అనుభవించాలి తద్భిన్నంగా పరధనాన్ని, పరస్త్రీని కోరుకుంటే కష్టాలుకొని తెచ్చుకున్నట్లే అవుతుంది. నిప్పును పట్టుకొంటే కాలిపోయే విధంగా పరస్త్రీల సంబంధం జీవితాన్ని దహించి వేస్తుందని, విషం మింగితే తలకెక్కినట్లే, కాముక స్త్రీల ప్రేమ భ్రాంతి కలిగిస్తుందని, సముద్రంలో పడితే మునిగిపోయేవిధంగా స్త్రీలమాటలు బ్రతుకును ముంచివేస్తాయని ఈ విషయాలన్నీ ముందే తెలుసుకొని బ్రహ్మదేవుడై యోగి అయినా మోసపోకుండా జాగ్రత్త వహించాలని చెప్పిన సంకీర్తనలో కాముకత్వం కలిగిన పరస్త్రీల స్వభావం ప్రమాదకరమయిందిగా అన్నమయ్య చిత్రించాడు

మొదలే తెలియవలె మోసపోక మానవలె
పదిలపుయోగికైనా బ్రహ్మకైనాను||

చిచ్చు గాఁగిలించుకొంటే చిమిడించకుండునా
గచ్చుఁబరస్త్రీల పొందు కాఁచ కుండునా
తచ్చి విషము మింగితే తలకెక్క కుండునా
పచ్చిసతుల వలపుభ్రమయించకుండునా||

తెగి సముద్రము చొచ్చి లోఁబడకుండునా
మొగినింతుల మాటలు ముంచకుండునా|| (3-273)

**1.2.2. వేశ్యాస్త్రీ స్వభావ చిత్రణ :** అన్నమయ్య అధ్యాత్మ సంకీర్తనల్లో వేశ్యాస్త్రీల స్వభావాన్ని కూడా చిత్రించాడు. వేశ్యలు తమ అందచందాలతో, ఆటపాటలతో ధనవంతులు, భోగలాలసులైన పురుషుల్ని ధనం కోసం, ఆస్తుల కోసం ఆకర్షించుకొని వారి జవసత్వాల్ని, ఐశ్వర్యాల్ని మొత్తం నాశనం చేస్తారు. వేశ్యాలోలత్వానికి గురిఅయి కృశించిన పురుషులు శ్రీహరి ధ్యానంతో గట్టెక్కిన తర్వాత వారకాంతలతో - ఇంత కాలం నరకాన్ని చూపి పంచ మహాపాతకాల్లో పడవేసిన మమ్మల్ని ఇంకమీరు ఏమీచేయలేరని, శ్రీహరి పక్షంలోవున్నామని తెలియజేసిన సంకీర్తనలో వేశ్యాస్త్రీల లుబ్ధస్వభావాన్ని చిత్రించాడు

చక్కఁదనముల వారసతులాల |
యిక్కువ తెక్కువల మీరేమిసేసేరిఁకను ||

ఒప్పుగా నరకము మాకుంబలిచ్చి మనమెల్ల
కప్పము గొంటిరిగా యంగనలార |
అప్పుడే గోవిందునికి ఆహివెట్టితిఁజిత్తము
యిప్పుడు యెమ్మెల మీరేమి సేసేరిఁకను ||

పంచమహాపాతకాల బారిఁదోసి మాసిగ్గులు
లంచము గొంటిరిగా నెలఁతలారా |
వంచన తోడుత హరివారమైతిమిఁకమీ
యించుక గుట్టుల మీరెందు చొచ్చేరిఁకను ||

దొంగిలిమాగుట్టులెల్లా దోవనేసి మరుబారి
భంగపెట్టితిరిగా వో భామ లార |
చెంగలించి వేంకటేశు సేవకుఁ జొచ్చితిమి
యెంగిలి మోవులును మీరేడఁబడేరిఁకను || (1-103)

**1.2.3. స్త్రీల శిష్టస్వభావ చిత్రణ:** అధ్యాత్మ సంకీర్తనల్లో కొన్నిచోట్ల స్త్రీలను దుష్ట స్వాబావం కలవారుగా, చపల స్వభావం కలవారుగా, విష స్వభావం కలవారుగా చిత్రించడంతో పాటు స్త్రీలను శిష్టస్వభావం కలవారుగా కూడా అన్నమయ్య చిత్రించాడు.

స్వామివారు కొలువుదీరి కూర్చున్నప్పుడు స్త్రీల చూపులు హారతుల వంటివని, స్వామి వారు కొంగు పట్టి కొసరి మాట్లాడేటప్పుడు వారి లేత నవ్వులు తలంబ్రాల వంటివని, సరసాలాడేటప్పుడు వారి పలుకులు కర్పూరాలవంటివని, ప్రేమతో కలసి వున్నప్పుడు వారి అధర చుంబనాలు పాలకూళ్ళ వంటివని, రతివేళలో వారి కౌగిళ్ళు దిండ్లవంటివని స్త్రీల విలాస చేష్టల్ని రమ్యంగా వర్ణించాడు

ఇవిగో మీ మహిమలు యేమని పొగడవచ్చు
జవళి నెంచి చూచితే సరిబేసివంటివవి అని చిత్రించాడు.||

అంగనల చూపులు ఆరతుల వంటివి
కుంగక నీవు కొలువై కూచున్నవేళ
చెంగటలేఁత నవ్వులు సేసపాలవంటివి
కొంగులు వట్టుచు నీవు కొసరేటివేళ||

కాంతల పలుకు లెల్లా కప్పురాల వంటివి
అంతలో నీవు సరసాలాడేటివేళ
బంతి మోపుల యీవులు పాలకూళ్ళవంటివి
మంతనాన నుండి నీవు మన్నించేవేళను||

వెలఁదుల కాఁగిళ్ళు విడిదిండ్ల వంటివి
చలముల నీరతులు సలిపేవేళ
యెలిమి శ్రీవేంకటేశ యిట్టెనన్నుఁగూడితివి
తలఁపుల వంటివి ఈ తమకపు వేళను|| (2-292)

**1.3.** అన్నమయ్య శృంగార సంకీర్తనల్లో స్త్రీ స్వభావచిత్రణ : అన్నమయ్య శృంగార సంకీర్తనల్లో నాయిక, సఖి, అత్తాకోడళ్ళు, గోపిక, మొదలైన స్త్రీమూర్తులు ముఖ్యంగా కనిపిస్తారు. అన్నమయ్య ఈ పాత్రల ద్వారా స్త్రీ స్వభావాన్ని రసవంతంగా, మనోహరంగా చిత్రించాడు. లోకంలో వ్యక్తమయ్యే స్త్రీ స్వభావాన్ని, స్త్రీకి వుండవలసిన స్వభావాన్ని ఈ దివ్యస్త్రీలకు ఆపాదించాడు వీరి స్వభావాన్నే తిరిగి లోకస్త్రీలకు ఆదర్శంగాను, స్ఫూర్తిగాను స్వీకరించవచ్చు. స్వభావానికి నిజభావం మృదువయింది కానీ పరిస్థితుల్ని బట్టి అనేక రకాల మార్పులకు లోనవుతూవుంటుంది అన్నమయ్య శృంగార సంకీర్తనల్లో స్త్రీపాత్రలకు అనురాగం, అభిమానం, అధిక్షేపం, అలుక, కరుణ, మాత్సర్యం, మమకారం,

వినయం, విశ్వాసం, వైరం, సహనం, సౌమ్యత్వం మొదలైన స్వభావాలు వ్యక్తమవుతుంటాయి. ఇవి ఆయా సన్నివేశాల్లో సమయానుకూలంగా ప్రదర్శితమవుతుంటాయి.

**1.3.1. అనురాగం :** అనురాగానికి అనురక్తి, ప్రేమ, కూర్మి మొదలైన అర్థాల్ని చెప్పుకోవచ్చు. అన్నమయ్య శృంగార సంకీర్తనల్లో కొన్నిచోట్ల అలమేల్మంగ, మరికొన్ని చోట్ల లక్ష్మీదేవి దివ్య నాయికలుగా కనిపిస్తారు. కొన్ని సంకీర్తనల్లో అన్నమయ్యే దివ్యనాయికగా మారి పరమ పురుషుడైన శ్రీవేంకటేశ్వరుని ప్రగాఢమైన ప్రేమతో ఆరాధించడం కనిపిస్తుంది.

అనురాగవతి అయిన నాయిక తన నాయకుని కలయిక కోసం ఎన్నివిధాలుగా పరితపించి ఎదురు చూసిందో ఆప్రేమ భావాలన్నింటిని నాయకుడు రాగానే అతనికి వ్యక్తం చేస్తుంది. 'నిన్ను కలుసుకోవాలనే ఆశతో మేడపైకెక్కి నీ కోసం చూశాను నీవు లేకపోయేసరికి విచారంతో నిట్టూర్పు విడిచాను వెంకటేశా! ఇంతవరకు ఎక్కడున్నావు? నీవు దప్పికతో ఉన్నావని నీకు కర్పూరం ఇచ్చాను నీపై అతిశయించిన విరహంతోదాన్ని నిప్పు అనుకొని భ్రమపడ్డాను నిండుగా పుష్పించిన చెట్టుపై గండుకోయిల కూస్తే అది నిండైన నీ స్వరం అనుకొని దగ్గరకు రమ్మని పిలిచాను పట్టుచీర కొంగు జారి గుట్టుగా నేనుంటే ఊరకే ఎందుకు నవ్వుతావు? నీవు సమర్థుడవు, మేము నీ అంతవారం కాము, అని అతని సరసాన్ని గొప్పతనాన్ని కీర్తిస్తుంది అతనిపై వున్న ప్రగాఢప్రేమను గూర్చి తెలియజేస్తూ, నీకోసం వలచిన వలపులు నా మనస్సులో పులకలు రేపాయి దీన్ని మాటల్లో చెప్పలేను. ఇది లోకానికంతా తెలిసిందే. నా యౌవనాన్నంతా నీకే అర్పించాను. నీవు నన్ను వదలకుండా మా ఇంట్లోనే వుండు. ప్రతిసారి నీవు చేసిన ప్రమాణ వాక్కులనే నమ్మివున్నాను. అలముకున్న చీకట్లు మాయమయ్యేలా నాపై కరుణ కురిపించరా' అంటూ తన అవ్యాజానురక్తిని, అపూర్వప్రేమను తెలియజేస్తుంది. ఇందులో నాయికకు అనురాగ పూరితమైన స్వభావం చిత్రించబడింది.

రాగం - దేసాళం

**మేడ లెక్కి నిన్ను జూచి - కూడేననె యాసతోడ**
**వాడు దేరి వుస్సురందురా-వెంకటేశ**
**యాడనుంటివిందాఁకానురా||**

దప్పిగొంటివని నీకుఁ గప్పుర ముపారమిచ్చి
ముప్పిరినీ విరహానను వెంకటేశ
నిప్పనుచు భ్రమసితిరా ॥

నిండఁబూచిన మానిపై గండుకోవిల కూయఁగా
నిండిన నీయెలుగంటాను వెంకటేశ
అండకు నిన్ను రమ్మంటిరా ॥

పట్టుచీర కొంగు జారి గుట్టుతోనే నుండఁగా
వట్టినవ్వులేల నవ్వేవు వెంకటేశ
దిట్టవునీ యంత వారమా ॥

నీకు వలచిన వలపులు పులకలొత్తె నామదిని
వాకుననే చెప్ప జాలరా వెంకటేశ
లోకమెల్లా నెరిఁగినదె ॥

పాయము నీ కొక్కనికే చాయగామీఁదెత్తితిని
యీ యెడ కైవాలకుండను వెంకటేశ
మాయింటనె పాయకుండరా ॥

ముమ్మాటికి నీబాసలే నమ్మివున్న దాననేను
కుమ్మరించరా నీకరుణ వెంకటేశ
చిమ్ముఁ జీకటెల్లపాయను ॥ (13-223)

**1.3.2. విశ్వాసం :** స్త్రీకి తనమీద, తనవాళ్ళమీద వుండేనమ్మకమే విశ్వాసం. పురుషుడు తన పట్ల సమంజసంగా, నిజాయితీగా ప్రవర్తించినప్పుడు స్త్రీ అతన్ని ప్రగాఢంగా విశ్వసిస్తుంది. అన్నమయ్య శృంగార సంకీర్తనలలో నాయకునిపై విశ్వాసం వున్న నాయిక చాలా చోట్ల కనిపిస్తుంది చెలికత్తెలు తమ నాయిక మేలుకోరి తాము కనుగొన్న రహస్యాలను చెబుతుంటారు ఒక్కోసారి పైకి తప్పులుగా కనిపించినా వాస్తవాన్ని పరిశీలిస్తే దోషాలు లేకపోవచ్చు చెలికత్తెలు పరస్త్రీల విషయం తన భర్తను దూషిస్తూ ఏవో నిందారోపణలు చేస్తున్నప్పుడు నాయిక వారిని నిరసిస్తూ - 'అతను నాకు ఉన్నాడనేదేచాలు ధీమంతుడైన అతన్ని మాటిమాటికీ నిందించకండి. అతను

పరస్త్రీతో మాట్లాడితే మాట్లాడుతాడేమో కానీ మనసిస్తాడా? అతని శరీరం ఎక్కడున్నా మనసు నామీదే వుంటుంది అతను రావాలనుకున్నప్పుడు నా దగ్గరకువస్తాడు. పరస్త్రీలతో పైకి నవ్వితే నవ్వుతాడేమో కానీ పరస్త్రీలను కోరుకుంటాడా? ఏమైనాగానీ, ఎవ్వరేమి చెప్పినా కానీ నేనే అతని దానను అతను ఆడిన మాటతప్పనివాడు. అతను ఎవ్వరినైనా చూస్తే చూస్తాడేమోకాని ఎవ్వరికైనా భ్రమింపజేస్తాడా? అతను నామమతితార్కాణం (నిదర్శనం)' అని తగిన విధంగా ప్రశ్న పూర్వకంగానే సమాధానమిస్తూ గుణవంతుడైన తనభర్తపై తనకున్న అపారమైన విశ్వాసాన్ని వ్యక్తం చేస్తోంది.

అతఁడు నాకుఁగలఁడనేదే చాలు
చతురుని దూరకురే సారె సారెనిఁకను ||

మలసి వేరొకతెకు మనసిచ్చునా అతఁడు
అలరి మాటలాడితే నాడుఁగాక
తలఁపు నామీఁద నుండు తను వెక్కడనుండినా
వలసినప్పుడు తానే వచ్చీనా కడకు ||

అటువలెఁ బరసతి కాసపడునా అతఁడు
నటనల నవ్వితేను నవ్వీఁగాక
యెట్టైనా నేనే యతఁడు యెవ్వరేమి చెప్పినాను
తటుకునఁ దనమాట తప్పని వాఁడతఁడు ||

పక్కన నెవ్వరికైనా భ్రమసునానేఁడతఁడు
చొక్కుఁగన్నులఁ జూచితేఁ జూచుఁగాక
యిక్కడ శ్రీవేంకటేశుఁ డింతలోనెనన్నుఁగూడె
దక్కె నామతి కేమతి తారుకాణ అతఁడు || (25-353)

అధిక్షేపం : నమ్మిన వ్యక్తులు తనను మోసం చేసినప్పుడు, హాని చేసినప్పుడు, చెడుగా ప్రవర్తించినప్పుడు స్త్రీ సహించదు. వారిని నిలదీసి ప్రశ్నించి అధిక్షేపిస్తుంది. అన్నమయ్య శృంగార సంకీర్తనల్లో చాలాచోట్ల నాయికకు అధిక్షేప స్వభావాన్ని ఆరోపించి చిత్రించాడు. నాయకుని అనౌచిత్యపుమాటలు, చేష్టలు నాయికలో సహనాన్ని పోగొట్టాయి. నాయకుడు తనకు అపకారం చేసి కూడా తనతో నవ్వడం, అబద్ధాలు చెబుతూ తాకడానికి

రావడం ఆమె భరించలేక పోయింది. 'నాతో నీవు నవ్వద్దు నవ్వు మాను' అందరూ వినేటట్లు నిన్ను మాటలతో తిట్టకుండా మాననురా! పోట్లాడి పోట్లాడి నీవు నిజాయితీ పరుడవంటూ అబద్ధాలాడుతూ నన్నెందుకు తాకుతావురా! నీవు చేసేరోత చేష్టలకు ముందే నాకు సిగ్గుగా వుందిరా! నీవు నీరు వంక తుంగలాంటి వాడవు (సమయాను కూలంగా ప్రవర్తించే వాడని లేదా బాగా బలిసిన వాడని అర్థం కావచ్చు.) నీతో సంబంధం చేయడానికి నేను సహించలేను, అంటున్న నాయికలో అధిక్షేపం, అసహన స్వభావ చిత్రణ వ్యక్తమవుతుంది.

మానవా నవ్వుమానరా వద్దు మానరా
మాతో మానరా యేల మానరా| నీవు
మానకుంటే నిన్ను నిందరు వినఁగా

మాటలఁ దిట్టక మానరా ||
పోరి పోరి నీవే నిజమరినంటా
బొంకుచు నన్నేల ముట్టేవురా ||

మొక్కలాన నీవు సేసేరోఁతలకు
మొదలనే నాకు సిగ్గవురా ||

నీరు వంకతుంగవంటివాఁడ వింతే
నీ తోడి పొందుకు నేనోపరా || (25-403)

**1.3.4. మాత్సర్యం :** తన భర్తకు పరస్త్రీలతో సంబంధం వుందని తెలిస్తే అభిమాన వతి అయిన ఇల్లాలికి మాత్సర్యం పెల్లుబుకుతుంది. ఇక అతని శరీరంపై పరస్త్రీ సంబంధమైన గుర్తులు వుంటే ఆమె కోపానికి హద్దులుండవు. ఇలాంటి మాత్సర్యం, కోపం వ్యక్తం చేసే నాయిక అన్నమయ్య శృంగార సంకీర్తనల్లో చాలా చోట్ల కనిపిస్తుంది. పరస్త్రీతో సంబంధంచేసి వచ్చిన నాయకుని నాయిక 'నీ శరీరంపై కుటిలపు పులకలు కుప్పలుగా రేగాయి నీ చిగురుటాకు వంటి పెదవిపై గాయం చేసింది ఎవ్వతెరా? నీ శరీరంపై చెమటలు పుట్టించింది ఎవ్వతెరా? నీలో అంత వేగంగా నిట్టూర్పులు రేపింది ఎవ్వతెరా?' అని నిలదీసి ప్రశ్నిస్తున్న నాయికలో మాత్సర్య స్వభావం వ్యక్తమవుతుంది.

కటకటామీఁదవెత్తు కానదాయ నెవ్వతెరా
కుటిలపుఁబులకలు కుప్పవడీ మేనను ||

కడునీ మోవిచిగురు గంటిసేసె నెవ్వతారా
వడసీఁ దీనెలు అందువంక నింతాను
పొడమించె చెమటలు పొలఁతి యెవ్వతెరా
కడలేని నీమనసు కరఁగునందునను ||

రేసుల నిట్టూరుపులు రేఁచిన దెవ్వతెరా
గాసిగా నీవలపులు గాలిఁబోయీని || (25-476)

అలాగే మరో సంకీర్తనలో 'పరస్త్రీ నీకు సంబంధించింది కానీ నాకెందుకురా! ఆమె గుణాల్ని నాముందు మాటిమాటికి చెప్పకురా! నాముందు ఆమెతో సంబంధం గొప్పదిగా భావించకురా' అంటూ పరస్త్రీసంబంధాన్ని వినడానికి కూడా ఇష్టపడని, సహించని విధంగా నాయిక మాత్సర్య స్వభావాన్ని చిత్రించాడు

మరిగిన నీకే కాక మాకేలరా
ఆడకురా నాముందర ఆకె గుణములు సారె
గోడ గడుగ నసలే కుప్పవడీని
యెంచెకురా ఆకె పొందు యెక్కుడుగా నాయెదుట (25-)

**1.3.5. వినయం :** స్త్రీకి సహజాభరణం వినయం. తన భర్తలో సద్గుణాలు కనిపించినప్పుడు, మనసు, మాట, చేష్ట ఒక్క తీరుగా వున్నప్పుడు స్త్రీలు ఎంతో వినయంగా ప్రవర్తిస్తూ అతని ఔదార్యాన్ని ప్రశంసిస్తుంది. నాయిక బుద్ధిమంతుడైన తన నాయకునితో - 'నీవు తెలివిగా ప్రవర్తిస్తావు. చల్లగా బ్రతకవయ్యా నీలో ఇంక తప్పులెంచ గలమా? నేను విన్న దానికి నీవుండే తీరుకు నిరూపణ సరిపోయింది. ఇంక నీవు ఒట్టు పెట్టనవసరం లేదు. నిన్ను ఇంక ఎవ్వరూ కదిలించలరు. నేను వూహించుకున్న దానికి, నీచేష్టలకు సరిపోయింది. ఈ విధంగా నీవు ఎందుకు కిందపడతావు? ప్రియ వాక్కులతో నన్ను మచ్చిక చేసుకోవలసిన పనిలేదు, అంటూ తన వినయాన్ని వ్యక్తంచేస్తూ అతని ఔన్నత్యాన్ని కీర్తిస్తుంది.

చల్లఁగా బతుకవయ్య జాణ తనాలు నేర్తువు
యెల్లచోటనిఁకఁదప్పులెంచేమా నిన్నును ॥

నేను విన్న వినికికి నీవుండే వునికికి
కానీ తీరా అన్నీఁదారుకాణ వచ్చెను
ఆనలేల పెట్టేవు అమరనేల చెప్పేవు
దానికేమి యెవ్వరైనాఁదడవేరా నిన్నును ॥

చేరి నా వూహలకు చేసేటినీ చేఁతలకు
సారెకునౌరా నేఁడు సరివచ్చెను
యీ రీతేల కిందుపడేవిచ్చ కాలేలసేసేవు
నీరసమైతే నౌఁగాక నిలిపేరా నిన్నును ॥ (32-251)

**1.3.6 సహనం :** కొంతమంది స్త్రీలు తమ భర్తలు పరస్త్రీలతో సంబంధం చేస్తున్నా సహించడమేకాక ఆ సంబంధాన్ని ప్రోత్సహిస్తారు కూడా ఇలాంటి అత్యంత సహన స్వభావం కల్గిన నాయిక కూడా అన్నమయ్య శృంగార సంకీర్తనల్లో కనిపిస్తుంది

'నీకు ఆమెవల్ల మేలు కల్గితే మానవచ్చా!' ఆమెను స్వీకరించు నేను ఇంటిదానను ఆమె అన్నీ నేర్చింది ఆమెను ఇంకా ఇష్టపడు నేను అభిమానవతిని. నీకు స్థిరమైనదాన్ని. ఆమె ఏమైనా చెయ్యగలదు ఆమెను ప్రేమతో ఇంటికి పిలవవయ్యా నీమాట ప్రకారం నడచుకొనేదాన్ని, గర్వంలేని దాన్ని ఆమె పంతంలేనిది. మచ్చికతో ప్రమాణం చేసి ఆమెను నమ్మించవయ్యా!' అంటూ ఇల్లాలు సహనంతో తన భర్తను ప్రియురాలు మీదికి ప్రోత్సహించడంలో ఆమె సహన స్వభావం వ్యక్తమవుతుంది

మంచిమేలు గలిగితే మానవచ్చునా
యెంచక చేకొనవయ్య ఇంటిదాననేను ॥

ఇన్నియు నేరుచు నాపె యెగ్గు సిగ్గు లేని దాపె
వన్నెల నింకా నాపెకు వలవవయ్యా
మన్ననతోదాన నేను మానాపతిని నేను
వున్నతిఁదొల్లే సతమై వున్న దాననేను ॥

యేమైనాఁజేసునాపె యెమ్మె లెరగనిదాపె
ప్రేమతో నాపెనింటికిఁ బిలువవయ్యా
నీమాటలో దాననేను నిగర్వపు దాననేను
కామించి నీకెప్పుడునుఁగల దాననేను ||

పనిలేని పని దాపె పంతము లొల్లని దాపె
ననుపున బాసలిచ్చి నమ్మించవయ్యా
చినవరి దాననేను జట్టి గొన్న దాననేను
యెనసితిని శ్రీ వేంకటేశయిటె నేను || (29-253)

**1.4.** చెలికత్తె హిత స్వభావం : అన్నమయ్య శృంగార సంకీర్తనల్లో చెలికత్తె పాత్రకు సముచిత ప్రాధాన్యం వుంది. నాయికా నాయకుల మధ్య స్పర్థలు, అభిప్రాయ భేదాలు, అలుకలు వచ్చినప్పుడు చెలికత్తె వారిద్దరి మేలుకోరి చొరవ చేసుకొని ఎవరిలో దోషం వుంటే వారిని తగిన విధంగా దండిస్తుంది. హితబోధలు చేసి వారిని సమైక్యపరుస్తుంది. ఇలాంటి హిత స్వభావం కలిగిన చెలికత్తె చాలా సంకీర్తనల్లో కనిపిస్తుంది.

నాయిక ఒక్కోసారి నాయకుని లోని చిన్నచిన్న పొరపాట్లకే పెద్దగా అలుగుతుంటుంది. అలా కోపగించుకొని నాయకుని దూషించవలసిన పనిలేదని, అతనికి చేరువగా రమ్మని హితబోధ చేస్తుంది. చెలికత్తె నాయికతో - 'నీవు ఎంత చెప్పినా మానడం లేదు. ఎందుకే? నాయకుని ఇన్నేసి మాటలతో వ్యంగ్యాలాడటం ఎందుకు? ముందే అతని చెక్కిలి నొక్కి బుద్ధి చెప్పవచ్చు కదా. ఇక్కడ అతని తప్పుల్ని లెక్కించడం ఎందుకు? మంచి భర్తను నీవు జంట వదలక వుండవచ్చు కదా. అతన్ని నిక్కి చూస్తూ నిందలాడటం ఎందుకు? ముందే అతని అవయవాల్ని తాకి ఒట్టు పెట్టించు కోవచ్చుకదా ఇప్పుడింక వివాదాలాడటం ఎందుకు? అతన్ని నీచేతులతో కౌగిలించుకోవచ్చు కదా. ఇప్పుడు అతనిపై పగ చాటడం ఎందుకు? ఎదురుగావున్న శ్రీ వేంకటేశ్వరుని అన్నీ అడుగవచ్చుకదా. అతడు విసుగు చెందడం ఎందుకు? అతనితో కలసి ఒకే బుద్ధితో వుండదుకదా. అతని వక్షస్థలం ఎక్కికూడా అనుమానం ఎందుకు? అంటూ అనునయంతో హితబోధ చేయడంలో చెలికత్తెలో మేలుకోరే సౌమ్యస్వభావ చిత్రణ కనిపిస్తుంది.

ఎంతచెప్పినా మానవు ఇది యేఁటికే
వింతసేసి రమణుని వెంగె మాడనే నేఁటికే ||

చెక్కునొక్కి నీవు బుద్ధి చెప్పరాదా తొలుతనె
ఇక్కడ నాతని తప్పులెంచనేఁటికీ
చక్కని పతిని నీవు జంటవాయకుండరాదా
నిక్కి చూచి నేఁడతని నిందలాడ నేఁటికే ||

ఆయమంటి మొదలనే ఆస వెట్టించు కోరాదా
వాయి తప్పి యిప్పుడిఁక వాదులేఁటికే
చేయివేసి కాఁగిటనే చిక్కించు కొనరాదా
బాయిటికిఁదీసి వేరే పగ చాటనేఁటికీ ||

యెదుట శ్రీ వేంకటేశు నిన్నియు నడుగరాదా
అదన నాతనిపై వేగింపనేఁటికే
వుదుటు రతులఁగూడి వొక్కబుద్ధినుండరాదా
అదివో వురమెక్కియు ననుమేఁటికె || (32-129)

**1.5. అత్తాకోడళ్ళ వైర స్వభావం :** సృష్టిలో కొన్ని క్రిమికీటకాదులకు, కొంతమంది మనుషుల మధ్య సహజవైరం ప్రవర్తిల్లుతుంది. అలాంటి సహజవైరం ప్రవర్తిల్లే వారిలో అత్తాకోడళ్ళు ఒకరు. ప్రతి అత్తా ఒకప్పుడు కోడలే అయినా అత్త స్థానం రాగానే గతంలో తాను అనుభవించిన వేధింపులను మరచిపోయి, కోడలు రాగానే ఆమెను వేధించడం మొదలు పెడుతుంది అందుకే 'అత్తలేని కోడలుత్తమురాలు, కోడల్లేని అత్త గుణవంతురాలు' అనేపాట పుట్టి జనంలో బాగా వ్యాప్తి అయింది ఇలాంటి పాట ధోరణిలో అన్నమయ్య దేవతామూర్తుల్లో అత్తాకోడళ్ళయిన లక్ష్మి సరస్వతుల మధ్య ఒక సంవాదగేయాన్ని రచించాడు. లోకవ్యవహారంలో అత్త ఏ కారణం లేక పోయినా వైరస్వభావంతో కోడల్ని అనుచితంగా

'కోడల కోడల కొడుకు పెండ్లామా ఓలెమ్మా
పచ్చిపాల మీద మీగడేదమ్మా
ఆవేడిపాలలోన వెన్న ఏదమ్మా'

అంటూ ప్రశ్నించడం, కోడలు వినయవిధేయతలతో -

'అత్తమ్మ నీ చేతి ఆరెళ్ళకానీ ఓలెమ్మా
పచ్చిపాలమీద మీగడుంటుందా

వేడిపాలలోన వెన్నవుంటుందా? అని నిజాన్ని వివరిస్తూ కనువిప్పుగా సమాధానం చెప్పడం కనిపిస్తుంది. అయితే అన్నమయ్య అత్త అయిన లక్ష్మీదేవి వాదానికి ఏమాత్రం తీసిపోకుండా కోడలైన సరస్వతి చేత ప్రతి వాదాలాడిస్తాడు 'రావే కోడల రట్టడి కోడల' అని లక్ష్మీదేవి సరస్వతిని రట్టడి కోడల అని దూషిస్తే, 'పోవే పోవే అత్తయ్యా పొందులు నీతోఁ జాలును' అని సరస్వతి అత్త పిలుపును, ఆమెతో సంబంధాన్ని తిరస్కరిస్తుంది

'రాజులెదుట నీవు రంకెలు వేసే జంకు కొంకు లేనికోడల' అని (సరస్వతి అంటే వాక్కు. రాజుల సమక్షంలో కవులు, పండితులు తమ తమ వాక్చమత్కారం చూపిస్తుంటారు. సరస్వతి పదిమంది వాక్ రూపంలో బహిర్గతం అవుతుందని అర్థం) లక్ష్మీదేవి సరస్వతిని కించపరచి మాట్లాడితే, సరస్వతి ఏమాత్రం తగ్గకుండా నీవు గొప్పవారిండ్లకు లెక్కపెట్టుకొని వరుసగా తిరుగుతుంటావు కదా అత్తయ్యా (లక్ష్మీదేవి ఎవరిండ్లకు వెళ్ళితే వాళ్ళు ఐశ్వర్యవంతులుగా జీవిస్తారు. ఇలా వరసబెట్టి ఇంటింటికి తిరుగుతుంటుందని అర్థం) అని తత్త్వాన్ని ఎత్తిచూపుతుంది.

'ఇక్కడ అక్కడ నలుగురు, ఐదుగురు మగవాళ్ళతో కలిసే సిగ్గులేని కోడల' అని లక్ష్మీదేవి అంటే 'ఒక్కొక్కవూర్లో పదేసి మందిని వశంచేసుకొని అక్కడక్కడ తిరుగుతుంటాం' కదా అత్తయ్యా అని సరస్వతి లక్ష్మీదేవిని తిరిగి అంటుంది.

'బొడ్డులో పుట్టిన (శ్రీహరి నాభికమలం నుంచి పుట్టినవాడు, బ్రహ్మ) వానికి నిన్ను అపురూపంగా వెతికి తెచ్చానే కోడల' అని లక్ష్మీదేవిఅంటే, కొండపైవున్న కోనేటి రాయడైన శ్రీ వేంకటేశ్వరువశం చేసుకున్నావుకద అత్తయ్యా, అని సరస్వతి తిరిగి అంటుంది. ఈ విధంగా అత్తా కోడళ్ళయిన లక్ష్మీ సరస్వతులు ఒకరి తత్త్వాల్ని ఒకరు దోషాలుగా చిత్రించి ఎత్తిచూపుతూ వాద ప్రతివాదాలు చేయడంలో వారి సహజవైర స్వభావం వ్యక్తమవుతోంది

**1.6 గోపికా మాతృస్వభావం :** అన్నమయ్య శృంగార సంకీర్తనల్లో స్త్రీ పాత్రల్లో గోపికలు కూడా కనిపిస్తారు. చిన్నికృష్ణుడు రేపల్లెలో యశోదానందుల ఇంట పెరుగుతున్నప్పుడు గోపికలు కూడా మాతృమూర్తులై చిన్ని కృష్ణుని వాత్సల్యభావంతో లాలించిసేవించారు. ఒకగోపిక చిన్ని కృష్ణుని బాల్యచేష్టల విషయంలో ఎంతో ఉత్కంఠతచెంది సాటి గోపికలతో 'ఇంతటి ముద్దుల పట్టి అయిన బాలుడెక్కడవాణ్ణి పట్టుకొనివచ్చి పొట్టనిండా పాలు పొయ్యండి ఈ బాలుడు వేగ పరుగెత్తుకుంటూ వచ్చి కాగుతున్న వెన్నలో చేమపువ్వు కడియాలు వేసుకున్న చెయ్యిపెట్టి చీమ కుట్టిందని చెక్కిళ్ళపై కన్నీరు కారే విధంగా పలుమార్లు ఏడుస్తున్నాడు. వాడికి ఉగ్గు తినిపించండి. దొంగ లాగా వచ్చి చిలుకుతున్న పెరుగులో తన అందమైన చెయ్యిపై నొప్పిగా వుందని చెయ్యితీసుకొని నోటిలో జొల్లుకారే విధంగా ఏడుస్తున్నాడు. వాణ్ణి ఓదార్చండి. మా ఇంట్లోకి ఎప్పుడు వచ్చాడోకానీ పెట్టెలో చెప్పనలవి కాని వుంగరాలు తీసుకున్న చెయ్యిపెట్టాడు దాన్ని తప్పకుండా వాడి తలమీదికి ఎత్తండి, అని ప్రేమగా ఆదేశించడంలో పరమాత్ముడైన చిన్ని కృష్ణునిపై వున్న మమకారం, మాతృ స్వభావం వ్యక్తమవుతుంది. అన్నమయ్య ఆనాటి చిన్ని కృష్ణుడే ఈనాడు ఆపదలు తీర్చి కానుకలు స్వీకరించండి ఆసపాలకుడని పేర్కొన్నాడు. ఇందులో, గోపిక పాత్రలో భగవంతుడైన శ్రీ కృష్ణపరమాత్మపై వాత్సల్యభక్తి ప్రదర్శించడం గోచరిస్తుంది.

దేవగాంధారి

ఇట్టి ముద్దులాఁడి బాలుఁడేడవాఁడు వానిఁ
బట్టి తెచ్చి పొట్ట నిండఁ బాలు పోయరే ||

గామిడై పారితెంచి కాఁగేటి వెన్నలలోన
చేమపూవు కడియాల చేయివెట్టి
చీమ గుట్టెనని తన చెక్కిటఁగన్నీరు జార
వేమరు వాపోయెవాని వెడ్డు వెట్టరే ||

ముచ్చువలె వచ్చి తన ముంగై మురువుల చేయి
తచ్చేటి పెరుగులోనఁదగఁబెట్టి
నొచ్చెనని చేయిదీసి నోరనెల్లఁజొల్లుగార
వొచ్చెలి వాపోయె వాని నూరడించరే ||

యెప్పుడు వచ్చె నోమాయిల్లు చొచ్చి పెట్టెలోన
చెప్పరాని వుంగరాల చేయి వెట్టీ
అప్పుడైన శ్రీ వేంకటేశుఁడా సపాలకుఁడుగాన
తప్పకుండ పెట్టెవాని తలకెత్తరే‖ (12-148)

ముగింపు : అన్నమయ్య ఆనాడే స్త్రీని పురుషునితోపాటు సమానంగా మహోన్నతస్థాయికి చేర్చడం కోసం శృంగార సంకీర్తనల్లో స్త్రీపాత్ర ద్వారా ఎన్నో రకాలుగా హితబోధలు చేశాడు. లోకంలో నవవధూవరులను సీతారాములుగా భావించి పాటలు పాడటం పూర్వం నుంచీ వస్తోంది. సహజంగా కొత్త పెండ్లి కూతురు పీటపై సిగ్గుతో తలవంచుకొని కూర్చోవడం ఆనవాయితీ. కానీ అన్నమయ్య

'సిగ్గరి పెండ్లి కూఁతుర సీతమ్మ
దగ్గరి సింగార బొమ్మ తలవంచకమ్మా'

అంటూ పెండ్లి కూతుర్ని కూడా తలవంచవద్దని చెలికత్తె పాత్ర ద్వారా అన్నమయ్య సూచించాడు. అలాగే మరో చోట -

'తలవంచ నేమిటికే తరుణి నీ నాయకుడు
పిలిచినీ చెయిపట్టి పెనఁగ గాను' (31-298)

అంటూ నీ నాయకుడు నిన్ను పిలిచి చెయ్యిపట్టి లాగుతుంటే నీవు సిగ్గుతో తలవంచు కోనక్కరలేదంటాడు అన్నమయ్య.

పూర్వకాలంలో భార్య భర్తకు అన్ని విధాలా సేవలు చేయాలని, స్త్రీ చదువుకోనక్కర లేదని, చదువుకొని వూళ్ళేలనక్కర లేదని మన పెద్దలనేవారు. కానీ అన్నమయ్య పదిహేనవ శతాబ్దంలోనే స్త్రీరాజ్యమేలితే మంచిదేనని, ఆమె పీటపై కూర్చొనివుంటే అతను నిలబడుకొని మాట్లాడటం మంచిదేనని ఆమె ఏదైనా పొరపాటుగా ప్రవర్తించినా అతను గుట్టుగా ఒదిగివుండడం మంచిదేనని, భార్యపడుకొని వుంటే భర్తపాదాల దగ్గరకూర్చొని ఆమెకు ఆకుమడుపులందిస్తే మంచిదేనని, విసుక్కోకుండా ఆమెకు సపర్యలు చేస్తే అది భర్తకే మంచిదంటూ దివ్య నాయకుడైన శ్రీవేంకటేశ్వరుని చేత పద్మావతికి సపర్యలు చేయించడంలో అన్నమయ్య స్త్రీమూర్తికిచ్చిన విశిష్టస్థానం, సమానత్వం మనం గుర్తించవచ్చు.

ఆఁటది రాజ్యమేలితే అది మంచిదే కాదా
మాటలాడే వాపెతోను మంచిదేకాదా
గాటముగా వంచనెంత గలిగి మెలగినాను
మాటున నీవే ఒదిగేవేమి నను నేటికీ ||

పడతి పవ్వళించగా పాదాల కాడనుండి
మడచిచ్చే వాకు నీవు మంచి దేకాదా
వుడుగక నీవెంత వూడిగాలు నేర్చినాను
కడునీకు లాభమయ్యీ కాదనఁగనేటికి || (29-364)

పురుషునితో సమానంగా అన్నిరంగాల్లో స్వేచ్ఛాసమానత్వాల్ని కోరడం, తమకు జరిగిన అన్యాయాల్ని ధైర్యంగా నిలదీసి ప్రశ్నించడం, తమ ప్రత్యేక వ్యక్తిత్వంకోసం, గుర్తింపుకోసం పోరాటం సాగించడం, పురుషాధిక్యతను ఖండించడం మొదలైనవి నేటి ఆధునిక స్త్రీవాద సిద్ధాంతాల్లో ముఖ్యాంశాలు ప్రాచీన స్త్రీ ధర్మాలతో పాటు ప్రగతి శీల స్త్రీవాదులు కూడా అభినందించగలి స్త్రీ చైతన్యాన్ని, స్త్రీ స్వభావాన్ని సముచిత రీతిలో సమున్నత స్థాయిలో అన్నమయ్య తన శృంగార సంకీర్తనల్లో చిత్రించాడు

## ఉపయుక్త గ్రంథాలు :

1. అన్నమాచార్య అధ్యాత్మ సంకీర్తనలు - తి తి.దే. ప్రచురణలు 1,2,3 సంపుటాల్లు
2 అన్నమాచార్య శృంగార సంకీర్తనలు, 25, 29, 31, 32 సంపుటాలు -
3. అన్నమయ్య శృంగార సంకీర్తనల్లో స్త్రీ ధర్మాలు
4. అన్నమయ్య సంకీర్తనల్లో జానపదగేయ ఫణితులు



# అన్నమయ్య సంకీర్తనలలో ఉపమాన ప్రయోగ వైశిష్ట్యం

డా॥ జి. ఉమాదేవి

15వ శతాబ్దికి చెందిన తాళ్ళపాక అన్నమయ్య 32వేల సంకీర్తనలు రచించి సంకీర్తనా చార్యుడుగా కీర్తి కెక్కిన మహనీయుడు కళ్లు తెరిచినా కళ్లు మూసినా అన్నమయ్య కళ్లకు ప్రత్యక్ష దైవం శ్రీవేంకటేశుడే. ఆ తిరుమలేశునికి చెందిన అలంకార, కైంకర్య, ఉత్సవ, యజ్ఞ యాగాదులు, వస్తుసంపద సమస్తం అన్నమయ్యకుపమాన ద్రవ్యాలే.

నాయిక నవ్వులే పూలు. కుచాలే పూగుత్తులు. వళులే దొంతరపూలు పాదాలు, చేతులు, కరములు, కుచాలు, కళ్ళు, చూపులు, ముఖాలే తామరలు. గోళ్ళు, కళ్ళు, చూపులు ముఖాలే కలువలు ముక్కు, ఊర్పులే సంపెంగలు. పులకలు, నవ్వులే జాజులు చూపులే మొల్లలు. చెమటలే మల్లెలు. పెదాలే మంకెనలు. గోళ్లు (పురుష శరీరాలే) గేదగులుగా స్వామికి పూలంగి సేవ చేశాడు నవ్వులు, చూపులు, వలపులను పాలుగా; సిగ్గు, నవ్వులను పాల పొంగలిగా; పెదాలు, సిగ్గులను మీగడగా; శరీరాన్ని చెక్కెర బొమ్మగా; మనసును వెన్నగా; మాటలను బెల్లంగా; పెదాలు, మాటలు, సిగ్గు, చూపులను తేనెగా; చెమటలను నెయ్యిగా, పులకలను బియ్యంగా; మాటలను మిరియాలుగా, వలపులను ఉప్పుగా; జవ్వనాన్ని కూరలుగా ఉల్లేఖించి భగవంతునికి నైవేద్యమిడిన భక్తుడు అన్నమయ్య.

ఇలా ఊహ గల వారికి ఉపమలు తోచు నన్నట్లుగా వేలాది ఉపమాన సంపదను పండించిన క్షేత్రజ్ఞుడు అన్నమయ్య. ఏ అంశాన్నైనా అటు ఆధ్యాత్మిక పరంగాను ఇటు శృంగార పరంగాను దర్శించ గలిగినవాడు. ఆధ్యాత్మికతలో శృంగారాన్ని శృంగారంలో ఆధ్యాత్మికతను దర్శించగల యోగభోగాద్వైతి అన్నమయ్య. ఆయన ఉపమాన ప్రయోగాలలోని కొన్ని విశిష్ట అంశాలను చూడండి.

ఘనయోగి హృదయ కమలాలు వికసించె
నొనర విజ్ఞాన సూర్యోదయ మాయ
మును జీవాత్మ పరమాత్మముల జక్కవలు గూడె
వనజాక్ష మేలుకొని వాకిలి దెరవవే. 11-1-170

సూర్యోదయంతో - కమలాలు వికసించడం; రాత్రంతా ఎడబాటు ననుభవించిన చక్రవాక పక్షులు జతగూడడం కవిసమయం. అయితే ఇక్కడ సూర్యోదయం - విజ్ఞాన సూర్యోదయం. వికసించిన కమలాలు - ఘనయోగి హృదయ కమలాలు. జత గూడిన చక్రవాకాలు - జీవాత్మ, పరమాత్మలనే చక్రవాకాలు. జీవాత్మ పరమాత్మల ఐక్యానుసంధానం అయ్యింది కాబట్టి ఓవనజాక్షా! మేలుకొని మోక్ష ద్వారాలు తెరవవయ్యా అనే మేలు కొలుపులో అన్నమయ్య ఆర్తి, ఆధ్యాత్మిక భావనలు ఇమిడి ఉన్నాయి.

**పొంచి తామర పువ్వుల బోలిన పాదాలాతడు**
**వంచి తుమ్మెదల కొప్పు వడిసోక మొక్కవే** 24-251

ఇక్కడ భగవంతుని పాదాలు తామరలు. నాయిక కొప్పు తుమ్మెదలు తామరకు తుమ్మెదలకు ప్రేయసీ ప్రియాను బంధం వర్ణించడం కవిలోక నైజం. ఈ అను బంధాన్ని నాయికా నాయకాను బంధంగానే కాక భగవంతునికి భక్తునికి గల అనుబంధంగా వర్ణించడం ఇక్కడి విశేషం. ఇక్కడ తుమ్మెద అంటే షట్పది - ఆరుపాదాలు గలది. పంచేంద్రియాలు + మనసు అనే ఆరు ఇంద్రియాలతో నడిచే జీవుడు భగవంతుని పాదపద్మాలను ఆశ్రయించి శాశ్వతానంద మకరందాన్ని గ్రోలమని జీవునికి హెచ్చరిక.

ఈ పరంధాముని పాదాలనే శృంగార సందర్భంలో కుపిత అయిన నాయిక 'సంతముద్రకోల' గా అభివర్ణిస్తుంది.

**ఇందరు సతులలో నాయెచ్చుకుందులు చూడవు**
**సందడిఁ గౌలు దొక్కేవు సారె సారెకును**
**చందమైన నీ పాదము సంతముద్ర కోలాయ**
**యిందుకు నేనూ లోనై యిరవు కోవలెనా.** 13-185

దక్షిణ నాయకుడు నాయిక పాదాలతో పాటు ఇతర కాంతల పాదాలను త్రొక్కడం వర్ణితం. ఈ చేష్టను పూర్వకాలం సంతలలో అమ్మబోయే సరుకు నాణ్యతను తెలిపే ముద్ర (ISIమార్కు)ను వేసినట్లుందని పోలిక. తన పాదాలతో పాటు ఇతర కాంతల పాదాలను త్రొక్కడం అంటే ఇతర కాంతలను తనతో సమాన సౌందర్యవతులుగా నిర్ణయిస్తున్నాడనే అభియోగం మోపి అతని చర్యను చీదరించు కోవడం ఇక్కడి అంశం.

సామాన్యంగా స్త్రీ వక్షాన్ని వర్ణించడం మన కావ్యాలలో ఎక్కువ. కాని అన్నమయ్య పురుషుని ఉరాన్ని వర్ణించడం ఇక్కడి విశేషం.

ముదితకు నీతోమాట మోహన మంత్రము
చదరపు నీవురము జపశాల. 13-271

నాయకునితో మాట్లాడడమే నాయికకు మోహన మంత్రమట అయన ఉరః పీఠాన్ని అధిష్ఠించిన ఆమెకు విశాలమైన అయన ఉరము నిరంతరం ఆయనను జపించడానికి అనువైన జపశాల. ఎంత పవిత్రమైన భావనో కదా! అయితే ఆ వక్షస్థలం మీద ఆమెప్రక్కన మరొక వనిత చేరితే ఆ ం ఎంత భీతావహంగా ఉంటుందో చూడండి

ఇక్కువ శ్రీవేంకటేశ యెనసి ఇద్దరివల్లా
అక్కర నురిపే కళ్ళమాయ నీవురము 13-404

శ్రీదేవి, భూదేవులను ఒక సరసన చేర్చిన ఉరము నురిపేకళ్ళం. ఆ సవతి పోరును భరించే దృశ్యం కళ్ళంతో ధాన్యాన్ని నురిపే కోలాహల దృశ్యాన్ని కళ్లకు కట్టిస్తుంది. ధాన్యాన్ని నురిపేటప్పుడు వరి కంకులను కాళ్ళతో త్రొక్కడం, నేలకేసి కొట్టడం మన మెరిగిందే. సవతులకు నిలయమైన ఆ ఇల్లు నురిపే కళ్ళమే.

పెదవులను ఎంతో అందంగా మధురంగా వర్ణించడం మన మెరిగిందే. కాని నోటిని, నాలుకను వర్ణించడం అరుదు అన్నమయ్య కీర్తనలలో ఆ అపురూప వర్ణనలను చూడండి.

నిత్యపూజ లివివో నేరిచిన నోహో
ప్రత్యక్ష మైనట్టి పరమాత్మునికి
పలుకే మంత్రమట పొందైన నాలుకే
కలకల మను పిడి ఘంట యట. 2-82

ఎంత భక్తి భావనో చూడండి. భగవంతుని కీర్తించే నాలుక కల కలమని మ్రోగే గుడిలో గంట అట! అయితే ఆ నోటిని మంచికైనా ఉపయోగించుకోవచ్చు. చెడుకైనా వినియోగించుకోవచ్చు. విచ్చల విడి శృంగారాన్ని చవి చూచిన దక్షిణ నాయకుని నోటిని 'బందెయెద్దుమోర'గా అభివర్ణించడం గమనించండి.

జంగిలి కాంతలనెల్లా సంగతు లెంచక నీవు
యెంగిలి సేసేవు మోవి యేకముగాను
పంగించ నీనోరు బందెయెద్దు మోరాయ. 13-185

కుపిత అయిన నాయిక కొప్పును 'రాహువు'గా, ప్రేమతో ప్రియుని ఒడిలో ఒదిగిన నాయిక కొప్పు 'కొత్తపేయల గూడు'గా, నాయకునిపై మన్మథాస్త్రాలను సంధించే కొప్పు 'మరుని ఆయుధశాల'గా ఉపమించడం విశేషం.

పొలతి వదనమను పున్నమ చంద్రుడు
బలిమి నెగయునను భయమునను
మెలత చికుర ధమ్మిల్లపు రాహువు
తలఁజెదరగ నిదె దైవమె నేసె 4-17

ఆమె ముఖం చంద్ర బింబమే అయినా కుపిత అయినప్పుడు నాయకుని తప్పించుకోవడానికి చూడడం సహజం. ఆ చంద్ర బింబం పైకి ఎగిరి పోవడానికి వీలు లేకుండా దానిని కబళించడానికా అన్నట్లు ఆమె కొప్పును రాహువుగా భగవంతుడు నిలిపాడట. ఇది విరహిణి అయిన నాయిక కొప్పు-రాహువు

సరసంలో తన చెంత చేరిన నాయిక కొప్పు ఆ గోపాలుని చేతికి కొత్తపేయల గూడుగా గోచరించిందట.

కొత్తపేయల గూడంటా కొప్పంటేవు - 13-156

కొత్తగా పాలు త్రాగడానికి విడిచిన పెయ్య కొత్తపెయ్య. దాని చిన్ని మూపురం కొత్తపేయల గూడు. ముచ్చటగా పూలతో ముడిచిన కొప్పు మరుని ఆయుధశాలట!

మరుని ఆయుధశాల మగువకొప్పు
తొరలించి విరువెల్లాఁదురిమెగాన - 29-196

పూలు మన్మథ బాణాలు. అవి జనాకర్షకాలు. ఆపూలతోడి కొప్పు సమ్మోహన భరితం.

ఇదే విధంగా సింగారపు నాయిక శరీరాన్ని జవ్వన యాగశాలగా, విరాగియైన భక్తుని శరీరాన్ని జ్ఞానాగ్నితో వెలిగే యాగశాలగా అభివర్ణించాడు.

జ్ఞానయజ్ఞమీగతి మోక్షసాధనము
నానార్థములు నిన్నే నడపె మాగురుడు. ||పల్లవి||

అలరి దేహమనేటి యాగశాలలోన
బలువై యజ్ఞాన పశువు బంధించి
కలసి వైరాగ్యపు కత్తులఁగోసి కోసి
వెలయ జ్ఞానాగ్నిలో వేలిచె మాగురుడు. ||జ్ఞాన||

మొక్కుచు వైష్ణవులనే ముని సభగూడపెట్టి
చొక్కుచు శ్రీపాదతీర్థ సోమపానము నించి
చక్కగా సంకీర్తన సామగానము చేసి
యిక్కువతో యజ్ఞముసేయిఁ చెబో మాగురుడు ||జ్ఞాన|| 2-148

అని ఒక చెంత పరమ వైరాగ్య భావనను గుప్పించి శరీరం ద్వారా మోక్షసాధనాన్ని చూపించి ఎదలో శ్రీవేంకటేశుని ప్రత్యక్షం చేసినాడు అన్నమయ్య.

వెలయ నీ కల్యాణ వేదిగా మతినుండి
కలికి జవ్వనపు యాగము నేసె నతడు ||పల్లవి||

మలయు నీనాభి హోమపు గుండమునను
నెలకొన్న విరహాగ్ని నిండాఁబోసి
పొలయు నీ నిట్టూరుపుల విసరుచును
వొలుకుఁజెమటల నాహుతి వోసె నతఁడు ||వెలయ||

కదిసి నీ నెన్నడిమి గగనము నందు
పొదలిన యారనే పొగనిండఁగా
మదిరాక్షి నీమంచి మానపుఁబశువు
నదనెరిగి వేలిచె నతివ నీకతఁడు ||వెలయ||

కాటుక కన్నుల విన్నుఁగడు నలయించి
బూటకముల చిటిపొటి సిగ్గుల
గాఁటపుఁగరుణ వేంకటగిరి విభుఁడు
కోటిహోమమునేసెఁగూడి నిన్నతఁడు 12-288

అని నాయిక అంగాంగాలతోనే యాగశాలలో వేంకట విభుడు కోటి హోమము చేసి నట్లుగా అభివర్ణించడం విలక్షణం. ఒకటి జ్ఞాన యజ్ఞము. మరొకటి జవ్వనపు యాగము. ఒకదానిలో 'మదిరాక్షి మానవు(బశువు. ఇలా అన్నిటా సమబుద్ధినే అన్నమయ్య ప్రదర్శించాడు.

ఈ విధంగా తన సంకీర్తనల యోగ, భోగాలను సమపాళ్లల్లో మేళవించిన అన్నమయ్య

> మనుజుడై పుట్టి మనుజుని సేవించి
> అనుదినము దుఃఖ మందనేలా 1-196
>
> బూరుగ మాకున జెందిన కీరము చందమున
> ఆరయ నిష్ఫలమగు మరి యన్యుల జేరినను - 1-194

అని మానవ మాత్రుల సేవించడం వ్యర్థమని, మధుర ఫలాలను ఆస్వాదించే చిలుక శుష్కమైన బూరుగ ఫలాలను చేరడం ఎలా వ్యర్థమో; అన్యుల నాశ్రయించి భగవంతుని చేరని జీవితం వ్యర్థం అని చక్కని ఉపమాన ప్రయోగంతో మనలను హెచ్చరించిన ధన్యజీవి.



# తాళ్ళపాక కవుల ద్విపద రచనలు - వైశిష్ట్యం

డా|| సి. గోవిందరాజు

భారతీయ భక్తి సారస్వతంలో, పదకవితా వాఙ్మయంలో 'నభూతో నభవిష్యతి'గా ప్రసిద్ధికెక్కిన వాగ్గేయకారులు తాళ్లపాకకవులు వారు పదకవులేకాదు పండితులు, గాయకులు, లక్షణకర్తలు, వ్యాఖ్యాతలు తమకంటే ముందున్న అనేక సాహితీ ప్రక్రియల్ని చేపట్టి ఎన్నో కృతుల్ని రచించడమేగాక వివిధ నూతన ప్రక్రియల్ని చేపట్టి వీరు దేశిసాహిత్యాన్ని సుసంపన్నం చేశారు. వారి ప్రక్రియల్లో విలక్షణమైంది ద్విపద.

తెలుగు కవితకు మూలం ద్విపదఛందస్సు. ఇది పాదానికి మూడు ఇంద్రగణాలు ఒక సూర్యగణం వంతున రెండేసిపాదాలు ప్రాస నియమంతో వుంటుంది. ప్రతి పాదంలో మూడోగణం మొదటి అక్షరానికి యతి చెలుతుంది ఇది గేయాంశంతో గానయోగ్యమై మధుర కవితాశాఖకు చెందిన దేశీరచన.

1. పన్నెండు పదమూడు శతాబ్దాల్లో శివకవులూ; పదిహేను పదహారవ శతాబాలో వైష్ణవకవులూ ద్విపదను ఆశ్రయించారు. మతవ్యాప్తి చేశారు. వైష్ణవకవుల్లో తాళ్లపాకవారి ద్విపదలకు ఒక ప్రత్యేక స్థానం వుంది

అన్నమయ్య రామాయణాన్నీ, పెదతిరుమలయ్య హరివంశాన్ని శ్రీవేంకటేశ్వర ప్రభాతస్తవాన్నీ, చిన్నన్న అష్టమహిషీకల్యాణం, ఉషాకల్యాణం, పరమయోగి విలాసం అన్నమాచార్య చరిత్ర అనే రచనలను ద్విపదలుగానే రచించారు. శృంగారమంజరిని అన్నమయ్య, చక్రవాళమంజరిని పెదతిరుమలయ్య, సుభద్రాకల్యాణాన్ని తాళ్ళపాకతిమ్మక్క మంజరీద్విపదల్లో పాడి ద్విపద సాహిత్య చరిత్రలో తెమదంటూ ఓ విశిష్టస్థానాన్ని సంపాదించుకున్నారు.

## 1.1 రామాయణం :

రామాయణకథ తెలుగు సాహితీ ప్రక్రియన్నింటితోను చోటుచేసికొంది. ద్విపదగా వెలువడిన రామాయణాలలో రంగనాథరామాయణం మొదటిది. రెండవది అన్నమయ్య రచించిన ఈ ద్విపదరామాయణం. ఇది అలభ్యం. ఈ కావ్యాన్ని గురించి "ప్రవిమల ద్విపద ప్రబంధరూపమున-నవముగ రామాయణము ప్రతిలేని - నానా ప్రబంధముల్‌చేసి" అని 'అన్నమాచార్య చరిత్ర'లో తాళ్లపాక చిన్నన్న పేర్కొన్నాడు. ఈ ఉటంకింపునుబట్టి క్రింది అనుమితులను సాధించవచ్చు.

1) ఈ రామాయణం ద్విపద ఛందస్సులో రచించబడింది

2) కర్త తాళ్లపాక అన్నమాచార్యులవారు

3) ఇది పూర్వ రామాయణాలకు భిన్నంగా సరికొత్త పద్ధతిలో రచించబడింది.

4) ప్రవిమల అంటే శుద్ధమైన/స్వచ్ఛమైన/నిర్మలమైన అని నైఘంటికార్థం. ఇక్కడ 'ప్రవిమల' అనే ప్రయోగానికి విశేషార్థాన్ని చెప్పుకోవలసివుంది అప్పటికే శైవసాహిత్యంలో ద్విపదరచన జరిగివుంది. కానీ అది తాళ్లపాక కవుల ద్విపదరచనలా శుద్ధమైందికాదు. వారు ద్విపదలలో ప్రాసయతిని కూడా వాడారు. వారు ఏపాదానికి ఆపాదం విరిగేటట్లు రాయలేదు. మొదటి పాదంలోని చివరి పదంలోని కొన్ని అక్షరాలు రెండో పాదం మొదటి గణంలోకి వచ్చేలా రచన సాగించటం కనిపిస్తుంది. తాళ్లపాక చిన్నన్న ద్విపదలక్షణాన్ని చెప్పినంత సవిస్తరంగ ఏలక్షణ కారులూ చెప్పలేదు. బహుశః దానికి ప్రేరకమో లక్ష్యమో వారి తాతగారి రామాయణమే కావచ్చు అందువల్లే ద్విపద లక్షణకారుల్లో విశిష్టుడైన చిన్నన్న ఈ రామాయణాన్ని 'ప్రవిమల' ద్విపదగా పేర్కొన్నాడు.

5) ప్రబంధం : ఈ ద్విపదను అన్నమయ్య ప్రబంధ రూపమున రచించాడని చిన్నన్న స్పష్టంగా చెప్పాడు. ఇక్కడ ప్రబంధమనే పదానికి అర్థం యిప్పుడు మనం ఏ అర్థంలో ప్రబంధపదాన్ని ప్రయోగిస్తున్నామో ఆ అర్థంలోనే ప్రయోగించాడేమో అన్నవూహకు ఆస్కారముంది. దానికి కారణం ప్రబంధయుగకర్త అయిన అల్లసాని పెద్దనకు అన్నమయ్య కించిత్ పూర్వుడు. అందునా ఇద్దరూ నందవరీకులే. కాబట్టి ద్విపద ఛందస్సులో అన్నమయ్య ఆలంకారిక శైలితో అష్టాదశ వర్ణనలతో ఈ రామాయణాన్ని పురాణాదిశైలిలో కాక, ప్రబంధఫక్కీలో రచించాడని భావించవలసివుంది. లేని పక్షంలో 'నవముగ' అని చిన్నన్న ప్రత్యేకించి చెప్పివుండేవాడుకాడు. ఎందుకంటే ద్విపద ఛందస్సులో అప్పటికే రంగనాథరామాయణం వ్యాప్తిలో వుంది కదా!

అన్నమయ్య శృంగార అధ్యాత్మ సంకీర్తనలు ఎన్నింటిలోనో ప్రస్తావించిన రామాయణ కథాంశాలను క్రోడీకరించి విశ్లేషిస్తే అన్నమయ్య రామాయణం యొక్క వస్తు శిల్ప దృక్పథాలకు సంబంధించిన ఒక స్థూలమైన ఊహారేఖా చిత్రాన్ని గీయవచ్చు. ఆ రేఖా చిత్రాన్ని సాహితీ పరంగా వ్యాఖ్యానిస్తే అది యించుమించు చిన్నన్నచేసిన పై వ్యాఖ్యకు సరిపోవచ్చు.

## 1.2 హరివంశం :

ఎఱ్రన హరివంశాన్ని ఆంధ్రీకరించాడు. నవీనగుణసనాథుడైన సోమనాథుడు అందులోనుంచి కొన్ని రసవద్ఘట్టాలను మాత్రమే తీసికొని ఉత్తరహరివంశాన్ని రచించాడు. ఈ రెండు కావ్యాల్లో వైవిధ్యాలు, వైరుధ్యాలు వున్నప్పటికీ అవన్నీ మార్గపద్ధతి చట్రంలోనే ఒదిగి పోతాయి

చిన్నన్న అష్టమహిషీకల్యాణంలో ".. ... .. ద్విపద రూపమున - హరివంశ కావ్యమాయత రసస్ఫూర్తి - హరివంశ మిగురొత్తననువొందజేసి" అని పెదతిరుమలయ్య రచించిన హరివంశాన్ని గురించి ఉటంకించాడు. ఈ గ్రంథం నేడు అలభ్యం ఈ ఉటంకింపువల్ల క్రింది ఊహలకు తావు లభిస్తోంది.

1 హరివంశం ద్విపద ఛందస్సులో రచించబడింది.

2. ఎఱ్రనలా కాకుండా నాచన సోమునిలా పెదతిరుమలయ్య దీనిని కావ్యంగా అనువదించాడు.

3. ఈ కావ్యం రసస్ఫూర్తితో సాగింది

4 తెలుగు హరివంశవృక్షానికి చిగుళ్లు వచ్చేలా చేశాడని అంటే అంతకుముందు హరివంశం రచింపబడిన మార్గపద్ధతికి భిన్నంగా స్వతంత్రమైన దేశీయ రీతిలో జనబాహుళ్యంలోకి చొచ్చుకొని పోయేలా హరివంశాన్ని ద్విపదీకరించాడని భావించవలసి వుంటుంది.

తండ్రి రచించిన ద్విపద హరివంశంలోని ఉషాపరిణయఘట్టాన్ని స్వీకరించి చిన్నన్న ఆ వరవడిలోనే రచించి వుండవచ్చు. ఉషాపరిణయాన్ని వివిధ దృక్కోణాల్లో పరిశీలిస్తే పెదతిరుమలయ్యగారి హరివంశకావ్య స్వరూప స్వభావాలు స్థాలీపులాకన్యాయంగా అవగతమౌతాయి. అంతేకాక పెదతిరుమలయ్య కీర్తనల్లో హరివంశ సంబంధిత కథాభాగాలను అధ్యయనం చేస్తే కొంత ద్విపదహరివంశ నిర్మాణ మర్మాలు బహిర్గత మవుతాయి.

## 1.3 శ్రీ వేంకటేశ్వర ప్రభాతస్తవం* :

సుప్రభాత రచనలు సంస్కృతంలోనూ తమిళంలోనూ ప్రాచీనకాలం నుంచీ కాన వస్తున్నాయి. రామాయణంలోని 'కౌసల్యా సుప్రజారామ' అనే సుప్రసిద్ధశ్లోకాన్ని చాలామంది సుప్రభాత రచయితలు తమరచనల్లో

* శ్రీవేంకటేశ్వర వచనములకు చివరన సమగ్రంగా ప్రచురించబడింది. శ్రీ వేంకటేశ్వర ఓరియంటల్ సిరిస్ నెం. 10. తి.తి.దే ప్రచురణ 1945. పుట 81-86

వాడుకున్నారు అన్నమయ్య రామాయణాన్ని ప్రత్యేకంగాను సంకీర్తనల్లోను ప్రస్తావనగా రచించి గానం చేశాడు. కాగా ఆయన కుమారుడు పెదతిరుమలయ్య రామాయణంలోని ఈ శ్లోకానికి ప్రభావితుడై కాబోలు శ్రీవేంకటేశ్వరస్వామికి ఈ మేలుకొలుపు కృతిని రచించి అంకితం చేశాడు.

తమిళంలో తొండరడిప్పొడి ఆళ్వారు (విప్రనారాయణ) 'తిరుప్పళ్లియెళుచ్చి' (ప్రభాతగీతి)ని రచించాడు. పెదతిరుమలయ్య ఆళ్వారులు రచించిన అనేక పాశురాల భావాలను 'ఆంధ్రవేదాంతంగా' చెప్పారని చిన్నన్న అష్టమహిషీ కల్యాణంలో "వేదాంత విద్యా ప్రవీణుడైయాంధ్ర-వేదాంతమొనరించి" అని ఉటంకించడం వల్ల తెలుస్తోంది. కాబట్టి వీరు రచించిన ఈ మేలు కొలుపు కృతిపై అనివార్యంగా తిరుప్పళ్లియెళుచ్చి ప్రభావం కూడా వుండి వుండాలి.

సంవత్సరంలో పదకొండు నెలలపాటు తిరుమలలో వేంకటేశ్వరస్వామికి మేలుకొలుపులు పాడితే ధనుర్మాసంలో మాత్రం స్వామివారిని శ్రీకృష్ణునిగా భావించి మేలు కొల్పుతారు.

ధనుర్మాసంలో శ్రీకృష్ణపరంగా గోదాదేవి తిరుప్పావై పాశురాలను పాడుతారు. తమిళపాశురాలకు బదులు ధనుర్మాసంలో కృష్ణస్వరూపిగ తిరుమలేశుని మేలుకొలుపడానికి పెదతిరుమలయ్య ఈ కృతిని రచించి వుండవచ్చు.

ధనుర్మాసంలో, కన్యలు శ్రీకృష్ణునిలాంటి భర్త లభించాలని నోములు నోస్తారు. శ్రీ వేంకటేశ్వరస్వామివారి గర్భాలయంలోకూడ అదే విధంగ కృష్ణస్వామిని మేలుకొలుపుతూ శ్రీ వేంకటేశ్వరప్రభాత స్తవాన్ని వినిపిస్తారు.

పండిత ప్రకాండులు కీ.శే. వేటూరి ప్రభాకర శాస్త్రిగారు ఈ కృతిని శ్రీ వేంకటేశ్వర ప్రభాతస్తవమని నామకరణం గావించారు* ఈ కృతిలో 56 ద్విపదలున్నాయి. ప్రారంభంలో

'శ్రీగరుడాద్రి పై శేషాహిశయ్య
యోగనిద్రను స్వామియున్నయత్తరిని
వినిపించి రప్పుడా విధ మెట్టిదనిన
వనజాసనాది దేవత లేగుదెంచి'

అంటూ చెప్పి తిరుమలేశుని కృష్ణస్వరూపిగా భావించి మేల్కొల్పాడు పెదతిరుమలయ్య.

---

* 1988 అక్టోబరు - భారతి - కలగూరగంప 'అపూర్వ కృతిమేలు కొలుపు ద్విపద రచయిత ఎవరు?' కర్త: డా॥ కె.జె. కృష్ణమూర్తి

ఈయన కొడుకు చిన్నన్న పరమయోగి విలాసంలో ఇలాంటి స్తుతిఘట్టాన్ని రచించటం గమనార్హం. ఆ రచనపై ఈ కృతి ప్రభావంవుంది.

## 1.4 కల్యాణ కావ్యాలు :

'మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతానిచ' అనే సూక్తిని అనుసరించి కావ్యరచన చేయటం కవిలోక సంప్రదాయం. అందువల్లే మన సాహిత్యంలో కళ్యాణ కావ్యాలు వెలిశాయని పరిశోధకులు గుర్తించారు. ఈ కళ్యాణ కావ్య పరంపర తెలుగులో అన్నిప్రక్రియల్లోను చోటు చేసుకొంది. అయితే ద్విపద ప్రక్రియలో మొట్ట మొదటిసారిగా చిన్నన్నగారి నాయనమ్మ అయిన తిమ్మక్క 'సుభద్రాకళ్యాణ' కృతిని రచించి తెలుగులో కళ్యాణ కావ్యాలకు శ్రీకారం చుట్టింది. అదే కుటుంబంలో జన్మించిన చిన్నన్న కూడా కళ్యాణ కావ్యాలను రెండింటిని ద్విపదరూపంలో రచించాడు. ఒకటి అష్టమహిషీకళ్యాణం, రెండు ఉషాకళ్యాణం.

**1.4.1. అష్టమహిషీకళ్యాణం :** పోతన శ్రీమహాభాగవతంలోని పూర్వోత్తరభాగాల్లో శ్రీకృష్ణుని పరిణయ వృత్తాంతం వుంది. మార్పులతో, చేర్పులతో, కూర్పులతో, నేర్పులతో చిన్నన్న దీన్ని 7365 పంక్తులున్న ఐదు ఆశ్వాసాల ద్విపదగా రూపొందించాడు. ఈ కృతి కృష్ణావతార కథతో ప్రారంభమౌతుంది ఆయన రుక్మిణి, సత్యభామ, జాంబవతి, కాళింది, మిత్రవింద, సత్యకీర్తి, భద్ర, లక్షణలను పరిణయమాడే వరకు వుండే గాథ యిందలి ప్రధాన యితివృత్తం. మొదటి మూడు ఆశ్వాసాలలో శ్రీ కృష్ణుని పుట్టుక బాలక్రీడావిశేషాలు వర్ణించబడ్డాయి. చివరి రెండు అశ్వాసాలలో అష్టమహిషుల వివాహగాథలు చోటు చేసుకున్నాయి. ఈ కావ్యంలో ఎనిమిదిమంది వివాహాలకు సంబంధించిన ప్రస్తావన వున్నప్పటికీ వైవిధ్య వర్ణనలతో రచన సాగడంవల్ల పాఠకునికి ఎక్కడా విసుగుపుట్టదు. ఈకావ్యం పేరు అష్టమహిషీకళ్యాణమే అయినప్పటికీ ఇందులో కృష్ణుని యితరత్ర గాథలకే ప్రాధాన్యం యివ్వబడింది. చిన్నన్న ఈ కావ్యంలో ప్రబంధ మార్గాన్ని ప్రవేశపెట్టి అవతారికా సంప్రదాయాన్ని పోషించాడు.

గోపికావస్త్రాపహరణం, గోవర్ధనోద్ధరణం, రాసక్రీడలు, శంఖచూడుని వృత్తాంతం మొదలయిన ఘట్టాల్లో చిన్నన్న శాస్త్ర సంప్రదాయ వైదుష్యాన్ని ప్రవచించాడు. భాగవతంలో లేని బాసికం కట్టడం, మధుపర్కం యివ్వడం, తలంబ్రాలు పోయడం మొదలయిన తెలుగువారి ఆచార వ్యవహారాలను వర్ణించి చిన్నన్న రచనకు తెనుగుదనాన్ని కూర్చాడు. అయన రేపల్లెను, శ్రీకృష్ణుని బాల్యాన్ని భాగవతంలో కంటె మనోజ్ఞంగా వర్ణించాడు.

వ్రతమాచరిస్తున్నగోపికలు వ్రతనిష్ఠకు విరుద్ధంగా జలక్రీడాసమాసక్తలై చీరలను గట్టుపై విడచి వివస్త్రలై నీళ్లలోకి దిగుతారు శ్రీ కృష్ణుడు వారి చీరలను అపహరించి చేతులుజోడించి శ్రీ కృష్ణా అని ప్రార్థిస్తే వస్త్రాలను యిచ్చాడంటారు దీన్ని కొందరు కృష్ణుని కాముకంగా చెప్తారు. దీన్ని చిన్నన్న శ్రీ కృష్ణుడు ఎంతోదయతో వారి దోషపరిహారార్థం అలా చేసినట్లు చిత్రించాడు

ఒకచోట సంధ్యావర్ణన కావిస్తూ ఆకాశంలోని నక్షత్రాలను చిన్నన్న 'గరుడుడు అమృతాన్ని తెస్తున్నప్పుడు ఆ కలశం నుండి తొణికి చెల్లాచెదురుగా ఆకాశంలో చిందిన తుంపరలు'గా వర్ణించడం మనోజ్ఞంగా వుంది. శ్రీకృష్ణుడు రుక్మిణిని తీసుకొని వెళ్లేటప్పుడు కర్ణాట, ద్రవిడ, కళింగ దేశాలకు చెందినవారు తమభాషల్లో శ్రీకృష్ణుని స్తుతించారు చిన్నన్న ఆ స్తుతిని ఆయా భాషల్లో రచించటం ఆయన బహుభాషా పాండిత్యాన్ని చాటుతోంది. ఏది ఏమైన యిదిచిన్నన్న తొలిరచన కావడంవల్ల తరువాతి రచనల్లో పరిణతి రూపంలో కన్పించే అంశాలు యిందులో బీజప్రాయంగా కనిపించడం గమనార్హం.

**1.4.2 ఉషాకల్యాణం :** పెదతిరుమలయ్యగారు హరివంశ పురాణాన్ని ద్విపదీకరించగా ఆయన కొడుకు చిన్నన్న హరివంశ పురాణాంతర్గత ఉషాపరిణయ గాథను ద్విపదీకరించాడు దీనికి మూలం హరివంశ మార్గోత్తమమగు ఉషాకన్య.

"క్రమమొప్ప పరిణయ క్రమమెట్టిదనిన" అని గ్రంథావతారికలో చిన్నన్న స్వయంగా చెప్పుకున్నాడు. ఇదేకాక ఆయన ఈ రచనకు ఉపక్రమించే ముందు విష్ణుపర్వం లోని ఉషానిరుద్ధుల ప్రణయగాథను, పోతనభాగవత దశమస్కంధ ఉత్తరభాగం లోని ఉషాపరిణయ కథను, నాచనసోముని ఉత్తర హరివంశాన్ని కూడ చూసివుండవచ్చు.

జనమేజయుని కోరికపై వైశంపాయనుడు ఉషాకల్యాణాన్ని వివరించాడు బాణుని ప్రియకుమార్తె ఉషాకన్యకు, శ్రీకృష్ణుని కొడుకు అనిరుద్ధునికి జరిగిన కల్యాణమే ఇందలి ఇతివృత్తం. ఈ కల్యాణాత్మక రచన 1979 ద్విపద వంక్తులలో ప్రకటించబడింది. దీనికి ఉషాపరిణయమనే మరోపేరు కూడ వాాపిలోవుంగి

చిన్నన్న తాను హరివంశమార్గంలో రచించినట్లు చెప్పుకున్నా యిది హరివంశానికి యథాతథానువాదం కాదు; స్వేచ్ఛాను వాదమని భావించవలసివుంది. ఎందుకంటే కవి మూలాన్ని ఎంతో క్లుప్తీకరించాడు.

కొన్నిచోట్ల అమూలక వర్ణనలు చేశాడు. మరికొన్ని తావులలో మార్పులు చేశాడు. చాలాచోట్ల మూలంలోని విషయాలను సంపూర్ణంగా వదిలేశాడు

చిన్నన్న ప్రబంధ సాహితీ మార్గాన్ని అనుసరించి, విరహతాపాన్ని సహించలేక ఉషాకన్య చంద్రుని నిందించినట్లు వర్ణించాడు, ఇది అమూలకం శ్రీకృష్ణుడు బాణా సురునిపై యుద్ధానికి వెళ్లేటప్పుడు మూలంలో గరుత్మంతుని స్తుతించినట్లువుంది. కానీ చిన్నన్న ఈ స్తుతిని తొలగించి కేవలం గరుడుని అప్యాయతతో నిమిరినట్లు మార్చి చెప్పి వదిలేశాడు. విస్తరభీతి వల్లనేగాక విష్ణువు తన సేవకుడైన గరుడుని స్తుతించడం చిన్నన్నకు నచ్చక ఈమార్పుచేసి వుంటాడు. అలాగే బాణాసురుడు పరమేశ్వరుని సుదీర్ఘంగా స్తుతించినట్లు ఆయన వారికి అనేకవరాలు యిచ్చినట్లు మూలంలో వుండగా చిన్నన్న ఈశైవ సంబంధి అంశాలను వైష్ణవపరంగా మార్చివేశాడు.

కోటవతీదేవి స్తుతి, ఉషాకన్య విరహం, అనిరుద్ధుని పూర్వభార్యా ప్రస్తావన, ఉషానిరుద్ధుల సురతకేళీవర్ణనం, నారదాగమనం, గరుత్మంతుడు శ్రీకృష్ణుని స్తుతించటం, బాణాసురుని రక్షించడం, ద్వారకా పౌరులు శ్రీకృష్ణునికి పూర్ణకుంభంతో స్వాగతం యివ్వడం మొదలయిన ఎన్నో అంశాలను కథాగమనానికి ఆటంకాలుగా, కొన్ని అనౌచిత్యాలుగా, మరికొన్ని శైవపారమ్య బోధకాలుగా తలచి చిన్నన్న వీటిని పరిత్యజించాడు.

భాగవతంలో బాణుని పక్షాన యుద్ధంచేసిన శివుడు, కృష్ణునిచే బంధించబడినట్లు రచించి చిన్నన్న ఈ ద్విపదలో వైష్ణవాధిక్యతను స్థాపించాడు.

## 1.5 పరమయోగి విలాసం :

చిన్నన్నకు స్వామివారు కలలో కనిపించి పరమయోగి విలాసమనే ద్విపద ప్రబంధాన్ని రచించమని కోరాడు చిన్నన్న అలమేలుమంగను వేంకటేశ్వరస్వామిని తలచి వారికి అంకితంగా ఈ కృతిని రచించాడు. ద్రావిడ భాషలో ఆళ్వారు అంటే భగవద్భక్తుడు అని అర్థం. భక్తి వైరాగ్య జ్ఞానసంపన్నులై విశిష్టాద్వైతమతాన్ని విస్తరింపజేసిన ఈ మతప్రవక్తల కథ పరమయోగివిలాస కావ్యంలో చక్కని చిక్కని దేశికవితారూపాన్ని దాల్చింది.

కాసారయోగి, భూతయోగి, మహాయోగి, భక్తిసారయోగి, మధురకవియోగి, కులశేఖరయోగి, విప్రనారాయణయోగి, విష్ణుచిత్త యోగి, గోదాదేవి, పరకాలయోగి అనే పన్నెండుమంది ఆళ్వారుల గురించి నాథముని, యామునాచార్యులు, రామానుజాచార్యులు అనే వైష్ణవ మతాచార్యుల చరిత్రను గురించీ తెలిపే తొలి తెలుగు ద్విపద గ్రంథమిది.

చిన్నన్న ప్రబంధయుగానికి యించుక తరువాతి వాడు కావడంవల్ల ప్రబంధయుగ ప్రభావం యితని ద్విపదలపై గాఢంగా కనిపిస్తుంది. ఆయన కావ్యంలో షష్ఠ్యంతాలు రచించాడు. ద్విపదను ప్రబంధ పోకడలో నడిపించాలని పురవర్ణనతో ప్రారంభించాడు.

మధుర మంజులమైన మనోహరమైన తనద్విపదల్లోని కవితావైభవాన్ని, ఆయన మధుర కవిత్వాన్ని ప్రశంసించే సందర్భంలో వ్యంగ్యంగా స్ఫురింపజేశాడు భారతంలోని "ఋత్విజుండని విచారించి పూజించితే" వంటి పద్యాలను ఆయన సందర్భాను సారంగా సరసంగా అనుసరించాడు. చిన్నన్న మంచి భావనాపటిమ కలవాడు. ఆరవ ఆశ్వాసంలో ఒకచోట యుద్ధ భూమిని బీభత్స రస ప్రధానంగా వర్ణించాడు.

ప్రబంధానికి మరో ముఖ్యలక్షణం ఏకనాయకాశ్రయత్వం ఈ గ్రంథంలో వేర్వేరు భక్తుల చరిత్రలు వర్ణించబడడంచేత దీనిలో వస్త్వైక్యత లోపించిందని కొందరంటారు కాని అది నిజం కాదు. ఈ కావ్య నాయకుడు శ్రీ మహావిష్ణువు ఇందులో వర్ణించబడిన భక్తులంతా ఆయన పొందుకోసం పరితపించిన నాయికలు. భగవంతుడనే ఏక సూత్రంతో భక్తులనే పుష్పాలను పరమయోగివిలాసమనే మాలగా చిన్నన్న కూర్చినాడు.

### 1.6 అన్నమాచార్య చరిత్ర :

తెలుగులో జీవిత చరిత్రలు తక్కువ. అందులోను కవిత్వ రూపంలో వుండే జీవితచరిత్రలు యింకా తక్కువ. శివకవి యుగంలో పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్ర, బసవపురాణం రచించాడు. కాని, కవి కాలానికి దేశానికి సంబంధం లేక రాయబడిన జీవిత చరిత్రలు. వీటిలో ఎన్నో కల్పితాంశాలు చోటుచేసుకొన్నాయి. కాని అన్నమాచార్య చరిత్రలో ఈ అసంగతవిషయాలు లేవు. అందువల్ల తెలుగులో ప్రత్యేకంగా కవితలో వెలసిన జీవిత చరిత్రల్లో సోమనాథుని రచన తర్వాత అన్నమాచార్య చరిత్ర ద్వితీయమైనా ప్రామాణికతలో అద్వితీయమైనది. ఈ గ్రంథంలోచిన్నన్న ఆనాటి చారిత్రక, సాంఘిక, పరిస్థితుల్ని తిరుమల తిరుపతుల్ని తత్పరిసరప్రాంతాల్ని కళ్లకు కట్టినట్టు చిత్రించాడు.

అన్నమాచార్యుని చరిత్రను ఆయన మనుమడైన చిన్నన్నే స్వయంగా రచించడంవల్ల ఈ ద్విపదకు సాహిత్య పరంగానేగాక చారిత్రకంగా కూడా విలువ పెరిగింది అన్నమయ్య జన్మ స్థలం, తాళ్లపాకవారి పూర్వీకులు, బాల్యం, వివాహం, సంతానం, మహిమలు, ఇతరసంకీర్తనాచార్యులతో

వారికుండే అనుబంధం, ఆనాటి రాజులతోవుండే సంబంధ బాంధవ్యాలు, శ్రీవారి దర్శనం మొదలైన విషయాల్ని తెలుసుకునే అవకాశం ఏర్పడింది

పొత్తపినాటి సీమలోని తాళ్లపాక గ్రామవాసి అన్నమయ్య వీరు నందవరీకులు, ఋగ్వేదులు, ఆశ్వలాయన సూత్రులు. మనకు లభించిన తాళ్లపాకవారి ఏ యితర గ్రంథాలలో కానరాని తాళ్లపాకవారి పూర్వీకుల వివరాలు వాళ్లపూర్లపేర్లు ఈ కృతివల్ల తెలుస్తున్నాయి

యోగవైరాగ్య శృంగార మార్గాల్లో అన్నమయ్య 32 వేల సంకీర్తనల్నిరచించినట్లు చిన్నన్న ఈ ద్విపదలో పేర్కొన్నాడు అన్నమయ్య రామాయణం నేడు అలభ్యం. కాని దీన్ని ఆయన ప్రబంధ ధోరణిలో నవముగ ద్విపదగా రచించినట్లు చిన్నన్న ఈకృతిలో ఉటంకించాడు. అలాగే అన్నమాచార్యులవారు సంస్కృతంలో వేంకటాచలమాహాత్మ్యం, శృంగారమంజరి, 12 శతకాలను రచించినట్లు ఈద్విపదవల్ల స్పష్టమవుతుంది. "అన్నమయ్య సకలభాషలయందు ప్రతిలేని ప్రబంధాలను" రచించినట్లు చిన్నన్న చెప్పాడు. అన్నమయ్యకు యిద్దరు భార్యలని పెద్దభార్య తిరుమలమ్మ (తిమ్మక్క), చిన్నభార్య అక్కలమ్మఅని తిరుమలమ్మకుమారుడు నరసింగన్న అని అతడు గొప్పకవి అని అక్కలమ్మకుమారుడు పెద తిరుమలాచార్యులని ఆయనకు నరసమ్మ, తిరుమలమ్మ అనే యిద్దరు చెలియండ్రు వున్నట్టు ఈ గ్రంథం ద్వారా తెలుస్తోంది.

అన్నమయ్య నందకాంశంతో జన్మించాడు. అందువల్ల ఆయనకు కొన్ని మహిమలు అబ్బాయి. అగ్రహారంలో వుండే జీడికంపు పుల్లమామిడి పళ్ళు అన్నమయ్య ప్రార్థనతో తియ్యని మామిడిపళ్లుగా మారాయి ఆయన ఆశీస్సు పొందిన ఒకడికి రాజానుగ్రహంవల్ల వాడిపెళ్లికి ధనం సమకూరుతుంది. ఇటువంటి మహిమల్ని అన్నమాచార్యులవారు ప్రదర్శించినట్లు చిన్నన్న గ్రంథస్థం చేశాడు. వైష్ణవభక్తులైన ఆళ్వారుల మహిమల్లా అన్నమయ్య మహిమలు అద్భుతమైనవి.

కర్ణాటక సంకీర్తనాచార్యులైన పురందరదాసులవారు అన్నమయ్యను దర్శించి ఆయన కీర్తనలువిని పరవశించి “నీవు శ్రీ వేంకటేశ్వర అవతారమని” ప్రశంసించాడు. అన్నమయ్య ఆయనను "నీవు పాండురంగ విఠలునివని" శ్లాఘించాడు.

తాళ్లపాకకవుల ద్విపదరచనా వ్యాసంగం అన్నమయ్యతో ప్రారంభం కావడం అన్నమాచార్య చరిత్రతో ముగియడం ఓ విశేషం.

**2.0 మంజరీద్విపదలు :**

ప్రాసనియమం పాటించని ద్విపదే మంజరీ ద్విపద తెలుగులో ఆడవాళ్ళు పిల్లలు పాడుకొనే చాలాపాటలు ఈ దేశీయ ఛందస్సులోనే నడుస్తాయి జనప్రియమైన మంజరీ ద్విపదలో తాళ్లపాకవారు శృంగారమంజరి, చక్రవాళమంజరి, సుభద్రాకల్యాణం అనే కావ్యాలు రచించి వైష్ణవమతౌత్కృష్ట్యానికి దోహదం చేశారు.

**2.1 శృంగారమంజరి :** అన్నమయ్య ఈ కృతిని శ్రీ వేంకటేశ్వరస్వామికి విన్నపం చేశాడు. ఇది వేంకటేశ్వరస్వామికి అంకితం. ఇందులో కేవలం దేవతాస్తుతేకాక భక్తునియొక్క అనుభవం, అభినివేశంకూడా చిత్రించబడ్డాయి భగవంతుని పొందడానికి భక్తి, శృంగారం రెండూ సమప్రాధాన్యం వుండే సాధనాలని అన్నమయ్య భావించాడు. ఈ విషయాన్ని ఈయన రచించిన శృంగార సంకీర్తనలు కూడ ధ్రువీకరిస్తున్నాయి. శృంగారమంజరిలోని వస్తువు దివ్య శృంగారం. దీనిలోని వర్ణనలు ప్రబంధోచితరీతిలో పుష్పాపచయం, వసంతవర్ణన, నాయిక విరహతాపం మొదలైనవి రసవత్తరంగ వర్ణించబడటంచేత యిది శృంగారమంజరి అయింది

శ్రీ వేంకటాచల మాహాత్మ్యంలోని పద్మావతీ శ్రీనివాసుల పరిణయగాథను అన్నమయ్య జనసామాన్యుడికి వినిపించడం కోసం మంజరీద్విపదలో పాడాడు వేంకటేశుని రసికతనుగురించి విన్న ఒక బాల తన చెలికత్తెలతో ఉద్యాన వనానికి వెళుతుంది. వసంతం ఆమె విరహతాపాన్ని యినుమడింపజేస్తుంది. ఆమె చెలులు స్వామివారికి ఆమె బాధను నివేదించి ఆయనను ఆహ్వానిస్తారు వచ్చిన ఆ స్వామి ఆమెతాపాన్ని ఉపశమింపజేసి శృంగారసాగరంలో ముంచి తేల్చుతాడు.

**2.2 చక్రవాళ మంజరి :** పూర్వ పదాంతంలోని అక్షరాలే ఉత్తర పదారంభంలో వుండి ఆవృత్తి కావడం చక్రవాళ రచనా రీతిలో ప్రధానాంశం అన్నమయ్య శృంగార మంజరిలోని కథావస్తువునే పెదతిరుమలయ్య తు చ తప్పక అనుసరించాడు. అలాంటప్పుడు దీన్ని మరల తిరిగిరాయడం దేనికి? తిరుమలలో ప్రతియేటా పెళ్లితిరునాళ్లు జరిగేవి. ఈ వేడుకల్లో ప్రతియేడూ పాడిందే పాడడం కంటే కొత్తపాటను పాడటం మేలని పెద తిరుమలయ్య ఈ చిన్ని కృతిని రచించివుండవచ్చు.

ఈ ద్విపద ముక్తపదగ్రస్తాలంకారంలో రచింపబడడం వల్ల దీనిలో గాన యోగ్యతపెరగడమేగాక ధారణకు కూడ మరింత అనుకూలంగావుంది.

పెదతిరుమలయ్య ప్రబంధయుగంలో రాయలకు సమకాలికుడు కాబట్టి, శబ్దాలంకారాలతో ఈ ద్విపదను ప్రౌఢతరంగా ప్రబంధీకరించాడు.

**2.3 సుభద్రాకల్యాణం :** తాళ్లపాక తిమ్మక్క ప్రథమాంధ్ర కవయిత్రేగాక భర్తతోపాటు కవన మల్లిన విదుషీమణులలో ప్రథమగణ్యా

డా|| జి నాగయ్యగారు ద్విపదవాఙ్మయంలో దీనిని మంజరీ ద్విపదగా పేర్కొన్నారు. తాళ్లపాక తిమ్మక్క సుభద్రాకల్యాణాన్ని సమీక్షిస్తూ ఆచార్య యస్వీజోగారావుగారు "దీనిని మంజరీ ద్విపద అనేస్తారు మంజరి అని అనాలిగాని మంజరీ ద్విపద అనగూడదు" అంటూ వాదాన్ని లేవనెత్తారు. మంజరిలోగాని ద్విపదలోగాని ప్రయోగింపబడేగణాలు ఒకటే. అయితే ద్విపదలో రెండుపాదాలకు ప్రాసనియమం వుంటుంది అందుకే అది ద్విపద అయింది మంజరిలో ఈ నియమంలేదు మంజరి అని అంటున్నారు మంజరి అంటే (పుష్ప)గుచ్ఛము. ఈ ప్రాసనియమం లేనందువల్ల లక్షణంలో కొంత సడలింపు వుండటంవల్ల ఆలవోకగా రాయడానికి వీలుంటుంది.

ఈ వాదవివాదాలమాట ఎలావున్నా తిమ్మక్క తొలికవయిత్రి కావటానికి, మంజరిలో కృతిరచించటానికి గల మూలకారణాలేమిటో ఆలోచించవలసివుంది. దీనిని ఆమె మంజరీద్విపద అనిగానీ మంజరిఅనిగాని అనలేదు. దీనిని ఆమె కేవలం పాటగానే పేర్కొనింది నాటి సంప్రదాయ కుటుంబాలలో నోములు, వ్రతాలు చేస్తూ పాటలుపాడుకోవడం ఆనవాయితీగా రావడం చూడవచ్చు. ఇవి నిరక్షరాస్యులైన, అమాయకులైన గ్రామీణ యువతులు పాడుకొనే పాటలకంటే కొంత భిన్నమైనవి, సంస్కరించబడినవి. ఈ అలవాటు తాళ్లపాక తిమ్మక్కకు కుటుంబవాతావరణం నుంచి సంక్రమించివుంటుంది. భర్త పరమభాగవతుడు, హరికీర్తనాచార్యుడు, పదసాహిత్యమార్గదర్శి, పదకవితాపితామహుడైన అన్నమాచార్యులవారు. ఆయన సహధర్మచారిణి కావటం వల్ల ఆ సాహితీగంధం కొంతయినా అబ్బడంలో ఆశ్చర్యం ఏమీలేదు. ఆనాడు మౌఖిక ప్రసరణంలోవుండిన స్త్రీల పాటలకు లక్షణ బద్ధమైన ద్విపదరచనలకు మధ్యే మార్గమయిన మంజరిలో ఈ రచన సాగింది. ఆమె అనుకొనివుండివుంటే ద్విపదలోనే రాయగల సమర్థురాలు. స్త్రీజనోపయుక్తంగ వుండాలనే ఉద్దేశ్యంతో ఆనాటి స్త్రీలపాటలను మరింత సంస్కరించి యిలా రచించింది.

తిమ్మక్క సుభద్రా కల్యాణాన్నే ఎందుకు రాసింది? దీనికి ప్రధానంగా రెండు కారణాలు చెప్పవచ్చు.

1. జానపదగీతాల్లో పౌరాణికగేయాలు ఒకప్రధాన విభాగం. కులీన కుటుంబాల్లోని స్త్రీలకు ఆనాడు రామాయణ, భారత, భాగవతాలు నిత్యపారాయణ గ్రంథాలుగావుండేవి. కాబట్టి, ఈమె పౌరాణికగాథనే యితివృత్తంగా గ్రహించింది.

2. పౌరాణికగాథలో సుభద్రాకల్యాణాన్ని స్వీకరించడానికి కారణం క్రింది విధంగా వూహించవచ్చు. అర్జునునికి మూలకథలో ద్రౌపది, సుభద్ర యిద్దరు భార్యలు. అన్నమయ్య ఏ కారణాలవల్లనో తిమ్మక్క బ్రతికి ఉండగనే అక్కలమ్మను ద్వితీయ కళత్రంగా స్వీకరించాడు. కాని, ఈమెను పరిత్యజించలేదు. ఆమెస్థానం ద్రౌపదిది అయ్యింది. అయితే ద్రౌపది పంచభర్తృక అర్జునుడు సుభద్రను పెళ్లాడినా ఆమెలో కలిగిన మానసికమైన లోటును భర్తీ చేయటానికి ఆమెకు నలుగురు భర్తలున్నారు. కానీ యీ ద్రౌపదికి అర్జునుడొక్కడే. ఆమెలో కలిగిన మానసికవ్యథను మూలంలోని ద్రౌపదిలా నిర్వికారంగా వుంచలేక కళాత్మకంగా మనతో పంచుకొంది

ఆంధ్ర మహాభారతంలోని ఈ ఘట్టాన్ని తీసికొని ప్రత్యేకంగ ఒక కృతినే రచించింది తిమ్మక్క. దీనికి భారత కథ ఆధారమైనా యిది స్వతంత్ర రచన. సుభద్రాకల్యాణ గాథను ఆ తర్వాత చేమకూరవేంకటకవి, కూచిమంచి జగ్గకవి, వావిలికొలను సుబ్బారావు, ముదిగొండ నాగవీరయ్యశాస్త్రి మొదలైనవారు స్వతంత్ర కావ్యాలుగా మలిచారు.

మూలానికి భిన్నంగా తిమ్మక్క ద్రౌపది, యింద్ర ప్రస్థాన్ని సమీపించగనే అర్జునునితో తనవెంట గొల్లెతలను పంపమని తాను ముందుగా ద్రౌపదీదేవిని ప్రసన్నం చేసి కోవలసివుందని కోరుతుంది. తిమ్మక్క ద్రౌపది, మూలంలోని ద్రౌపదిలా నిర్వికారంగా వుండక సుభద్రాకల్యాణవార్త విని మనోవ్యథ చెందుతుంది. అర్జునుని తీర్థయాత్రా సందర్భంలో తిమ్మక్క అమూలకాలైన తిరుపతి, అహోబలం, శ్రీరంగం మొదలైన వైష్ణవక్షేత్రాలను కూడ దర్శించినట్లు రచించి తన ఆంధ్ర దేశీయాభిమానాన్నీ వైష్ణవమతాభిమానాన్నీ ప్రకటించింది

ప్రతిపద్య చమత్కారచణుడైన చేమకూరవేంకటకవి కూడ తన విజయవిలాస కావ్యంలో తిమ్మక్క రచనను కొన్నిచోట్ల అనుసరించడం ఆమె రచనా వైశిష్ట్యాన్ని తెలియజేస్తుంది.

తిమ్మక్క తన సుభద్రాకల్యాణకథను వారి సమాగమంతో ముగించి కథాకథన చాతుర్యాన్ని లలితశృంగారాత్మకంగా దేశీయతతో, ఆనాటి తెలుగువారి

ఆచార వ్యవహారాలను ప్రతిబింబిస్తూ రచన కావించింది. అందువల్ల భారతంలోని పాత్రలన్నీ తిమ్మక్కచేతిలో తెలుగువారయ్యారు

### 1.3 అనుమితులు :

కవిత్వానికి ఎన్నోచోదక శక్తులున్నాయి. వాటిలో భక్తి ముఖ్యమైంది మధ్యయుగాల్లో భక్తి ఒక సామాజిక ఉద్యమంగా ప్రబలింది. శివకవుల్లా పదిహేనుపదహారవశతాబ్దాల్లో తాళ్లపాకకవులు వైష్ణవమతాన్ని ఒక ఉద్యమంగా ప్రచలితం చేశారు. సాహిత్యం ద్వారా మతాన్ని ప్రచారంచేయడం అనాదిగా వస్తున్నదే కానీ తాళ్లపాకకవులంతా ఒకే కుటుంబానికి చెందినవారు కావడం వారిలో స్త్రీలుకూడ కవిత్వం చెప్పడం, జనసామాన్యంకోసం దేశీయ ప్రక్రియలైన ద్విపదల్లాంటి వాటిని ఆశ్రయించి అందంగా వెలయించడం విశేషం.

శివకవుల్లా వీరు ద్విపదరచనలో దేశీయమైన సరళమైన అందమైన జానుతెనుగును వినియోగించారు వీరి ద్విపదల్లో భక్త్యావేశం పాండిత్య గౌరవం రెండూ ఒకదానితోఒకటి పోటీ పడ్డాయి.

తాళ్లపాకకవుల్లో తొలిద్విపదకారుడు అన్నమయ్య. మలిద్విపదకారుడు పెదతిరుమలయ్య వైష్ణవధర్మాన్ని ప్రతిపాదించిన ముఖ్యమైన గ్రంథాలు రామాయణం, హరివంశం మొదటిదాన్ని అన్నమయ్య రచించడంవల్ల రెండోదాన్ని ఆయన కుమారుడు చేపట్టాడు.

వీరశైవసాహిత్య ద్విపదల్లోలేని మరోవిశేషం కల్యాణోత్సవద్విపదలు. తాళ్లపాకకవులు తిరుమలలో కల్యాణోత్సవ ప్రారంభకులు. కల్యాణోత్సవానికి సంబంధించిన కీర్తనలను అన్నమయ్య, పెదతిరుమలయ్య రచించగా చిన్నన్న, తాళ్లపాక తిమ్మక్క ఏకంగా కల్యాణద్విపదలేరచించారు. చిన్నన్న అష్టమహిషీకల్యాణం, ఉషాకల్యాణం, తిమ్మక్క సుభద్రా కల్యాణం ఈ కోవలోనివే.

శివకవుల ద్విపదల్లో కన్నడసంప్రదాయాభిజ్ఞత కనబడుతుంది. తాళ్లపాకవారి ద్విపదల్లో వైష్ణవానురక్తి గోచరిస్తుంది. వారు బసవ సంప్రదాయాన్ని పాటిస్తే వీరు ఆళ్వారుల మార్గాన్ని అనుసరించారు. చిన్నన్న పరమయోగి విలాసమనే ద్విపదను అవసరమైన మార్పులతో సమకాలీన సామాజిక ఔచిత్యాన్ని సందర్భోచితంగా ప్రస్తావిస్తూ వైష్ణవ విధేయంగా ఉదాత్తీకరించాడు. మతదృక్పథంతోనే గాక సాహిత్యపరంగా కూడ విశిష్టమైన

ఈ ద్విపదకావ్యం తర్వాత వచ్చిన కవుల మీద ఎనలేని ప్రభావాన్ని నెరపింది.

క్రీ శ 1564లో సిద్ధిరాజు తిమ్మరాజు ఈ కావ్యాన్ని అనుసరించి అయిదు ఆశ్వాసాల పద్య ప్రబంధాన్ని నిర్మించాడు క్రీ. శ 1583 ప్రాంతంలో చదలవాడ మల్లన విప్రనారాయణ కథను కావ్యంగా మలిచాడు క్రీ శ 1600లో సారంగుతమ్మయ్య వైజయంతీ విలాసమనే పేరిట విప్రనారాయణుని కథను నాలుగు అశ్వాసాల ప్రబంధంగా తీర్చిదిద్దాడు.

తెలుగు సాహిత్యంలో కవులజీవిత చరిత్రలను తెలిపే గ్రంథాలు కవుల గ్రంథ కర్తృత్వాదులను నిర్ణయించే చారిత్రక ఉపపత్తులు చాలాతక్కువ పాల్కురికి రచనల్లో గతించిన పుణ్యపురుషుల చరిత్రలు మాత్రమే ఉన్నాయి తెలుగు సాహిత్యంలోని ఈ లోటును భర్తీ చేస్తూ చిన్నన్న తన తాతగారైన అన్నమాచార్యుల జీవిత చరిత్రను ద్విపదగా రచించాడు తెలుగు ద్విపద చరిత్రలోనేకాదు సారస్వత చరిత్రలోనే కావ్యరూపంలో వుండే సమగ్రమైన తొలిజీవిత చరిత్రగా దీన్ని నిర్ణయించవచ్చు

పెద తిరుమలయ్య మంజరీ ఛందంలో చక్రవాళరచనా రీతిని జోడించి చక్రవాళమంజరిని రచించాడు తెలుగు సాహిత్యంలో తొలితెలుగు కవయిత్రి తాళ్లపాకతిమ్మక్క. ఈమె రచించిన సుభద్రాకల్యాణం ద్విపదకృతిని చేమకూరవారికృతితో పోలిస్తే కవితానిర్మాణ కౌశలం తక్కువగా వుండవచ్చేమోగాని మరే కావ్యంలోలేని స్త్రీ సహజమైన సున్నితత్వం వుండడం వల్ల ఈ ద్విపదకు నిండుదనం వచ్చింది

తాళ్లపాకకవుల ద్విపదలు ప్రధానంగా వస్త్వాశ్రయాలుకావు. వీరికవిత ఆత్మాశ్రయరీతిలో సాగింది. భక్తితోపాటు శృంగార వైరాగ్య తత్త్వాలు కలిసి పోయాయి. మతానికేగాక వీరు తమ ద్విపదరచనలద్వారా సంగీత సాహిత్యాలకు ఎంతోస్ఫూర్తి నిచ్చారు. తెనుగు దేశిసారస్వతాన్ని సుసంపన్నం చేశారు.

వేటూరి ఆనందమూర్తిగారన్నట్లు "వీరశైవుల మతాభినివేశం, తిక్కనగారి రసోత్తేజం, దేశి తెనుగులోని తీయని మధురకవిత్వాంశతో మేళవించి తాళ్లపాకవారిని ఆవేశించినది"

ఒకే కుటుంబానికి చెందిన నలుగురు సాహిత్యకారులు పౌరాణిక, చారిత్రక, సాంఘిక ఇతివృత్తాలను చేపట్టిద్విపద ప్రబంధాలను రచించడం తెలుగుసాహిత్య చరిత్రలో అపూర్వమైన అంశం. *

# అన్నమయ్య సందేశం

డా॥ ఎ. పద్మబాల

వాగ్గేయకారులు సామాజిక కవులు వారు సందేశవాహకులు. సందేశ బోధకులు సందేశతత్త్వ అవగాహకులు. అటువంటి వారిలో అన్నమయ్య ఒకడు

అన్నమయ్య సందేశం నాలుగు రకాలు.

1 ఆదర్శ జీవనమే సిద్ధాంతం, సందేశం. రాజసేవా నిరాకరణ, వ్యవసాయ జీవనం. గ్రామాదుల దానం సంకీర్తనలు క్రమబద్ధంగా వ్రాయడం. తననూ తన కుటుంబాన్ని శ్రీనివాససేవకు అంకితం చేయడం.

2 సంకీర్తనల ద్వారా సందేశం.

3. మతసందేశం- రామానుజ మతమే శ్రేష్ఠమనడం

4. ధర్మసందేశం-నీతి, భక్తి, వైరాగ్య భావనలతో పరతత్త్వం చెప్పడం.

బ్రహ్మతత్త్వ సందేశం - వృత్తి గౌరవం, జాతిమత భేదరాహిత్యం బాహ్యాచారాలపట్ల నిరసన. కనక కాంతాదులపట్ల అభిప్రాయ ప్రకటన. స్త్రీలకు, పురుషులకు ప్రత్యేక సందేశాలు

సామాజిక సందేశం -'తందనాన అహి తందనాన" లౌకిక సందేశాలు

## అన్నమయ్య సందేశం

సందేశం అనేమాట రామాయణ కాలం నాటిది శ్రీరామచంద్రుడు సీతమ్మవారికి హనుమంతుని ద్వారా సందేశం పంపించాడు. భారతంలో కుంతీదేవి కృష్ణుని ద్వారా పాండవులకు కర్తవ్య సందేశం పంపింది. మరి ఈ మాటను 'అన్నమయ్యకు' అనుసంధానిస్తే ఎవరు ఎవరికి సందేశం పంపుతున్నారనే సందేహం రావడం సహజం. కాని ఇక్కడ కూడా పంపేవాడు భగవంతుడు. పరమాత్మ. సందేశహరుడు భక్తుడు వాగ్గేయకారుడయిన అన్నమయ్య సందేశం జీవాత్మలకు అని అన్వయించుకుంటే సరిపోతుంది దానికి కారణాలు

మొదటిది భక్తుడు భగవంతుని చేరడానికి పరితపించినట్లే భగవంతుడుకూడా జీవుల విరహాన్ని సహించలేడు పైగా తల్లి పిల్లలక్షేమాన్ని కోరేవిధంగా పరమాత్మ జీవుల సంక్షేమాన్ని ఎపుడూ కోరుకుంటాడు అంచేత సందేశం అనివార్యం

రెండవది వార్తాహరుడు విశ్వాసపాత్రుడుగా ఉండాలి సందేశం పంపేవారికి సన్నిహితుడుగా ఉండాలి.

అన్నమయ్య స్వామి నందకాంశంతో జన్మించిన వాడు కావడం వల్ల సన్నిహితుడు మూడవది 84 లక్షల జన్మాల అనంతరం మానవ జన్మ మానవ జన్మ సార్ధకం చేసుకోవాలి దేవతలు కూడా మానవులుగా పుట్టాలని కోరుకుంటారట కారణం దేవలోకంలో ఎపుడూ 'త్రిదశ' స్వరూపమే, పుట్టుకమరణం, కష్టసుఖాలు అన్నీ ఈ లోకం వారికే. అంచేత 'సందేశం' అవసరం.

అన్నమయ్య 'జీవులకు' సందేశమివ్వడానికి వచ్చాడని అవతరించాడని అనడం సబబయితే ఏలాంటి జీవులకు అనే ప్రశ్న సహజంగా కలుగుతుంది. అన్నిరకాల జీవులకూ అని సమాధానం రాజులకూ, సన్యాసులకూ, ఆడవారికీ మగవారికి, పేదవారికి, ధనవంతులకూ, రకరకాల వృత్తులవారికి, సందేశం ఇచ్చాడు. తనసాటి కవులకు సందేశమిచ్చాడు. వాటినంతా అనేక రకాలుగా వర్గీకరించడానికి వీలుంది.

'ఆదర్శ జీవితం గడపడమే' ఒక సందేశం. గాంధీ ఆదర్శ జీవితంలాగే అన్నమయ్య జీవితం ఆదర్శ జీవితం. సాళ్వ నరసింహరాయలు కొలువులో వుంటే లౌకిక జీవితానికి అవరోధాలు లేవు. నరసింహరాయలపై పాటపాడితే రాజగౌరవం, రాజసన్మానం రెండూ అలవోకగా లభిస్తాయి. కాని

**నరహరి కీర్తన నానిన జిహ్వ**
**పరుల నుతింపగ నోపదు జిహ్వ**

అంటూ తిరస్కరించడమే ఒక ఆదర్శ జీవితం. తను మాత్రం కాకుండా తన కుటుంబాన్ని అంతా స్వామి సేవకు అంకితం చేయడం మరో ఆదర్శజీవితం. రోజుకో కీర్తనవంతున తుది శ్వాసవిడిచేవరకు 32 వేల కీర్తనలు వ్రాయడం ఆదర్శ జీవిత సందేశం. ఒక్క సంకీర్తనం వొద్దికనుండచాలు తక్కినవి భండారాన దాచివుండనీ అనే విశ్వాసం ఆదర్శ జీవితం. ధీమా వాగ్గేయ కారులందరూ ఈ లాగే వుండాలని అన్నమయ్య ఆకాంక్ష. సందేశం

కూడా అంచేతనే పురందరదాసు విజయనగర రాజవీథులలో జోలెపట్టాడు కాని రాయల సంవత్సర గ్రాసదానానికి ఒప్పుకోలేదు రామదాసు నరహరి సేవకే అంకితమయ్యాడు త్యాగయ్య అయితేనిధి చాల సుఖమా? రాముని సన్నిధి సుఖమా అంటూ 5 ఎకరాల మాగాణి దానం వద్దన్నాడు. తనకు ఇచ్చిన గ్రామాల్ని కూడా స్వామి కైంకర్యాలకు వినియోగించవలసిందిగా ఆదేశించడం అన్నమయ్య సందేశం

అన్నమయ్య కవులకు కూడా పరోక్షంగా సందేశమిచ్చాడనడం సబబు. కవులారా! రాజాస్థానాలలోని సుఖాలకు తలవొగ్గకండి పండితుల మెప్పుమాత్రం పరమార్థం కాదు సామాన్యప్రజల కోసం మీ రచనలుండాలి. మీ సామాజిక బాధ్యత ఏమిటి అనే విధంగా ప్రశ్నించాడు. అంచేతనే ప్రబంధాల జోలికి పోకుండా పాటల్ని అభిమానించాడు గేయాన్ని ఆదరించాడు రాజాస్థానాలు నిలయాలు కావు. రమణీయ గ్రామ ప్రదేశాలు కూడా అని పల్లెపల్లెలూ తిరిగాడు సులభమయిన భాషలో కవితలల్లడం అవసరమని పరోక్షంగా చెప్పాడు తెలుగుపదాల తీయదనం తెలుసుకో మన్నాడు అంచేతనే పుట్టపర్తివారు భాషావిషయంలో తిక్కనకు అన్నమయ్యదగ్గరివాడు అన్నారు తనపాటను, తనపదాలను వాడుకునేవారిని

'వెఱ్ఱులాల మీకు వేడుక కల్గితేను
అఱువంచి తడుకల్లంగ రాదా'
అని నిరసించాడు. ఇది కూడా ఒకరకమయిన సందేశమే.
సంసారులకిచ్చే సందేశం.
'సంసారమే మేలు సకల జనులకు
కంసాంతకుని భక్తి కలిగితే చాలా'

అన్నమయ్య కాలంనాటికి మతం పట్ల, ముక్తిపట్ల రకరకాల అభిప్రాయాలుండేవి. యోగానికి ప్రాధాన్యం ఇచ్చేవారు కొందరు. సన్యాసులు కావడం పరమార్థమని అనుకునేవారు కొందరు. సాంసారిక జీవితం పట్ల వైముఖ్యం పాటించేవారు కొంధరు. కాని, సంసారం అవశ్యకతను స్పష్టంగా చెప్పడం అన్నమయ్య సందేశం. అదే సందర్భంలో సంసారం గురించి కూడా హెచ్చరిక చేశాడు.

చమురు దీసిన దీపమట.

అన్నమయ్యకు అన్ని వృత్తులు సమానమే. అన్ని కులాలు సమానమే. అంచేతనే అన్ని వృత్తులకు సంబంధించిన కీర్తనలు కుమ్మరి, కమ్మరి, వైద్యుడు, వ్యవసాయదారుడు గొల్ల, చెంచు, బోయత, బ్రాహ్మణ, ఎరుకల పాటలు అన్నిటిలోనూ బ్రహ్మర్షి చేసిన అసలయిన బ్రాహ్మణుడు అన్నమయ్య

మానసిక పూజ. భౌతిక పూజలపట్ల సందేశం.

నా దేహమే నీకు తిరుమలగిరి పట్టణము
భావింప హృదయ కమలమే బంగారు మేడ

మూఢాచారాలపట్ల సందేశం.

గ్రహబలాదులపట్ల అసక్తిరాహిత్యం
కనుగొను నీ విగ్రహమే గ్రహబలమిది నాకు

కుటుంబంపట్ల హెచ్చరిక.

అంత హితులా తనకు అన్నలును తమ్ములును వంతు వాసికి పెనగువారే గాక

అన్నలంటా తమ్ములంటా
ఆండ్లంటా బిడ్డలంటా
ఎన్నుకొని తిరిగేరు బహురూపాలు.

ఆశ్వాసం : విశ్వాసం . దైవభక్తి పట్ల సందేశం.

దేవుడు కలవారికి దిగులు చింతయు లేదు
త్రికరణ శుద్ధిగ చేసిన పనులకు
దేవుడు మెచ్చును లోకము మెచ్చును
ఉపకారి దేవుడు అపకారి కాడు.

గురుభక్తి.

గురువు కలవానికి కొరత ఏమియు లేదు
అన్నియును దగ ఆచార్యాధీనము.

హెచ్చరిక: జీవులకు సందేశం.

నటనల భ్రమయకు నామనసా
ముంచిన జగమిడి మోహినీ గజము
పొంచిన ఆస పుట్టించేదిది
వంచనల నిజము వలెనే వుండును
మంచులు మాయలె మరునాడు
నానాటికి బ్రతుకు నాటకము

సామాజిక నీతి. సందేశము.

విజాతులన్నియు వృథా వృథా
జాతి భేదములు శరీరగుణములు
ఏ కులజుడేమి ఎవ్వడైననేమి
ఆ కడ నాతడె హరినెఱిగినవాడు.

ధనంపట్ల వైముఖ్యం.

సిరులు కల్గిన ఫలము చింతపొరలనె కాని
సొరిది సంతోష మించుక యైన లేదు
వెతల పొరలే ఘనవిభవము కంటె
అతి పేదరికమతి సుఖము
కలిమికంటె చీకటి గద్దా
అప్పులేని సంసారమైన పాటే చాలు
చింతలేని యంబులొక్క చేరడే చాలు

స్త్రీలకు సందేశం.

పతితోడ సతికి పంతములాడందగదు
మితిమీరి గర్వమున మించంగ దగదు. నవ్వే స్త్రీకి మూలధనము.

భక్తి సందేశం.

ఏమి వలసిననిచ్చు నెప్పుడైనను
ఏమరక కొలచిన నీతడే దైవము
పంతమాడి కొలిచిన ప్రాణమిచ్చు ప్రాయమిచ్చు

ఎంతటి పదవులైన నిట్టెయిచ్చు
నేర్పు కంటె పెన్నిధి గద్దా
ఓర్పు కంటె సుఖమొకటి కద్దా

బంటు ఎలా ఉండాలనే సందేశం.

ఏలికను దైవముగా నెంచి కొల్చేవాడె బంటు
తాలిమి గలిగిన యాతడే బంటు
పాలుమాలక ఏ ప్రొద్దు పనిసేయువాడె బంటు
వేళ గాచుక వుండేటి వెరవరే బంటు
ధనము పట్టున శుద్ధాత్మకుడు బంటు
అనిశము నెదురు మాటాడని వాడె బంటు
అనిమొన తిరుగని యతడె బంటు
చెప్పినట్లనే నడచిన యాతడె బంటు
తప్పులేక హితుడై నాతడె బంటు
మెప్పించుక విశ్వాసాన మెలగువాడె బంటు
ఎప్పుడును ద్రోహిగాని హితుడె బంటు

కొన్ని లౌకిక సత్యాలు.

పంతములేల అట్టి
పందతనమేల
జాగరము సేయనేల సరిగా
నిద్రించనేల
ఎంత తొండమున్నా దోమ ఏనుగవునటే?

సాత్త్విక ప్రవృత్తి అలవరచుకోవలసిందిగా సందేశం.

ఇతరుల దూరనేల ఎవ్వరూనేమి సేతురు
మతివారు తమవంటి మనుజులేకాక
చేరి మేలు సేయ కీడుసేయ నెవ్వరు కర్తలు
ధారుణిలో నరులకు దైవమే కాక!



# యోగి వేమన

ఆచార్య ఎస్. గంగప్ప

"ఉప్పు కప్పురంబు నొక్క పోలిక నుండు
చూడ చూడ రుచుల జాడ వేఱు
పురుషులందు పుణ్యపురుషులు వేరయా
విశ్వదాభిరామ వినుర వేమ"

-ఇది మనకందరికీ తెలిసిన వేమన పద్యం ఆయన మాటల్లోనే పురుషులందు పుణ్య పురుషులు వేరైనట్లు వేమన పుణ్య పురుషుడు. ఇదే రీతిగా ఎందరో మానవులున్నారు.

భావ వ్యక్తీకరణలో వేమన ఉత్తమ కవిగా కన్పిస్తాడు. పై పద్యంలో మొదటి పాదంలో సిద్ధాంతాన్ని నిరూపిస్తాడు. ఇది వేమన అభివ్యక్తి విశిష్టత

## నిత్య సత్యాలు : సూక్తులు :

'పుట్టలోని చెదలు పుట్టదా గిట్టదా"- అనే పాదం లోకోక్తిలా, తెలుగువారి నోళ్ళల్లో అచ్చమైన సామెతలా ప్రచారంలో ఉంది. ఆ సూక్తి రెండు సందర్భాల్లో రెండు రకాల అభిప్రాయాల్ని సమర్థించటానికి చెప్పినట్లు తెలుస్తున్నది ఆర్షధర్మం ప్రకారం 'మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ" అని వివరించటానికి

"తల్లిదండ్రి మీద దయలేని పుత్రుండు
పుట్టనేమి వాడు గిట్టనేమి
పుట్టలోని చెదలు పుట్టదా గిట్టదా
విశ్వదాభిరామ వినుర వేమ." అనే పద్యం చెప్పాడు.

పుట్టిన పుత్రుడు తల్లి దండ్రుల మీద మమతా మమకారం, దయా దాక్షిణ్యం కలిగి ప్రవర్తించడం పుట్టినందుకు సార్థకత. లేకపోతే పుట్టలో చెదలు పుట్టుతూ గిట్టుతూ ఉన్నట్లు వీని జన్మ అనర్థకం. ఇదొక సందర్భంలో చెప్పిన అంశం. మరో సందర్భంలో ఇలా అన్నాడు.

పెట్టి పొయ్యలేని వట్టి నరులు భూమి
పుట్టనేమి వారు గిట్టనేమి
పుట్టలోన చెదలు పుట్టదా గిట్టదా || విశ్వ ||

-ఇక్కడ మొట్ట మొదటి పంక్తి తప్ప, తక్కినదంతా సమానమే లేనివారు ఎలాగూ పెట్టలేరు కాని ధనవంతులు ధనమున్నందుకు దానం చెయ్యడమే పరమ ప్రయోజనం లేకపోతే ఆ ధనం లేక పోతేనే మేలు మనకు తెలుసు, ధనము సర్వాభీష్టకారి అని భర్తృహరి సుభాషితము మనకందరకూ విదితమే ఇంకాస్త ముందుకు వెళ్లి భర్తృహరి ఈ విషయాన్ని విశిష్టంగా చెప్పాడు

విద్యయొసగును వినయంబు వినయమునను
బడయు పాత్రత, పాత్రత వలన ధనము
ధనము వలనను ధర్మంబు దానివలన
నైహికాముష్మిక సుఖంబు లందు నరుడు

-ధనమున్నందుకు ప్రయోజనం దానం చెయ్యడం మేమూ ధనవంతుల మని గొప్పలు చెప్పుకొంటూ కోటికి పడగలెత్తి, పిల్లికి బిచ్చం పెట్టనివారు పుట్టలో పుట్టి చచ్చే చెదలుతో సమానం. వారి పుట్టుక లేకపోయినా ప్రమాదం లేదు.

"ఇయ్యగ ఇప్పించంగల
అయ్యలకే గాని యింక అన్యులకేలా
రొయ్యకులేదా మీసము"

-అని కవి చౌడప్ప నిరసించాడు. ధనముండీ దానం చెయ్యలేని అయ్యలను గూర్చి ఇది ఒకనాటి మాట. ఈ విషయాన్నే మరింత స్పష్టంగా వివరించాడు వేమన

ధనము గూడ బెట్టి ధర్మంబుసేయక
తాను దినక లెస్స దాచుగాక
తేనె నీగ గూర్చి తెరవరి కియ్యదా || విశ్వ ||

-ధనాన్ని ఎన్నో కష్టాలనుభవించి సంపాదించి, దాన ధర్మాలు చేయక, తానూ తినక దాచి పెట్టే వాడు తేనెటీగతో సమాన మంటాడు. కాబట్టి ధనము ఉన్నంత వరకు దాన ధర్మాలు చేయడం సముచితం. దీన్ని

తాత్త్విక చింతనంతో, మరింత తాత్వికతతో పోయేనాడు ఏదీ తనతో రాదని, మిగిలేది మంచి ఒక్కటే అని చక్కగా వేమన వివరించాడు

"ఇంటిలోని ధనము ఇది నాది యనుచును
మంటిలోన దాచు మంకు జీవి
కొంచు బోడు;వెంట గుల్లకాసును రాదు || విశ్వ ||

-ఇది అనాడు, ఈనాడు, ఇంకేనాడైనా మానవులందరికీ గుణపాఠమే. ఇదంతా సామాజిక వ్యవహారం. సమాజం లోని ప్రతిమానవుడు ప్రవర్తించే తీరును వేమన నిర్దేశించాడు. సామాజిక రుగ్మతల్ని దుయ్యబడుతూ చెప్పిన తీరు ఇది.

క్షమాగుణానికి చక్కటి వివరణ ఇచ్చాడు వేమన.

"చంప దగిన యట్టి శత్రువు తన చేత
జిక్కనేని కీడు సేయరాదు
పొసగ మేలు చేసి పొమ్మనుటే చాలు (చావు) || విశ్వ ||

అని చక్కగా వివరించాడు.

వేమన ఆస్తికుడన్న విషయం ఆయన పద్యాల అంతస్సాక్ష్యం వల్ల స్పష్టమవుతుంది. వేమనను ఎన్ని దృక్కోణాలనుంచి చూస్తే అన్ని విధాల మనకు దర్శన మిస్తాడు. అతనిలోని గొప్పదనమే అది. అందుకే ఆయన ఆస్తికతతో పాటు యోగసాధకుడనీ, తద్వారా తాత్త్విక చింతనా పరుడని విదిత మవుతుంది.

ఆయన ఆస్తికతకు అనేకమైన ఉదాహరణలు ఇవ్వవచ్చు. అతి సామాన్య ప్రజలకు సైతం దేవుడంటే నమ్మకం కుదరటం కోసమే దేవుడని, దేవాలయమని, దైవపూజ అని ఈలోకానికి మార్గం చూపటం జరిగిందంటాడు వేమన. విశ్వాన్ని గ్రహిస్తే దేవాది దేవుణ్ణి గ్రహించినట్లే అని ఎంతో ఆస్తికుడైన వేమన ఇలా పేర్కొన్నాడు.

"దేవ పూజలందు దేవాలయములందు
దేవుడంట జెప్పి తెఱువు జూపె
తెలియ విశ్వమెల్ల దేవాది దేవుడై || విశ్వ ||

-ఈవిషయాన్నే మరింతగా వివరిస్తాడు దైవపూజ వల్ల సమస్త భోగాలు సిద్ధిస్తాయని, ఆ తత్త్వాన్ని తెలుసుకొన్న వాడే దైవసముడని, తద్విరహితుడైన వాడు ఏమీ లేనివాడని స్పష్టం చేశాడు

"దేవపూజసేయ దివ్య భోగము కల్గు
తత్త్వమెఱిగె నేని దైవ సముడె
ఏమి లేని నరున కేగతి లేదురా || విశ్వ ||"

గురువులో భగవంతుణ్ణి చూడగలిగిన వాడు వేమన ఈ విషయాన్ని వివరించడానికి అనేక పద్యాలు ఉదాహరించ వచ్చు.

వాక్కునందు గురువు వాక్తత్త్వమున గుర్వు
చీకటిని గురుండు చిక్కియుండు
అఖిలమునకు గురువు నాధారమైయుండు || విశ్వ ||

-ఇవన్నీ వేమన ఆస్తికతను నిరూపిస్తాయి.

వేమన ఉత్తమ తాత్త్వికుడని ఆయన పద్యాలు వివరిస్తాయి ఇంతకు పూర్వమే మనం చెప్పుకొన్నట్లు వేమన ఆస్తికుడు ఆ విషయాన్నే ఆయన తాత్త్వికత ద్వారా మనం తెలుసుకో గలుగుతాం. ఆయన స్వయంగా తాత్త్వికుడు కావటం వల్లనే భగవత్ తత్త్వాన్ని పరిపూర్ణంగా వివరించ గలిగాడు.

'తత్త్వ మెఱుగు వాడు దైవంబు నెఱుగును' అని విస్పష్టంగా పేర్కొన్నాడు ఇహలోక సంబంధమైన ఆశలన్నీ నశించినపుడు తత్త్వజ్ఞుడౌతాడు చివరికి తానే తత్త్వమౌతాడని, అలాంటివాడే తత్త్వయోగి అని వేమన నిర్ణయం

తత్త్వము తిరమైన తావుల వెదకుచు
తాను తత్త్వమగును తత్త్వయోగి
తలపు లన్ని యుడుగ తానెపో తత్త్వంబు || విశ్వ ||

-ఇహలోక సంబంధమైన సమస్త ఆలోచనలు తొలగిపోయి పారలౌకికమైన చింతన ప్రబలి నప్పుడు విశుద్ధమైన తత్త్వము తానే ఔతాడంటాడు దీన్ని మించి ఎఱుకయే అంటే జ్ఞానమే తత్త్వమంటాడు వేమన. జ్ఞాని అయిన వాడే తత్త్వజ్ఞుడు.

ఈ విషయాన్ని తెలుగు మాటల్లో తేటగా వివరించిన తీరు అనన్య సామాన్యమే కాదు, అనితర సాధ్యం.

ఎఱుక కన్నను సుఖ మేలోకమున లేదు
ఎఱుక నెఱుగ నెవని కెఱుక లేదు
ఎఱుక సాటి యెఱుక, యెఱుకయే తత్త్వంబు || విశ్వ ||

-అలాంటి తత్త్వజ్ఞుడు కావటం సులభం కాదు. అందుకు ఉపమా సామగ్రితో వివరించిన తీరు సామాన్య ప్రజలకు కూడా తెలుసు కోవటం సులభం.

కానలేడు నుదురు కర్ణముల్ వీపును
నెఱులు గానలేడు నెత్తి మీద
తన్నుగాన లేడు తత్త్వమే మెఱుగును || విశ్వ ||

-తరచిన కొద్దీ కఱ్ఱలో అగ్ని, పెరుగులో వెన్న, ఆలోచించేకొద్దీ తత్త్వం అవగ్గతమవుతుందట.

తరువ తరువ బుట్టు తరువున ననలంబు
తరువ తరువ బుట్టు దధిని ఘృతము
తలప తలప బుట్టు తనువున తత్త్వంబు || విశ్వ ||

-లోకంలోని అతి సహజమైన అంశాల్ని వివరిస్తూ తత్త్వబోధ చేయటం వేమనకే సాధ్యమైంది. ఈనాడు ప్రాణ వాయువు విశిష్టత ఏమిటో మనకు తెలుసు. అలాంటి ప్రాణ వాయువే తత్త్వ మంటాడు వేమన. ఊపిరి ఉన్నంత వరకే జీవియొక్క కార్య కలాపాలు. ఆవెనుక ఏమీ ఉండదు అంతటికీ ఆ గాలి ప్రధానం.

వాయువందె బుట్టి వాయువందె బెరిగి
వాయువందు మేలు వరుస దెలియు
వాయువందు ప్రాణ వాయువు తత్త్వంబు || విశ్వ ||

ఈ జ్ఞానం ఎలా ఉంటుందో స్పష్టంచేశాడు వేమన.

గాజుకుప్పె లోన కడగుచు దీపంబు
ఎట్టు లుండు జ్ఞానమట్టు లుండు
తెలిసి నట్టి వారి దేహంబు లందుల || విశ్వ ||

- 'కుంభ గతప్రదీప కళికా శ్రీదోప' అని మను చరిత్ర కారుడు పేర్కొన్నాడు.

ఇంకా ఆత్మ నిత్యమని, దేహమనిత్యమని పంచభూతాత్మకమైన ఈ శరీరం పంచ భూతాల్లో కలిసి పోతుందని ఎంతో సులభంగా, అందరికీ అర్థమయ్యేలా వేమన చెప్పడమనేది విశేష, ప్రశంసకు పాత్రమైన అంశం

గాలిగాలి గలిసె, గగనంబు గగనంబు
మన్ను మన్ను గలసె, మంట మంట
నీరు నీట గలసె నిర్మలంబై యుండె ॥ విశ్వ ॥

-ఇలాంటి రచన వేమనకు సహజమైంది. మనకు తెలుసు ఇలాంటి మరో పద్యం.

చెప్పులోని రాయి చెవిలోని జోరీగ
కంటిలోని నలుసు కాలిముల్లు
ఇంటిలోని పోరు ఇంతింత గాదయా ॥ విశ్వ ॥

వేమన యోగం :

సామాన్యంగా యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహారము లైదూ యోగ సాధనకు ముఖ్యం. పంచేంద్రియాలు మనసుతో చేరి నిలిచి నప్పుడు బుద్ధి సంచలించకుండా స్థిరంగా ఉన్నప్పుడు పరమ గతి అంటారు. అలాంటి ఇంద్రియ ధారణమే యోగం అని పిలువ బడుతుంది.

ఈ విధంగా శరీరం స్వాధీనమై మనస్సుకు చంచలత్వం తగ్గిపోయి, మనం కోరిన వస్తువుపై నిలుప వలసి ఉంటుంది. దీన్ని ధారణ అంటారు దాన్నే స్థిరంగా నిలపటం ధ్యాన మంటారు. ఈ రెంటిలోను - నేను దీనిని ధ్యానిస్తున్నాను అనే ధ్యాత, ధ్యేయం, ధ్యానం అనే మూడంశాల్ని కొన సాగిస్తుండగా మనం ధ్యానం చేసే వస్తువుమాత్రం మిగిలి - నేను అనే కర్త, ధ్యాన మనే క్రియ రెండూ అంతరించి పోతాయి. దీన్నే సమాధి అంటారు ఇదే యోగం.

యోగసాధన చేసిన మహనీయుడు వేమన. అయన పద్యాల్లో ఈ యోగ సంబంధమైన సమస్త విషయాలు పొందు పరచినట్లు విజ్ఞులు వివరించారు సమస్తమూ మాయ అని వేమన గుర్తించాడు. ఆత్మ స్థిరమని శరీరమనిత్యమని భావించి ఈ లోకాన్నంతటినీ మాయ గానే తెలిపాడు. ఆ మాయను తెలిసినవాడు మర్మజ్ఞుడైన యోగి అని వేమన భావన.

బ్రతుకు నెల్ల మాయ భవ బంధములు మాయ
తెలివి మాయ తన్ను దెలియ మాయ
మాయ దెలియు నాడు మర్మజ్ఞుడౌ యోగి || విశ్వ ||

ఇలాగే మరికొంత సులభంగా, సరళంగా అర్థమయ్యేరీతిలో వేమన చెప్పాడు

సతులు సుతులు మాయ సంసారములు మాయ
ధనము ఘనము మాయ తనువు మాయ
మాయ గెలుచువాడు మర్మజ్ఞుడగు యోగి || విశ్వ ||

- ఆ మాయను గుర్తించిన వాడు ధన్యుడంటాడు

"మాయలోన బుట్టి మాయలోన బెరిగి
మాయ దెలియ లేని మనుజు డేల
మాయ దెలియు వాడు మహిమీద ధన్యుండు|| విశ్వ ||

ఇలాగ వేమనను రాజ యోగిగా కూడా పండితులు వివరించారు.

చివరిగా తత్త్వమేమిటనే విషయాన్ని వేమన చాలా సముచితంగా వివరించాడు దేశమంటే మట్టికాదని, దేశమంటే మనుషులనీ ఆధునిక యుగ వైతాళికుడు గురజాడ ఉవాచ. ఈ విషయాన్నే మధ్య యుగాల వైతాళికుడైన వేమన గుర్తించాడు. గుర్తించటమే కాదు చక్కగా వివరించాడు భూమిలో సారమూ, శ్రమజీవుల చెమటలో సమస్తమూ పుడు తుందని అలాంటి శ్రమకు ఎంతో ప్రాధాన్య ముందనీ గుర్తించిన మహనీయుడు వేమన.

భూమిలోన బుట్టు భూసార మెల్లను
తనువులోన బుట్టు తత్త్వమెల్ల
శ్రమములోన బుట్టు సర్వంబు తానేను|| విశ్వ ||

-యోగ సంబంధమైన తాత్త్వికతతో పాటు శ్రమ జీవుల చెమటల్లో సమస్తమూ ఉందని 'శ్రమైక జీవన సౌందర్యాన్ని' గుర్తించిన యోగి పుంగవుడు వేమన

పసులవన్నె వేఱు పాలేక వర్ణమౌ
పుష్ప జాతి వేఱు పూజ యొకటె
దర్శనంబు వేఱు దైవంబ దొక్కటే
విశ్వధాభి రామ వినుర వేమ!

*

డా॥ కట్టమంచి మహాలక్ష్మి

సాహిత్యంలో పుష్ప, ఫల, వృక్ష సంపద అనే అంశం సాహిత్య పరులకు ఆసక్తి దాయకం. నిత్య జీవితంలో పువ్వులు, పండ్లు, వృక్షాలు ఎంతటి ప్రముఖ స్థానాన్ని ఆక్రమించాయో అంతటి స్థానాన్నే వాటిని కవులు సందర్భాను సారంగా తమ రచనల్లో కల్పించారు.

"పత్రం పుష్పం ఫలం తోయం
యోమే భక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యు పహృతం
అశ్నామి ప్రయతాత్మనం" -(అ 9 - శ్లో 26 భగవద్గీత)

ఎవడు నాకు భక్తితో ఆకు గాని, పువ్వు గాని, పండు గాని, జలం గాని సమర్పిస్తాడో అట్టి పరిశుద్ధాంతః కరణుడిచ్చే పత్ర పుష్పాదులు నేను ప్రీతితో ఆరగిస్తున్నాను అని భగవద్గీతలో శ్రీ కృష్ణ పరమాత్మ వచించాడు

పద్మ పురాణంలో ఆయా మాసాల్లో దేవ పూజకు వాడవలసిన ఫల పుష్పాల వివరణ వుంది.

సర్వేభ్యః పత్ర పుష్పేభ్యః సత్తమా తులసీ శివా ।
సర్వ కామ ప్రదా శుద్ధా వైష్ణవీ విష్ణు సుప్రియా ॥
భక్తి ముక్తి ప్రదా ముఖ్యా సర్వలోక పరా శుభా ।
యామాశ్రిత్య గతాః స్వర్గ మక్షయం ముని సత్తమా ॥

పత్ర పుష్పాలన్నింటిలో శ్రేష్ఠం, శుభప్రదం తులసీ పత్రమనీ మహా విష్ణువు భార్యగా చెప్పబడే తులసిని పూజిస్తే కోరికలు నెరవేరుతాయని నమ్మకముంది. తులసిని పూజించి మహా మునులు స్వర్గసుఖాలు పొందారు

తులసీదేవి తమ భక్తులకు మంచి వంశం, గుణాలు, భార్య / భర్త మోక్ష సంబంధమైన బుద్ధి, శాస్త్ర జ్ఞానం, కళల్లో నేర్పరితనం, వేద-వేదాంగాల పరిజ్ఞానం వంటి సకల సంపద లిస్తుంది. గంగానదీ జలాలు, పుష్కర

జలాలు మొదలైన వాటికంటె తులసీ దళాలతో మిశ్రితమైన సామాన్య జలంతో పూజిస్తే విష్ణుమూర్తి సంతృప్తి చెందుతాడు.

సత్యభామ శ్రీకృష్ణుని తన వశం చేసుకోవాలని శ్రీకృష్ణ తులాభారాన్ని నిర్వహించింది. సత్యభామ యావత్తు బంగారంతో తూగని శ్రీకృష్ణుడు రుక్మిణీదేవి సమర్పించిన ఒకే ఒక తులసి దళంతో తూగిన కథ సాహిత్యంలో చోటు చేసుకుంది. తులసీ ప్రాశస్త్యాన్ని ఈ కథ బలపరుస్తున్నది

ఉన్నతమైన పుష్పాల పుట్టుక బ్రహ్మ పురాణంలో వుంది మంథర పర్వతాన్ని కవ్వంగా, వాసుకిని త్రాడుగా చేసుకొని దేవదానవు లిద్దరూ కలసి క్షీరసాగర మథనం గావించారు ఆ ప్రయత్నంలో అమృతంకన్నా ముందుగా హాలహాలం పుట్టింది తరువాత లక్ష్మి ఉద్భవించింది. చంద్రుడు, కల్ప వృక్షమైన పారిజాతాదిగా గల వృక్షాలు పుట్టాయి. ఈ విధంగా పుష్పాలకు అమృత సోదరత్వం ఆపాదించబడింది

పారిజాత పుష్పాన్ని నారదుడు దేవేంద్ర లోకం నుంచి తెచ్చి శ్రీకృష్ణుడి కిచ్చి ఆ పుష్పం విలువను వివరించాడు శ్రీకృష్ణుడు తన సమీపంలో వున్న రుక్మిణికి ఆ పుష్పాన్నిచ్చాడు ఈర్ష్యా జనితమైన సత్యభామ పారిజాత వృక్షాన్నే అపహరించి తెమ్మని శ్రీ కృష్ణుని ప్రేరేపించింది ఈ కథా సందర్భాన్ని పురస్కరించుకుని నంది తిమ్మన 'పారిజాతాపహరణ'కావ్యాన్ని రచించాడు.

ప్రళయ కాలాంతంలో విష్ణుమూర్తి శయనించి వున్నప్పుడు విష్ణుమూర్తి నాభినుండి పద్మం పుట్టింది అందుకే విష్ణువును పద్మనాభుడంటారు. పద్మం లోంచి బ్రహ్మ ఉద్భవించినందున బ్రహ్మ పద్మోద్భవుడయ్యాడు. పద్మం కుబేరుని నిధుల్లో ఒకటైంది

"అంబుజోదర దివ్య పాదారవింద" అని శ్రీహరిని ప్రహ్లాదుడు కీర్తించాడు.

పద్మం పేరుతో పద్మపురాణం, పద్మవ్యూహం - ప్రసిద్ధాలు, పద్మినీ జాతి స్త్రీలు, పద్మజ (పద్మం నుండి పుట్టిన లక్ష్మి) పద్మసరోవరం తరచూ వినిపించేవే.

పుష్ప ప్రస్తావన రాని కావ్యం గాని, ప్రబంధం గాని లేదనే చెప్పాలి ఆముక్త మాల్యద శ్రీకృష్ణ దేవరాయలు రచించిన ప్రౌఢకావ్యం. విష్ణుచిత్తుని కుమార్తె గోదాదేవి తాను ధరించిన పుష్పమాలను శ్రీ రంగనాథునికి సమర్పించిన

ఉదంతం ఆధారంగా "ఆముక్త మాల్యద" అనే నామకరణం ఈ కావ్యాన
వన్నె తెచ్చింది అనాదిగా స్త్రీ పురుష లిద్దరికి పుష్పాల పట్ల అనుర
ఎక్కువగా ఉంది. ద్రౌపది సౌగంధిక పుష్పం కోరినందువల్ల భీము
గంధర్వులతో యుద్ధం చేయవలసి వచ్చింది

కంసుని ఆహ్వానంపై మధురా నగరం చేరిన శ్రీకృష్ణుడు కుబ్జ నుం
పూల మాలలు గ్రహించి అలంకరించు కున్నాడు అది శుభప్రదం. ఇందు
ప్రతిఫలంగా శ్రీకృష్ణుడు ఆమె వికార స్వరూపాన్ని పోగొట్టాడు.

అలంకరణలు చేయడానికి రాజాంతఃపురంలో సైరంధ్రి పేరుతో స్త్రీల
వుండేవారు. తిక్కన విరాటపర్వంలో ద్రౌపది పుష్పాలంకరణ చేసే విధానాన్ని
వివరించాడు

"కలపంబు లభినవ గంథంబులుగఁ గూర్చి
- - - - - - - - - - - - - - - - - - - - - - - -
బువ్వులు బహు విధంబులఁ గట్టి ముడికొక్క
భంగిగా నెత్తులు వట్టి యిత్తు
హారంబులు మెఱయ నొయ్యారంబుగా గ్రుచ్చి
యందంబు వింతగా నలవరింతు - - - -" (విరాటపర్వం. 1-107)

ఎంతో అందంగా అలంకరించ గల ద్రౌపది పనితీరు చూసి విరటుని
పట్ట మహిషి సుధేష్ణ ఆమె పట్ల అభిమానం చూపేది.

స్త్రీలు వివిధ పుష్పాలను వివిధ వేళల్లో ధరిస్తారు. గురువిందలు,
గన్నేరు, నవమాలికలు మబ్బు వేళల్లో ధరిస్తే శీతలాన్ని నిర్బంధించే శక్తి
వుంటుందట.

శీతాకాలంలో పొన్నలు, చేమంతులు, సురపొన్నలు, సంపెంగ, మొగలి,
పొగడలు కట్టుకుంటారు. ఇవి ఉష్ణాన్ని కలిగిస్తాయి. పుష్ప గుణంతో పాటు
పుష్పాల జీవిత కాలాలు, వాటి సౌరభ సమయాలు "చారుచర్య" అనే గ్రంథంలో
(12 -22 పద్యాలు) వివరింపబడి నాయి.

భారతంలో మాద్రి ముత్యాల హారాలతో పాటు "చారు సవర్ణహాసి,
నవచంపక" భూషితురాలైంది. పొగడ మాలలు ధరించింది. ఆ సువాసనలకు
పాండు రాజు మోహితుడైనాడు. మోహానికి పుష్పాలు ఉద్దీపనాలైనాయి
ముని శాపం గుర్తుకు రాలేదు. పాండురాజు మరణించాడు.

ఉ. చారు సువర్ణ హాసి నవచంపక భూషయు సింధు వారము
క్తా రమణీయమున్ వకుళదామవతంసయునై యపూర్వ శృం
గార విలాస లీల యెసగం దనముందట నున్న మ్రాద్రి నం
భోరుహనేత్రఁ జూచి కురుపుంగవుఁడంగజ రాగమత్తుడై
(ఆదిపర్వం - 5-141)

మేనక విశ్వామిత్రుని తపస్సు భంగం చేయడానికి భూలోకానికి వచ్చింది. కొప్పులో ధరించిన పుష్పాల సువాసనలు విశ్వామిత్రుని శరీరానికి తాకాయని కవి వర్ణించాడు

చల్లని దక్షిణ మారుత
మల్లన వీతెంచెఁ దగిలి యాలలనా ధ
మ్మిల్ల కుసుమాంగరాగస
ముల్లసన సుగంధి యగుచు ముని వరుమీఁదన్ (ఆది. 4-40)

విశ్వామిత్రుడు మేనక పట్ల మోహితుడై తపస్సు భంగం చేసుకోవడానికి పుష్పాలు ఒక కారణమని నన్నయ ఒక సూచన చేశాడు.

ప్రబంధాలలో కవులు స్త్రీల అంగాలకు, పుష్పాలకు సామ్యం కూర్చారు దేహం - సరోజమాల; కరతలం - పద్మం, ముఖం - పద్మం, నాసిక - సంపెంగ మొగ్గ; నేత్రాలు - పద్మం, స్తనాలు - తమ్మి మొగ్గలు, బిల్వఫలాలు, దబ్బ పండ్లు; పృష్ఠం - అరటి పట్టు; ఊరువులు - కదళీ కాండాలు; హాసం - పుష్పం

అష్టాదశ వర్ణనల్లో వనాలకు, ఉద్యాన వనాలకు శోభ గూర్చేవి పుష్పాలే. పుష్పాలలో సౌరభం గల వానికే మన్నన జాస్తి

పరిమళం లేని పుష్పం, కోకిలాలాపం లేని అరణ్యాలు శోభించనట్లే దమయంతీ సాహచర్యం లేని నీరూపం శోభించదని హంస నల మహారాజుతో చెప్పింది కవులు పూజకు పనికిరాని పూలను ఎత్తి చూపారు.

పత్రముల మీద మూగిన భ్రమర కులము
హర విసర్జన జనిత దుర్యశము బోల
గమియ వచ్చిన గేదంగి కన్నెపూవుఁ
గౌతుకము పల్లవింపంగ గాంచె విభుఁడు.
(శృంగార నైషధ కావ్యశిల్పం, పుట. 55)

మొగలి పువ్వుతో ఈశ్వరార్చన చేయరు. ఆ విషయాన్ని స్ఫురణలో వుంచుకొని కవి - వికసించిన మొగలి పూరేకులపై తుమ్మెదల గుంపు వాలిందని అందుచేత అక్కడ నల్లగా కనిపిస్తూ వుందని, మొగలి ఈశ్వరార్చన వర్జించి నందున దానికి నలుపు రూపం వచ్చిందని, అందువల్ల పుష్పం దుఃఖిస్తున్నదని భావించాడు నల మహారాజు అలాంటి పుష్పాన్ని చూచాడు.

మన్మథుని విల్లుకు పుష్ప బాణాలుగా శ్రీనాథుడు 'సురపొన్నలను' వాడాడు. (నైషధ కావ్యశిల్పం - 58 పుట)

పుష్పాల మూగ భాషను కవులు గ్రహించారు. నల మహారాజు హంసను పట్టబోగా పక్షులన్నీ ఒక్కుమ్మడిగా పైకి లేచి పోయాయి. సరోవరం ఆకులతో పూవులతో వూగిసలాడుతూ వుంది అది చూచేవారికి "వద్దు, వద్దు" అని నల మహారాజుని నివారించినట్టుగా వుంది. (నై కా శిల్పం - 54 పుట)

పక్షులు హఠాత్తుగా బయటకు వెడలి నపుడు కలిగిన వాయు కంపనానికి చిగురాకులనే చేతులలో ఫలాలు, పుష్పాలు అందించినట్టు అనిపించిందట

మదవతుల దోహద క్రియల వలన వృక్షాలు ఆకాలంలో పుష్పిస్తాయట పాదతాడనం చేత అశోకం చిగురుస్తుంది. ముఖాసవం వల్ల వకుళం పుష్పిస్తుంది.

"తీరైన రాగిణి తిరుగుడు పూవు
సౌరైన కెంపుల చంద్ర వంకయును
పాపిట బొట్టును పసిడి పోకయును
చూపుల కింపైన సూసకం బమర
నిలిపి పన్నెరుపువ్వ నెరితమ్మిరేకు....."

(సింహాసన ద్వాత్రింశిక 3-188)

పూల పేర్లననుసరించి అనేక ఆభరణాలు ఏర్పడ్డాయి. ఆది కావ్యమైన రామాయణంలో శబరి తత్త్వరహస్యం తెలిసినవాడు శ్రీరామ చంద్రుడని అన్నమయ్య సంకీర్తనల్లో కీర్తించాడు మతంగ మహర్షి ఆశ్రమంలోని మునులకు సేవచేసే తత్త్వం శబరిది. పూజకు కావాల్సిన పువ్వులు తెచ్చి శ్రీరాముని రాకకై ఎదురు చూస్తూ రుచికరమైన ఫలాలెన్నో ప్రీతితో రుచి చూసి శ్రీరాముడి కందించింది శ్రీరాముడు ప్రతిఫలంగా ముక్తిని ప్రసాదించాడు. 'శ్రీకాళహస్తి మాహాత్మ్యం' లో తిన్నడు శివునికి -

సీ. "నేరేడు పండులు నెలయూటి పండులుఁ
గొండమామిడి పండ్లు దొండపండ్లుఁ
బాల పండులు నెమ్మిపండులు బరివంక
పండులుఁ జిటిముటి పండ్లుఁ గలివి
పండులుఁ దొడివెంద పండ్లుఁ దుమ్మికి పండ్లు
జామ పండ్లు గంగరేను పండ్లు
వెలగ పండులు పుల్ల వెలగ పండులు మోవి
పండ్లు మంకెన పండ్లు బలుసు పండ్లు

బీర పండ్లను బిచ్చుక బీర పండ్లుఁ
గొమ్మి పండ్లీతపండ్లను గొంజి పండ్లు
మేడి పండ్లను మొదలుగా" గల పండ్లను
ప్రీతి పూర్వకంగా సమర్పించినట్లు చెప్పబడింది. (కాళ. 3-69)

శ్రీ మద్భాగవత పురాణంలో దుందులి, ఆత్మదేవుల వృత్తాంతం వుంది. ఆత్మదేవుడు సంతానం కోసం ఒక సన్యాసిని ప్రార్థించాడు. సన్యాసి ఇచ్చిన సంతానాన్నిచ్చే ఫలాన్ని అతని భార్య స్వీకరించక గోవుకేసింది. గోకర్ణుడనే వాడు గోవు చెవులతో మానవుడుగా పుట్టాడు.

దుందులి తన చెల్లెలి కొడుకును తన కుమారుడిగా పెంచుకొన్నది. అతడు దుర్మార్గుడై దుష్కార్యాలు చేసి భూతమయ్యాడు.

గోకర్ణుడు మహాభారత శ్రవణం చేస్తూ వుంటే అది విని దుందులి పుణ్యలోకాలు చేరుకొన్నాడు.

"ధాత్రీ ఫలం పరం పూతం సర్వలోకేషు విశ్రుతమ్" అని ధాత్రీ ఫల (ఉసిరికాయ) ప్రాశస్త్యం పద్మ పురాణంలో చెప్పబడింది. ఉసిరికాయ ఎంతో పవిత్రమైంది. ఉసిరికాయ మొక్క నాటితే భవ బంధ విముక్తి కలుగుతుంది తిన్నవారికి ఆయువు పెరుగుతుంది. ఉసిరిక రసంతో స్నానం చేస్తే దారిద్ర్యం తొలుగుతుంది. అష్టైశ్వర్యాలు ప్రాప్తిస్తాయి. శుక్ల పక్షంలో గాని, ఏకాదశిలో గాని ఎవరైతే ఉసిరి స్నానం చేస్తారో వారి పాపాలు క్షీణిస్తాయి. వైకుంఠం చేరుకో గల్గుతారు. ఉసిరి కాయతో స్నానం చేస్తే కేశాలు నిగనిగ లాడుతాయి తల్లి పాలు తాగనవసరం లేనంత గొప్ప లాభం చేకూరుతుంది.

ముద్గల మహాముని మందబుద్ధి, మూగ అయిన తన కుమారుని బావిలో పడేసి రాయి అడ్డం పెట్టాడు అయితే ఆ బాలుడు ఆ బావిలో వున్న ఉసిరి చెట్టు కాయలు తిని జీవించి సంపూర్ణ ఆరోగ్యవంతుడై మాటవచ్చి వేద వేదాంగ పారంగదుడైనట్లు వామన పురాణంలో ఉంది దీనికి కారణం ఉసిరికాయ ప్రభావం

వృక్షాలన్నింటిలో కల్పవృక్షం గుణ ప్రధాన మైంది దేవ లోకంలో వుంటుంది. కల్పకం కైలాసంలో వుండే శివుని తోట పేరుగా కథా సరిత్సాగరంలో చెప్పబడింది. అక్కడ ఏయే వృక్షాలు పెరుగుతాయో గాని దేవలోకంలో మాత్రం ఐదు కల్ప వృక్షాలున్నాయి. "మందార, పారిజాత, సంతాన, కల్పవృక్ష హరిచందనాలు" ఇవి క్షీర సాగర మథన సమయంలో ఉద్భవించిన వృక్షాలు

మానవులకి మేలు కలిగించే వృక్షాలున్నట్లే కీడు కలిగించే వృక్షాలూ వున్నాయి కాలవని అనేవాడు బలిచక్రవర్తి అన్న విరోచనుడి కొడుకు దేవతలకు భయపడి కపత్థ వృక్షమైనాడు కానీ వాడి రాక్షస గుణం నశించ నందున ఆ చెట్టు కాయల్లోంచి దుర్గంధం రావడం వల్ల పశువులకు రోగాలు వచ్చాయి. దాని నివారణకు నందాదులు శివపూజ చేసి దాన్ని నరికేశారు పచ్చని చెట్లని నరకడం పాతకాల్లో ఒకటి. తప్పని సరైనందున నందాదులు ఆ చెట్టును నరికేశారు.

శృంగభేరీపురం గంగ ఒడ్డున వుండే గ్రామం ఆటవిక జాతి వారు నివసిస్తుంటారు. అక్కడ ఒక పెద్ద గార చెట్టుంది. ఆ చెట్టుకింద శ్రీరామ చంద్రుడు అరణ్యావాసానికి వెళ్ళినపుడు విడిది చేశాడు. ఆటవిక రాజు గుహుడు రాముని తన గృహానికి ఆహ్వానించినా నిరాకరించి వ్రత దీక్షాపరుడైన రాముడు ఆ చెట్టు కిందనే విశ్రమించాడు.

వృక్షాలు నిస్వార్థ ప్రేమకు చిహ్నాలు. అందుకే పెద్దలు "వృక్షో రక్షతి రక్షితః" అన్నారు. వృక్షాలకు, మిత్ర, శతృత్వ భేదాలు లేవు. న్యూనతాధి పత్యాలు అసలే లేవు. ఒకనాడు శ్రీరాముడి బాణానికి గురైన మారీచుడు సుదూర ప్రాంతంలో వున్న వనానికి పరిగెత్తి చెట్టు కింద విశ్రమించాడు అక్కడి వాతావరణం అతడిలో మంచి ఆలోచనలను రేకెత్తించింది. మారీచుడు తన క్రూర స్వభావాన్ని విడిచి ముని వృత్తిని స్వీకరించాడు.

నల చరిత్రలో తాండ్ర వృక్ష ప్రసక్తి వుంది. నల మహారాజు ఋతు పర్ణుడికి రథసారథ్యం నెరిపే సమయంలో అతడు చెట్ల ఆకులు పువ్వులు లెక్కించే విద్యను నలుడికి నేర్పి, అతడి దగ్గర నుంచి అశ్వ హృదయమనే విద్యను నేర్చుకొన్నట్లు వుంది. నలుడు తన జబ్బును ఆ తాండ్రచెట్టుకే అర్పించి తాను ఆరోగ్యవంతుడైనాడు

రామాయణంలో సంజీవిని పర్వతం మీద పెరిగే చెట్లలో మృత సంజీవ కరణి, విశల్యా కరణి అనే జాతి వృక్షాలు వున్నట్లు వాల్మీకి చెప్పాడు (యుద్ధ కాం. 50 - 31, 32 శ్లోకాలు) లక్ష్మణుడు మృతి చెందిన సందర్భంలో ఆ వృక్షాల గాలి సోకి యుద్ధంలో మృతి చెందిన వారంతా సజీవులయ్యారు.

ఆముక్త మాల్యదలో మాలదాసరి కథలో బ్రహ్మ రాక్షసుడు వటవృక్షాన్ని ఆశ్రయించి వున్నట్టు చెప్పబడింది. వటవృక్ష వైశాల్యాన్ని సవిస్తరంగా శ్రీకృష్ణదేవరాయలు వర్ణించాడు.

అనేక వృక్షాలతో పాటు మనుచరిత్రలో అల్లసాని పెద్దన నారికేళ వృక్షాన్ని హిమాలయాల్లో వర్ణించాడు విమర్శనాగ్రేసరుడైన కట్టమంచి రామలింగారెడ్డి "అల్లసాని పెద్దన చెప్పిన వృక్షాలన్నీ పుట్టి పెరుగునది ఒక్క నిఘంటువు లోనే" అని విమర్శించారు.

మహాకవులు తాము దర్శించిన వృక్షాలను కథానుగతంగా చిత్రీకరించ డానికి ప్రయత్నించి, కావ్యాలకు సంపూర్ణ సొగసును సమకూర్చారు. పుష్ప, ఫల, వృక్షాలు ప్రకృతిలో వుండి మానవుడికి ఆరోప్రాణంగా మసలు తున్నాయి.



# సద్యః పరనిర్వృతి

- ఆచార్య ఎం. శ్రీమన్నారాయణ మూర్తి

"కావ్యం యశసే౽ర్థకృతే వ్యవహారవిదే శివేత రక్షతయే |
సద్యః పరనిర్వృతయే కాన్తా సంమిత తయోపదేశయుజే ||[1]

అని మమ్మటుని కావ్య ప్రయోజన నిర్వచనం. ఇది సార్వజనీనం, సార్వకాలికం ప్రాచీనార్వాచీన దార్శనికుల దృక్పధానికి ఒకమైలు రాయి ప్లేటో (427 - 347 B.C) కూడ సంగీత సాహిత్యాలను గూర్చి దాదాపు ఇదే అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు. ప్లేటో కళా సిద్ధాంతం (Theory of art) ప్రకారం సంగీత సాహిత్యాలు కళలు. పదాల సత్యమైన అర్థజ్ఞానావగాహనలో ప్రాసంగికంగా కళలు ఉపయోగ పడతాయని, విద్యావిధానంలో వాటిని ప్రవేశపెట్టాల్సిన ఆవశ్యకత ఉందని ఆయన అభిప్రాయపడ్డాడు. సంగీత సాహిత్యాలను తగురీతిలో విద్యాబోధనలో చేర్చకపోతే కలిగే అనర్థాలను గూర్చి కూడ చర్చించాడు పదాల సత్యార్థజ్ఞానమే ఆయన దర్శన లక్ష్యం విద్యార్థి దశలో సంగీత సాహిత్యాలు వ్యక్తిత్వాన్ని పెంపు చేసుకోవటానికి ఉపయోగ పడతాయి అందువల్ల అసభ్యకరమైన సాహిత్యం మీద సామాజిక ఆంక్షలు కూడ అవసరం.

ప్లేటో అభిప్రాయాల విలువలు అనాటి సాహిత్య స్వరూపం, ప్రయోజికతను గమనిస్తేతెలుస్తాయి. గ్రీకు రచయితలైన హోమర్ (Homer), హెసియోడ్ (Hesiod)ల కావ్యాలను ప్రామాణికంగా తీసుకొని సాహిత్య విమర్శ నడిచింది. ఇలియడ్, ఒడెస్సి మొదలైనవి పూర్తిగా కల్పితాలు. వీటిని mythology అంటారు. కల్పిత ఇతివృత్తాలైనా ఆ రచనలు వ్యక్తిత్వ పరిణతికి ఉపయోగపడతాయి. కాబట్టి అంగీకార్యాలే ప్లేటో తర్వాతకాలంలో కొందరు క్రైస్తవ మత ప్రాబల్యంలో రూపుదిద్దుకున్న యూరోపీయ విమర్శకులు బైబుల్ కథలనాధారంగా వచ్చిన రచనలే ప్రామాణికమని అభిప్రాయపడ్డారు. మరికొందరు New Testement కంటే Old Testement ఎక్కువ ప్రామాణిక మైనదని, దానిలోని కథలనాధారంగా ఉన్నరచనలే ప్రామాణికమని ఛాందసంగా కూడ వాదించారు క్రైస్తవ మతం మీద అభిమానం సడలిన విమర్శకులు కూడ బైబిల్ ఇతివృత్తాల మీద ఆధారపడిన రచనలే విద్యాభ్యాసదశలో

నైతిక విలువలను పెంచటానికి ఉపయోగ పడ్తాయని భావిస్తున్నారు. G C. Field తన The Philosophy of Plato[2] అనే గ్రంథంలో ప్లేటో సిద్ధాంతం ఒక చట్రంలో బిగించినది కాదని, ఎప్పటికప్పుడు విమర్శకుల చేతిలో మార్పులకు చేర్పులకు లోనైందని వివరించాడు.

ఇదే విధంగా వేదకాలం నుంచి నేటి వరకు సాహిత్య విమర్శ భారత దేశంలో సాగింది అందుకు మమ్మటుడుచెప్పిన పైకావ్య లక్షణమే తార్కాణం. ఈ కావ్య లక్షణంలో మొదటి రెండు పాదాలలో మమ్మటుడు చెప్పింది. దాదాపు ప్లేటో అభిప్రాయమే "సద్యః పరనిర్వృతయే" అన్న నిర్వచనాంశం భారతీయ సాహిత్యపు విలువల్ని, విమర్శనా వైశిష్ట్యాన్ని, దార్శనికతను, సంస్కృతిని స్పష్టీకరించుతుంది. ధర్మార్థకామ మోక్షాలనే చతుర్విధ పురుషార్థాలకు సాధకము కాని సాహిత్యం నిరర్థకం. "కావ్యాలాపాంశ్చ వర్జయేత్" అనే సాంఘిక మర్యాద నిరర్థకములైన పుస్తకాలకు వర్తిస్తుంది ఈ సంప్రదాయం వేదాంగాల నుంచి సంక్రమించింది. జ్యోతిషం, కల్పం, శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం అనేవి వేదాంగాలు. దేశకాలాల యోగ్యతనెరిగి వేదవిహిత కర్మలను చేయటానికి ఉపయోగ పడేది జ్యోతిషం. యజ్ఞ ప్రక్రియలోను, ఇంట్లోను, సంఘజీవిగా సమాజంలోను వ్యక్తుల ప్రవర్తనను నిర్దేశించేది కల్పం. ఈ రెండూ పురుష ప్రవృత్తికి సంబంధించినవి. మిగిలిన నాలుగు భాషకు సంబంధించినవి. ప్రకృతికి భాషకు అవినాభావ సంబంధం ఉంది. అందువల్ల భాషా స్వరూపం తెలుసుకొని సరియైన ప్రయోగం చేయటం ద్వారా ప్రకృతిశక్తుల అనుగ్రహాన్ని సంపాదించవచ్చునన్నది ఆర్యుల నమ్మిక. శుద్ధమైన వర్ణోచ్చారణకు శిక్ష, పదనిరూపణ సంధికార్యాలుచేయటానికి వ్యాకరణం, క్రమబద్ధమై అమోఘశక్తి వంతమైన పదవిన్యాసానికి ఛందస్సు, పదాల వాక్యాల అర్థనిర్ధారణకు నిరుక్తం ఉపయోగ పడతాయి. ప్రతివైదిక శాఖకు ఒక వ్యాకరణం తప్పనిసరిగా ఉంటుంది కాబట్టి వైదిక వ్యాకరణాన్ని ప్రాతిశాఖ్య అనిఅంటాం సంహితా బ్రాహ్మణాల్లో యజ్ఞయాగాదుల గురించి, ఆరణ్యకోపనిషత్తులలో బ్రహ్మమోక్షం, ఆత్మతత్త్వాల గురించిన విచారణ ఉంటుంది. అందువల్ల ప్రాతి శాఖ్యలలో మోక్ష ప్రస్తావనలేక పోయినా, ఉపనిషత్తుల సమకాలీన వ్యాకరణ గ్రంథాలలో మోక్షం గురించి కూడ చర్చలు ఉంటాయి. వైదిక భాషను, వ్యావహారికమైన లౌకికభాషను సమన్వయించి పాణిని అష్టాధ్యాయి అనే వ్యాకరణ గ్రంథాన్ని సూత్రపద్ధతిలో రచించాడు. శబ్దార్థాల సాధుత్వాన్ని గూర్చి వివరిస్తూ వ్యాడి సంగ్రహం అనే వ్యాఖ్యను

రాశాడు. ఈ వ్యాడి దాక్షాయణుడని మహాభాష్యంలో చెప్పటంవల్ల దాక్షీ పాణినికి మేనమామ కొడుకో, మేనమామ మనుమడో అవుతాడు.[3] అది ఇప్పుడు లభ్యంకాదు. మహాభాష్యకారుని సమయంలో, భర్తృహరి సమయంలో అది దొరుకుతూ ఉండి ఉండాలి. వారు యీ గ్రంథంనుంచి ఎన్నో వాక్యాలను ఉదహరించారు. వాటిల్లో కొన్ని ముఖ్యాంశాలను మాత్రం పతంజలి తన మహాభాష్యంలో వివరించాడు. పతంజలి "రక్షోహాగమ లఘ్యసందేహాః ప్రయోజనం" అని అష్టాధ్యాయికి వేదార్థ బోధనే ప్రధానలక్ష్యమని వక్కాణించాడు. కాని భర్తృహరి -

> ఇదమాద్యం పదస్థానం సిద్ధిసోపాన పర్వణామ్ |
> ఇయం సా మోక్షమాణానామ జిహ్వా రాజపద్ధతిః ||[4]

అని మోక్షం వ్యాకరణ పరమప్రయోజనమని నిర్ధారించాడు.

పాణినీయం యొక్క వైశిష్ట్యం లౌకిక వైదిక శబ్దాలను రెంటిని కలిపి సూత్రాల ద్వారా నిరూపించటం, దీని ద్వారా వైదిక భాష మాత్రమే కాక వ్యావహారిక భాషకూడ చతుర్విధ పురుషార్థాలకు సాధకమగునని తెలియు చున్నది. అందువల్లనే భరతుడు "వాచి యత్నస్తు కర్తవ్యః"[5] అని నిర్దేశించటమేగాక, వేదం నుంచి నాట్యశాస్త్రం పుట్టిందన్నాడు. ఆనందవర్ధనుడు "ప్రథమే హి విద్వాంసో వైయాకరణాః వ్యాకరణ మూలత్వాత్ సర్వ విద్యానామ్" అని వ్యాకరణం అలంకారశాస్త్రమునకే గాక సర్వశాస్త్రాలకు కారణమని సిద్ధాంతీకరించాడు. అభినవగుప్తుడు నాట్యశాస్త్రంలో నిర్ధారించిన అభినయ ప్రక్రియ వ్యాకరణాది వేరే శాస్త్రాల నుంచి గ్రహింపబడినదని అభిప్రాయ పడినాడు.

> "తత్ర శాస్త్రాన్తర ప్రసిద్ధానపి రసాంగత్వేన కవి శిక్షార్థం
> నటస్య చ తత్రతత్రాభినయే విశ్రాంతికరాన్
> ఇతి కర్తవ్యతయా ఉపదేశార్థమాగతాన్
> నిర్దిశతి. ఆగమేత్యాది."[7]

ఈ సూచిక నాధారంగా నాట్యశాస్త్ర ప్రక్రియకు మూలం వ్యాకరణమని నిరూపించనగును.

కళాత్మకమైన లౌకిక సంస్కృత భాష దృశ్య కావ్యాలైన నాటకాలలోను, శ్రవ్యకావ్యాలలోను కనబడుతుంది. నాటకాలలో ఉపయోగించే భాషను

విమర్శించే గ్రంథాన్ని కావ్యలక్షణమని భరతుడు పేర్కొన్నాడు[8] నాట్యశాస్త్ర సమకాలీన కావ్య లక్షణ గ్రంథం ఏదీ మనకు లభ్యం కావటం లేదు భామహాలంకారమే మనకు లభ్యమయ్యే మొట్టమొదటి కావ్యలక్షణం. నాటకలక్షణ కావ్యలక్షణాలను సమన్వయించి ఏకరూపంగా సాహిత్యశాస్త్రం ఏర్పడి కావ్యప్రకాశము, సాహిత్యదర్పణము మొదలైన అలంకార శాస్త్రగ్రంథాలు ఆవిర్భవించాయి.

ఈ సాహిత్యశాస్త్రంలో చర్చించిన ఎన్నో విషయాల యొక్క పునాదులు వ్యాకరణ శాస్త్రంలో కనబడతాయి ఉదాహరణకు అన్య పదార్థాభిదానమే వృత్తిఅని నిర్వచిస్తూ పతంజలి జహత్స్వార్థావృత్తి, అజహత్స్వార్థావృత్తి, జహదజహ త్స్వార్థావృత్తుల గురించి ప్రస్తావించాడు[9] ఇవి మొదట వ్యాకరణాంశాలుగా ప్రారంభమై అలంకార శాస్త్రంలో విస్తారంగా చర్చింపబడ్డాయి. అదే విధంగా నాట్యశాస్త్రంలో ఉపయోగించిన ఎన్నోపారిభాషిక పదాలకు భరతుడు నిర్వచనం ఇవ్వలేదు. వీటిని ప్రచారంలో ఉన్న పాణిని వ్యాకరణం నుంచి గ్రహించాడు.

భరతుని నాట్యశాస్త్ర నిర్మాణరీతి వేదాంగాల నుంచి, పాణినీయ అష్టాధ్యాయినుంచి తీసుకొనబడింది సహృదయుడైన ప్రేక్షకునిః రసాస్వాదన కలుగునట్లు అభినయం చేయటం గురించి సిద్ధాంతీకరించటం నాట్యశాస్త్రం యొక్క ప్రధానలక్ష్యం. ఆంగికము, వాచికము, ఆహార్యము, సాత్త్వికము అని అభినయం నాలుగురకాలు[10] ఆంగికాహార్యసాత్త్వికాభినయాలు వాచికాభినయం యొక్క వైశిష్ట్యంమీద ఆధారపడి ఉంటాయి వాచికాభినయాన్నే వాగభినయం, వాక్యాభినయం అనికూడ భరతుడు వ్యవహరించాడు. వాగభినయంలో భాషా స్వరూపంగురించి చర్చ జరుగుతుంది. వేదకాలంలో వేదరచనకు ఉపయోగపడే భాషకు "వాక్" అని పేరు[11] ఆ ప్రయోగాన్నే తీసుకొని వాగభినయం, వాచికాభినయం అని నాటకలక్షణంలో భరతుడు వాడాడు. వైయ్యాకరణ సిద్ధాంతం ప్రకారం వాక్యమే అర్థబోధకం. వాక్యం అఖండం. అర్థమూ అఖండమే, అందుకనే భరతుడు వాక్యాభినయం అని ప్రయోగించాడు ఇంతే కాకుండ వేదాంగాలైన శిక్ష, వ్యాకరణం, ఛందస్సు నిరుక్తాలననుసరించి మొదట అచ్చులు, హల్లులు, సంయుక్తాక్షరాలు, పదాలను వివరించి ఛందస్సును వివరించాడు. తరువాత నిరుక్తమునకు ప్రతిరూపమైన వాక్య స్వరూపం వర్ణించటం ప్రారంభించాడు.

లక్షణము, అలంకారము, దోషము, గుణము అని నాలుగు వాక్య లక్షణాలను భరతుడు పేర్కొన్నాడు. వీటిల్లో లక్షణానికి గుణానికి నిర్వచనం ఇవ్వలేదు. భాష స్వతః సిద్ధంగా నాట్య ప్రదర్శనకు అనుగుణంగా ఉంటే, అభాష లక్షణమనే లక్షణం కలిగి ఉంది. తెలుగు బెంగాలి భాషలు సంగీతానికి, వాచికాభినయానికి ప్రకృతి సిద్ధంగా మధురంగా ఉంటాయి అటువంటి భాషను కవి తన ప్రతిభ చేత వాక్యనిర్మాణంలో, అర్థావబోధనలో వైచిత్ర్యాన్ని చూపి రమణీయంగా తీర్చిదిద్దుతాడు. ఇలా కవి ప్రతిభ చేత రూపొందినది అలంకారము కవి ప్రతిభ చేత భాషలో చేర్చబడిన విశేషం అలంకారమన్నమాట ఇందులో కృతకత్వం ఉంది. కృతకత్వం లేని వాక్య శోభ మరొకటి ఉంది అది గుణం రమణీయమైన భాషకు అలంకారాలేమీ లేకుండ, రమణీయ పదవిన్యాసంలో ఏర్పడిన సోంపు-గుణం. ఇక్కడ "గుణం" అనే నాటక పారిభాషిక పదం భరతుడు గ్రహించాడు.

అర్థలో మార్పులేకుండ అచ్చులలో మార్పువచ్చినట్లైతే గుణం అవుతుందని పాణిని సూత్రాల బట్టి తెలుస్తున్నది. ఒక సుగంధ ద్రవ్యాన్ని నూనెలో కలపటం చేత నూనెలో మార్పు రాదు. కొత్తగా చేర్చబడిన వాసన వల్ల నూనె ఆకర్షిత మౌతుంది అదే విధంగా ఒక అచ్చును గుణం చేయటం వల్ల పదమో, ప్రాతిపదికో శ్రోతను ఆకర్షిస్తుంది. కాకువు అనేది యథేచ్ఛగా అభినయంలో చేర్చిన ఉచ్చారణ వైవిధ్యం అయితే పాణినీయ గుణ వృద్ధులు నియమబద్ధమైన ఉచ్చారణ వైవిధ్యాలు. 'ఇ' 'ఉ' వర్ణాలకు ముందు 'అ' అనే అచ్చును చేర్చితే ఏ ఓలు వస్తాయి. ఇది గుణం[12] ఏ ఓలకు ముందు మరో 'అ' చేరిస్తే అది గుణం యొక్క వృద్ధి అవుతుంది అప్పుడు "ఇ" "ఉ"లు 'ఐ' "ఓ"లుగా విన్పిస్తాయి దీన్ని వృద్ధి అంటారు. ఈ ఏ, ఓ, ఐ ఔలకు అచ్చు పరమగునప్పుడు "అయ్, అవ్, ఆయ్, ఆవ్"లుగా మారుతాయి.[14] "యజ్" లాంటి ధాతువుల్లో ఇ ఉ లకు ప్రక్కనున్న 'అ' కారము లోపిస్తే దాన్ని సంప్రసారణం అంటాం.[15] అందువల్ల గుణ వృద్ధి సంప్రసారణలు అర్థంలో మార్పులేకుండా ధ్వనిలో ఏర్పడే మార్పులు అదేవిధంగా అర్థంలో మార్పు లేకుండా వాక్యాల పొందికలో మార్పులతో వాక్యం ప్రేక్షకునికిగాని, శ్రోతకుగాని ఆకర్షణీయంగా ఉండటమే గుణం ఈ గుణాన్నే ఆనంద వర్ధనుడు ఉక్తి వైచిత్ర్యం అని అన్నాడు.

"కిమిదం ఉక్తివైచిత్ర్యం? ఉక్తిర్హి వాచ్యవిశేష-
ప్రతిపాదనమ్..... యతో యావానయం

కావ్యార్థానన్యభేదహేతుః ప్రకారః ప్రాగ్దర్శితః
స ఏవ పునరుక్తి వైచిత్ర్యాత్ ద్విగుణత్వ మాంపద్యతే." 16

వామనుడు "కావ్యశోభాయాః కర్తారో ధర్మాః గుణాః" (3 1.1) అని వివరించాడు.

భరతుడు గుణ శబ్దానికి నిర్వచనం ఇవ్వలేదు. 'గుణాః విపర్యయాదేషాం'17 అని అన్నాడు. ఇక్కడ ఏషాం అనే నామవాచకం దోషాలను బోధిస్తుంది అంటే దోషాలకు విరుద్ధములైనవి గుణాలు అని వ్యతిరేక లక్షణం ఇచ్చాడు "గుణ విపర్యయాత్మానో దోషాః"18అని వామనుడు భరతుని నిర్వచనాన్ని పునరుద్ఘాటించాడు. ప్రతిభలేని కవి భాషయొక్క ప్రకృతి సిద్ధమైన వైలక్షణ్యాన్ని గమనించలేడు. అందువల్ల సరియైన రీతిలో వాక్య నిర్మాణం చేయలేడు.

"అవ్యుత్పత్తికృతో దోషః శక్త్యా సంవ్రియతే కవేః ।
యస్త్వశక్తికృతస్తస్య ఝటిత్యేవావ భాసతే ॥ 19"

అని ఆనంద వర్ధనుడు ధ్వనాలోకంలో వివరించాడు.

స్వతఃసిద్ధమైన భాష ప్రజల నుంచి అవిర్భవిస్తుందని, ఆ భాషలో లభ్యమయ్యే పదాలను సూత్రాలద్వారా వర్ణించటమే గాని కొత్తగా పదాలను, వాక్యాలను తయారు చేసే ప్రక్రియను నేర్పేందుకు వ్యాకరణం కాదని వైయ్యాకరుణుల అభిప్రాయం. దీనితో ఏకీభవిస్తూ భరతుడు మొదట కవియైనవాడు ఉన్నభాషను కాపాడి అటు తరువాత ప్రతిభననుసరించి అలంకారాలను చేర్చుకోవాలని సిద్ధాంతీకరించాడు.

అన్యోన్యసదృశా యత్ర తథా హ్యన్యోన్య భూషణాః ।
అలంకారా గుణాశ్చైవ సమాః స్యుః సమతాం మతాః ॥ 20

భరతుని తరువాత వచ్చిన ఆలంకారికులు దోషాలను గుణాలను ప్రత్యేకంగా విభజించి సోదాహరణంగా నిరూపించారు. భోజుడు వ్యాకరణానికి అలంకార శాస్త్రానికి ఎన్నోరకాలుగా సమన్వయం చేశాడు. రాజశేఖరుడు ఒక అడుగు ముందుకు వేసి కావ్య మీమాంసలో శబ్దబ్రహ్మను భర్తృహరి నిరూపించినట్లు, కావ్య పురుషుణ్ణి చిత్రీకరించి అలంకారశాస్త్రం "సప్త పరనిర్వృతయే ॥ 21

అన్న మమ్మటుని వాదానికి బలం చేకూర్చాడు.

నరసింహసూరి అనే ఆలంకారికుడు వ్యాకరణదర్శనం వలె సాహిత్యం కూడ మోక్షసాధనమని సిద్ధాంతీకరించాడు. ప్రతాపరుద్రీయవ్యాఖ్య అయిన రత్నాపణంలో కుమారస్వామి నరసింహసూరి అనే ఈ సాహితీవేత్తను ఉదహరించాడు శారదా తనయుడు "బధ్నాతి కావ్యం యత్ తస్మాద్రసః సామాజికాశ్రయః" అని విరమిస్తే, నరసింహసూరి మోక్షం ఎలా లభ్యమౌతుందో కూడ వివరించాడు

ఏవం సామాజిక సమవేతతాం రసస్య
అంగీకృత్య అలౌకికతా వర్ణితా పరమార్థతః
పునః పరిపూర్ణాఖండైక రసానన్ద రూప పర
మేశ్వర పర్యాయస్య అస్యరసస్య అధికరణ
చింతా కుతో వాన సత్యానన్తా నందాత్మకే
బ్రహ్మణ్యపి పదమాసాదయేదితిః విచార
చతురైః అనాది కవిభిరనా ధారో రసః
సామాజికైః పరం చర్వ్యతే విభావాదిభిః
పరం వ్యజ్యతే యోగి గమ్యత్య మాత్రేణేశ్వరస్య
యోగిమనో నివాస సంవాదవతో సామాజి
కాధికరణత్వారోపో౽పి సహ్యతే‖ [22]

ఈ తాత్పర్యాన్నే జగన్నాథపండితుడు మరో విధంగా చెప్పాడు

"అథాస్యాం సుఖాంశభానే కిం మానమితి
చేత్ ................ 'రసోవైసః, రసం హ్యేవాయం
లబ్ధ్వానన్దీ భవతి' ఇతి శ్రుతిః సకల
సహృదయ ప్రత్యక్షం చేతి ప్రమాణ ద్వయం." [23]

వ్యక్తిత్వ అభివృద్ధికి, నైతిక విలువల పెంపుకు మాత్రమే కాక చతుర్విధ పురుషార్థాలకు దోహదకారియైన సాహిత్యం కావాలి అన్నది భారతీయ సంస్కృతి ప్రత్యేకత. లక్ష్యానికి హాని కలుగకుండా కాంత వలె ఆహ్లాదకరంగా ఉండటానికి ఎన్ని కల్పనలనైనా చేయవచ్చు.[24] గమ్యాన్ని చేర్చగలిగే కల్పన ఆమోదయోగ్యం. ఏభాష అయినా అభ్యంతరం లేదు. వ్యాకరణం యొక్క శాఖాశాస్త్రం సాహిత్యం. సాహిత్య శాస్త్ర ప్రయోజనం వ్యాకరణ శాస్త్ర ప్రయోజనం కంటే భిన్నంగా ఉండటం కుదరదు. వైదిక వాఙ్మయంవలె లౌకిక వాఙ్మయం కూడ పురుషార్థసాధనమని మమ్మటుని సిద్ధాంతం.

## సూచికావివరణ

1      1 2

2. Oxford unıversıty press, London 1969. Chapter 9: Other Problems, pp 124

3. మహాభాష్యం, 1 1.1, 2.3.66; పాణిని, 4.1.92, 94, 95, 101, 105, 162, 163.

4. వాక్యపదీయం, 1.16

5 నాట్యశాస్త్రం, 14. 2-3

6. ధ్వన్యాలోకః, 1 13.

7 నాట్యశాస్త్రం, 14.4

8. సమిధ్యాధ్యవసాయస్తు ప్రోచ్యతే కావ్యలక్షణే, నాట్య 16.16. సాజ్ఞేయో హ్యుపపత్తిస్తు లక్షణం నాటకాశ్రయమ్, నాట్య 16.35.

9. పాణిని, 2.1 1

10. నాట్యశాస్త్రం, 8 9.

11 చూ. నా వ్యాసం : '0n the Nomenclature Samskrta', Adyar Lıbrary Bulletın, 57, 1993, pp 58-71.

12 అదేఙ్. గుణః, పాణిని. 1.1.2

13. వృద్ధిరాదైచ్, పాణిని. 1 1 1.

14. ఏచో ఽయవాయావః, పాణిని. 6.1.78

15 ఇగ్యణః సంప్రసారణమ్ పాణిని. 1 1.45

16. ధ్వన్యాలోకః, 4.7.

17 నాట్యశాస్త్రం, 16.95.

18. కావ్యాలంకార సూత్రః, 2.1.1.

19. ధ్వన్యాలోకః, 3.5.

20. నాట్యశాస్త్రం, 16.101,

21. "సద్యః పరనిర్వృతయే" అంటే సద్యః=శ్రవణ సమనంతరమేవ పరనిర్వృతయే=పరమానందాయ, 'చదివిన లేక వినినంతనే, కలిగే పరమానందము కొరకు', పరమానందం ఇహలోకసుఖం నుంచి ఆనందరూపమైన మోక్షంవరకు.

22 ప్రతాపరుద్రీయమ్ రత్నాపణవ్యాఖ్యా, రసప్రకరణం, 94

23. రసగంగాధరం,

24 కావ్యప్రకాశకారుని నిర్వచనం లోని "కాంతా సమ్మితతయోపదేశ యుజే" వ్యాకరణ శాస్త్రానికి అలంకార శాస్త్రానికి మధ్య ఉన్న తేడాను చెప్తుంది. అతిచారం (Variability), సందిగ్ధత (ambiguity) అనేరెండు లక్షణాలు ప్రతిభాష కలిగి ఉంటుంది అతిచారత అంటే వ్యాకరణ సూత్రాల నధిగమించి పదాల ప్రయోగాలలోనో అర్థాలలోనో మార్పురావటం ఈమార్పు వక్తకు శ్రోతకు తెలిస్తే ఇబ్బంది లేదు. శ్రోతకు తెలియకపోతే సందిగ్ధత ఏర్పడుతుంది ఈ సందిగ్ధతను రెండు రకాల విభజించవచ్చు ఒకటి అర్ధపరివర్తనం (Transmutation) రెండు - శబ్ద పరివర్తనం (idiomisation), కర్మధారయ సమాసాన్ని బహువ్రీహిగా ప్రయోగించి నప్పుడు ఏర్పడే అర్థ పరివర్తన మనకందరకు తెలిసిందే. కారకసూత్రాలు, సంధి సూత్రాలు మొదలైన వాటినుల్లంఘించి వాక్యప్రయోగం చేయటం శబ్దపరివర్తన. అంటే అర్ధంలో మార్పులేకుండా శబ్దప్రయోగంలో మార్పురావటం ఈ రెండు వ్యాకరణం దృష్ట్యా దోషాలు. వైదిక వాఙ్మయంలో ఇలా అర్ధ పరివర్తనగాని, శబ్ద పరివర్తనగాని జరుగకూడదని వీరి మౌలికసిద్ధాంతం కాని ఆలంకారికులు ఈ రెంటిని సహృదయుని అహ్లాదం కొరకు ప్రోత్సహించటం గమనించదగింది. నాటకంలో మరీ ఎక్కువగా సందిగ్ధతను కల్పించటం మంచిది కాదని నాట్యశాస్త్ర కారుల అభిప్రాయం. నానాజనరంజకంగా ఉండాలన్నదే వీరి ఆశయం. ఇక శ్రవ్యకావ్యం విషయంలో పారకులు విశిష్టమైన వ్యక్తులు. అందువల్ల ఎన్నిరకాలైన చమత్కృతులైనా చేయవచ్చు. ఒకొక్కప్పుడు కవి అపేక్షించని అర్థంకూడ పాఠకునికి తోచవచ్చు. అటువంటి కావ్యం ఉత్తమ ధ్వనికావ్యం అనికూడ ఆనందవర్ధనుడు అన్నాడు. కాని శ్రుతిమించి రాగాన పడ్డప్పుడు ఆలంకారికులకు వైయాకరణుల రూపం దాల్చక తప్పలేదు. అందుకనే "న కర్మధారయః బహువ్రీహిప్రతిపత్తికరః" అని వామనుడు కావ్యాలంకార సూత్రవృత్తిలో సూత్రీకరించ వలసి వచ్చింది. అందువల్ల నేటి సాహిత్య విమర్శకుడు రేపటి వైయాకరణుడు



# వ్యాకరణం - అధ్యాపనం - అధ్యయనం

డా॥ దావులూరి కృష్ణకుమారి

'శాస్త్రతో గురుతశ్చైవ స్వతశ్చైవ త్రిసిద్ధయః' - అంటూ యోగవాసిష్ఠం, శాస్త్రం మూలంగా - గురువు మూలంగా - స్వయంకృషి మూలంగా జ్ఞానాన్ని సముపార్జించుకోవాలని చెప్తుంది.

ప్రవాహిని అయిన భాషలో ఉండే నియమాల్ని వ్యాకరించి విశేషంగా చూపేది వ్యాకరణ శాస్త్రం. అంటే లోకసిద్ధమై జనం వాడుకలో ఉండే భాషను ఎలా క్రమబద్ధీకరించాలో, అలా చేయడంలో ఏయే సంస్కరణలు పాటించాలో తెలిపేదే వ్యాకరణ శాస్త్రం - 'శాబ్దిక మాలిన్య చికిత్స' చేయడం దీని ప్రధాన ధర్మం. ప్రత్యేకించి ఆబాల్యంగా అభ్యసించాల్సిన శాస్త్రం ఇది. ఈ శాస్త్రప్రాశస్త్యాన్ని 'ప్రథమేహి విద్వాంసో వైయాకరణః - వ్యాకరణ మూలత్వాత్ సర్వవిద్యానామ్' అని ధ్వనికారుడు తెలిపాడు.

ఈ శాస్త్రాన్ని ఒకవైపు సమస్త వాఙ్మయాన్ని ఆవిష్కరించేదిగా పేర్కొంటున్నప్పటికీ, మరొకవైపు ఈ శాస్త్రం అంటే ఇనుప గుగ్గిళ్లు గానో, ఉప్పుబుట్ట గానో ఎందుకు భావిస్తూ వస్తున్నారనేది మన ముందు నిలిచే ప్రశ్న.

సంస్కృత భాషలో సూత్రరూపంలో ఉన్న ఆంధ్ర శబ్దచింతామణి, తెలుగు భాషలో బాలవ్యాకరణం - ఈ రెండే పాఠ ప్రవచనంలో ప్రాచుర్యం పొందిన వ్యాకరణాలు సూత్రం అంటే విస్తృతమైన అర్థాన్ని సంక్షిప్తంగా చెప్పేది. సూత్రం లోని పరి బాషలు - ప్రత్యాహారాలు - అధ్యాహారాలు - అనువృత్తులు - ఆకృతిగణాలు - నిపాతాలు మొదలైనవి ఆ సంక్షిప్త రూపాలు. ఈ సంక్షిప్తతే వ్యాకరణ శాస్త్ర దురవగాహనకు ప్రథమకారణం అందుకు సంస్కృత వ్యాకరణాల అవగాహన తప్పనిసరి కావడం మరో కారణం. ప్రక్రియా బాహుళ్యం ఉండడం ఇంకొక కారణం'. సరైన లక్ష్యజ్ఞానం కల్గాలంటే ఎన్నోసూత్రాల ఆనుపూర్వి మనసులో మెదలాలి. అప్పటికీ లక్షణం సరిగ్గా అర్థం కాక పోవచ్చు. అందువల్ల ఈ శాస్త్రం కొరుకుడు పడదనిపిస్తుంది.

కాని 'అనభ్యాసేవిషమ్‌శాస్త్రమ్' అన్నట్లు నియమబద్ధంగా చదవకపోతే ఇది పట్టుబడడం కష్టమే. దీని మీద దృష్టిపెట్టి చదివితే మాత్రం సులువుగా పట్టుబడ్తుంది. అందువల్ల వ్యాకరణం మీది జడుపును పోగొట్టే మొదటి ఉపలాలనీయం అధ్యాపనం, రెండవది నిరంతర అధ్యయనం, మూడవది ఈ రెంటికీ పుష్టిని కల్గించే వ్యాఖ్యాన గ్రంథం / లిఖిత రూప అధ్యాపనం

అధ్యాపనం అంటే ఒక్క మాటలో చెప్పుకోవాలంటే సుశిక్షితుడైన గురువు నోటి మాటతో వివరించేది అని ఈ అధ్యాపనా విధానాల్ని బాలవ్యాకరణానికి పరిమితం చేసుకుని రేఖామాత్రంగా ఇలా సూత్రీకరించుకోవచ్చు.

'అల్పారంభోక్షేమం కరః' అనేది ప్రాచీన బోధన సంప్రదాయం ప్రథమతః అధ్యేతల స్థాయిని అంచనా వేసుకోవాలి వ్యాకరణ గ్రంథ పరిచయం - ఒకటి రెండు సూత్రాల పఠనం ద్వారా అధ్యేతల ఉచ్చారణ స్థాయిని, శబ్దాల విరుపు ద్వారా శబ్ద జ్ఞానాన్ని పసికట్టడం ప్రధానకర్తవ్యం, 'అర్థవశేన విరతిః సర్వస్వమిదం హి పాఠస్య, అర్థాదులకనుకూలంగా నిలిపి చదవడం మన పఠన సంప్రదాయం కదా. ఈమదింపు వల్ల బోధనను ఎంత మేరకు సాధించవచ్చో నిర్ణయించుకోను వీలవుతుంది - నీటికొలది తామర

తెలిసిన విషయాల్నుంచి తెలియని విషయాల్లోకి అధ్యేతను ప్రవేశింప చేయాలి. సూత్రార్థం ద్వారా ప్రాథమిక విషయపరిజ్ఞానం కల్గించి ఉదాహరణల్లో సమన్వయింప చేయాలి సూత్రగత విషయం బాగా నాటుకోవడానికి ఆకాంక్షా రూపంగా ప్రశ్నించాలి. ముఖ్యంగా ప్రక్రియకు దేనికి ఏది పరంగా ఉంటే ఏవిధి ప్రవర్తిస్తుంది అనే త్రిసూత్రాలు ఉపకరిస్తాయి. ఒకే అంశాన్ని రక రకాలుగా మార్చి మార్చి అడుగుతూ, ఆలోచింపచేస్తూ, సందేహాలు కల్గిస్తూ, వాటిని నివృత్తిచేస్తూ, గ్రహణశక్తిని పెంపొందింపచేయాలి. పూర్వం ప్రస్తావించిన విషయాలు నెమరు వేయిస్తూ జ్ఞాపక శక్తిని గుర్తింప చేయాలి కొత్తవిషయాన్ని పరిచయం చేయాలి.

క్రమ క్రమంగా సూత్రాంశంతో పాటు పరిచ్ఛేదాల వారీగా విషయానుభవాన్ని కల్గింప గల చాకచక్యం అధ్యాపనానికి ఉండాలి. ఇలాంటి స్థూల విషయాల్తోపాటు సూక్ష్మాంశాలు చెప్పడం మరొకకళ. కళాపూర్ణోదయంలో పింగళి సూరన చెప్పినట్లు-

తమ విద్యనెవ్వరేమా
త్రముగనజాలుదురు వారిదండను దన్మా
త్రము ప్రకటింతురు బుధులు
త్తములమహిమ నీటికొలది తామరసుమ్మా!

వినేవారి వివేకాన్ని, గుణగ్రహణ శక్తిని గుర్తించి ఇంకా చెప్పడానికి ఏమీ లేనంత సూక్ష్మంగా చెప్పాలి. ఇందుకు పూర్వ వ్యాకరణాల్ని, సూరి సమకాలీన వ్యాకరణాల్ని, ఆధునిక వ్యాకరణాల్ని, వివరణల్ని, పూర్వకవుల లక్ష్యాల్ని, నూత్న భాషాశాస్త్ర దృక్పథాల్ని విప్పి చెప్పాలి అసలు పాఠ్య గ్రంథం గూర్చి మౌలికమైన ఆలోచనలు కల్గించాలి ప్రయోగమూలం వ్యాకరణమ్ - ఆంధ్ర పాణినీయం - అనువాద విధానం వంటి వాటితో వివేచన కల్గించి దాన్ని వ్యాసరూపంలో పొందు పరచమంటూ రచనా కళకు దారులు చూపాలి. పరీక్షకు సన్నద్ధ పరచడం బోధనలో ఒక భాగం కావాలి గాని, అదే పరమార్థం కాగూడదు

ఇలా అధ్యాపనాక్రమం అతి సహజంగా సాగిపోతూ అధ్యేతను సంస్కరించాలి. అందుకు తగ్గ సంయమనం పాటించాలి బోధనా వాతావరణాన్ని కావ్య శాస్త్ర వినోదాల్తో పవిత్రంగా ఉంచాలి. అధ్యేతలో నానాటికి నాటుకున్న శాస్త్రజ్ఞానం ఆత్మవిశ్వాసాన్ని పెంపొందింప చేస్తుంది. తెలియకుండానే వ్యాకరణ శాస్త్రం పట్ల ఆకర్షితుణ్ణి చేస్తుంది అందుకే అంటారు ధర్మశాస్త్రకారులు -

"ఏకమప్యక్షరంయస్తుగురుః శిష్యేనివేదయేత్
పృథివ్యాంనాస్తి తద్ద్రవ్యం యద్దత్వా అన్నృణీభవేత్"

అంటే ఒకొక అక్షరం క్రమంగా నేర్పే విద్యా ధనాన్ని పోలిన ధనం మరొకటి ఎక్కడా ఉండదు. ఇంతటి జ్ఞాన జ్యోతిని ప్రకాశింపచేసే గురువు ఋణం తీర్చుకోలేది అని.

ఈరీతిగా శాస్త్రతః గురుతః సంపాదించుకున్న జ్ఞానానికి తోడు అధ్యేత అవగాహనాసామర్థ్యాన్ని, అధ్యయన ఆసక్తిని మరింత శక్తిమంతం చేసి వన్నెపెట్టేవి వ్యాఖ్యలు. ఇవి స్వయం కృషికి సోపానాలు వేస్తాయి. ఏనాటికానాటికి వచ్చిన భాషావిశేషాల్ని సుబోధం చేస్తాయి. బాలవ్యాకరణానికి

వచ్చిన వ్యాఖ్యలు (16) కాలానుగుణంగా ఆయా విద్యాస్థాయి (ఓరియంటల్ - డిగ్రీ - పి జి) అధ్యేతలకు 'స్వయంబోధినుల' వంటివి. ఇవన్నీ, బోధించే నోటి భాషలో కాక కావ్య భాషలో (ఒక్క వ్యాకరణదీపిక తప్ప) రావడం విశేషం అధ్యేతల స్థాయి 'ఎరిగి వివరించిన' వ్యాఖ్యాతల వ్యాఖ్యలకే ఈనాడు చలామణి ఎక్కువ ఇంకా విమర్శలు - సమీక్షలు - సంజ్ఞాచంద్రికలు - అనుక్రమణికలు - కరదీపికలు - ప్రశ్నోత్తరాలు - పద్యానువాదాలు మొదలైనవి బాలవ్యాకరణం ఆనుపానులు ఆకళింపుచేసుకోను ఉపకరించే ఉపకరణాలు

ఈ తీరున నిరంతరం పరిశ్రమించి ఒంటబట్టించుకున్న శాస్త్ర జ్ఞాననిధిని నల్గురికి పంచిపెట్టినపుడు తెలిసింది ఎంతో, తెలియంది ఎంతో ఆత్మ పరిశీలనకు వస్తుంది విషయం అధీనం అవుతుంది పాఠప్రవచన శక్తి పెంపొందుతుంది ఇలా సాధికారి అయిన అధ్యాపకుడే శిష్యచిత్తాపహరుడవుతాడు అలాంటి శిష్యసంపత్తే అతడికి పెద్ద పెన్నిధి ఉన్నగుణాలకు వన్నె పెట్టేది అధ్యాపనం. శ్రమపడి శ్రద్ధతో నేర్చుకునేది అధ్యయనం

శ్రుతము వలన శ్రోత్రియుడగు
నతుల తపోయుక్తి గడుమహత్త్వము వడయున్
ధృతిచే సహాయయుతుడగు
నతిశయముగ బుద్ధిమంతుడగు బుధసేవన్ -

చెప్పింది వినాలి. విన్నదాన్ని మననంచేయాలి. తుదముట్ట తెలుసుకోవాలనే తపన పుట్టాలి అపుడే దానిసారం అందుతుంది ఈ జ్ఞానసారం మరుగునపడి పోకుండా ఉండాలంటే బుధసేవ చేయాలి అనేది ఆంధ్ర మహాభారత సందేశం.

కాని చదువు కొనసాగినంతకాలం సాగిన ఆనాటి గురుశిష్య సంబంధాలకు, తరగతి తరగతికి మారే ఈనాటి అధ్యాపక విద్యార్థి సంబంధాలకు గల అంతర్యాన్ని గమనించక తప్పదు.

పూర్వం అధ్యాపనం - అధ్యయనం అనేవి షట్కర్మల్లో భాగాలు ఆనాడు చదువు చెప్పడం ఒక పవిత్రమైనధర్మకార్యం. శ్రద్ధపెట్టనివాళ్లనూ,

సత్ప్రవర్తన లేనివాళ్లకూ, అసూయాపరులకూ ఉపదేశించేవారుకాదట. సహృదయంతో విద్యాధర్మం పాటించేవారు ఇక ఆనాటి అధ్యాతలు, 'సకలశాస్త్రార్థ తత్త్వజ్ఞాన సంపన్నుల్ని' గురువుగా ఆశ్రయించేవాళ్లు. 'విద్యాతురాణామ్ నసుఖమ్ ననిద్రా'-అన్నట్లు సుఖం. నిద్రపట్టని జ్ఞానార్జన పరులువాళ్లు, ఇంత చక్కటి వాతావరణంలో అధ్యాపన అధ్యయనాలు సాగిపోతుండేవి

ఈనాడు అధ్యాపకత్వం ఒక ఉపాధి కార్యం అయింది. విద్యార్జన విత్తార్జన అయింది. ఈనాటి చదువరులు పరీక్ష పాసుకోసం విద్యను అర్థించే విద్యార్థులు, జంధ్యాలవారు -

"బడికి నడవలేడు పాఠాలు వినలేడు

చిన్నపద్యమప్పజెప్పలేదు

రాజరాజు బిడ్డరా నేటి విద్యార్థి......."

అన్నట్లు ఎంత సమన్వయపరచి తగ్గించి చెప్పినా ఆకాస్త కూడ అందుకోలేని స్థితి వీళ్లది ఒకవేళ అందుకునే వారున్నా మార్జాలకిశోర న్యాయంగా గురువు బోధించే దానిమీదే ధ్యాస తప్ప తమకు తాముగా కృషిచేయనిస్థితి. ఈ విద్యార్థులే రేపటి ఉపాధ్యాయులైతే 'బోధ మల్పంబు, గర్వమభ్యున్నతంబు శాంతినిప్పచ్చరంబు మచ్చరముఘనబు' - అంటూ శ్రీనాథుణ్ణి స్మరించుకోవాల్సిందే. ఇక ప్రతిభావంతులు కొద్దోగొప్పోఉన్నా ఆ ప్రతిభకు పట్టంగట్టని ఈనాటి సామాజిక సంస్కృతిని ఆనాడే కట్టమంచి వారు సవర్ణదీర్ఘసంధితో ముడిపెట్టి 'అకస్సవర్ణేదీర్ఘః' సవర్ణులు తమతోపాటు పొడవవుతారు - అని నెల్లూరు మహాసభలో చమత్కరించారు. బంధువులైన సవర్ణులకు సహాయంచేసి పదవులు దానం చేయడం పద్ధతిగా ఉందనేది దీనిలోని చమత్కారమట

కొసరుగా - వ్యాకరణ శాస్త్ర అధ్యయనం అవసరమా? అనవసరమా? అనేది వాదిబలమా వాదబలమా అన్నదానిమీద ఆధారపడిందే. అయినా వ్యాకరణ శాస్త్రం మీద చిన్నచూపు కల్గడానికి పాఠప్రవచనమా - పఠితా - పాఠ్యాంశాలభారమా - శాస్త్రకర్తా - సాహిత్యవేత్తా ఎవరు కారకులనేది ఎవ్వరికివారే ప్రశ్నించుకుంటే సమాధానం తప్పక దొరుకుతుంది.

"సర్వస్యనేత్రమ్ వ్యాకరణమ్"

"వ్యాకరణాత్ పదసిద్ధిః - పదసిద్ధేః అర్థనిర్ణయోభవతి

అర్థే తత్త్వజ్ఞానమ్ - తత్త్వజ్ఞానాత్ పరమశ్రేయః"-

అయిన వ్యాకరణం తన విలువను కాలాంతరంలోనూ నిలువరించు కుంటుంది.

అసలు భాషమీద పట్టు సాధించడంలో వ్యాకరణ అధ్యయన అవసరం ఎంతటిదో స్వామిహర్షానందులవారి ప్రవచనం కూడా ఈ సందర్భంలో ఉట్టంకించుకోదగిందే.

" . ..... .. the student do not become proficient even in the use of their mother tongue, let alone others. One of the reasons is perhaps the absence of the systematic teaching of grammar Grammar is the science of language and without a sound knowledge of its basic principles a masters over the use of the language is not possible".

అందుకుగాను అధ్యాపనం బాధ్యతాయుతంగానూ, అధ్యయనం తేజోవంతంగానూ సాగాలని కాంక్షిద్దాం.



# తులనాత్మక సాహిత్య పరిమితులు - ప్రయోజనాలు

ఆర్వీయస్. సుందరం

ఏ సాహిత్యమైనా ఇతర సాహిత్యాల ప్రేరణ ప్రభావాలకు లోను కాకుండా ఉండడానికి సాధ్యం కాదు ముఖ్యంగా భారతీయ సమాజంలో ఇలాంటిదాన్ని ఊహించడానికి కూడా వీలు లేదు. అలా అని ప్రతి దాన్నీ పోల్చి చూడాల్సిన అవసరమూ లేదు. జరగాల్సిన చోట తులనాత్మక పరిశీలన జరగక పోవడం, అక్కర లేని చోట నామ సాదృశ్యాన్ని బట్టి తులనాత్మక పరిశీలన జరపడం మన పరిశోధనలో భాగమై పోయింది. ప్రేమచంద్-గోపీచంద్ అని, కన్నడ తిమ్మణ్ణ - తెలుగు తిమ్మన్న అని ప్రేరణ ప్రభావాలను గమనించ కుండా పరిశోధించడం వల్ల ప్రయోజనం ఉండదు.

తులనాత్మక సాహిత్యం అన్ని విషయాలనూ విడమరిచి చెప్తుందని కాని, దానివల్ల రెండు సాహిత్యాల సమగ్ర దర్శనం కలుగుతుందని కాని అనుకోవడమూ భ్రమే. సాహిత్య తత్త్వాన్ని లోతుగా అర్థం చేసుకోకుండా తులనాత్మక అధ్యయనానికి పూనుకుంటే ఫలితాలు అంతంత మాత్రంగానే ఉంటాయి. కన్నడంలో ప్రాచీన కాలంలో ప్రబంధమంటే మహాకావ్యం. పంపని 'విక్రమార్జున విజయం', హరిహరుని 'గిరిజాకల్యాణం' మొదలైనవి ప్రబంధాలు. మన ప్రబంధాలను వాటితో పోలిస్తే ప్రయోజనం ఉంటుంది ఆధునిక కాలంలో ప్రబంధమంటే కన్నడంలో వ్యాసమని అర్థం. పేరును బట్టి తెలుగు ప్రబంధాలను కన్నడ వ్యాసాలను పోల్చి చూస్తే ప్రయోజనం లేదు. అలాగే తమిళంలో 'నాలాయిర దివ్య ప్రబంధం' ఉంది. అవి భక్తి గీతాలు. తెలుగు ప్రబంధాలకు తమిళ భక్తి గీతాలకు పోలిక కంటే భేదాలే ఎక్కువ.

తులనాత్మక అధ్యయనం చేసేవారు మరికొన్ని పరిమితులకు కూడా లోనవుతుంటారు. తెలుగు సాహిత్య మనగానే సంస్కృత సాహిత్యంతో పోల్చి చూస్తారు. తెలుగు వారిలో ఎక్కువ మందికి సంస్కృత భాషా సాహిత్యాల పరిచయం ఉండడమే దీనికి ముఖ్య కారణం. అదీకాక సంస్కృతంలోని రామాయణ మహాభారతాలు, పురాణాలు, మహాకావ్యాలు మొదలైనవి

చాలావరకు తెలుగు లోనికి రావడం వల్ల మూల రచనలతో పోల్చి చూడడం తప్పని సరి అవుతుంది. అయితే తెలుగు సాహిత్యం లోని వివిధ ప్రక్రియల వికాసాన్ని ఇతర ద్రావిడ భాషలతో పోల్చి చూడడం కూడా చాలా అవసరం కాని మన పండితులు ఈ విషయాన్ని ఎక్కువగా గమనించలేదు. కోరాడ రామకృష్ణయ్య, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, నిడుదవోలు వెంకటరావు, చల్లా రాధాకృష్ణశర్మ ఇలా కొంత మందిని మాత్రమే వేళ్ళ మీద లెక్కించవచ్చు. దక్షిణదేశ భాషా సాహిత్యాలలో దేశిని గురించి కోరాడవారు, తెలుగు తమిళ సంబంధాలను గురించి చల్లావారు, తెలుగు కన్నడ సాహిత్యాలు, జానపద సాహిత్యాలను గురించి ఆర్వీయస్ సుందరం, దాక్షిణాత్య ఛందస్సులను గురించి కె సర్వోత్తమరావు చేసిన పరిశోధనలు గమనించ దగినవి.

తులనాత్మక సాహిత్యానికి పరిమితుల కంటే ప్రయోజనాలే ఎక్కువగా ఉన్నాయి. సమగ్రమైన తులనాత్మక పరిశీలన చేయడంలో తెలుగు వారికి ఆసక్తి తక్కువే కోరాడ రామకృష్ణయ్య, పి ఎస్. సుబ్రహ్మణ్యం వంటి పరిశోధకుల ప్రామాణిక ప్రయత్నాల వల్ల అత్యుత్తమ ఫలితాలు లభించాయి. గొప్పగొప్ప పండితులు కూడా తెలిసిన వారిని అడుగుదామనే ఆసక్తి లేకపోవడం వల్ల, మనకు తెలిసిందే నిజమనే ఆత్మ విశ్వాసం వల్ల చాలాసార్లు తప్పులే చేస్తుంటారు నిడుదవోలు వారి దగ్గరి నుంచి ఈ నాటి వరకు మైసూరులో తెలుగు సాహిత్యం గురించి వ్రాసే వారంతా కళలె వీరరాజు, కళలె నంజరాజు పేర్లను 'కళువె' అనో 'కళులె' అనో వ్రాస్తారు కాని ఈ విషయంలో ప్రామాణిక ప్రయత్నం చేసి కర్నాటకాంధ్ర సాహిత్యాన్ని రచించిన శంకర నారాయణ రాజు గారి పుస్తకం చూడరు. తెలుగు ప్రబంధాలను గురించి సిద్ధాంతాలు చేసే వారు, పరిశోధన వ్యాసాలు వ్రాసే వారు ఈ ప్రక్రియ కన్నడంలో 10వ శతాబ్ది నుంచే ఉందనే విషయాన్ని విస్మరిస్తారు నన్నెచోడుని కుమార సంభవాన్ని పంప విక్రమార్జున విజయ ప్రబంధంతో, గిరిజాకల్యాణ ప్రబంధంతో పోల్చకుండా శ్రీకృష్ణ దేవరాయల కాలంనాటి ప్రబంధాలతో పోలుస్తారు నన్నెచోడుడు రాయల కాలానికి దగ్గరి వాడని కూడా సిద్ధాంతాలు చేస్తారు. పాల్కురికి సోమనాథుడు వ్రాసిన గద్యలలో కన్నడం లోని మూడు రగడలనే ఎందుకు వాడాడనే విషయం తెలుగు వారికి పట్టదు. యతి ప్రాసలను గురించి వ్రాసే వారు తమిళం లోని మోనై, ఎదుగై మొదలైన వాటిని పరిశీలించక పోతే వ్రాయట మెలా? తెలుగు లోని దేశీయ ఛందస్సును

విశ్లేషించాలంటే తమిళ కన్నడాల లోని దేశీయ ఛందస్సులను పోల్చి చూడాలి కాని, సంస్కృత ఛందస్సుతో పోల్చిచూస్తే ప్రయోజనం పరిమితమే. తెలుగులో ముఖ్యమైన కావ్య మాధ్యమం చంపువు. చంపూ కావ్యాలనే మనం పద్య కావ్యాలని పిలుస్తున్నాం. చంపూ కావ్యాలలో ఛందస్సులను గురించి అధ్యయనం చేసే వారు కన్నడ కావ్యాలను పరిశీలించకపోతే ఆ అధ్యయనం సమగ్రం కాదు.

తులనాత్మక అధ్యయనం వల్ల ముఖ్యమైన ప్రయోజనం - సమగ్ర దృష్టి లభించడం. కవులను గూర్చి, ప్రక్రియలను గూర్చి, కవితా సంప్రదాయాలను గూర్చి, ఛందస్సు, అలంకారం, భాషాస్వీకరణ, ఇతి వృత్తాలు మొదలైన వాటిని గూర్చి పరిశీలించేటప్పుడు తులనాత్మక అధ్యయనం మన రచనకు పుష్టినిస్తుంది. అలవోకగా ఎక్కడో విన్నవి, కన్నవి, రెండవ మూడవ వ్యక్తులద్వారా, పుస్తకాలద్వారా తెలిసినవి నిజమనుకొని వ్రాస్తే అది సమగ్ర దృష్టి కాదు. పంప తెలుగు వాడని, శ్రీనాథుడు కన్నడిగుడని, పాల్కురికి సోమనాథుని మాతృభాష కన్నడమని, యక్షగానం తెలుగు వారిదని లేదా కన్నడిగులదని, కంద పద్యం తెలుగు వారు సృష్టించిందని, నక్షత్రకుని పాత్ర తెలుగువారు సృష్టించిందేనని, పంప తమ్ముడు చినవల్లభుడని (జినవల్లభుడని) - ఇంకా ఎన్నయినా వ్రాయవచ్చు. కాని సమగ్ర దృష్టి ఉన్నవారు ఇలా వ్రాయరు. నన్నయ్య తమిళుడనో, నంజనగూడు వాడనో, పంప తెలుగువాడనో, శ్రీనాథుడు కన్నడిగుడనో వ్రాసేముందు తత్సంబంధమైన అన్ని విషయాలనూ పరిశీలించి స్వాభిమానాన్ని వదులు కోకుండా, దురభిమానాన్ని పెంచుకోకుండా వ్యవహరించడం చాలా అవసరం.

భారతీయ సాహిత్యంలో తులనాత్మక పరిశీలనకు చాలా అవకాశం ఉంది. వస్తు పరంగా, ప్రక్రియా పరంగా, వికాస పరంగా, శైలీ పరంగా, సాహిత్య సంప్రదాయ పరంగా, అనువాద పరంగా తులనాత్మక అధ్యయనం జరపడానికి అవకాశం ఉంది. ముఖ్యంగా భారతీయ సాహిత్యం మీద వైదిక సాహిత్యం, రామాయణ మహాభారతాలు, పురాణాలు, మహా కావ్యాలు, శాస్త్ర కావ్యాలు చూపిన ప్రభావం అనంతంగా ఉంది. వివిధ భాషల్లో రామాయణ మహాభారతాలను తులనాత్మకంగా పరిశీలించడానికే వంద సిద్ధాంత వ్యాసాలు అవసరమవుతాయి. పంపశైలి-నన్నయ శైలి, పంప-నన్నయ-పెరుందేవనార్ల

భారతాలు, తెలుగు తమిళ రామాయణాలు, తెలుగు కన్నడ రామాయణాలు, సంస్కృత రామాయణ కథను దేశ భాషల్లో వాడుకొన్న తీరు మొదలైనవన్నీ పరిశీలనార్హాలే. వీటిలో కొన్నిటిని గురించి పరిశోధన జరిగింది.

ఒకే భాషలోని వివిధ దశల్ని తులనాత్మకంగా పరిశీలించడమూ ఒక పద్ధతి వివిధ ప్రక్రియల్ని పోల్చి చూడడం, వివిధ ప్రక్రియల్లో వచ్చిన ఒకే వస్తువును పోల్చి చూడడం, వివిధ కాలాల్లో వచ్చిన ఒకే ప్రక్రియను పరిశీలించడం మొదలైన వన్నీ ఈ కోవకు చెందుతాయి. ఏ విషయాన్నయినా విశ్లేషణ చెయ్యాలంటే దానితో పోలికలున్న మరో విషయాన్ని, భిన్నమైన విషయాలను గుర్తించడం తప్పనిసరి. అందువల్ల తులనాత్మక పరిశీలన ఎంత అవసరమో స్పష్టమవుతుంది.

తెలుగులో ఇప్పటికే కొన్ని తులనాత్మక పరిశీలనలు జరిగాయి. విశ్వ విద్యాలయాల బయటకూడా అత్యుత్తమ కృషి చేసిన వారున్నారు. తెలుగు-ప్రాకృతాల సంబంధాలను గురించి తిరుమల రామచంద్ర గారి లాంటి వారు జరిపిన కృషి అలాంటిదే. ద్రావిడ ఛందస్సులు, ద్రావిడ భాషలు, వేమన-సర్వజ్ఞ-తిరువళ్ళువర్లు, పంప-నన్నయ-పెరుందేవనార్లు, తెలుగు-కన్నడ జానపద గేయాలు, తెలుగు-తమిళ జానపద గేయాలు, తెలుగు కన్నడ సామెతలు, తెలుగు-కన్నడ జానపద రామాయణాలు, తెలుగు పైన సంస్కృత ప్రాకృతాల ప్రభావం, ఇంగ్లీషు ప్రభావం, తెలుగు-హిందీ సాహిత్యాలు, తెలుగు-ఉర్దూ భాషా సాహిత్యాలు మొదలైన విషయాలను గురించి పరిశోధన జరిగింది ఈ క్షేత్రంలో ఎంత పరిశోధన జరిగినా ఇంకా జరగాల్సింది అనంతంగా ఉందనిపిస్తుంది అయితే బహుభాషా పరిచయం, సంయమం, నిర్మోహ దృష్టి, సత్యాన్వేషణ తత్పరత, తులనకు పనికివచ్చే విషయాలను గుర్తించగలగడం -ఇవన్నీ అవసరం ఉండడం వల్ల ఎక్కువ మంది ఈ సువిశాల క్షేత్రంలో కృషి చేయలేక పోతున్నారనిపిస్తుంది.



# మాతృభాషా బోధన - తెలుగు

## (Teaching Telugu as Mother-tongue)

డా|| జి.ఎస్. మోహన్

భాష అనేది అభివ్యక్తి మాధ్యమం, అది సంస్కృతి మాధ్యమం కూడ. అంతేకాదు భావనా మాధ్యమం కూడ. అనువర్తిత భాషాశాస్త్ర (Applied Linguistics) శాఖలలో భాషా బోధన ప్రధానమైంది

భాషాబోధన ప్రణాళిక మూడువిధాలు. అవి (1) మాతృభాషా బోధన (Mother tongue Teaching) (2) ద్వితీయ భాషా బోధన (Second Language Teaching) (3) అన్యభాషా బోధన (Foreign Language Teaching).

జనని, జన్మభూమి, మాతృభాష - అనునిత్యం పూజింపదగ్గవి. 'తల్లినిమించిన దైవం లేద'న్నట్టుగానే మాతృభాష కంటె మధురమైంది మరొకటి లేదు.

మాతృభాష అంటే ఏమిటి? - పిల్లలు చిన్నప్పటి నుంచీ ఇంటా బయటా, స్కూళ్ళలో ఏ భాషతో వ్యవహరించడానికి అవకాశం ఉందో ఆ భాషే మాతృభాష అవుతుంది. 'Mother tongue is that language with which one is emotionally identified. It is the language through which the child recognizes and organises his experience and environment around him. It is the language through which one expresses one's basic needs, ideas, thoughts, joys, sorrows and all other feelings. This is the language which if one gives up and adopts another language, one may become intellectually alive, but grows emotionally sterile'[1] అని డా|| డి.పి. పట్టనాయక్ పేర్కొన్నాడు

'మానవుడు భాషను శిశువుగా ఉన్నప్పుడే వినటం ప్రారంభించి సుమారు నాల్గవ సంవత్సరం నిండేసరికి భాషా నిర్మాణాంశాలను క్షుణ్ణంగా నేర్చుకొని 'Linguistic adult' అవుతాడు. అలా నేర్చుకున్న భాషే మాతృభాష. ఆ

---

1 Language curriculum, P.3. Central Institute of Indian Languages, Mysore.

తర్వాత నేర్చుకున్న భాషలన్నీ ద్వితీయభాషలే'[2] అని శ్రీమతి వై. రెడ్డిశ్యామల అభిప్రాయం.

తల్లి ఒడిలో శిశువుకు తొలి విజ్ఞానపు వెలుగులు నింపిన భాష మాతృభాష. జన్మజాతమైన బోధన మాధ్యమం ఇది. బయటి ప్రపంచాన్ని అవగాహన చేసుకొనేందుకు మొదటి మాధ్యమం కూడ ఇదే.

పిల్లలు స్కూళ్ళకు వెళ్ళడానికి ముందే తమ తల్లిదండ్రుల నుంచి నేర్చుకొనే భాష ఆ పిల్లల మాతృభాష. ఆయా ప్రాంతీయ భాషలు ఆయా ప్రాంత జనుల మాతృభాషలు. మాతృభాషలో విద్యాబోధన అంటే శిశువిద్య నుండి స్నాతకోత్తర విద్యదాకా మాతృభాష ద్వారా లభించే విద్య. అయితే ఇది బోధన మాధ్యమానికి సంబంధించిన విషయం.

ఇక ఈ వ్యాసం ప్రధానోద్దేశం - తెలుగు మాతృభాషగా ఉన్నవారికి తెలుగు నేర్పడం గురించి నిజానికి అధ్యాపకుడి శక్తి సామర్థ్యాలు మాతృభాషా బోధనలో పరీక్షకు గురవుతాయి. అతడి విశ్లేషణ సామర్థ్యం మీదనే బోధన ఆధారపడి వుంటుంది. అతడి భాషాధికారం మీదనే విద్యార్థి పాటవం పెరుగుతుంది.

మాతృభాషా బోధనలో ఆ భాషా నిర్మాణ పద్ధతుల్ని నేర్పాల్సిన అవసరం అంతగా ఉండదు. పదాలు, సాహిత్యం, భిన్నశైలులు, రిజస్టర్లు (ప్రోక్తులు) మొదలైన వాటిని నేర్పాల్సి వుంటుంది.

తెలుగు మాతృభాషగా ఉన్నవారికి తెలుగు నేర్పడం కష్టంకాదు ఎంచేతనంటే ఆ విద్యార్థి అప్పటికే మాట్లాడడం లోను, అర్థం చేసుకోవడం లోను ప్రావీణ్యం సంపాదించి ఉంటాడు. అతనికి అవసరమయినవి వ్రాయడం, చదవడం మాత్రమే. 'In the case of teaching Telugu to mother tongue learners, it is to be noted that the pupil already is competent in speaking and listening (understanding). What he needs is exposure to the conventions of writing and reading. The problem - discripancy between the spoken variety and written form deserves the teacher's attention. Though it is said that Telugu writing follows very closely the spoken variety, still there are many discripancies between the two, especially when we com-

2 హిందీ మాతృభాషగా గల విద్యార్థులకు ద్వితీయభాషగా తెలుగుబోధన - సమస్యల విశ్లేషణ, పుట. 1

pare the dialects of Telangana or Rayalaseema with that of the so called standard Telugu[13]. అన్నమాటలు గమనించదగ్గవి.

అంతేకాకుండా 'The Mother tongue teacher is usually required to begin with teaching the mechanics of the language, but the mother tongue teacher is to introduce the student to (a) the visual representation of a language system already mastered by him (b) the standard elegant forms of speech and to various colloquial standards of speech (c) different styles and genres of writing (d) different registers such as language of science, language of philosophy etc., and (e) different varieties in language use'[4].

ఏ భాషా బోధనలో నయినా ప్రధానమయిన అంశాలు మూడు కన్పిస్తాయి అవి (1) బోధకుడు (2) బోధన సామగ్రి (3) అభ్యాసకుడు. భాషా బోధకుడికి భాషాశాస్త్ర నేపథ్యంతో కూడిన పద్ధతులు అవసరం. అలాగే బోధన సామగ్రికి నేపథ్యం భాషాశాస్త్ర సూత్రాల మీద ఆధారపడి నిర్మించబడ్డ పాఠ్య ప్రణాళిక, అభ్యాసకుడికి అవసరమైంది సౌముఖ్యం (Motivation).

'అభ్యాసం కూసువిద్య' అన్నట్టుగా ఏ భాషనయినా అభ్యాస పూర్వకంగా నేర్చుకోవాలి. అందువల్ల భాషను ఒక విషయంగా కాక ఒక కౌశలం (Skill)గా గ్రహించాలి. భాషా సామర్థ్యం శ్రవణం, భాషణం, పఠనం, లేఖనం అనే నాలుగు భాషా కౌశలాలతో కూడిన ఒక సంకీర్ణ కౌశలం.

బోధన కార్యక్రమ ఉద్దేశాలను నెరవేర్చడం కోసం బోధన సామగ్రి ఒక పరికరంగా తీసుకోవాల్సి ఉంటుంది. పాఠ్యగ్రంథం బోధన సామగ్రిలో ప్రధానమైంది. అందువల్ల పాఠ్యగ్రంథం బోధన లక్ష్యాల మేరకు మాత్రమే వ్రాయబడాలి. భాషాబోధన సామగ్రిలో ప్రదానమైన మూడు అంశాలు - 1 ఎంపిక (Selection) 2. స్థాయీ కరణం (Gradation) 3. ప్రస్తుతీకరణం (Presentation)

"బోధనాంశాల ఎంపిక బోధన లక్ష్యాలను బట్టి జరుగుతుంది. అంటే బోధన లక్ష్యాలను సాధించేందుకు కావలసిన బోధనాంశాలను ఎంపిక చేసుకోవలసి ఉంటుంది. ఎంపిక చేసుకొన్న బోధనాంశాలను ఎట్లాపడితే అట్లా పాఠ్య గ్రంథంలో ఇవ్వడం కుదరదు. భాషాభ్యసన కార్యక్రమం సులభతరం

3 తెలుగు అధ్యాపకుడు (ప్రత్యేక సంచిక) మొదటి అంతర్జాతీయ తెలుగు ఉపాధ్యాయుల సదస్సు, ఆంధ్రమహాసభ, మారిషస్, నవంబరు 1995

4 Language Curriculum, P 5

చేసేందుకు బోధనాంశాలను ఇవ్వడంలో 'సరళం నుంచి సంక్లిష్టానికి" (Simple to complex), తెలిసిన దాని నుంచి తెలియని దానికీ (Known to unknown) అనే సూత్రాలు మార్గదర్శకంగా ఉంటై. ఈ సూత్రాలను అనుసరించి ఏ బోధనాంశం ముందు రావాలి, ఏది తర్వాత రావాలి అనే వివక్షతతో కూడిన స్థాయీ కరణం జరుగుతుంది. అప్పుడు వాటిని అభ్యాసకుల వయస్సును బట్టీ, పరిణతిని బట్టీ, వారికి పాఠ్యగ్రంథం పట్ల, పాఠ్యాంశాల పట్ల ఆకర్షణ కలిగేలా పాఠ్యగ్రంథంలో ప్రస్తుతీకరించటం జరుగుతుంది. పాఠాలరూపిక (format), రంగురంగుల చిత్రాలు, విషయాంశాల అమరిక, ఆకర్షణీయమైన ముద్రణ ప్రస్తుతీకరణకు తోడ్పడతై"[5].

1986లో రూపొందించిన నూతన జాతీయ విద్యావిధాన నేపథ్యంలో తయారుచేయబడ్డ, పాఠ్య విషయాలను ఆధారం చేసుకొని రచింపబడ్డ కర్నాటకలోని తెలుగుభాషా పాఠ్యపుస్తకాలను (ప్రథమభాష) - మొదటి తరగతి నుంచి పదోతరగతి దాకా - ఈ వ్యాసానికి ఆధారం చేసుకొన్నాను. ఈ పాఠ్య పుస్తకాల్లో జాతీయ విద్యావిధానంలో పొందుపరచబడ్డ ఉద్దేశాలకు (Core elements) అనుగుణంగానూ, మానవత విలువల్ని దృష్టిలో ఉంచుకొని పాఠ్య ప్రణాళికల్ని ఎంపిక చేయడం జరిగింది. తెలుగు భారతి 1, 2, 3, 4, 6, 9 పాఠ్యపుస్తకాలు భారతీయ భాషాసంస్థ (CIIL) మైసూరు వారి సహకారంతో కర్నాటక ప్రభుత్వం, పాఠ్యపుస్తక నిర్దేశనాలయం, బెంగుళూరు వారు ప్రచురించారు. అలగే 5, 7, 8, 10 తరగతుల పాఠ్య పుస్తకాలను పాఠ్య పుస్తక నిర్దేశనాలయం, బెంగుళూరు వారే ప్రచురించారు. (1992 - 1994)

విషయబోధన, అవగాహన సౌలభ్యాలదృష్ట్యా విద్యాబోధనలో / భాషాబోధనలో ప్రామాణిక, వ్యావహారిక భాషాప్రయోగం ఎక్కువగా ప్రయోజనకరమైంది.

నిజానికి పిల్లల్లో అభిరుచి, సోదరప్రేమ, జాతీయ సమైక్యత, సంస్కృతి అలవడేటట్టు చేయడమే పాఠ్యగ్రంథాలు చేయాల్సిన పని. భాషా బోధనలోని ప్రధానాంశం ఆ భాషను విని స్పష్టంగా అర్థం చేసుకోవడం, మాట్లాడగలగడం, వ్రాయడం, చదవడం. మాతృభాషలో విద్యనభ్యసించే పిల్లలు స్కూల్లో చేరే సమయానికి తమ మాతృభాషను అర్థం చేసుకోవడం,

5 పరిమి రామనరసింహం, హిందీ మాతృభాషగా గల విద్యార్థులకు ద్వితీయభాషగా తెలుగుబోధన - సమస్యల విశ్లేషణ, పుట. XVI

తమ భావాలను ఎదుటివాళ్ళకు వ్యక్తంచేయడం, వ్రాయడం మాత్రం నేర్పితే చాలదు. సాధారణంగా చిన్నపిల్లలు భాషను ప్రయోగించడంలో ఎన్నోలోపాలను చేస్తుంటారు. ఆ లోపాలను అధ్యాపకులు సరిదిద్దడంతో పాటు చదవడం, వ్రాయడాన్ని పిల్లల్లో అభివృద్ధి చేయడం, వాళ్ళు సరిగా వినడం, మట్లాడం కూడ నేర్పించాల్సి వుంటుంది.

మొదటి తరగతిలో చేరిన పిల్లలు సాధారణంగా కథల్ని వినడానికి ఆసక్తిని కనబరుస్తారు. అందువల్ల అధ్యాపకులు పాఠం చెప్పడానికి ముందు కొన్ని కథల్ని పిల్లలకు చెప్పడం, ప్రశ్నలు వేసి సమాధానాలను రాబట్టడం ద్వారా పిల్లల్లో 'వినడం' అనే భాషా కౌశలాన్ని వృద్ధి చేయవచ్చు. అలాగే పిల్లలు మాట్లాడేటప్పుడు వాళ్ళు పదాలను సరిగా ఉచ్చరిస్తున్నారో లేదో అధ్యాపకులు గమనించాలి. పిల్లలు తొందర తొందరగా మాట్లాడు తుంటారు. లేదా చాల మెల్లగా మాట్లాడు తుంటారు. అలాంటప్పుడు అధ్యాపకులు వీటిని గమనించి పిల్లల్ని ఈ రెండూ చేయకుండా శ్రద్ధ తీసుకోవాలి.

'మాట్లాడడం' వృద్ధిచెందితే దాంతోపాటు 'చదవడం' మీద కూడ ఆసక్తి కలుగుతుంది. ఈ చదవడాన్ని స్కూళ్ళలో మాత్రమే నేర్చుకొంటారు. అందువల్ల అధ్యాపకులే పాఠ్యపుస్తకాల లోని పదాలను చదువగలిగే సామర్థ్యాన్ని పెంపొందించాలి. పిల్లలు ప్రతి అక్షరాన్నీ సరిగా ఉచ్చరించడాన్ని నేర్పాలి. పదాలను, వాక్యాలను, వాటి అర్థాలను అర్థంచేసుకొనే శక్తిని వాళ్ళలో కలిగించాలి.

చిన్న పిల్లలు మొదటిసారిగా స్కూల్లో చేరినప్పుడు వాళ్ళకు వ్రాయడం ఏమీ తెలిసి ఉండదు. అందువల్ల వాళ్ళకు అక్షరమాలలో ఉండే గీతల్ని, సున్నల్ని వ్రాయడంలో శిక్షణనివ్వాలి. అధ్యాపకుడు వ్రాసిన అక్షరాల మీద పిల్లలు దిద్దేటట్లు చూడాలి. ఆ తర్వాత పిల్లలు సొంతంగా వ్రాసేటట్టు నేర్పాలి. ఒత్తులు, గుడులు - కొమ్ములు మొదలైనవాటిని ఎలా వ్రాయాలి, అక్షరాలు, పదాలమధ్య ఎంతెంత స్థలం వదలాలి అన్న విషయాలను అధ్యాపకులు నేర్పించాలి.

తెలుగు అక్షరమాలను బోధించడానికి ముందు అధ్యాపకులు గుర్తుంచుకొనే అంశాలు కొన్ని ఉన్నాయి. సాధారణంగా తెలుగు అక్షరాలన్నీ సున్నను ఆధారం చేసుకొని వ్రాయబడతాయి. అలాగే ఇ, ఈ, ఐ అక్షరాలు తప్ప తక్కిన అక్షరాలన్నీ ఎడమవైపు నుంచి కుడివైపుకు వ్రాయబడతాయి.

అంతేకాక ఖ, జ, ఞ, ట, ణ, బ, ల అక్షరాలకు తప్ప తక్కిన అక్షరాలకు తలకట్టు ఉంటుంది.

పాఠ్య పుస్తకంలో పాటల్ని పరిచయం చేయడంవల్ల పిల్లలు మౌఖికంగా పాటల్ని నేర్చుకోవడమే కాకుండ ఉత్సాహాన్ని పెంపొందించు కొంటారు. అందువల్ల అధ్యాపకులు పాటను రాగయుక్తంగా నాలుగైదు సార్లు పాడి విన్పించాలి. ఆ తర్వాత పిల్లలు అధ్యాపకుణ్ణి అనుకరించేటట్టు చేయాలి

పాఠ్య పుస్తకాలను రచించడానికి ముందు పాఠ్య ప్రణాళికను ముందుగా రూపొందించు కోవాలి. ఈ విషయంలో కర్నాటక ప్రభుత్వం రూపొందించిన తెలుగు - ప్రథమభాష పుస్తకాలు (మొదటి తరగతి నుంచి పదో తరగతి దాకా) మార్గదర్శకంగా ఉన్నాయి. ఉన్నత ప్రమాణాన్ని కలిగివున్నాయి. మొదటి తరగతి పాఠ్య ప్రణాళికలో 450 పీరియడ్లకు సరిపడేట్టుగా పుస్తకాన్ని వ్రాయడం జరిగింది. ఈ 450 పీరియడ్లలో 110 పీరియడ్లు బొమ్మలు, కథల కోసం కేటాయించబడ్డాయి. పాఠ్యపుస్తకంలో ఏడు భాగాలున్నాయి. అవి 1 బొమ్మలు - బొమ్మల కథలు 2. వర్ణమాల - బొమ్మలు 3 అక్షర పాఠాలు 4. వచన పాఠాలు 5. పాటలు 6. అక్షరాలు, గుణింతాలు, గుణింతపు గుర్తుల పట్టిక 7 పదపట్టిక. అలాగే ఒక్కో అక్షర పాఠాన్నీ మళ్ళీ ఎనిమిది భాగాలుగా విభజించడం జరిగింది. అవి 1. బొమ్మలు, 2. పదాలు, 3. ఆ పదాల విభజన, 4. కొత్తగా ప్రవేశపెట్టిన అక్షరాల్ని విడివిడిగా చూపించడం, 5. అక్షరాలతో పదాలు, పదబంధాలు, చిన్న చిన్నవాక్యాలు నిర్మించడం, 6. కొత్తగా ప్రవేశ పెట్టిన అక్షరాలకు చేతి కదలికల్ని బాణపు గుర్తులతో చూపించడం, 7. రకరకాల అభ్యాసాల్ని ప్రవేశపెట్టడం, 8. ఆయా పాఠం చివర ఉపాధ్యాయులకు సూచనలు ఇవ్వడం. పాఠ్య పుస్తకం చివరి భాగంగా పదపట్టికను ఇవ్వడం జరిగింది. ఈ పదాలన్నీ పాఠ్య పుస్తకంలో ప్రవేశపెట్టబడ్డవే. ఈ మొదటి తరగతి పాఠ్య పుస్తకాన్ని పిల్లలు వాళ్ళ మాతృభాషని నేర్చుకోవడానికి అనువుగా కర్నాటక ప్రభుత్వ పాఠ్యపుస్తక నిర్దేశనాలయం వారు భారతీయ భాషా సంస్థ మైసూరు వారి సహకారంతో తయారుచేశారు.[6] ఈ పుస్తకం ముందుమాటలో చెప్పబడ్డట్టుగా ఇందులో ప్రవేశపెట్టబడ్డ భాషాబోధన పద్ధతి సంప్రదాయ పద్ధతికి భిన్నంగా శాస్త్రీయమైన, పరిశోధనాత్మకమైన నేపథ్యాన్ని కలిగిఉంది. పుస్తక నిర్మాణపద్ధతి, బోధన సామగ్రి విషయంలో ప్రత్యేకత కలిగిఉంది.

6. తెలుగుభారతి - 1

పిల్లలు రెండో తరగతికి వచ్చేటప్పటికి వాళ్ళకు మాతృభాషలో వినడం మాట్లాడడం, వ్రాయడం, చదవడం, తమ భావాలను ఇతరులకు చెప్పగలగడం కొంతవరకు తెలిసే ఉంటుంది పిల్లలు అనేక ధ్వనుల్ని, శబ్దాల్ని తప్పుగా ఉచ్చరించడం, వాక్యాల్ని తప్పుగా నిర్మించడం, పెద్దలతో మాట్లాడేటప్పుడు గౌరవ వాచకాలను ఉపయోగించక పోవడం సాధారణంగా జరుగుతూ ఉంటుంది. అందువల్ల ఇలాంటి దోషాలను పిల్లలు రెండో తరగతికి వచ్చిన తర్వాత వాళ్ళచేత పూర్తిగా మాన్పించేటట్టు అధ్యాపకులు జాగ్రత్త పడాలి రెండో తరగతి పూర్తయ్యేటప్పటికి పిల్లల్లో చదవడం, వ్రాయడం, వినడం, మాట్లాడడం మొదలైన కౌశలాలను అధ్యాపకులు పెంపు చేయాల్సి వుంటుంది వాటితో పాటు ఈ క్రింది అంశాలను అధ్యాపకులు గమనించి పిల్లల్లో అభివృద్ధి చేయాలి. 1 చిన్న చిన్న పేరాలు చదవడం, వాటిని వ్రాయడం పిల్లల చేత చేయించాలి, 2. వినడం, మాట్లాడడం తరగతి గదిలోనే చేయించాలి, 3. తోటి బాలబాలికలతో సంభాషణలు చేయించాలి, 4. పాటల్ని గేయాల్ని సామూహికంగా పాడించాలి, 5. రకరకాల కథల్ని వినిపించాలి. వాటిని పిల్లలచేత చెప్పించాలి. కొన్ని ప్రశ్నలు వేసి సమాధానాలు రాబట్టాలి, 6. 'చూసి వ్రాయండి' అనే అభ్యాసాల్ని ప్రతిరోజూ క్రమం తప్పకుండా చేయించాలి, 7. దినపత్రికల్లోని ప్రకటనలు, పతాక శీర్షికల్ని పిల్లలు చదువ గలిగే శక్తిని పెంపొందించాలి, 8 సంయుక్తాక్షరాల్ని, ద్విత్వాక్షరాలను సరిగా ఉచ్చరించేటట్లు చేసి పిల్లలచేత వ్రాయించాలి, 9. అయా పాఠాల్లో ఉండే విరామ చిహ్నాల్ని తప్పకుండా పరిచయం చేయాలి.[7]

పై భాషా కౌశలాల్ని అభివృద్ధి చేయడానికి, పిల్లల్లో మౌలిక విలువల్ని పెంచడానికి ఉపకరించేటట్టుగా పాఠ్య ప్రణాళికను రూపొందించడం జరిగింది దీనిప్రకారం 450 పీరియడ్లకు సరిపడేటట్లు పాఠ్యపుస్తకాన్ని వ్రాయడం జరిగింది. ఇందులో 110 పీరియడ్లు వినడానికి, 110 పీరియడ్లు మాట్లాడడానికి, 125 పీరియడ్లు చదవడానికి, 105 పీరియడ్లు వ్రాయడానికి కేటాయించబడ్డాయి ఈ పుస్తకంలో ముఖ్యంగా ఐదు ప్రధాన భాగాలున్నాయి. 1. ఉపాధ్యాయులకు సూచనలు, 2. బొమ్మల పాఠాలు, 3. వచన గేయ పాఠాలు, 4. భాషలో ఆటలు, 5. పదపట్టిక. ఈ పాఠ్య పుస్తకంలో 10 కథాపాఠాలు, 10 గేయపాఠాలు, 10 సామాన్య పాఠాలు ఇవ్వబడ్డాయి. ఈ కథా పాఠాలు మౌలిక విలువల్ని తెలియజేసేవి. ఇందులో జంతువుల, పక్షుల కథలే చెప్పబడ్డాయి. అలాగే

---

7. తెలుగు భారతి - 2, పుట. 7.

గేయపాఠాలు పిల్లల మానసిక శక్తికి తగినట్టుగా ఎన్నుకోవడం జరిగింది. ఇవి జానపద విలువలు, పరిసర జ్ఞానం, దేశభక్తి, సమతాభావం, మంచి అలవాట్లు తెలియజేసేవిగా ఉన్నాయి. అలాగే ఊరు, రాష్ట్రం, దేశం, దేశ నాయకులు, వీరులు, వీర వనితలు మొదలయిన పాఠాలు సామాన్య పాఠాలుగా చేర్చబడ్డాయి

పోతే బోధనలో అతిప్రధానమైన భాగం అభ్యాసాల్ని చేయించడం విద్యార్థుల గ్రహణశక్తి, భాషా కౌశలం, పరిశీలనాశక్తుల్ని పెంపొందించడానికి ప్రతి పాఠంలోనూ రకరకాల అభ్యాసాలు ఇవ్వబడ్డాయి వీటిని అధ్యాపకులు పాఠం పూర్తవగానే పిల్లలచేత చెప్పించి చేయించాలి.

పిల్లలు మూడో తరగతికి వచ్చేటప్పటికి వాళ్ళ మాతృభాషలో వినడం, మాట్లాడగలగడం, వ్రాయడం, చదవడమే కాకుండా తమ భావాల్ని ఇతరులకు స్పష్టంగా చెప్పగలగడంలో నైపుణ్యాన్ని సాధించి ఉంటారు. వీటితో పాటు విద్యార్థుల్లో పరిసరజ్ఞానం పెంపొంది ఉంటుంది. అయినటప్పటికీ ఉచ్చరించడంలో దోషాలు చేస్తుంటారు. ఆ దోషాలను దిద్దటం అధ్యాపకుల కర్తవ్యం. వినడం, మాట్లాడడం, చదవడం, వ్రాయడం లాంటి ప్రాథమిక కౌశలాలతోపాటు మరికొన్ని నైపుణ్యాలను మూడో తరగతిలో పెంపొందింప చేయాలి. అవి 1 పాఠాల్ని సంభాషణ రూపంలోనూ, నాటక రూపంలోనూ పిల్లలతో అభినయింప చేయాలి, 2. చిన్న చిన్న కథల్ని పిల్లల చేత చదివించడం, మళ్ళీ వాటిని వ్రాయించడం చేయించాలి, 3. పాటల్ని, పద్యాల్ని ముందుగా సామూహికంగానూ, తర్వాత వైయక్తికంగానూ పాడించాలి అలాగే పిల్లలకు తెలిసిన పాటల్ని పాడమని ప్రోత్సహించాలి, 4. పిల్లలకు తెలిసిన కథల్ని చెప్పమనాలి. వాటిలో తప్పులు దొర్లితే అధ్యాపకులు సరిదిద్దాలి తర్వాత ప్రశ్నలు వేసి సమాధానాలు రాబట్టాలి, 5 దిన, వార, మాస పత్రికలు, చిన్నచిన్న ప్రకటనలు, పతాక శీర్షికలు, ఉత్తరాలు మొదలైనవి పిల్లలు ప్రతిరోజూ చదివేటట్టు ప్రోత్సహించాలి. అలాగే వీటిని పిల్లలు సేకరించేటట్టు చేయాలి, 6. ఇతరులతో మాట్లాడేటప్పుడు గానీ, చదివేటప్పుడు గానీ శబ్దజాలాన్ని సరిగా ఉచ్చరించేటట్టు చూడాలి. వాక్యాల్ని తప్పుగా నిర్మించడం, ఉచ్చరించడం పిల్లలలో సాధారణంగా జరుగుతూ ఉంటుంది అలాంటి దోషాలను అధ్యాపకులు సరిదిద్దాలి, 7 ప్రతిపాఠంలో ఉన్న విరామ చిహ్నాలను విధిగా పరిచయం చేయాలి, 8. సాహిత్య విలువలు

ఉన్న అంశాలను అధ్యాపకులు అప్పుడప్పుడు పిల్లలకు బోధించాలి. అలాగే వాటిని చదివి విన్పించాలి.[8]

మూడో తరగతి పాఠ్య ప్రణాళిక రెండో తరగతి పాఠ్య ప్రణాళికలాగానే తయారుచేయబడింది. అలాగే ఇందులో పిల్లలు సొంతంగా 'భాషలో ఆటలు' తయారుచేసేటట్టు ప్రోత్సహించడం జరిగింది.

పాఠ్యపుస్తకాలలో పాఠం చివర అభ్యాసాలు అధిక ప్రాధాన్యాన్ని వహిస్తాయి మొదటి తరగతిలో అభ్యాసాలు ఈ క్రమంలో ఉండాలి. అవి 1. అక్షరాలను గుర్తించడం, 2. అక్షరాలను చదవడం, 3. పదాలను చదవడం, 4 సరయిన అక్షరంతో ఖాళీలు నింపడం, 5. అక్షరాలను కలిపి చదవడం, 6. బొమ్మల పేర్లు వ్రాయడం, 7. ప్రశ్నలకు జవాబులు చెప్పించడం, 8 బ్రాకెట్లలో ఇచ్చిన పదాల సాయంతో ఖాళీలు నింపడం మొదలైనవి.

అలాగే రెండో తరగతిలో ప్రతిపాఠం చివర అభ్యాసాలు ఇలా ఉండాలి. 1. సమాధానాలు వ్రాయడం, 2 చదవడం, 3. ఖాళీలు నింపడం, 4 వాక్యాలను సరయిన క్రమంలో వ్రాయడం, 5 జతపరచడం, 6. అవును / కాదు వ్రాయడం, 7. ఒకే గుంపుకు చెందని పదాలను గుర్తించడం, 8. సూచించనట్టుగా పదాలను వ్రాయడం, 9. సూచించినట్టుగా పదాలను మార్చి వ్రాయడం, 10. పాఠంలో ఉన్న వాక్యాల్ని ఎవరు ఎవరితో అన్నారు అనేది గుర్తించడం.

ఇక పోతే మూడో తరగతిలో రెండో తరగతిలో ప్రవేశపెట్టిన అభ్యాసాలనే ప్రవేశపెట్టితే సరిపోతుంది.

నాలుగో తరగతి పాఠ్య ప్రణాళిక మూడో తరగతి పాఠ్యప్రణాళికను అనుసరిస్తే చాలు. అలాగే అభ్యాసాలు కూడ. ఆ అభ్యాసాలతోపాటు 1. ప్రశ్నలకు సమాధానాలను ఒక వాక్యంలో వ్రాయడం, 2. ప్రశ్నలకు సమాధానాలు మూడు, నాలుగు వాక్యాలలో వ్రాయడం, 3. ఇచ్చిన పదాలతో వాక్యాలను పూర్తిచేసి, పేరును తిరిగి వ్రాయడం మొదలైన అభ్యాసాలను ప్రవేశపెట్టాలి.

పిల్లలు ఐదో తరగతికి వచ్చేటప్పటికి వాళ్ళ మాతృభాషలో ప్రధాన భాషా కౌశలాలయిన వినడం, మాట్లాడడం, వ్రాయడం, చదవడంలో నైపుణ్యాన్ని

8. తెలుగుభారతి - 3, పుటలు VI, VII

బాగా సంపాదించి ఉంటారు. అలాగే తమ భావాలను ఇతరులకు మరింత స్పష్టంగా చెప్పగల్గిన స్థితిలో ఉంటారు. నాలుగో తరగతి దాకా చెప్పబడ్డ పై భాషా కౌశలాలతోపాటు 5, 6, 7 తరగతుల్లో వ్యాకరణాంశాల్ని విధిగా పరిచయం చేయాల్సి వుంటుంది వ్యాకరణాన్ని సంప్రదాయక పద్ధతిలో సూత్రబద్ధంగా కాకుండా ప్రాయోగిక వ్యాకరణాన్ని (Functional Grammar) ద్వారా బోధించాలి ఈ ప్రాయోగిక వ్యాకరణాంశాలను సులభమైన రీతిలో తగిన ఉదాహరణాల ద్వారా పిల్లలకు అర్ధం అయ్యేటట్టు స్పష్టంగా చెప్పాలి అలాగే విద్యార్థులు రేడియో కార్యక్రమాలను, వార్తలను వినడంతోపాటు, టి.వీ.లో వచ్చే విజ్ఞానదాయకమైన కార్యక్రమాల్ని చూసేటట్టు ప్రోత్సహించాలి వాళ్ళు తెలుసుకొన్న విషయాలను, అనుభవాలను అడిగి తెలుసుకోవాలి పిల్లలకు వ్యాసరచన పోటీలను, వక్తృత్వ పోటీలను విధిగా నిర్వహించాలి విద్యార్థుల్ని ఇతర పాఠశాలల్లో జరిగే వక్తృత్వ, వ్యాసరచన పోటీల్లో పాల్గొనేటట్లు అధ్యాపకులు ప్రోత్సహించాలి.

5, 6, 7 తరగతుల్లో అభ్యాసాలు ముఖ్యంగా 1 విషయ సంబంధి అభ్యాసాలు, 2 భాషా సంబంధి అభ్యాసాలు, 3 వ్యాకరణాంశాలు, 4 అదనపు సమాచారం భాగాలుగా వర్గీకరింపబడాలి. అభ్యాసాలలో పదాలకు అర్థాలు, వ్యతిరేకపదాలు, జంటపదాలు, నానార్థాలు, జాతీయాలు, పలుకు బడులు, సామెతలను ఇవ్వాలి

విద్యార్థి ఏడోతరగతికి వచ్చేటప్పటికి 1. అవగాహనతో వినడం, 2 సంప్రదాయంగా, గౌరవప్రదంగా మాట్లాడడం, 3. స్పష్టంగా సృజనాత్మకంగా వ్రాయగలగడం, 4 చదవడం ద్వారా భావాలను అవగాహన చేసుకోవడం, 5. వివిధ సన్నివేశాల్లో ప్రాయోగిక వ్యాకరణాన్ని ఉపయోగించడం, 6. చూసిన సంఘటనల్ని వివరించడం మొదలైన భాషా ప్రయోగాలు అలవడి వుంటాయి అలాగే విద్యార్థులు ఎనిమిదో తరగతికి వచ్చేటప్పటికి వాళ్ళలో తగినంత భాషాజ్ఞానం, సాహిత్య పరిచయం క్రింది తరగతుల్లో అధ్యయనం ద్వారా అలవడిఉంటుంది. దీంతోపాటు తమ అనుభవాల్ని స్పష్టంగా చెప్పగలిగి ఉంటారు.

ఏడో తరగతి నుంచే పద్యాలను కంఠస్థం చేసే అలవాటును పిల్లలలో కలిగించాలి. అందుకోసం పద్యపాఠాలలో ఉన్న కొన్ని మంచి పద్యాలను పిల్లల చేత విధిగా కంఠస్థం చేయించాలి.

8, 9, 10 తరగతుల పాఠ్యప్రణాళికల్లో నేటి భాషాబోధనకు అనుగుణంగా మార్పులు అవసరం. పద్య భాగంలో 10-15 పాఠాలు, గద్యభాగంలో 10-15 పాఠాలు ఉండేట్టు చూడాలి ఆధునిక కవితల్ని పరిచయం చేయాలి. ఇవి ఆధునిక ఆలోచనల్ని అభిప్రాయాల్ని, జీవిత దృక్పథాన్ని ఎత్తిచూప గలుగుతాయి. అంతేకాక సమకాలీన రచయితల్నీ, రచనా శైలుల్నీ పరిచయం చేసుకొనే అవకాశం ఏర్పడుతుంది. ఇవి గేయాలు కాబట్టి పాడడానికి వీలుగా ఉంటాయి మాత్రా ఛందస్సు పిల్లలకు పరిచయం అవుతుంది. ఛందస్సు కంటె భావ సరణి స్పష్టంగా తెలుస్తుంది. ఇలాంటి కవితల్ని చదవడం వల్ల పిల్లల్లో తాము కూడ ఇలాంటి వాటిని వ్రాయాలన్న ప్రేరణని కల్గించినట్టవుతుంది.

అధ్యాపకులు పాఠాలను బోధించేటప్పుడు తాము బోధించిన విషయాలకు సంబంధించిన ఇతర పుస్తకాల పేర్లను చెప్పాలి. అలాంటి పుస్తకాలను చదవడం పిల్లలకు అలవాటుచేయాలి అలాగే వీలయినన్ని Vocabulary Hemsని పిల్లలకు అందించాలి.

పాఠ్య ప్రణాళికలో నాటకాలను చేర్చాలి. ఇవి భాషలో మాటల్ని ఎలా పలకాలో, సందర్భాను గుణంగా భావాల్ని ఎలా అభివ్యక్తం చేయాలో అన్న కౌశలాన్ని పెంచుకోవడానికి ఉపకరిస్తాయి. అలాగే కొత్తకొత్త వ్యాకరణాంశాల్ని పరిచయం చేస్తూ అభ్యాసాలను ఇవ్వాలి.

పోతే పాఠ్య పుస్తకాల్లో, పాఠ్య ప్రణాళికల్లో నూతన జాతీయ విద్యా విధానంలో చేర్చాల్సిన Core elements నీ Core Values నీ మనసులో ఉంచుకోవాలి. భాషా బోధనలో ఇవి ప్రాముఖ్యం వహిస్తాయి. ఆ పట్టికను పొందుపరుస్తున్నాను.

CORE ELEMEMTS TO BE INCORPORATED IN TEXT BOOKS[9]

The National Policy on education 1986 is emphatic on introducing a common core in the National Curriculum Framework along with the components that are flexible. The common core elements have been identified as under:

1) History of India's freedom movement.

2) Constitutional obligations.

[9] కర్నాటక ప్రభుత్వం, పాఠ్య పుస్త నిర్దేశనాలయం, బెంగుళూరు వారిచ్చిన పట్టిక.

3) Content essential to nurture national identity,

4) India's common cultural heritage.

5) Egalitarianism, democracy and secularism.

6) Equality of sexes.

7) Protection of environment.

8) Removal of social barriers.

9) Observance of family norms.

10) Inculcation of Scientific temper.

CORE VALUES

(1) Abstinence (2) Appreciation of cultural values of others (3) Anti-untouchability (4) Citizenship (5) Consideration for others (6) Concern for others (7) Co-operation (8) Cleanliness (9) Compassion (10) Common cause (11) Common - good (12) Courage (13) Courtesy (14) Curiosity (15) Democratic decision making (16) Devotion (17) Dignity of the individual (18) Dignity of manualwork (19) Duty (20) Discipline (21) Endurance (22) Equality (23) Friendship (24) Faithfulness (25) Fellow - feeling (26) Freedom (27) Forward look (28) Good manners (29) Gentlemanliness (30) Gratitude (31) Honesty (32) Helpfulness (33) Humanism (34) Hygienic living (35) Initiative (36) Integrity (37) Justice (38) Kindness (39) Kindness to animals (40) Loyalty to duty (41) Leadership (42) National unity (43) National Consciousness (44) Non-violence (45) National integration (46) Obedience (47) Peace (48) Proper utilisation of time (49) Punctuality (50) Patriotism (51) Purity (52) Quest for knowledge (53) Resourcefulness (54) Regularity (55) Respect for others (56) Reverence for old age (57) Sincerity (58) Simple living (59) Social justice (60) Self - discipline (61) Self - help (62) Self - respect (63) Self - confindence (64) Self - support (65) Self - Study (66) Self - reliance (67) Self - control (68) Self - restraint (69) Social service (70) Solidarity of mankind (71) Sense of social responsibility (72) Sense of discrimination between good and bad. (73) Socialism (74) Sympathy (75) Secularism and respect for all religions (76) Simple living (77) Spirit of enquiry (78) Team work (79) Team spirit (80) Truthfulness (81) Tolerance (82) Universal truth (83) Universal love (84) value for national and civic property.

మాతృభాషా బోధన ముఖ్యోద్దేశాలను (5, 6, 7, 8, 9, 10) తరగతులు) ఈ క్రింద క్రోడీకరించడం జరిగింది. ఇవి పాఠ్య పుస్తకాలను రచించడానికీ, పాఠ్య ప్రణాళికల్ని తయారు చేయడానికి ఉపకరిస్తాయి.

మాతృభాషా బోధన ముఖ్యోద్దేశాలు[10] ; **5, 6, 7 తరగతులు (తెలుగు ప్రథమభాష)**

1. భాషా కౌశలాలయిన 'వినడం, మాటాడడం, చదవడం, వ్రాయడం, మొదలయిన వాటిలో సామర్థ్యాన్ని కలగజేయడం

2. స్పష్టమైన ఉచ్చారణ, వ్రాతలను కల్పించడం.

3. నిత్య జీవితంలో సమయానుకూలంగా, సంఘటనలను అనుసరించి అభిప్రాయాన్ని వ్యక్తపరచే సామర్థ్యాన్ని పెంచడం.

4. మాట్లాడేటప్పుడు, చదివేటప్పుడు, వ్రాసేటప్పుడు దీర్ఘాక్షరాలు, అల్ప, మహా ప్రాణాక్షరాలు, అనునాసికాలు మొదలైన అక్షరాల వ్యత్యాసాలను గమనించే సామర్థ్యం.

5. అందమైన వ్రాతను స్పష్టంగా, క్రమ బద్ధంగా తప్పులు లేకుండా వ్రాయడం.

6. ఉచ్చారణ స్వరభేదాలు, ఒత్తులు గమనించి స్పష్టంగా చదవడం.

7. వ్యాకరణ జ్ఞానాన్ని కల్గించడం.

8. జాతీయ, సామాజిక, సాంస్కృతిక, నైతిక విలువలు అనుసరించే మనోభావాల్ని అభివృద్ధి చేయడం.

9. పరిసర సంరక్షణం, వైజ్ఞానిక మనోభావం, జాతీత సమాజం వంటి నైతిక విలువల్ని తెలియజేయడం.

10. జ్ఞానార్జనని, సంతోషాన్ని పొందడం కోసం అర్థవంతంగా చదవడం

11. వ్రాత సామర్థ్యాన్ని పెంచడం, వాక్యాలను క్రమంగా, వేగంగా వ్రాసే సామర్థ్యాన్ని పెంపొందించడం.

12. సౌందర్యం, వర్ణన, రసాస్వాదుల కోసం సాహిత్యం, భాషా పుస్తకాలను చదివే మనోభావాన్ని పెంపొందించడం.

---

10 కర్నాటక ప్రభుత్వం, పాఠ్యపుస్తకనిర్దేశనాలయం, బెంగుళూరువారి తెలుగు ప్రథమ భాష పాఠ్యప్రణాళికల ఆధారంగా

8, 9, 10 తరగతులు (తెలుగు ప్రథమభాష)

1. విద్యార్థులలో వినడం, మాట్లాడడం, వేగవంతంగా చదవడం, వ్రాయడం వంటి సామర్థ్యాన్ని అభివృద్ధిచేయడం.

2 మౌఖిక మరియు లిఖిత సామర్థ్యాలను పెంపొందిచడం.

3. జ్ఞానార్జన, సంతోషం సాహిత్యాభిరుచుల్ని పొందడం కోసం పిల్లలు స్వయంగా చదువుకునే సామర్థ్యాన్ని కల్గించడం.

4. వాక్యాలు, సమాసాలను అర్థం చేసుకోవడం, పదజాలాన్ని వృద్ధిచేసుకోవడం, స్పష్టమైన ఉచ్చారణతో దోషరహితమైన భాషతో మాట్లాడడం, వ్రాయడం వంటి సామర్థ్యాన్ని పెంపొందించడం.

5. వర్ణనాశక్తి, కాల్పనిక శక్తి, సృజనాత్మక శక్తుల్ని పెంపొందించడం

6. సాహిత్యం సంస్కృతుల్లో ఆత్మీయత, సోదరభావం, అభిమానం వంటి గుణాల్ని పెంపొందించడం.

7. సర్వతోముఖాభివృద్ధినీ, వ్యక్తిత్వ వికాసాన్నీ కల్గించే నైతిక విలువల్ని, భావనల్ని కల్గించడం.

8. సుప్రసిద్ధ కవులు, రచయితలు, గ్రంథకర్తల కావ్యాలు, రచనలతో పరిచయం కల్పించడం,

9 సాహిత్య విలువల్ని, వ్యాకరణాంశాల్ని పరిచయం గావించడం

10. సర్వసమానత్వం, జాతీయ దృక్పథం, జాతీయత మొదలైన విలువల్ని పిల్లల్లో అభివృద్ధి చేయడం.

11. పరిసర సంరక్షణ, జాతీయ వనరుల సంరక్షణ, వైజ్ఞానిక మనోభావం, సాహిత్య దృక్పథం వంటి విలువల్ని పిల్లలకు పరిచయం చేయడం.

12. సమస్యలను గురించి ఆలోచించడం, కారణాల్ని కనుగొనే విశ్లేషణ శక్తిని, తులనాత్మక శక్తి వంటి సామర్థ్యాలను పెంపొందింప చేయడానికి సహకరించడం.

ఇలా మాతృభాషా బోధన సమర్థవంతంగా జరగాలంటే అధ్యాపకుల బోధన విషయంలో కూడ మార్పు రావాలి. మంచి శిక్షణ అవసరం కాబట్టి శిక్షణ సంస్థలు కూడ ఈ విషయంలో తమవంతు పాత్రను నిర్వహించాలి. పాఠ్య ప్రణాళికల్లో, పాఠ్య పుస్తకాల్లో రావలసిన మార్పులతోపాటు పరీక్షల విషయంలోను మార్పు అవసరం.

ఆచార్య బి. రామకృష్ణారెడ్డిగారన్నట్టుగా " There is an urgent need to improve the teaching of Telugu as Mother tongue as it has two fold function of bringing the knowledge to the learner through his own mother tongue and developing Telugu for modern communation purposes Historically Telugu has been confined to the domain of literature and some other traditional areas of knowledge. But in the recent past it is endowed with the responsibility of bringing the knowledge explosion in the areas of science, technology, medicine, Communication etc. to the monolingual native speakers. This means the domains of use of Telugu have expanded and correspondingly the Telugu language has to develop registers to cope with ever increasing horizons of knowledge and development"[11]

చివరగా మలాయి భాషలోని ఆణిముత్యాల లాంటి రెండు నానుడుల్ని ఇక్కడ పేర్కొంటాను. 1. 'బహాషా జీవా బంగ్సా' - భాష ఒక జాతికి జీవం లాంటిది 2. 'బహాషా హీలాంగ్' - భాష పోయిననాడు జాతిలేకుండా పోతుంది

## తోడ్పడ్డ గ్రంథాలు


1. హిందీ మాతృ భాషగా గల విద్యార్థులకు ద్వితీయ భాషగా తెలుగుబోధన - సమస్యల విశ్లేషణ - వై రెడ్డి శ్యామల
2. తెలుగు భారతి 1-10 తరగతుల పాఠ్యపుస్తకాలు - కర్నాటక ప్రభుత్వం పాఠ్యపుస్తక నిర్దేశనాలయం, బెంగుళూరు
3. భాష - ఆధునిక దృక్పథం - పోరంకి దక్షిణామూర్తి
4. భాషాశాస్త్ర వ్యాసాలు - బూదరాజు రాధాకృష్ణ
5. 'అభ్యుదయ' - వాడుక భాష సదస్సు విశేష సంచిక - ఏప్రిల్ 1980
6. Language curriculum - D.P. Pattanayak.
7. '5, 6, 7, 8, 9, 10 తరగతుల పాఠ్య ప్రణాళికలు - కర్నాటక ప్రభుత్వ పాఠ్యపుస్తక నిర్దేశనాలయం, బెంగుళూరు.
8. 'Guidelines for textbook writers' - Directorate of text books, Bangalore.
9. తెలుగు భాష (Compiled articles) Editor . M. Ramappa International Telugu Institute, Hyderabad.
10. తెలుగు అధ్యాపకుడు (ప్రత్యేక సంచిక) మొదటి అంతర్జాతీయ తెలుగు ఉపాధ్యాయుల సదస్సు నవంబరు 1995, ఆంధ్ర మహాసభ, మారిషస్.


11. తెలుగు అధ్యాపకుడు (ప్రత్యేక సంచిక) పుట 54 పుట 139.

# హృదయనేత్రి, పుదువెళ్లం - తులనాత్మక అధ్యయనం

డా॥ జె. మునిరత్నం

నవల నలుగురినీ ఆకట్టుకొని అలరించే అద్భుత ప్రక్రియ. నవల విశేషజ్ఞులనే గాక అక్షరజ్ఞానం కల సామాన్య పాఠకులను కూడా సముచితంగా స్పందింపజేస్తుంది. పాఠకుడి ఆలోచనను, మాటను, ప్రవర్తనను ప్రభావితం చేస్తుంది. సమకాలీన సమాజ సజీవ ప్రతిబింబ రూపమే నవల. ఒకవైపు చరిత్రకు అద్దంపడుతూ మరోవైపు చరిత్రను సృష్టించే మహత్తర మాధ్యమరూపం నవల. సాంఘిక, ఆర్థిక, రాజకీయ సమస్యలెన్నిటినో చర్చించి వాటికి తగిన పరిష్కారాలను సూచిస్తుందీ ప్రక్రియ. చారిత్రక నవలలు, అపరాధ పరిశోధక నవలలు, మనోవైజ్ఞానిక నవలలు, రాజకీయ నవలలు, స్త్రీవాద నవలలు, దళితవాద నవలలు, పిల్లల నవలలు, ప్రాంతీయ జీవనాత్మక నవలలు మొదలైనవి నవలల్లో కనిపించే కొన్ని విభాగాలు. వీటిలో చారిత్రక, రాజకీయ నవలల్లో కొన్ని దేశభక్తిని ప్రతిపాదించి ప్రబోధించి ప్రజ్వరిల్ల జేసేందుకు ప్రయత్నించాయి. ప్రస్తుత సంక్షోభ పరిస్థితులలో దేశభక్తి నవలలను గూర్చి ఆలోచించి అవి ఆవిష్కరించే దేశభక్తిని అందరి దృష్టికి తీసుకొనిరావడం అత్యావశ్యకం.

ప్రస్తుతం దేశంలో పలురంగాలు గణనీయంగా అభివృద్ధి చెందినా దేశభక్తి మాత్రం దీనికి విరుద్ధంగా గణనీయంగా నానాటికీ తగ్గిపోతూ ఉంది. నిజాయితీ, కష్టపడాలనే మనస్తత్వం, పరోపకార బుద్ధి, త్యాగ నిరతి, విశాల దృక్పథం, దీర్ఘ కాలిక ప్రయోజన దృష్టి, మంచితనం, మానవత్వం బాగా తగ్గిపోతున్నాయి. మోసం, ద్వేషం, పగ, అన్యాయార్జనాసక్తి, కుయుక్తి, పైశాచిక ప్రవృత్తి, కేవల స్వార్థ చింతన నానాటికీ పెరిగిపోతున్నాయి మరోవైపు హింసాత్మక నేర సాహిత్యం అనేక రూపాల్లో అందరికీ అందుబాటులో ఉంటూ మస్తిష్కానికి మత్తెక్కిస్తూ ఉంది అశాంతిని, అలజడిని రేకెత్తిస్తూ ఉంది అవాంఛనీయ మారణ హోమానికి ఆజ్యం పోస్తూనే ఉంది.

ఈదుస్థితిని మార్చేందుకు, భవితవ్యాన్ని తీర్చి దిద్దేందుకు ఆరోగ్యకరమైన సాహిత్యం ఎంతైనా అవసరం. దేశభక్తి, త్యాగనిరతి, నిస్వార్థ సేవాసక్తి, హృదయ వాదం, మానవతా వాదం, చెడును ద్వేషించే స్వభావం, మంచిని

ప్రేమించే మనస్తత్వం వంటి సుగుణాలను ప్రజలలో కలిగించి ప్రవృద్ధి చేసే సాహిత్యం ప్రజల్లోకి రావాలి. ఇటువంటి సాహిత్యం తెలుగు, తమిళ భాషల్లో పుష్కలంగానే ఉంది. అయినప్పటికీ అది అందరికి అందుబాటులోకి రాకపోవడం సోచనీయం. దేశభక్తిని ప్రబోధించే నవలలు స్వాతంత్ర్యోద్యమ వస్తుకంగా ఎన్నో ఉన్నాయి. కొన్ని నవలలు స్వాతంత్ర్యోద్యమ కాల జీవితాన్ని చిత్రిస్తే మరికొన్ని నవలలు స్వాతంత్ర్యోద్యమ కాల జీవితంతో పాటు స్వతంత్ర భారత జీవితాన్ని కూడా చిత్రించాయి. తెలుగు, తమిళ భాషల్లో వచ్చిన ఇటువంటి రెండు నవలల్ని తులనాత్మకంగా అధ్యయనం చేయడం ఎంతో ఆసక్తికరంగా ఉంటుంది. ఉభయప్రాంతాల ప్రజల మనోభీష్ట సారూప్యతను, వారి దేశభక్తి సాదృస్యతను అంచనా వేసేందుకు అవకాశమేర్పడుతుంది. తద్వారా స్ఫూర్తి పొందేందుకు దోహదం కలుగుతుంది. తెలుగులో 'హృదయనేత్రి', తమిళంలో 'పుదువెళ్లం'(కొత్తవెల్లువ) అనే నవలలు పరిశీలించి, భావించి పరవశించదగ్గవి

హృదయనేత్రి :-దేశ జీవనంలో నేడు మృగ్యమైపోయిన త్యాగం ఆవశ్యకతను తెలియజేసే నవల 'హృదయనేత్రి' స్వాతంత్ర్యోద్యమ జీవన చిత్రణతో ప్రారంభమై స్వతంత్ర భారత జీవితంలోని పలుకోణాలను పాఠకులకు పరిచయం చేస్తుందీ నవల. మనిషి స్వార్థపు విస్వరూపాన్ని చిన్న అద్దంలో చూపించేందుకు ఈ నవల ప్రయత్నించింది. స్వాతంత్ర్యోద్యమ కాలంలోనే గాక స్వాతంత్ర్యానంతర కాలంలోనూ స్వార్థం చేసినా చేస్తున్నా విలయ తాండవాన్ని ధరించినా ధరిస్తున్నా రూప బాహుళ్యాన్ని పాఠకుల దృష్టికి తెచ్చింది. మానవతను జాగృతం చేసి స్వతంత్రోద్యమ స్ఫూర్తితో అభ్యుదయ మహా ప్రస్థానానికి అర్థమైన పిలుపునిచ్చింది. నిరంతర నైతిక పోరాటాన్ని కొనసాగించవలసిన ఆవశ్యకతను నొక్కి చెప్పింది.

హృదయాన్ని స్పృశించే 'హృదయనేత్రి' నవలను రచించి ఆంధ్రుల కందించిన వారు సుప్రసిద్ధ రచయిత్రి శ్రీమతి మాలతీ చందూర్ గారు. వీరు జాతీయోద్యమంతో బాటు స్వతంత్ర భారతదేశంలో తలెత్తిన వివిధ ఉద్యమాలను, పరిస్థితులను ఈ నవల్లో పాఠకులకు పరిచయం చేశారు. అందరికీ అనుసరణీయమైన ఆదర్శ జీవితాన్ని చిత్రించి పాఠకుల్లో మంచి స్ఫూర్తి కలిగించారు. చదివించే కమ్మని భాష, మనసుకు హత్తుకుపోయే చక్కని భావాలు, కళ్లకు కట్టినట్టు సాగే దృశ్యాలు, సంఘటనలు ఈ నవలను మళ్ళీ మళ్ళీ చదవాలనిపించేట్టు చేస్తాయి. ఆదర్శ జీవితానికి అక్రమ జీవితానికి

మధ్య ఉన్న అంతరాన్ని, నిత్యమూ వాటిమధ్య జరిగే సంఘర్షణను ఈ నవల అద్భుతంగా ఆవిష్కరించింది. ఈ నవలకు సాహిత్య అకాడమీ పురస్కారం లభించడం గమనార్హం.

రామలక్ష్మి శుద్ధ శ్రోత్రియ కుటుంబానికి చెందిన ఆడపడుచు. లాయర్ శ్రీనివాసరావుని వివాహం చేసుకొని అతని సాహచర్యంలో ఆధునిక అభ్యుదయ భావాలను ఒంట బట్టించుకుంది. దేశభక్తిని అలవరచుకుంది విశాల దృక్పథాన్ని వికసింపజేసుకుంది. మేనల్లుడు పదేళ్ళ గోపాలరావుకు దేశభక్తిని నూరిపోసింది అంత చిన్న తనంలోనే అన్నిటినీ విడమరచి చెప్పి రాజీ లేని నైతిక పోరాటానికి అతన్ని సిద్ధం చేసింది. స్త్రీలు పిల్లల్ని ఎలా తీర్చిదిద్దాలో, స్త్రీజాతి ఒక జాతికి ప్రాణ ప్రాయంగా ఎలా పనిచేయ గలుగుతుందో మాలతిగారు రామలక్ష్మి పాత్ర ద్వారా చక్కగా తెలియజేశారు

ఈ నవల్లో నాయకుడుగా పేర్కొదగిన గోపాలరావు తన పదేళ్ళ వయసు నుంచి చివరిదాకా ఆదర్శవంతంగానే ప్రవర్తించి నలుగురి ప్రశంసలకు పాత్రుడయ్యాడు తన మేనత్త గారింట్లో చోటు చేసుకున్న జాతీయోద్యమ కార్యకలాపాలను, ప్రసంగాలను లేతవయసులోనే శ్రద్ధగా గమనించాడు బాగా ఒంట బట్టించుకున్నాడు అత్తయ్య, మామయ్యలను ఆదర్శమూర్తులుగా భావించి వారి అడుగు జాడల్లో పయనించాడు. మేనత్తతో కలసి బెజవాడ కాంగ్రెస్ మహాసభకు వెళ్ళి గాంధీజీ ఆశీర్వాదాన్ని కూడా పొందాడు. చీరాల పేరాల సత్యాగ్రహంలో పాల్గొన్నాడు.

గాంధీజీ ఆంధ్రదేశ పర్యటనలో భాగంగా చీరాల పేరాల వారు నివసించే రామనగర్‌కు వచ్చారు. జానకమ్మ, రామలక్ష్మి స్వరాజ్యనిధికి తమ నగలన్నిటినీ ఇచ్చివేశారు.

ఊరూరు తిరిగి ఉపన్యాసాలిచ్చినందుకు ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యను, పోలీసుల దౌర్జన్యాన్ని ఎదుర్కొన్నందుకు మరికొందరితోపాటు శ్రీనివాసరావు, జానకమ్మలను పోలీసులు అరెస్టు చేశారు జైలులో అనేక కష్టాలనుభవించి అనారోగ్యం పాలై జానకమ్మ, శ్రీనివాసరావులు విడుదలయ్యారు శ్రీనివాసరావు క్షయతో బాధపడుతూనే కాంగ్రెస్ కార్యకలాపాలను కొనసాగించాడు. చివరకు అకాల మరణం పాలయ్యాడు

మాలపల్లి నవలను పట్టుకు వెళుతున్నందుకు పోలీసులు నందయ్యను అరెస్టు చేశారు. అతనికి రెండు సంవత్సరాలు జైలు శిక్ష పడింది.

గోపాలరావు తల్లి ఇష్టానికి వ్యతిరేకంగానే బందరు జాతీయ కళాశాలలో చేరారు పిల్లలంతా వెలివేసినా హరిజన విద్యార్థి నందయ్యతో గోపాలరావు స్నేహం చేశాడు. గోపాలరావు మనసు వివాహం మీదికంటే దేశసేవ మీదికే ఎక్కువగా మొగ్గు చూపింది తన అభిప్రాయాన్ని ఇలా తెలియజేశాడు. "దేశసేవకి నాజీవితం అంకితం చేస్తాను. దేశానికి స్వతంత్రం వస్తేగాని పెళ్ళిచేసుకోను." (హృదయనేత్రి. పుట . 48) బెజవాడ స్టేషనులో సైమన్ కమీషన్‌కు వ్యతిరేకంగా జరిగిన ప్రదర్శనలో గోపాలరావు కూడా పాల్గొన్నాడు. దేశ క్షేమం పట్ల ఏమాత్రం ఆసక్తి లేకుండా కేవల స్వార్థంతో పబ్బంగడుపుకొనే వాళ్ళంటే గోపాలరావుకు విపరీతమైన అసహ్యం. తెల్లదొరలకు ఊడిగం చేసేందుకు మనసు అంగీకరించక పోవడంతో పై చదువులకు స్వస్తి చెప్పాడు.

స్వరాజ్య సాధనకు శ్రమించాలని గోపాలరావు నిశ్చయించుకున్నాడు. కల్లుపాకల దగ్గర పికెటింగ్ చేశాడు. బలమైన లాటీ గాయాలతో జైలు పాలయ్యాడు. మూడు సంవత్సరాలు జైలు శిక్ష అనుభవించాడు. గోపాలరావుకు త్యాగం రుచించినంత బాగా భోగం రుచించలేదు. అతని మనస్తత్వాన్ని ఆవిష్కరించే రచయిత్రి మాటలు ఇక్కడ గమనించదగ్గవి. "గోపాలరావుకి--ఆ మెత్తని పరుపు, ఆ గది, ఆ పరిసరాలు, కిటికీలోంచి పడుతున్న సన్నని చంద్రకాంతి ఇవన్నీ సంకెళ్ళులా తోచాయి. జైల్లోని ఆ కటిక నేల, వాసనగొట్టే ఆ గొంగళి, ఆ దోమలు అవన్నీ సుఖంగా, చెయ్యి జారిపోయిన ఆత్మీయుల్లా తోచాయి. (హృదయనేత్రి - పుట. 88)

గోపాలరావు చీరాలలో ఆశ్రమ జీవితం గడుపుతూ హిందీ నేర్పడం వంటి నిర్మాణ కార్యక్రమాల్ని చేపట్టాడు. జానకమ్మ గారు ప్రోత్సహించినా ఎన్నికలలో నిలబడటానికి నిరాకరించాడు. మామ, తమ్ముడు తీవ్రంగా బాధించినా గాంధీజీ సందేశాన్ని శిరసా వహించి యుద్ధానికి వ్యతిరేకంగా వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని పది నెలలు జైలుశిక్ష అనుభవించాడు. తనకిష్టం లేకపోయినప్పటికీ తమవారి ఒత్తిడివల్ల గోపాలరావు ఎన్నికలలో నిలబడ్డాడు. నిరాడంబరంగా సైకిలు మీదనే ఎన్నికల ప్రచారం సాగించాడు తాను ఎమ్మెల్యే అయినప్పటికీ స్వతంత్ర దిన వేడుకల్లో పాల్గొనలేదు. దేశ విభజన వల్ల ఉత్పన్నమైన సమస్యలు, హిందూ- ముస్లిం కలహాలు, కాందిశీకుల అభద్రత అతని మనసును కలచివేశాయి. కాందిశీకులకు సేవ చేసేందుకు అతడు ఢిల్లీ వెళ్ళాడు. రాజకీయ బాధితులకు ప్రభుత్వం ఇవ్వ జూపిన

ఐదెకరాల పొలాన్ని పుచ్చుకోవడానికి గోపాలరావు నిరాకరించాడు. దరఖాస్తు పెట్టుకోమన్న అతని తమ్ముడితో గోపాలరావు అన్నమాటలు ప్రశంసనీయాలు. "నాకలాంటివి ఇష్టం లేదు. మాకేదో ముందు ముందు పొలాలు ఇవ్వబోతున్నారని జైలు కెళ్లామా? దేశంకోసం వెళ్ళాము. మాకు చేతనయింది చేశాం." (హృదయనేత్రి- పుట. 162)

భాషాప్రయుక్త రాష్ట్రవిభజనను వ్యతిరేకించాడు. తన భావాలను వెల్లడించేందుకు ఎటువంటి ఇబ్బందులనైనా ఎదుర్కొనేందుకు వెనుకాడలేదు

గోపాలరావు కొడుకు శ్రీనివాస్ నక్సలైట్లలో చేరాడు. తనకుమారుడు పంపిన ఉత్తరాన్ని అందుకొన్నాడు మనుమరాలిని దగ్గరకు తీసి ఆమెకు స్వరాజ్యలక్ష్మి అనిపేరు పెట్టి తన భావాలకనుగుణంగా తీర్చిదిద్దాడు. దేశభక్తి, న్యాయం పక్షాన నిలిచే ధీశక్తి ఆమెలో కలిగించాడు. ఎమర్జెన్సీని, దాని ముసుగులో జరిగిన అక్రమాలను నిరసించాడు మనవరాలు తలపెట్టిన వృద్ధ సేవాకార్యక్రమానికి మద్దతు పలికాడు.

శ్రీనివాసరావు, నందయ్య, జానకమ్మలు స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న ఇతర కల్పిత పాత్రలు. రామలక్ష్మి జాతీయోద్యమంలో పాల్గొక పోయినా ఆదర్శ దేశభక్తి ప్రదర్శించింది. ఈ నవలలో ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, జితేంద్రదాస్, గాంధీజీ, చక్రవర్తి రాజగోపాలాచారి, బెజవాడ గోపాలరెడ్డి వంటి జాతీయోద్యమ పురుషుల ప్రస్తావన కనిపిస్తుంది.

'హృదయనేత్రి' దేశభక్తి ప్రధాన నవలగా ఆంధ్రులను ఆకట్టుకుంది త్యాగానికి, స్వార్థానికీ గల తేడాను వాటిమధ్య జరిగే సంఘర్షణను ఎంతో హృద్యంగా ఆవిష్కరించింది. ఈ నవల పాఠకలోకానికేగాక రచయితల జగత్తుకు కూడా ఆదర్శంగా నిలిచిందంటే అతిశయోక్తి కాదు.

**పుదువెళ్లం (కొత్త వెల్లువ) :-** తమిళంలో వెలువడిన మహోన్నత నవలల్లో పుదువెళ్లంకు ప్రముఖస్థానం ఉంది. స్వాతంత్ర్యోద్యమ కాల సమాజాన్ని, స్వతంత్ర భారత సమాజాన్ని కూడా ఈ నవల సజీవంగా చిత్రించింది త్యాగం స్వాతంత్ర్య సముపార్జనకే గాక దేశ పునర్నిర్మాణానికి కూడా అత్యవసరమని స్పష్టం చేసింది. ఏమేరకైనా దిగజారి డబ్బు కూడ బెట్టడమే ధ్యేయంగా బ్రతికే అధిక సంఖ్యాకుల్లో నిజాయితీతో నిలదొక్కుకోలేక, పరిస్థితులతో రాజపడి దిగజారలేక అగచాట్లు పడే అతికొద్ది జీవితాలకు ఈ

నవల అద్దం పడుతుంది. స్వాతంత్ర్య పిపాసి, దేశభక్తుడు, జ్ఞానపీఠ పురస్కార గ్రహీత అఖిలన్‌గారి కలం నుంచి ఈ బృహన్నవల వెలువడింది.

తిరుచ్చి కళాశాలలో చదువుకుంటున్న మురుగయ్యాన్ జాతీయోద్యమం చేత బాగా ఆకర్షితుడయ్యాడు. విద్యార్థుల రహస్య సమావేశాన్ని ఏర్పాటు చేసి కార్యాచరణ పథకాన్ని వారితో చర్చించాడు. పోలీసులు హాస్టలులో ప్రవేశించి అతన్ని అరెస్ట్ చేసేందుకు ప్రయత్నించారు. మురుగయ్యాన్ కూడా అరెస్టయ్యేందుకు సిద్ధమయ్యాడు. కానీ ప్రిన్సిపాల్ ఒత్తిడి మేరకు అక్కణ్ణుంచి బయటపడి ఊరు చేరుకున్నాడు.

ఊరి సమీపంలో పెరుమాళ్ళసామి మురుగయ్యాన్‌కు తారస పడ్డాడు. దేశ స్వాతంత్ర్యం కోసం ఏదైనా చెయ్యాలనే ఆరాటం పెరుమాళ్ళసామిలో కనిపించింది. పెరుమాళ్ళసామి కూడా తన గ్రామంలో దేశభక్తి సాహిత్యాన్ని నలుగురికీ అందించే ప్రయత్నం చేశాడు. మురుగయ్యాన్ పెరుమాళ్ళసామి దేశభక్తిని అభినందిస్తూనే అతడు తలపెట్టిన హింసను వ్యతిరేకించాడు. హింస వలన ఏర్పడే ఇబ్బందులను వివరించాడు. అహింసే అత్యుత్తమ మార్గమన్నాడు. పెరుమాళ్ళసామి ఇవేవీ ఖాతరు చెయ్యలేదు. ఆ రాత్రే పోలీస్ స్టేషనుకు నిప్పంటించాడు. ఊరిబయట గడ్డి వాములు తగులబెట్టాడు. టెలిగ్రాఫ్ తీగలు తెంచివేయబడ్డాయి. పంచాయతీ బోర్డు కార్యాలయంలోని దస్తావేజులు వీధిపాలయ్యాయి. సమాచారం అందిన పోలీసు బలగాలు హుటాహుటిన తరలి వచ్చాయి. తిరుచ్చి విప్లవ కార్యక్రమంలో పాల్గొన్నాడన్న మిషతో ఆ దౌర్జన్య కాండతో ఎటువంటి సంబంధమూ లేని మురుగయ్యాన్‌ను అరెస్ట్ చేసి తీసుకువెళ్ళారు. మురుగయ్యాన్ మూడు సంవత్సరాలు జైలుశిక్ష అనుభవించి తిరిగి వచ్చాడు. ఆలోపుగానే మురుగయ్యాన్ ఇంటినీ, ఆస్తినీ అప్పుమిషతో అతని దగ్గర బంధువు కుమరవేలు హరించాడు పెరుమాళ్ళసామి కూడా జైలుశిక్ష అనుభవించి తిరిగివచ్చాడు. కుమరవేలు చేస్తున్న అక్రమాలను మురుగయ్యాన్ పెరుమాళ్ళ సామి ఎదిరించారు.

మద్రాసులో మురుగయ్యాన్ జీవనభృతి కోసం ఎన్నోకష్టాలు పడ్డాడు. బీచ్‌లో తినుబండారాలమ్మాడు. ప్యారిస్ కార్నర్‌లో వీధికొట్టు వ్యాపారం చేశాడు. రిక్షాలాగాడు. కానీ నీతికీ, నిజాయితీకీ స్వస్తి చెప్పలేదు.

ప్రియురాలు చిత్ర మురుగయ్యాన్‌ను తీసుకువెళ్ళి నామమాత్రంగా షాప్ యజమానిని చేసింది. తన పేరు మీదుగా ఉన్న దుకాణంలో జరుగుతున్న

అవకతవకలు గూర్చి తెలుసుకొని మురుగయ్యన్ చాలా బాధపడ్డాడు అవినీతికి వత్తాసు పలికే తన ప్రియురాలు చిత్ర తోనూ, ఆమె అన్న మాణిక్యం తోనూ తెగతెంపులు చేసుకున్నాడు. అయాచితంగా వచ్చే ఐశ్వర్యాన్ని, సౌఖ్యప్రదమైన వివాహాన్ని తృణీకరించాడు. సింగరేణి గని కార్మికుడుగా స్థిరపడ్డాడు. పెరుమాళ్ళ సామి కూడా తెలంగాణా పోరాటంలో పాల్గొని గనికార్మికుడుగానే పోరాటంలో మరణించాడు.

కష్టించి పనిచేయడం, ఇతరులను ఇబ్బంది పెట్టకపోవడం, ఇబ్బందుల్లో ఉన్నవారిని ఆదుకోవడం, ఒక ఉన్నత లక్ష్యాన్ని ఏర్పరచుకోవడం, దాన్ని పొందేందుకు ఉన్నత విధానాన్ని అవలంబించడం మనిషి మనిషిగా మనుగడ సాగించేందుకు కావలసిన కనీస లక్షణాలు వీటిని మురుగయ్యన్‌లో నిక్షేపించి అఖిలన్ ఆ పాత్రను ఆదర్శవంతంగా తీర్చిదిద్దాడు. గ్రామీణ ప్రాంతాల్లో జరిగే మోసాలను పట్టణ ప్రాంతాల్లో జరిగే మోసాలను పేదలు ఎదుర్కోవలసి వస్తున్న ఇబ్బందులను సజీవంగా చిత్రించి ఆలోచింపజేశాడు

హృదయనేత్రి, పుదువెళ్లం రెండు నవలలు కూడా స్వాతంత్ర్యం వచ్చాకే రచింపబడ్డాయి. రెండు నవలలూ మద్రాసు జీవితాన్ని చిత్రించాయి. జాతీయోద్యమానికి తరువాత దేశంలో నెలకొన్న సంఘ విద్రోహ చింతనను తీవ్రంగా ఎండగట్టి రెండూ నిరసించాయి. హృదయనేత్రి నవలలో గోపాలరావు, పుదువెళ్లం నవలలో మురుగయ్యన్ స్వాతంత్ర్యోద్యమ కాలంలోనూ, స్వాతంత్ర్యానంతర కాలంలోనూ నిజాయితీతో నిరాడంబరంగా జీవించారు. నీతికోసం, న్యాయంకోసం పోరాటం కొనసాగించారు. అన్యాయంతో ఎప్పుడూ, ఎక్కడా రాజీపడలేదు. 'హృదయనేత్రి' మాలతీ చందూర్‌గారి హృదయాన్ని 'పుదువెళ్లం' అఖిలన్‌గారి అంతరంగాన్ని పాఠకుల ముందుంచి వారి ఔన్నత్యాన్ని ఆవిష్కరిస్తున్నాయి. ఇటువంటి నవలలను తులనాత్మకంగా అధ్యయనం చెయ్యడం ద్వారా ఇటు తెలుగు సమాజం లోనూ, అటు తమిళ సమాజంలోనూ ఒకే రకమైన ఆలోచన, ఆచరణ కనిపించడం గమనించవచ్చు.



# తెలుగు కథ - శిల్పం

డా॥ కోసూరి దామోదర నాయుడు

పందొమ్మిదవ శతాబ్దంలో ఐరోపా ఖండంలో నెలకొన్న భావం కథ పుట్టడానికి కారణమని H.G.Wells అభిప్రాయం సుప్రసిద్ధ కథా రచయిత H.E.బేట్స్ మానవ సమాజంలో కలిగిన ఆందోళనను, విశ్వాస రాహిత్యాన్ని చిత్రించడానికి కథ మెరుగైన సాహిత్య ప్రక్రియగా భావించాడు. అతడు కథను The form of the Present movement అని చెప్పాడు అన్ని దేశాలలోను కథా రచయితలు తమ చుట్టూ వున్న అలజడిని చిత్రించే ప్రయత్నం చేశారు. పారిశ్రామికీకరణం వల్ల నగరాలకు చేరుకున్న ప్రజలకు పని రద్దీ పెరిగి విశ్రాంతి తగ్గింది. సంవత్సరాల కొద్దీ కొనసాగే ధారావాహిక నవలలు మాత్రమే కాకుండా ఒకే సంచికలో పూర్తయ్యే కథలను ప్రచురించ వలసిన అవసరం పత్రికలకు కలిగింది. కథ పుట్టుకకు ఇది కూడా కారణమే. కథ మానవజీవితం లోని ఒక అంశాన్ని వివరిస్తుంది. క్లుప్తత కథకు ప్రధాన లక్షణం. కథలోని క్లుప్తత కేవలం రూపానికి చెందిన అంశమే కాకుండా 19వ శతాబ్దపు జీవితానికి, జీవిత దృశ్యానికి కూడా సంబంధించిన రూపం. జీవితంలోని ఒక అంశాన్ని తీసుకొని దానికి వ్యక్తిత్వం ఇవ్వాలనుకోవడంలో కథకు రూపం ఏర్పడింది. మేధావి వర్గానికి మాత్రమే పరిమితంగా వున్న ఏకాంత భావం 19 వ శ॥ లో సాధారణ ప్రజలకు కూడా దక్కింది సాధారణ మానవుడు కూడా తనలోని భిన్న వ్యక్తిత్వాలను, తనకు తానే దూరం కావడాన్ని గుర్తించ గలిగాడు. మానవుని ఏకాంత జీవితాన్ని చిత్రించాలనే కోరిక కూడా కథావిర్భావానికి మరొక కారణం.

పాశ్చాత్య సాహిత్యంలో కథ అవతరించడానికి పైన చూపిన సామాజిక సాంకేతిక బౌద్ధిక కారణాలు దోహదం చేశాయి. కథ అవతరణ వెనుక వాటిని మనం స్పష్టంగా చూడవచ్చు. అలాంటి కారణాలు తెలుగులో కథ అవతరణ వెనుక అంతస్పష్టంగా కనబడవు. బెంగాలులో ప్రారంభమైన సంస్కరణోద్యమం ఆంధ్రదేశంలో చాల త్వరగా వ్యాపించింది. అందులోంచి నవలలాగే కథ కూడా పుట్టింది. కాని నవల పుట్టుకకు (1872) కథ పుట్టుకకు (1910) మధ్య ముప్పై సంవత్సరాలపైగా వ్యవధి వుంది. ఇంత వ్యవధికి

కారణమేమిటో అర్థంకాదు. కాని నవల లాగే కథ కూడా ఒక నిశ్చితమైన సామాజిక ప్రయోజనం కోసమే పుట్టింది ఆధునిక నవలకు, నాటకాని కథకు, కవితకు మూల పురుషులైన వీరేశలింగం, గురజాడలు ఒక నిశ్చితమై సామాజిక దృక్పథంతోనే కలం పట్టారు. తెలుగులో గురజాడ 'దిద్దుబా' మొదటి తెలుగు కథ నన్నయ భట్టు పద్యంలా సర్వాంగ సుందరంగా అవతరించింది. మంచి కథకు వుండవలసిన లక్షణాలన్నీ దిద్దుబాటు కథకు చక్కగా కుదిరాయి.

ఈనాడు తెలుగు కథకొక విస్తృత పరిధివుంది ప్రతికథా రచయిత సాంఘిక స్పృహగల వస్తువులనే ఎన్నుకొంటున్నాడు. ఇప్పుడొస్తున్న కథలను ప్రధానంగా రెండు వర్గాలు చేయవచ్చు 1. వ్యక్తికి సమాజంతోను, ప్రకృతితోను గల సంబంధాన్ని చెప్పే కథలు 2. వ్యక్తిలోని భావ సంపూర్ణతను చిత్రించే కథలు ఈ రెండవ తరగతికి చెందినవే ఎక్కువగా ఇప్పటి కథలు. పాఠకులను ఆకట్టు కొనడంలో సామాజిక ప్రయోజనాన్ని సాధించడంలో కథ ఒక ప్రధాన భూమికను నిర్వహిస్తున్నది. ఎన్నుకున్న వస్తువును రచయిత కథగా మలుస్తాడు. ఇది పాఠకుల దగ్గరకెళుతుంది. ఆ కథ వాళ్ల కర్థమయ్యే తీరు ఆ రచయిత కథను నడిపిన విధానం మీద ఆధారపడి వుంటుంది. కొన్ని కథలు వెంటనే అర్థం కావడం రచయిత సూచించిన విషయంపై ఆధారపడి వుంటుంది కొన్ని కథలు కొంత సేపు ఆలోచించి, ఆయాపాత్రల స్వభావాలను మననం చేసుకున్న తరువాత అర్థమవుతాయి. కొన్ని కథలలో చెప్పదలచిన భావం అనవసర విషయాల వర్ణనలో పడి మసకబారి పోతుంది కొన్ని కథలలో ఓ ప్రధాన భావం ప్రస్ఫుటంగా ఇతర విషయాలను అధిగమించి కనిపిస్తూనే వుంటుంది. మొత్తం మీద కథ పాఠకుడికి అర్థమయ్యే తీరు ఆయా కథలలో ఆయా రచయితలు పోషించిన శిల్పవిన్యాసాలను బట్టి వుంటుంది. శిల్పమంటే ఎత్తుగడ మొదలు ముగింపు వరకు కథా విన్యాసంలో రచయిత చూపే కళా నైపుణ్యం

కథలో గమనించ వలసిన అంశాలు మూడు 1 వస్తువు 2. భాష 3 శిల్పం. కథ ఎన్ని పేజీల వరకు వుండవచ్చు ననడంలో ఏమీ నియమం లేకపోయినా సాధారణంగా ఏడెనిమిది పేజీలకు మించి వుండదు. రెండు పేజీలలో లేక ఒకే పేజీలో కూడా వుండవచ్చు. కథా వస్తువు రచయిత జీవితంలో నుంచి లేక అతనికి తెలిసిన ఇతరుల జీవితంలో నుంచి పుడుతుంది

వర్గాల వారిగా జీవితదశలు మారుతాయి. రచయిత ఈ మార్పులను కూడా గ్రహిస్తాడు. కథా వస్తువును ఎన్నుకోవడంలో, చిత్రించడంలో రచయితను నడిపే భావజాల ప్రభావం అతనికి కథల మీద ప్రభావం చూపుతుంది దీనికి ఉదాహరణగా చూపడానికి రావిశాస్త్రి లాంటి పెద్ద రచయితలను కాకుండా చక్రవేణు లాంటి వర్ధమాన రచయితలను కూడా గ్రహించవచ్చు చక్రవేణు కథ 'కువైట్ సావిత్రమ్మ' బాగా పేరు పొందిన కథ. ఆర్థిక ప్రయోజనాల ముందు నైతిక సూత్రాలు పనికి రాకుండా పోతాయి అని చెప్పడం ఈ కథలో ప్రధానాంశం. చక్రవేణు సగటు రాయలసీమ జీవితానికి అద్దంపట్టే ఒక పల్లెటూరి వాడు. మధ్యతరగతి జీవితానికి కూడా కొంత కిందివాడు. ఆర్థిక దుస్థితి మనిషిని ఎంత కుంగదీస్తుందో దానిముందు నైతిక విషయాలు ఎలా వెలవెల పోతాయో అతడు చూశాడు ఆ రకమైన సాంఘిక వ్యవస్థలో అతడు బతికాడు. ఇక్కడ బ్రతుకు తెరువు లేక సంపాదన కోసం కువైట్ వెళ్ళడం కొందరికి తప్పనిసరి అవుతున్నదన్న విషయం నుండి కథా వస్తువు ఎన్నుకోబడింది. జీవితం లోని ఏ విలువలైనా బతుకు తెరువు లేనప్పుడు విలువను కోల్పోతాయనే నిష్ఠురమైన సాంఘిక స్థితి ప్రభావం అతనిపై వుండడం వల్ల కువైట్ సావిత్రమ్మ కథకు చక్రవేణు అలాంటి ముగింపు ఇచ్చాడు.

కథా వస్తువును గ్రహించిన తరువాత ఆవస్తువుకు సంబంధించిన భిన్న సంఘటనల వరుసను కార్య కారణ సంబంధంతో అతకడం కథా సంవిధానమవుతుంది. ఏ సంఘటనకు కారణం ఏ సంఘటనో తెలియ జేయడం కథా సంవిధానం యొక్క ఉద్దేశం, ప్రయోజనం

సంవిధానం తర్కబద్ధంగా లేకపోతే కథాంశానికి అర్థ స్ఫూర్తి వుండదు. ఇది కథా నిర్వహణలో రచయిత సాధించే శిల్పం పైన ఆధారపడి వుంటుంది. కథాంశాన్ని పాఠకులు గ్రహించడానికి భాష ప్రధాన వాహిక. ఇప్పుడొస్తున్న కథలు పూర్తిగా వాడుక భాషలో వున్నా ప్రాంతీయ మాండలిక భేదాలు కనిపిస్తున్నాయి. పత్రికలలో వస్తున్న కథలను చదివేది సామాన్య పాఠకులే వీళ్ళకు ప్రాంతీయ భాషా భేదాలు అంతగా తెలియవు కాబట్టి అన్ని ప్రాంతాల కథా రచయితలు ఒకే రకమైన భాషను వాడుతున్నారు. అయితే ప్రాంతీయ భాషా జవ జీవాలను వ్యక్తం చేయడానికి ఒక్కొక్కప్పుడు రచయిత ప్రయత్నం చేయడం కనిపిస్తుంది.

కథలో గమనింప వలసిన ప్రధాన అంశం శిల్పం. ఏ కథలోనైనా కథాంశ స్ఫురణ ఆ రచయిత సాధించే శిల్పంపై ఆధారపడి వుంటుంది రచయిత కథను నడిపే తీరే శిల్పం. ఏ పనిలోనైనా ఆ పనిచేసేవాడు కళా కౌశలాలను తన శక్తి మేరకు చూపిస్తాడు. ఇలా ఏ పనిలో నైనా కళా నైపుణ్యాన్ని చూపే పద్ధతే శిల్పం. ఉద్దిష్ట ఫలితాన్ని సాధించడానికి అనువైన ప్రక్రియా పద్ధతులు, సాధించే సాంకేతిక నైపుణ్యం శిల్పం. కథా రచనలో వుండవలసిన శిల్పం లేదా కనిపించే శిల్పం ఆకథా రచయిత కళా దృక్పథంపై ఆధారపడి వుంటుంది. కథను ఏరకంగా చెపితే పాఠకుడికి నచ్చుతుందో అతనికి తెలుస్తుంది. ఆ తెలియడమే అతడు కథలో సాధించే శిల్పమవుతుంది కథలో ఏది ఎక్కువ స్ఫుటంగా చిత్రించాలో నిర్ణయించడం కథా శిల్పంలో ముఖ్యమైంది కష్టమైంది "కథలో ప్రతివాక్యం, ప్రతిభావచిత్రం మెరుస్తుండాలి. వైచిత్రి కథకు ప్రాణం (కథానిక శిల్పం. పాలగుమ్మి పద్మ రాజు. భారతి 1946 నవంబరు). రచయిత తానెన్నుకున్న వస్తువు లోంచి ఒక ప్రణాళికను రూపొందించి దాని కనుగుణంగా వివిధాంశాలను పొందుపరిచి కథా శరీరానికొక సౌష్ఠవం సౌందర్యం సంతరించడం వస్తు విన్యాస శిల్పం కథా స్వరూపంలో ఆద్యంతం ఈ మూల భావాన్ని పోషిస్తూ వుండాలి. 'మంజుశ్రీ' రాసిన రైలు పడి పోయింది కథలో భర్త ప్రయాణం చేస్తున్న రైలు ప్రమాదం జరిగి అతని శరీరం కూడా దొరక్కపోగా భార్య ఆత్మ హత్య చేసుకుంటుంది. పాఠకులు కన్నీళ్లు పెట్టుకునేలా చేస్తుంది. ఈ ముగింపు కథకు ప్రాణం. ఈ ముగింపు తేవడానికి రచయిత కథను మలచిన తీరులో అతని శిల్ప చాతుర్యం కనిపిస్తుంది. కథా స్వరూపమంతా ఒక ఎత్తు. ముగింపు ఒక ఎత్తు. కథ రాణింపు పై ముగింపు మీద ఆధారపడి వుంటుంది. దీంట్లో అద్భుతమైన శిల్పాన్ని ప్రదర్శించే కథ లెన్నో వున్నాయి. దీనికి మంచి ఉదాహరణ గురజాడ 'దిద్దుబాటు'. పుట్టింటికి పోతున్నానని ఉత్తరం రాసిపెట్టిన కమలని ఆ గదిలో మంచం కింద దాక్కొని వున్న విషయం కరకంకణ ధ్వనుల ద్వారాను , కిలకిల నవ్వుల ద్వారాను వెల్లడి కావడంతో కథకు అద్భుతమైన ముగింపు వచ్చింది.

నిత్యజీవితంలో ఒక్కొక్క వ్యక్తికున్న వైయక్తిక మూర్తిమత్వంలాగా కథా రచయిత ఒక్కొక్కపాత్రను ఒక్కొక్క భావానికి ప్రతినిధిగా చిత్రిస్తాడు. ఇది పాత్ర చిత్రణ శిల్పం. గురజాడ కమల, మునిమాణిక్యం కాంతమ్మ, చలం అమీనా మొదలైన పాత్రలు పాఠకుల మనస్సుల్లో ఎప్పుడూ మెదలుతూ

వుండడానికి కారణం ఆయా పాత్రలను చిత్రించడంలో ఆయా రచయితలు చూపిన పాత్ర చిత్రణ శిల్పం. కథలో ఆకర్షక కేంద్రాలుగా భాసించేవి సంఘటనలు. వీటిని సహజంగా ప్రతిభా స్ఫోరకంగా నిర్వహించడం గొప్ప సంఘటన ఘటనా శిల్పం. పద్మరాజు 'గాలివాన'లో రావుగారు తుఫాను బీభత్సంలో రైలు స్టేషన్ గదిలో ఒక ముష్టి పడుచుతో ఆరాత్రి ఏకాంతంగా గడప వలసి రావడం ఒక సంఘటన. క్రమబద్ధమైన ఒక రకం జీవితానికి అలవాటు పడ్డ ఆ తాత్త్వికుడు ఆ సంఘటన బలం వల్ల మానవ సహజమైన తన బలహీనతకు లొంగి పోక తప్పలేదు. ప్రవర్తన కాలాన్ని ప్రతిబింబించే ఈ కథకు ప్రాణతుల్యమైనది ఈ సంఘటనే జీవితం గతిశీలక మైంది. కథలో అది ప్రతిబింబించడం కావాలి. దీనికి ఉత్ప్రేరకమైంది సంఘటన. కథలో ఇలాంటి సంఘటన ముగింపుకు ఒక మెరుపు నిస్తుంది. రచయిత దీన్ని సార్థకంగా నిర్వహించినపుడు సంఘటనా శిల్పం రమణీయంగా భాసిస్తుంది

పాత్రల మనసుల్లో గాని, బయటగాని పాత్రకు, ప్రకృతి శక్తికి మధ్య గాని సంఘర్షణను సార్థకంగా ఉత్పాదన చెయ్యడమన్నది సంఘర్షణోత్పాదన శిల్పం. దానికి సంఘటనలు, పాత్రల ఆలోచనలు తోడ్పడతాయి. కథలో జరిగే వాటికి అనుగుణమైన పరిసరాలను, నేపథ్యాలను, వాతావరణ స్థితిగతులకు సహజంగా, ప్రతీకాత్మకంగా చిత్రించడం సన్నివేశ కల్పనా శిల్పం. తెలుగు కథా రచయితలు ఈ విషయాన్ని గమనించి వాళ్ల కథల్లో అతి సహజమైన ఇలాంటి నేపథ్యాలను కల్పించారు. సందర్భ ఔచిత్యాన్ని పాటిస్తూ కథలో కలిసిపోయేటట్లు వర్ణనలు చేయడం వర్ణన శిల్పం వర్ణనలు రెండు రకాలుగా వుంటాయి. బాహ్య వర్ణనలు అంటే ప్రకృతి వర్ణనలు లేక భౌతిక వర్ణనలు. అంతర్ వర్ణనలు స్వభావాన్ని చిత్రించడానికి ఉపయోగపడే వర్ణనలు. కథ ఒకే సంఘటనను వివరిస్తుంది కాబట్టి పరిధి తక్కువ. అలాంటప్పుడు దీర్ఘ వర్ణనలు చేస్తే కథా సంవిధానం దెబ్బ తింటుంది. అట్లని వర్ణనలు వుండకూడదని కాదు. కథాంశాన్ని స్పష్టం చేయడానికే వర్ణనలు ఉపయోగపడేలా వుండాలి. కథలో భావ సంఘర్షణ ముఖ్యంగా చిత్రింప బడుతుంది. కాబట్టి స్వభావ వర్ణనలకే కథలో ప్రాముఖ్య ముంటుంది. వర్ణన చేయడం కథా రచయితలు స్వభావాన్ని బట్టి వుంటుంది. రచయిత జన్మతః కళాకారుడైతే వర్ణనా శిల్పం ప్రతిభావంతంగా పోషింప బడుతుంది కథకు పేరు పెట్టడం కూడా శిల్పంలో భాగమే. సుందరమైన విగ్రహానికి

నొసటి తిలకంలాగా కథకు మరింత చక్కదనం చేకూర్చేది పేరు. 'తాను వెలిగించిన దీపాలు' అనేది మధురాంతకం రాజారాం రాసిన ఒక కథపేరు అందులో ప్రధాన పాత్ర రిటైర్ అయిన బడి పంతులు ఆయన దగ్గర చదువుకున్న పిల్లలే చిట్టి చిట్టి దీపాలు ధన సంపాదనే గొప్ప వ్యసనంగా పరిణమించిన వాడి కథకు మంజుశ్రీ 'డబ్బు డబ్బు' అని పేరుపెట్టాడు

ఇప్పటి వరకు వివరించిన వాటికంటె ముఖ్యమైనది కథన శిల్పం ఇది రచయిత కథను చెప్పే పద్ధతికి చెందినది కథ రెండు రకాలుగా కథనం చెయ్యబడుతుంది. జరిగే కథకు తాను ప్రత్యక్ష సాక్షిభూతుడై రచయిత సమపూర్ణ సర్వజ్ఞత్వం ప్రదర్శించడం ఒక పద్ధతి ఉదా · పద్మరాజు 'గాలివాన'. ఈ పద్ధతిలో వివిధ పాత్రలను ప్రస్తావించే సందర్భాలలో కథకుడు ఆయా పాత్రలను పేర్లతో చెప్పడం గాని అతడు, ఆమె, వాళ్లు మొదలైన సర్వనామాలలో చెప్పడం గాని జరుగుతుంది కథకుడు అన్నీ చూస్తాడు అన్నీ వింటాడు. అన్ని తెలుసుకుంటాడు. తన ఇష్టం వచ్చిన అంశంమీద వెలుతురు ప్రసరింప జేస్తాడు అతడు పాత్రల మనసుల్లోకి చూడగలడు ఆలోచన పొరల్లోకి దూరగలడు దీన్ని ప్రథమ పురుష కథనం అంటారు. అలాకాక పాత్రల మనస్సుల్లోను బయట వున్న స్థితిగతులకు రచయిత తనకు తానుగా ఆవిష్కరిస్తాడు ఇది ఉత్తమ పురుష కథనం మరొక కథన పద్ధతి లేఖా కథనం. కథా సాహహిత్యంలో లేఖా కథనాన్ని ఉపయోగించిన రెండు కథలు చాసో బదిలీ (1946), రంగనాయకమ్మ పెళ్ళానికి ప్రేమలేఖ (1971) వంటచేసి పెట్టడం కోసం మాత్రమే కాదు తాను పుట్టింటినుండి రావలసింది అంతకు మించిన అనుబంధం తమిద్దరి మధ్యన వుంది అనే విషయాన్ని విమల అనే భార్య బుచ్చిబాబు అనే భర్తకు తెలియజెప్పడం పెళ్ళానికి ప్రేమలేఖలోని కథాంశం. విమల బుచ్చిబాబు రాసుకున్న ఏడు ఉత్తరాలు, విమల తాను బయలు దేరి వస్తున్నట్లుగా పంపిన టెలిగ్రాం ఆధారంగా కథనం సాగింది ముందు వివరించిన వస్తువిన్యాస శిల్పం, సంఘటన శిల్పం మొదలైన అంశాలన్నీ పరిపుష్టంగా పోషింప బడినపుడు కథన శిల్పం రాటుదేలి కనిపిస్తుంది. చక్ర వేణు కథల సంపుటిలోని 'కసాయి కరువు' కథను పరిశీలిస్తే వస్తువిన్యాస శిల్పాదులు కథన శిల్పానికి ఎలా సహాయకారులో అర్థమవుతుంది. కరువు మూలంగా తాగడానికి నీళ్లులేక నీళ్ళ దగ్గర పోట్లాటలు, చిన్నపిల్లలకు మందులకోసం, ఓ పూట బోజనం కోసం తమ పాత్రలలో ప్రాణమైన పశువులను అమ్ముకోవడం,

ఎక్కడ పని దొరుకుతుందా అని వెదుక్కుంటూ మగాళ్ళు దూర ప్రాంతాలకు పోవడం కసాయి కరువు కథలో కనిపించే అంశాలు. పశువులను అమ్మినపుడు వాటిని లారీలో ఎక్కించుకుని పోతుంటే చిన్నపిల్లలు ఏయ్ బోడిదానా, పొట్టికొమ్మలో అని పేరు పెట్టి పిలుస్తుంటే అవి లారీలోంచి తలెత్తి అరవడం, బంధువులను రైలెక్కించి వీడ్కోలు చెపుతున్నట్లు ఊళ్ళోవాళ్ళు నిలబడడం, గొడ్లు కడసారిగా తమ యజమానుల వైపు చూడడం జీవితంలోని పశువులకు మనుషులకు మధ్యగల అనుబంధాన్ని పట్టిస్తాయి. కరువు తీవ్రతను కళ్ళకు కట్టినట్లు చూపడం ప్రధాన కథాంశం ఈ కథలోని వస్తువు కరువు దీనికి సంబంధించిన వివిధ సంఘటనలు మిళితమై కథన శైలిని రూపు కట్టిస్తున్నాయి.

కథలో కేంద్ర బిందువు కథాంశం కథాంశానికి రచయితకు మధ్య వున్న సంబంధం కథాంశాన్ని అనుభవంలోకి తెచ్చుకుని వ్యక్తీకరించడం దీన్నే ఉద్దేశమనవచ్చు. కథాంశం వ్యక్తీకరణ వస్తువుకు సంబంధించిన అంశాలు 1 కథాసంవిధానం (Plot) 2. పాత్రలు (Characters) 3. నేపథ్యం(Setting) 4 దృష్టికోణం (Point of view) 5 శిల్పానికి సంబంధించిన అంశాలు. కథలో రెండు మూడు సంఘటన లుండవచ్చు. కార్య కారణ సంబంధాన్ని బట్టి ఏ సంఘటన వెనుక ఏ సంఘటన వుండాలో నిర్ణయించి కథనం చెయ్యడం కథా సంవిధానం. 'కసాయి కరువు' కథలో గొడ్లను అమ్ముకోవడం ఊళ్ళోని మగవాళ్ళంతా పనులు వెదుక్కొంటూ వెళ్ళడం, ఊళ్ళోనే మిగిలి పోయిన ఆడవాళ్ళు భర్తల కోసం బెంగ పెట్టుకోవడం, పనులు దొరికితే తాముకూడా వెళ్ళాలనుకోవడం మొదలైనవి ఒక వరుసలో ఇమిడిన సంఘటనలు. కథలో పాత్రలు తక్కువుగా వున్నప్పుడే ఆపాత్రల మనస్తత్వాన్ని కథకు గల చిన్నపరిధిలో చిత్రించడానికి సాధ్యమవుతుంది. పాత్రలు కథాంశాన్ని భరించేవారు కథను నడిపేవారు కాబట్టి పాత్రల మీద పాఠకుడికి నమ్మకం కలిగేటట్లు రచయిత చిత్రించాలి.

'కువైట్ సావిత్రమ్మ' కథలో సావిత్రమ్మ, రామలక్ష్మమ్మ , చిన్నబ్బ అనేవి మూడే పాత్రలు. ఈ మూడు పాత్రలు రాయలసీమ గ్రామాల్లో కనిపించేవే. ఈ పాత్రల చిత్రణలో రచయిత ఎంతో స్వాభావికతను కనపరిచాడు. కథ జరగడానికి కారణం వున్నట్టే స్థలం, కాలం కూడా వుంటాయి. కొన్ని కథలకు స్థల కాలాలు అవసరం లేకపోయినా కొన్ని

కథలకు అవసరం వుంటుంది. ఉదాహరణకి కరువు కథలకు రాయలసీమ ప్రాంతాన్నే స్థలంగా గ్రహిస్తే బాగుంటుంది. కథలోని సంఘటనలను ఇలాంటి నేపథ్యం తీర్చిదిద్దుతుంది. కథను ఎలా చెప్పాలి ప్రథమ పురుషలోనా, ఉత్తమపురుష లోనా అనే విషయం దృష్టి కోణానికి సంబంధించినది దీనిని గురించి ఇంతకు ముందే వివరించడం జరిగింది. ఈ విషయాలన్నీ కథా శిల్పంలోని భాగాలు. ఇలాంటి శిల్ప విషయాలు బాగాకుదించిన కథ ఉత్తమ కథ. అలాంటి కథా రచయిత ఉత్తమ కథారచయిత.

శ్రీవల్లంపాటి వెంకట సుబ్బయ్యగారు కథా శిల్పాన్ని సాధించి పెట్టే మరికొన్ని లక్షణాలను గుర్తించారు. 1. క్లుప్తత 2. అనుభూతి ఐక్యత 3 సంపూర్ణత మొదలైనవి. కథలో క్లుప్తత చాలా ప్రధానమైన అంశం. క్లుప్తత తనంత తానుగా రాదు రచయిత దాన్ని కష్టపడి సాధించ వలసిందే క్లుప్తత అంటే కథ పొడవు తక్కువగా వుండడటం కాదు. ఇతివృత్త అవసరాలకు మించి కథ పెరగడం క్లుప్తత లోపించడం అవుతుంది. సందర్భశుద్ధి లేకుండా కథలో వర్ణనలను పెంచడం. తానన్నివిషయాలను వివరంగా చెబితే తప్ప పాఠకులకు అర్థం కాదనే అభిప్రాయం రచయిత కుండడం, అనవసరమైన సంభాషణలు, సంఘటనలు, కథలో చోటు చేసుకోవడం మొదలైనవి క్లుప్తతను లోపింపజేసే లక్షణాలు. ఈ విషయాలలో రచయిత తగిన జాగ్రత్తలు తీసుకుంటే క్లుప్తతను సాధించవచ్చు. రాజారాం రాసిన ఎన్నో కథలు క్లుప్తత లోపించడం వల్ల బలహీనంగా తేలిపోయాయని, రావిశాస్త్రి వంటి శిల్ప నైపుణ్యం గల రచయిత కూడా కథాంశం మీద వ్యాఖ్యానం చేయాలన్న చాపల్యం నుంచి కొన్ని కథల్లో తప్పించుకోలేక పోయాడని వల్లంపాటి వెంకటసుబ్బయ్య కథాశిల్పం అనే గ్రంథంలో చెపుతున్నారు.

కథ చదివినపుడు పాఠకుడిలో ఒక అనుభూతి కలగాలి. పాఠకుడిలో అనుభూతి కలగాలంటే రచయిత శైలి విషయంలో ఎంతో జాగ్రత్త పడాలి. ఎత్తుగడ నుండి ముగింపు వరకు కథాంశమనే తీగమీదనే నడవాలి. కథనంలో ఏకాగ్రత తప్పినా అలసత్వం చోటు చేసుకున్న కథలో బిగువు సడలి పాఠకుడికి కలగ వలసి నంత అనుభూతి కలగదు. అనుభూతిని కలిగించడానికి రచయిత రెండు రకాలుగా ప్రయత్నించవచ్చు. 1. పరిమిత పాత్రలతో సంఘటనలను చిత్రించడం అంటే ఆ కథాంశం ఒకే సంఘటన ద్వారా ద్యోతకమయ్యేటట్లు అందుకుపాత్రలు సహాయకారు లయేటట్లు చేయడం

2 రచయిత ఎన్నుకొనే సంఘటన పాత్రలో గుణాత్మకమైన మార్పుకు కారణమయ్యేదిగా వుండాలి. మరొక రకంగా చెప్పాలంటే కథలో ముగించ దలచిన రసానుభూతి పరిపూర్ణత పొందడమే క్లైమాక్స్. కథ క్లైమాక్స్‌కు చేరినపుడు పాఠకుడిలో అనుభూతి తప్పక కలుగుతుంది. కథలో సంఘర్షణ వుండాలి. రెండు పాత్రల మధ్య, ఒకే పాత్రలోని రెండు అంశాల మధ్య, రెండు భావాల మధ్య, రెండు వర్గాల మధ్య, రెండు జీవిత దృక్పథాలమధ్య సంఘర్షణ వుండవచ్చు.ఇలాగే ప్రకృతికి మనిషికి మధ్య రాయలసీమలో జరుగుతున్న సంఘర్షణను కేతు విశ్వనాథరెడ్డి , చక్రవేణు, మహేంద్ర వంటి రచయితలు చిత్రిస్తున్నారు. వివిధ రకాల సంఘర్షణల నుంచి రచయిత వస్తువును ఎన్నుకుంటాడు. కథ ద్వారా రచయిత ఆ సంఘర్షణకు పరిష్కారం చూపించాలనడంగాని, అక్కరలేదనడంగాని మొరటు వాదాలని వల్లంపాటి వారి అభిప్రాయం. పరిష్కారం కథలో సహజంగా రూపొందాలి రాయల సీమలో వానలు రాకపోవడం చేత ప్రకృతికి మానవుడుకి మధ్య సాగే సంఘర్షణకు పరిష్కారం వానరావడమే కాబట్టి కరువును చిత్రించే ప్రతి కథకు వానలు రావడంతో ముగించడం సాధ్యంకాదు. ముగింపు మాత్రమే పరిష్కారంకాదు. కాళీపట్నం రామారావు 'యజ్ఞం' కథలో తనకొడుకు బానిసబతుకు బతకడం ఇష్టంలేని సీతారాముడు వాడిని చంపేస్తాడు. ఇది కథ ముగింపు ఇలాంటి ప్రతి కథకు ముగింపు మరణం కాకూడదు.

ఇక చివరి అంశం ముగింపు. కథా సూత్రం నిలిచిపోయే స్థానం ముగింపు. కథను ఎలా ముగించాలన్నది రచయిత కథను పోషించిన విధానాన్ని బట్టి వుంటుంది. చివర్లో ఒక ఉత్కంఠ భరితమైన భావాన్ని మిగిల్చడం లేక ఒక కొసమెరుపును విసరడం కనిపిస్తుంది. అయితే ముగింపు పాఠకులలో ఒక మౌలికమైన ఆలోచనను వికసింప జేయడానికి తోడ్పడాలి. అలా జరిగినప్పుడే అ కథ సార్థక మవుతుంది. దాన్ని సాధించాలంటే కథా రచయిత శిల్ప విషయంలో ఇప్పటివరకు వివరించిన జాగ్రత్తలన్నీ తీసుకోవాలి.

# తెలుగు - మాండలికం

డా॥ వి. ఆర్. రాసాని

మన సాహిత్యం ప్రధానంగా గ్రాంధికం, వ్యావహారికం, మాండలికం అనే మూడు రకాల శైలీ భేదాలతో విస్తరించి వుంది. గ్రాంథికంలో మళ్ళీ వీర గ్రాంథికం అనీ, వ్యవహారంలో ప్రామాణికం అనీ, అలాగే మాండలికంలో వీర మాండలికం అనీ ఉప భేదాలు కూడా ఉన్నాయి

ఆధునిక తెలుగు కథ ప్రామాణిక వ్యవహారంలోను, మాండలికంలోను రాయబడుతోంది. గ్రాంథికంలో కథ రాసేవాళ్ళు దాదాపు లేరనే చెప్పాలి ఇక వ్యవహారాని కొస్తే మనం నిత్యం పత్రికల్లో కథల్లో దాన్ని చూస్తూనే వున్నాం. అందులో భాగంగానే అప్పుడప్పుడూ మాండలికం కూడా తగుల్తూంటుంది.

ఒక ప్రాంతాన్ని తెలిపే అర్థంలో వాడే 'మండలం' అనే పదం నుంచీ 'మాండలికం' అనే సమాసం ఏర్పడి వుంటుందని ఊహించడానికి పాండిత్యమూ, పరిశోధనా అవసరం లేదనుకుంటాను

'వాడు నిద్రించు చున్నాడు' అనే గ్రాంథిక వ్యాకరణ రూపాన్ని 'వాడు నిద్రిస్తున్నాడు' అని మార్చినంత మాత్రాన అది వాడుక భాష అయిపోదు 'నిద్రపోతున్నాడ'నేది నిజమైన వాడుకభాష. దాన్నే 'తొంగున్నాడు' అంటే మాండలికం అవుతుంది.

ఈ మాండలికం రెండు రకాలుగా కనిపిస్తుంది. అందులో నెరేషనంతా ప్రామాణిక భాషలోవుండి, సంభాషణలు మాత్రం మాండలికంలో రాయడం మొదటిది. రెండోది రచనంతా మాండలికం లోనే సాగడం

అసలు మాండలికం అంటే ఉచ్చారణలో, వాడే పదాల్లో, జాతీయాల్లో, సామెతల్లో, ఇతర వ్యాకరణ రూపాల్లో ప్రదర్శించే వ్యావహారిక వైవిధ్యం స్థూలంగా భాషా ప్రయోగం లోని వ్యవహార వైవిధ్యమే మాండలికం ఈ వైవిధ్యం మనిషికీ మనిషికీ మధ్య, ప్రాంతానికీ ప్రాంతానికీ, వర్గానికీ వర్గానికీ, కులానికీ కులానికీ మధ్య కూడా వుంటుంది.

ఒక మనిషి ఒక చోట, ఒక స్థితిలో ఒకరితో మాట్లాడిన విషయాన్ని అదేరీతిలో మరోచోట, మరోస్థితిలో అదేలాగా మాట్లాడలేడు అయితే ఆ మనిషికి ఒక యాస (Slang) ఉంటుంది. అతను పదే పదే కొన్ని ఊత పదాలు వాడుతుంటాడు. ఆ యాస, ఆ మాట తీరు, అతనికే పరిమితమై ప్రత్యేకంగా కనిపిస్తుంటుంది. ఇది కూడా వ్యక్తిత్వం లాంటిది. దీన్నే వ్యక్తి మాండలికం అంటారు. అలాగే ఒక ప్రాంతంలో వున్న మాట తీరుకు మరో చోట ఉన్న మాట తీరుకు తేడా కనిపిస్తుంది. ప్రాంతీయమైన ఈ తేడానే ప్రాంతీయ మాండలికం అంటారు. అలాగే ఒక జన సముదాయం లేదా ఒక వర్గం వాళ్ళు, ఒక వృత్తివాళ్ళు, లేదా ఒక కులం వాళ్ళు మాట్లాడుకునే భాషలోనూ తేడాలు కనిపిస్తాయి. వీటిని వర్గ మాండలికం అంటారు. అందువల్ల ఉచ్చారణలో, వాడే పదాల్లో, జాతీయాల్లో, సామెతల్లో, వ్యాకరణ సాధ్య రూపాల్లో వైవిధ్యం కనిపిస్తుంది. ఇట్లా భాషను మాట్లాడే వ్యవహర్తల వాడుక లోని మాండలిక భేదాలను గుర్తించడం కష్టమేమీ కాదు.

ఈ వాడుక భాషను మొట్టమొదట అక్షర బద్ధం చేసినవాడు శ్రీనాధుడే బైసి (గొప్పతనం) పాసెము (పాయసం), చల్ల (మజ్జిగ) నూకు (దొబ్బు) వంటి పదాలు హర విలాసాది గ్రంథాల్లో శ్రీనాథుడు వాడాడు

అలాగే శుక సప్తతిలో ఎల్లుండి, శాస్త్రి, అవునష , కాదటే వంటి పదాలు కనిపిస్తాయి. గంగామాహాత్మ్యంలో తెలంగాణా మాండలికం లోని 'పోరి' (పిల్ల) కనిపిస్తుంది. తాళ్ళపాక తిమ్మక్క తన "సుభద్రాకళ్యాణం"లో కడప మాండలికాన్ని ప్రయోగించిందంటారు. అలాగే తాళ్ళపాక పెద్ద తిరుమలయ్యా తన భగవద్గీతానువాదంలో రాయలసీమ భాషను వాడాడు.

ఉదాహరణకు - "నిష్కంటకమై, సమర్థమైన రాజ్యమున్నూ, దేవాధి పత్యమున్నూ పొందిన్ని, సమస్తమైన యింద్రియాలను శోషింప చేస్తున్న నా యొక్క శోకమున్ను, తొలగదొబ్బే వుపాయం గానను", "పాతకోకలు విడిచి కొత్తకోకలు యెటువలె నైనా నేమి కట్టుకోనునో....."

అలాగే క్రీ.శ. 16 వ శతాబ్దికి చెందిన స్థానాపతి 'రాయవాచకం' లో ఆనాటి వ్యవహారికం వాడాడు - "నూట యెనిమిది తిరుపతులనించిన్ని, తీర్థప్రసాదములున్ను డబ్బైరెండు దేవస్థలాలనుంచి, విభూతి గంధ ప్రసాదములున్ను...."

ఈ ఉదాహరణలు చూస్తే అందులోని భాష రాయలసీమది కావడం, అందునా అటు తిరుమలయ్య, తిమ్మక్క; ఇటు స్థానాపతి ముగ్గురూ రాయలసీమ వారు కావడం విశేషం

ఆ తర్వాత ఆధునికుల్లో మాండలికం వాడిన మొదటి వ్యక్తి గురజాడ అప్పారావు. తాను మాండలికం ఎందుకు రాయవలసి వచ్చిందో ఒక సందర్భంలో రాస్తూ "ఉదాత్త గంభీర భావాల అభివ్యక్తీకరణకు వాడుక భాష అన్నివిధాలా యోగ్యమైనదని చూపడానికి బిల్హణుని కథను నాటకంగా రాస్తున్నాను" (1909 ఆగష్టు 11వ తేదీన మునిసుబ్రహ్మణ్యం గారికి రాసిన లేఖ) అని చెప్పారు.

ఆ నాటకం లోనే కాక అటు కన్యాశుల్కం లోను, ఇటుకొండు భట్టీయం లోను ఆయన రాజమండ్రి వాడుక భాషను ప్రయోగించారు.

కథల్లోనూ ఓంప్రథమంగా మాండలికాన్ని ప్రవేశపెట్టిందీ గురజాడే.తెలుగు కథా సాహిత్యం లోనూ ఆయా మాండలికాలను గుర్తించవచ్చు. గురజాడ, శ్రీపాద వంటివారు వాడిన భాష రాజమండ్రి ప్రాంతానిది. కా రా, కవన శర్మ, గంధం యాజ్ఞవల్క్య శర్మ, అప్పల్నాయుడు, ఆడెపు లక్ష్మీపతి, కాలువ మల్లయ్య, బి.ఎస్. రాములు వంటి వారు కరీంనగర్, శ్రీకాకుళం వంటి కళింగాంధ్ర ప్రాంతపు భాషను వాడారు. చా.సో. విజయనగరం భాషను, రావిశాస్త్రి, బీనాదేవి, సి ఎస్. రావు, అరిగే రామారావు వంటివారు విశాఖ భాషను, పెద్దిబోట్ల సుబ్బరామయ్య, సత్యవతి వంటివారు బెజవాడ భాషను, కొలకలూరి ఇనాక్ గుంటూరు ప్రాంతపు భాషను, దాశరధి రంగా చార్య, ఉప్పల నరసింహం దేశ్ పాండే, అల్లం రాజయ్య, రఘోత్తమరెడ్డి లాంటి రచయితలు తెలంగాణా మాండలికాన్ని విరివిగా తమ కథల్లో వాడారు పోరంకి దక్షిణామూర్తి రాయలసీమ, తెలంగాణా, కోస్తా మాండలికాలని, తమ నవలల్లో వాడుకొని కొత్త ప్రయోగం కూడా చేశారు.

ఇక రాయలసీమ విషయానికొస్తే, కె. సభా, మధురాంతకం రాజారాం, కలువ కొలను సదానంద, కేశవ రెడ్డి, వీరపల్లె వీణావాణి, నరేంద్ర, మహేంద్ర, రాసాని వంటి వాళ్ళు చిత్తూరు జిల్లా మాండలికాన్ని వాడారు. ఈ జిల్లాలో పూర్తిగా మాండలికాన్ని వాడిన వారిలో నామిని సుబ్రహ్మణ్యం నాయుడిది ఒక ప్రత్యేకమైన స్థానం. పూడిసినాడు గీడిసినాడు అంటూ అందరూ ఎగతాళి చేసుకునే చిత్తూరు జిల్లా భాషకు మంచి గౌరవాన్ని, తియ్యందనాన్ని తెచ్చి

పెట్టిన వాడు నామిని. ఈ కోవలోనే గోపిని కరుణాకర్, రాసాని కూడా కథలు రాస్తున్నారు.

సింగమనేని నారాయణ, స్వామి, శాంతి నారాయణ, మహర్షి, చిలుకూరి దేవపుత్రులు అనంతపురం భాషను చక్కగా వాడు కొన్నారు. శ్రీనివాసమూర్తి, రాపాటి గోపాలకృష్ణ వంటి వాళ్ళు కర్నూలు జిల్లా యాసను, Y.C V రెడ్డి, రా.రా , కేతు విశ్వనాథ రెడ్డి, సొదుం జయరాం, కుప్పిలి పద్మనాభ రెడ్డి, సన్నపరెడ్డి వెంకట్రామరెడ్డి, దాదాహయత్ వంటి కడపజిల్లా రచయితలు కడప మాండలికాన్ని కథల్లో వాడుకుని దానికి పరిపుష్టిని తెచ్చారు.

అయితే ఇక్కడ ఒకమాట చెప్పాల్సివుంది కథల్లో మాండలికం అవసరమా, అనే ప్రశ్న కూడా ఒకటుంది. అంతేగాకుండా 'ఒక ప్రాంతపు భాష మరో ప్రాంతపు పాఠకులకు అర్థంకాదు కదా. అందువల్ల ఎంతగొప్ప రచనైనా, మాండలికం వల్ల పాఠకులకు దూరమవుతుంది కదా' అనే వాళ్ళు వున్నారు. సబ్జక్టే శైలిని వెదుక్కుంటుందని కొందరు చెబుతుంటారు. అది నిజమే కావచ్చు. ఎందుకంటే బాగా చదువుకున్న , ధనవంతుల గురించిన కథల్లో మాండలికం పేలవమే కదా అలాగే నిరక్షర కుక్షి, నాగరికతకు దూరంగా బతికేవాడు అయిన గ్రామీణుడి గురించి రాసేటప్పుడు దానికి ప్రామాణిక భాష కంటే మాండలికమే బలాన్ని చేకూర్చుతుందనడంలో సందేహం లేదు. ఇకపోతే కష్టపడకుండా అన్నీ రావాలంటే రావు. కొంచెం ఓపిక, శ్రద్ధా వుంటే చాలు, మాండలికం అర్థమైపోతుంది. అర్థమైన తర్వాత అందులోని మాధుర్యానికి పాఠకుడే ముగ్ధుడవుతాడు. పైగా టీవీల్లోను, సినిమాల్లోను ఈనాడు ఆయా మాండలికాల్ని కొన్ని పాత్రల చేత మాట్లాడిస్తున్నారు. అందువల్ల మాండలికాన్ని అర్థం చేసుకోవడం ఈనాడేమీ కష్టం కాదు.

తెలుగు కథాసాహిత్యంలో మాండలికం ఏ తీరుగా వుందో పరిశీలిద్దాం- కాళీపట్నం రామారావు గారు పాత్రల సంభాషణల్లో మాత్రమే మాండలికం వాడారు. వీరిది కళింగాంధ్రమాండలికం.

"ఆళ్ళు మీకు నెలవా ?" అంది తవిటమ్మ. సత్యవతి అమ్మమ్మజీకి తెలుసునంది.

"మాయమ్మ! మాయమ్మ! మీదేపున్నాం. గంజోర్చుకో నానికేనా డోకెడు నీల్లేవు..! నన్నూ తీసుకెళ్ళండి." అంది తవిటమ్మ - (జీవధార)

"నాయన్నాయన. అల్లా బొరికోడికి తోడబెల్లేమి.." - (చావు)

"ఒల్నెన్వురు ఎత్తుకు పోరునేయే."

"నన్నెవలెత్తుకు పోతారు ఎత్తుకుపోతే నిన్నెత్తుకుపోవాల. నేకపోతే మీ నేస్తురాల్నెత్తుకుపోవాల వయసులో పిటపిటలాడు తున్నారా. సక్కగ అతురుతారు"

"ఇదేటోలమ్మ పోకిరీ గుంట" - (అర్తి)

రావిశాస్త్రి కథల్లో మరోరకమైన మాండలికం కనిపిస్తుంది ఇది జవమూ జీవమూ వున్న విశాఖ ప్రాంతపుభాష వీరి సారా కథలు మాండలిక ప్రయోగానికి పెద్దమలుపు. అందులో కథనం, పాత్రల శైలి ఆనాటి రచయితలందరినీ ప్రభావితం చేశాయనడంలో సందేహం లేదు.

"యాపారం లోకి దిగి సెడిపోనావ్రా శిసువా ?" అన్నాడు గురుడు.
"నీ కేటి తెల్దుగురూ." అని మళ్ళీ అన్నాడు రాకెట్టు.
"తెల్దు" అని గురుడు వప్పేసుకున్నాడు.
"అందుకే కాకాలోడిలానే పెళ్ళాన్ని గెద్ద తన్నుకుపోయినట్టు తన్నుకుపోను"

... .. ..

"అమ్మ పొట్టి లంజికొడుకు. ఎంతపంజేసేడు. అయాల సల్లో బిగిసి పోయిన జాయింట్లు ఇయ్యాల్టి దాకింకా సరిగా యిడ్డం లేదు. మంగలాడు పావిడా ఈయెడం కాలింకా సరిగా సాక్కుండుంది. అమ్మ లంజికొడుకెంత పన్జేసేడు? సూడూ? నువెళ్ళి ఆలంజి కొడుకు ఎక్కడుంటే అక్కడకెళ్ళి పిలకట్టుకీడ్చుకొచ్చి కొట్లో అడేయ్. - (అరుసారా కథలు - మోసం)

అలాగే తెలంగాణా మాండలికం మరోతీరుగా కనిపిస్తుంది.

"దొరపిలిచిండా?" అడిగాడు

"కాదండి నేనే వచ్చిన."

"ఏమిటి సంగతి ?"

"సదుకోవాల్నని ఉన్నదండి. సదువుసెప్పరా ? రాత్రిళ్ళువస్త. దొరకు తెలిస్తే పానం తీస్తడు......"

"దొరకొటింది మరచినవా?"

"దొర కొట్టిండు. గన్ననే సదుకోవాల్నని ఉన్నదండి చెప్పుతరా. రాత్రిళ్ళు వస్న. "

"ఎంకటి బస్తీకి పోరాదు చదువుసెప్తరు పైసలిస్తరు. ఏమంటావ్ ?"

"ఎట్లపోతనండి. మా అయ్య, అమ్మి పోయిండు దొరకు నన్ను. ఇగ చచ్చేడి దాకా బానిసోన్ని. ఎట్ల పోత ?" -(దాశరథి రంగాచార్య - చదువు)

అలాగే మాగోఖలే భాషను చూడండి- ఇది నెల్లూరు, రాయలసీమ భాషకు, దగ్గరగా వుంటుంది.

"అప్పుడే తెల్లారిందంటే నీకు గాబు కాడికి చేర్దానికీ ? మీ అమ్మసూసిందంటే చంపుద్దిరా."

"ఈలచ్చి ముండ అప్పుడే గాబు కాడికి చేరిందీ ? వస్తున్నా. ఇయాల దీనికి మూడిందే."

"ఛీ నీ బురద సేతుల్తో నన్ను ముట్టుకోమాక." -(ముత్తాయి కూతురు)

అలాగే రాయలసీమ కథకులదొక ప్రత్యేకమైన శైలి. రాయల సీమలో మొదట మాండలికాన్ని ప్రయోగించి కథలు రాసినవారు కె సభా గారు. వారు చిత్తూరు జిల్లా లోని దక్షిణ మండలం భాషను రసవత్తరంగా వాడుకున్నారు.

"అబ్బోడికి జాబు రాయవే. చేదలో నీరు పడిందే నీ యిల్లు బంగారం గాను."

"పది గుంటలు కాకపోతే పాతిక గుంటలైతే మాత్రమేం ? బంగారు కోనేరు లాంటి బావిపడుతుంది. పని నిలపకయ్యా." - (పాతాళ గంగ)

రాజారాంగారి మాండలికం మరోతీరుగా వుంటుంది. గ్రామీణ భాషను కాగితం పైకి తెచ్చేటప్పుడు కాస్తంత పదును పెట్టి దాని సహజత్వం చెడిపోకుండా సౌందర్యవంతంగా ప్రయోగించాలను కునే వారి శైలి హృద్యమైంది.

"ఏమయ్యా! అయ్యవారూ! ఎన్ని సార్లడిగినా సెప్పకనే పోతివి. ఇప్పుడైనా సెప్పేదుందా, లేదా ? 'ఓ' కు ముందచ్చరమేందయ్యా బాబూ?" - (ఓకు ముందక్షరం)

"ఆ తెలివిమంతుడి కడుపులో నువ్వొట్టి వెర్రిమారాజువి ఎట్లా పుట్టినావో? గాలిపోవిడిగా మాకన్నీ తెలుస్తానే ఉండాయిలే నాయనా మీ అమ్మానాయనా రెండేండ్లకో, మూడేండ్లకో ఒకసారి ఇజయవాడ దాకా వచ్చి పోతానే ఉండారంట ఎందుకురారు? ఆడ మేడలుండాయి. కార్లుండాయి రాజనాల భోజనాలుండాయి. అందుకన్నెప్పి ఆడికొస్తారు ఈ రాళ్ళదేశంలో ఏముంది? పూరి కొంపలు, బీటి నేలలు, గడ్డీగాదం తప్ప" (ఎడారికోయిల)

నరేంద్రదీ ఇంచుమించుగా అదేదారి.

"యెండగా వుండాది గొడుగు దెప్పిస్తానన్నా" "పెత్తనాలు మానేసి నేను జెప్పిన పని జెయ్యి." (కుంభమేళా)

ఇలాగే మహేంద్ర, కేశవరెడ్డి లాంటి రచయితలు చిత్తూరు మాండలికాన్ని వాడారు. కాని పూర్తిగా మాండలికంలో కథలు రాస్తున్న కొద్దిమంది రచయితల్లో నామిని, రాసాని, గోపిని కరుణాకర్‌లు చెప్పుకోదగ్గవారు.

నామిని భాష తిరుపతి సమీపంలోని మిట్టూరికి చెందింది. ఇతని భాషంటే ఆంధ్రులకెంతో అభిమానం అతని రచనల్లో నుంచీ కొన్ని శకలాలు-

"ఊర్లో అందరూ ఎట్టెట్ట చేస్కోని ఎట్టెట్టా బతకతా ఉండారు. మాకు మడి మద్యానం, చేను సందేళ ఇదీ మా వాటం. పది రూపాయలుంటే సారా పొట్లాం. అయిదు రూపాయలుంటే కల్లుముంత. రెండ్రూపాయలుంటే బీడీ కట్ట. చేతిలో పదిపైసాలే ఉండిందనుకో. ఒక మిటాయి తీస్కొనేది, నోట్లో యేస్కోని చప్పరిస్తా తిరిగేది."

"ఏరక తినే కోడి ముక్కులో ముల్లిరిగిపాయగద సిన్నబ్బా. పచ్చులు ఏచ్చులు ఆలకించేలాగా..."

"మానం తీసి మాకులకు కట్టు."

"మా అప్పు తీరేదాకా నేను బతికేది బదికేదేరా నా బట్టా." - (పచ్చనాకు సాక్షిగా)

రాసాని వాడిన భాష చిత్తూరు జిల్లా లోని పడమటి తాలూకాలకు సంబంధించింది -

"అబ్బయా ! నేను నిజంసెబుతుండా! నేను తప్పు సెయ్యనేదు నాకు ముగ్గురితో మనువాయ మూడుతావల సంసారమాయ. అయినా నేనేంతప్పు

సెయ్యాలా. నేను నిప్పులాంటి దాన్నబ్బయా. నిప్పులాంటిదాన్ని. ఆఁ"
(ఒలిబతుకులు)

"నాకు పది దినాలు దసిరా లీవులు దొరికితే మాఊరికి బోతి. నేన ఊరికి బోతే యింకేముండాది ఆటోళ్ళు అట్టే పట్టుకుంటారు. నాకు ఉద్యోగం రాక ముందు వోళ్ళేసే ఈది నాటకాల్లో యేసికం గడతావుంటి నేన బొయ్యేగుందికి సుట్టుకుంటారనుకో" (మావూరికతలు- నొగలమిందకూసున్నాడా నల్లనయ్యేగదా)

ఇదేవిధంగా కడపజిల్లా మాండలికాన్ని కథల్లో గుర్తించవచ్చు

సన్నపురెడ్డి వెంకటరామిరెడ్డి రాసిన 'తడి' కథలో సంభాషణ చూడండి-

"ఏమ్మా కూకోనుండవ్?"

"ఏంలేదు నాయనా ! నిద్రబట్టలే"

"సేతి కడేలడిగినానని సింత బడ్తాండవా అమ్మా. వొద్దులే నేనే యాన్నోసోట తంటాలుబడ్తా"

"ఎందుకోరే యీ అగసాట్లన్నీ"

"మనం కేసు గెల్సొద్దూ?"

"గెల్సకుంటేం?"

"వాల్లు గెలిస్సే నలుగుర్లో మనం తలెత్తుకొని తిరుగుతామా."

విశ్వనాథరెడ్డిగారిది మరోతీరు -

"అన్నీ పోగొట్టుకొని, బుట్టా పక్కీరై ఈడికి రాక చానా రోజులముందు ఈ రెడ్డేరి తోటలో కావిలిపనికి కుదురుకోక చానా ఏండ్ల ముందు నా కప్పుడు ముప్పయేండ్లుపైనే ఉంటాయి. మాఊళ్లో మాకు రెండెకరాల సన్న నిమ్మ చెట్లు, ఒక ఎకరా అరటి చెట్లు ఉండేవి. అసలు పక్కీరు! అప్పటికి మిగిలింది మూడెకరాలే కానీ మాది చానా పెద్ద వంశంలే. మట్లి వంశం అంటార్లే." - (నిజంకాని ఒక్కనిజం కథ)

అనంతపురం జిల్లాలో కథకులకు పెద్ద దిక్కుగా నిలిచినవారు సింగమనేని నారాయణ గారు. వారేమిరాసినా నేటివిటీ టచ్ ఉండేటట్లు చూసుకోవడం, ఆప్రాంతపు భాషను తగిన రీతిగా పాత్రల చేత చెప్పించడం అద్భుతంగా చేస్తారు -

"యాడికి మామా. ఎల్ల బారినావు."

"ఛూ మంచిసగినం చూసుకొని యల్లబారితే యాటికని అడుగుతా వుండావు. ఇంగ పని అయినట్టే"

"ఏమప్పా విశేషము ?"

"మా దగ్గర విశేషాలేముంటాయి తిరుపాలయ్యా ఏదో పల్లెకొంపలో బతికే వాళ్ళం."

"అట్లలేప్పామీరనేది మా సావుచూడు"

"వచ్చే నెలలో పాపది పెండ్లి ఒప్పుకుండానప్పా. వియ్యపోళ్ళకు పదివేలు పంపియ్యాల్ల. మాట చెప్పినాను" - (అరుసు)

అలాగే దేవపుత్రది అచ్చమైన అనంతపురం భాష మచ్చుకు కొన్ని శకలాలు -

"నేను బళ్ళోకి రాగూడదు సారూ అదీగాక అక్కడ మా అయ్య ఉండాడు ఎట్ల సారూ ఆడిగొచ్చేది మీరంతా పెద్దోళ్ళు గాబట్టి ఆడ ఉండొచ్చు. నేను మాత్తరం ఆడికి రాలేను సామీ నన్ను ఈడనే ఉణ్ణీయండ్రీ"

"మా అయ్య ఎదురంగ నేను కూసోవల్లా? నా వల్లగాదు సామీ. నన్నిడిసిపెట్టండ్రి నన్నిట్ల బలవంతజేస్తే ఎట్ల?" - (ఊడలమర్రి)

పై ఉదాహరణలన్నీ క్రోడీకరిస్తే - భాషా భేదాలెన్ని వున్నా, మాండలిక వైరుధ్యాలెన్ని వున్నా భాషలో ఒక ఏక సూత్రత కనిపిస్తుంది అవేమిటంటే ఆంధ్ర గ్రామీణుల ఆత్మ ఆత్మీయత మాండలికంలో అంతర్లీనంగా వుంటుంది

తెలంగాణా వాళ్ళు 'వచ్చిండు', 'నీ బాంచెన్' అన్నా, కళింగాంధ్రవాళ్ళు 'దొబ్బు' అన్నా, రాయలసీమ వాళ్ళు 'పూడిసినాడు, అబ్బోడు, కుశాల, వచ్చాసూబ్బా' అన్నా - ఆ మాటలు వారి గుండెల నుంచి వచ్చినవే నాగరికత నాజూకు తనం కోసం తెచ్చిపెట్టుకున్నవి కావు.

కాబట్టి గ్రామీణ ఇతివృత్తాలు ఎన్నుకున్నప్పుడు తగిన రీతిలో మాండలికాన్ని వాడడంలో తప్పులేదు దానివల్ల ఆ కథకి ఔచిత్యమూ, అందమూ, బలమూ చేకూరుతాయి.



# ఆధునిక తెలుగు కవిత్వం - ఐతిహాసిక ప్రయోగం

డా॥ మేడిపల్లి రవికుమార

భారతీయ సంస్కృతికి పురాణేతిహాసాలు పట్టుకొమ్మలు సంస్కృతిని గౌరవించటం ఒక సంప్రదాయం గురు పరంపరాగతమైన సదుపదేశానికి సంప్రదాయం అని అమరకోశం వ్యుత్పత్తి చెప్పింది అయితే ఈ సంప్రదాయం ప్రస్తుతం విశాలమైన అర్థంలో ప్రవర్తిల్లుతూ ఉంది

గతించిన తరం వర్తమాన తరానికి అందించిన మూలధనం సంప్రదాయం అని సినారె చెప్పారు సాహిత్యపరంగా అది రూపం కావచ్చు, వస్తువు కావచ్చు, ఛందో ధర్మాలు కావచ్చు, గుణరీతులు కావచ్చు- ఆఖరికి కవి సమయాల వంటివి కూడా కావచ్చు ఈ పట్టికలో వస్తువును అనుసరించి మన పురాణేతిహాసాల లోని పాత్రలూ, సంఘటనలూ వంటివి ఈ నాటికీ మన నిత్య జీవితంలో నీడలా మనల్ని వెన్నాడుతూనే ఉన్నాయి. 'వాడు భీముడిలా ఉన్నాడు' , 'వీడొక శకుని' , 'అదొక పద్మవ్యూహం' వంటివి ప్రతి నిత్యం మన వ్యవహారంలో సజీవంగానే ఉన్నాయని మనకు తెలుసు ఇదంతా కిందటి తరాలు మనకిచ్చిన ఐతిహాసిక సంప్రదాయ మూలధలమే!

నిత్య జీవితంలోని సత్య భాగాన్ని యథాతథంగా తెలుగు ఆధునిక కవులు ఆవిష్కరిస్తూ ఉన్నారు. అధునిక కవిత్వమంటే ఆధునిక జీవితమే కనుక జీవితంలోని ఐతిహాసికతను కవులు ప్రయోగాత్మకంగా ప్రతిబింబింప చేస్తున్నారు. ఆధునిక కవితా నిర్మాణ పద్ధతుల్లో ఇది కూడా ఒక ధోరణి.

ఆధునిక తెలుగు కవిత్వంలో చాలా ధోరణులకు పాశ్చాత్య కవిత్వం ప్రేరణగా నిలిచింది. ఈ ఐతిహాసిక ధోరణికి కూడా ఆంగ్ల కవిత్వం ఒరవడి పెట్టిందని చెప్పలేం కానీ, ఈ ధోరణి ఆంగ్లంలోనూ ఉంది. పౌరాణిక నేపథ్యంతో కవిత్వానికి రూపాన్నిచ్చే ఈ పద్ధతిని ఆంగ్లంలో MYTHOPOEIE (మిథోపోయి) అంటారు. దీనిని పాటించిన వారిలో టి.ఎస్.ఇలియట్ ప్రముఖుడు ఇతడు రాసిన 'ది వేస్ట్ ల్యాండ్' ఒక అద్భుతమైన మిథోపోయి కవిత శాపానికి గురికావడం వల్ల తనకే కాక తన రాజ్యానికి కూడా వంధ్యత్వం,

నిస్సారత వాటిల్లిన ఒక రాజు (Fisher King) కథ ఇలియట్ కవితకు ఆధారం. డబ్లు.బి. ఈట్స్ కూడా ఎన్నో ఐరిష్ పురాణ గాథల్ని నేపథ్యంగా స్వీకరించి ఐరిష్ రాజకీయాలను 'మిథోపోయి'గా మలిచాడు

తెలుగులో ప్రాచీన కవిత్వం అంతా చాలావరకు పౌరాణిక నేపథ్యం సంప్రదాయ బద్ధంగా కలిగి ఉంది. ఆధునిక కాలంలో కొంతమంది భావకవులు [illegible] 'ఊర్వశి', నాయని సుబ్బారావు

'శ్మశానాల వంటి నిఘంటువులు దాటి
వ్యాకరణాల సంకెళ్ళు విడిచి
ఛందస్సుల సర్ప పరిష్వంగం వదలి'

వడివడిగా కవిత్వం చెపుతానని మహాకవి శ్రీశ్రీ ప్రతిజ్ఞ చేశాడు అయితే తన 'మహాప్రస్థానం'లో చాలా వరకు పురాణేతిహాస ఘట్టాల్నే ఏర్చికూర్చి పెట్టాడు. 'అవతారం','జ్వాలాతోరణం' వంటి ఖండికల నిండా 'మిథోపోయి'ని గమనించవచ్చు.

"యముని మహిషపు లోహ ఘంటలు
మబ్బుచాటున
ఖణేల్ మన్నాయి!

నరకలోకపు జాగిలమ్ములు
గొలుసు త్రెంచుకు
ఉరికి పడ్డాయి!

.... .... .... ....

కనక దుర్గా చండ సింహం జూలుదులిపీ, ఆవులించింది!
ఇంద్ర దేవుని మదపుటేనుగు ఘీంకరిస్తూ, సవాల్ చేసింది!

పుడమి తల్లికి
పురుటి నొప్పులు
కొత్త సృష్టిని స్ఫురింపించాయి!" - [అవతారం (1934) - శ్రీశ్రీ]

"ఇదేమి!లోకం హిరణ్య నేత్రుని
పదాఘాతమున ప్రవిధ్వనించగ,
కురుక్షేత్రమున క్రుద్ధ వృకోదరు
గదా ఘాతమున గజగజలాడగ" - [జ్వాలాతోరణం (1938) -శ్రీశ్రీ]

అని మహాకవి నూతన ప్రపంచం ఆవిర్భావానికి తగిన రూపం కల్పించాడు. ఈ దశలో అవసరమైన విప్లవకార్యాచరణ బీభత్సంగా ఉంటుందన్న సత్యాన్ని స్ఫురింప చేశాడు. ఇందులోని 'మిథోపోయి' కవిత్వానికి కొత్త శక్తినిచ్చింది.

'మహాప్రస్థానం'(1934) అన్న ఖండికలో 'త్రాచులవలెనూ, రేచులవలెనూ, ధనంజయునిలా సాగండి' అన్నప్పుడూ, 'బుక్కులు', (1934) అనే ఖండికలో 'ప్రపంచమొక పద్మవ్యూహం! కవిత్వమొక తీరని దాహం!' అని చెప్పినప్పుడూ, 'జగన్నాథుని రథ చక్రాలు' (1940)లో 'నిటాలాక్షి పగిలిందట!, నిటాలాగ్ని రగిలిందట!' అని 'ధ్వంస రచన' చేసినప్పుడూ మహాకవి శ్రీశ్రీలో దాగిఉన్న ఐతిహాసికతను మనం గమనించవచ్చు.

పౌరాణిక నేపథ్యంలో ఆధునిక దృశ్య కావ్యాన్ని విలక్షణంగా చిత్రించిన వారిలో శ్రీరంగం నారాయణబాబు పేర్కొన దగినవాడు. నారాయణబాబు సంప్రదాయకమైన ఛందస్సుపై గొప్ప తిరుగుబాటు చేసిన వాడు. అయితే భారతీయ సంస్కృతిని కూడా అంత గొప్పగా జీర్ణించుకొన్నవాడు. తన 'రుధిరజ్యోతి' కావ్యంలోని 'కపాల మోక్షం' (1938) ఖండిక ఒక అద్భుతమైన 'మిథోపోయి'.

లాహోరు కుట్రకేసులో 1930 సం॥లో భరతజాతి గర్వించదగిన వీరుడు భగత్‌సింగ్‌ను ఇరికించి మరణ దండన విధించారు. దేశంలో ఎందరో కవులు భగత్‌సింగ్‌పై 'ఎలిజీ'లను రాశారు. 'నీ గళమ్మున నిరాకరణ సూత్రం వైచి నిలువునా ఉరితీశారా నాతండ్రీ!' అంటూ నారాయణబాబు కూడా వాపోయాడు. అంతేకాదు, ఇతర కవుల కంటే భిన్నంగా భగత్‌సింగ్ జీవితాన్ని

వినూత్న పురాణంగా కథనంచేశాడు. భగత్‌సింగ్‌ను కారణ జన్ముడుగా కీర్తించాడు ఆ ఖండికే -'కపాల మోక్షం''

ఆది శంకరుడు ఒకనాడు తపస్సమాధిలో నిమగ్నమై ఉన్నాడు ఓంకారం హూంకరిస్తూ ఉంది చరాచరాలు చలించిపోతున్నాయి. పంచభూతాలు ఉద్రేకించాయి అనంతకోటి జీవరాశులు హాహాకారాలు చేస్తున్నాయి. అప్పుడు-

'ఆర్ద్రమైనది
ఆ మహామహుని
అంతః కరణ
అంతట అక్షులు విప్పి
'ఆకలి! ఆకలి!' అంటూ

చేయి చాపినాడు'

శివుడు ఆచరించిన ఉగ్రతపస్సుకి బ్రహ్మకపాలం బూడిదయింది ఒక కొత్త కపాలం ఈశ్వరుడికి భిక్షాపాత్రగా అవసరమైంది బ్రహ్మ కపాలానికే దిక్కులేదు, మరెవరి కపాలానికి ఈ విశేషమైన అర్హత ఉంటుంది? భిక్షాపాత్ర కోసం శివుడు చేతులు చాచటం చూసి భూలోకంలోని ముస్లింల గోరీలలోనూ, కిరస్తానుల సమాధుల్లోనూ, హైందవుల శ్మశాన వాటికల్లోనూ ఉన్న కపాలాలన్నీ 'ఫిక ఫిక నవ్వినవి' ఈ సమయంలోనే శివుని చేతిలో బ్రహ్మకపాలం స్థానంలో భిక్షాపాత్రికగా ఉండడానికి మూర్తీభవించిన ఒక శక్తి స్వరూపం అవతరిస్తూ ఉంది

అగ్ని దేవుని భార్య స్వాహాదేవి తన భర్త మునిభార్యలను మోహించాడని తెలుసుకున్న స్వాహాదేవి ఒకనాడు ఆ ముని పత్నుల రూపాన్ని ధరించి అగ్ని దేవునితో రమించింది క్రీడించిన ప్రతిసారీ అగ్ని వీర్యాన్ని తీసుకొనిపోయి స్వాహాదేవి మంచుకొండ శిఖరాలపైన ఒక కనక భాండంలో దాచి పెట్టింది ఇపుడా భాండం కదిలింది

"శ్వేత పర్వతపు
శిఖరాంచలముల
కనక భాండమే
కదిలింది"

శివపార్వతులిద్దరూ ఓ రోజు రతిక్రీడలో ఉన్నారు దానిని భంగం చేయమని దేవతలు అగ్నిని ప్రోత్సహించారు. అగ్ని దేవుడు రతిక్రీడలో ఉన్న శివపార్వతుల ఎదుట నిలిచాడు. పార్వతి సహజంగానే సిగ్గు పడింది. దూరంగా వెళ్ళింది. తమ ఆనందాన్ని భంగపరిచినందుకు పార్వతి అగ్నిని శపించింది ఈ శాప ఫలితంగా శివుని వీర్యాన్ని అగ్నిదేవుడు ధరించవలసి వచ్చింది. అయితే, అగ్ని ఆ వీర్యాన్ని ఎంతోకాలం భరించలేక గంగ కడుపులో నిక్షిప్తం చేశాడు ఆ రేతస్సే ఇప్పుడు మానవ రూపం పొందడానికి సిద్ధంగా ఉంది.

"స్వాహా వల్లభు
సువర్ణ గర్భం
సళుపరించినది
కళవళించినది
గంగ వక్షమే
పాలపోటుతో
కళవళ పడ్డాది."

ఇంద్రుడు ఒక రోజు శివునితో తలపడ్డాడు ఈశ్వరుడు తన మూడో కన్ను తెరవడంతో ఇంద్రుడు బూడిదయ్యాడు. శివుడు ఇంద్రుణ్ణి కనికరించి తరువాత బతికించాడు. శివుని నేత్రాగ్ని చాలా విస్తృతమైంది. ఇంద్రుణ్ణి భస్మం చేయగా మరికొంత నేత్రాగ్ని మిగిలింది. దానిని మూడు భాగాలు చేశాడు. 'సింధు గర్భం'లో ఒక భాగాన్నీ, 'గంగ కడుపు'లో మరో భాగాన్నీ, 'లవణ సాగరపులోతుల్లో' మిగిలిన భాగాన్నీ దాచి పెట్టాడు.

"సింధు గర్భమున
గంగ కడుపులో
లవణ సాగరపు లోతుల్లో
దాగిన నేత్రాగ్ని
మానవ రూపం దాల్చింది."

ఆ మానవుడే మహనీయుడైన సర్దార్ భగత్‌సింగ్.

నారాయణబాబు స్వీకరించిన పౌరాణిక సన్నివేశాలన్నీ మహాశక్తి వంతమైనవి. అగ్ని వీర్యం, శివుని తేజస్సు, ఫాలాక్షుని నేత్రాగ్నిని ప్రస్తావించటం

ద్వారా భగత్‌సింగ్ నిప్పులాంటి మనిషని నారాయణబాబు కీర్తించాడు భగత్‌సింగ్ జన్మకు పౌరాణికతను ఆపాదించి, మరో పౌరాణిక వీరుణ్ణి సృష్టించాడు అందుకే భగత్‌సింగ్-

"మంటల్లోనే పుట్టాడు!
మంటల్లోనే పెరిగాడు!!
మంటల్లోనే మడిశాడు!!! "

'మిథోపోయి'ని ఇంత శక్తివంతంగా తీర్చిదిద్దటం అందరికీ సాధ్యంకాదు అందుకే -"ఎందరు భగత్‌సింగ్ పై పద్యాలు రాయలేదు? అంతరూ ఇటువంటి 'ఎపిక్' కల్పన చేశారా? ఈ ఘనత నారాయణబాబుకే దక్కింది" అని ఆరుద్ర కవికి కితాబు నిచ్చారు ఈ ఐతిహాసిక ధోరణి అభ్యుదయకవిత్వంలోనే కాక దిగంబర, విప్లవ కవిత్వాల్లో కూడా అక్కడక్కడా మనం గమనించవచ్చు అయితే తెలుగునాట అత్యాధునిక ధోరణులైన దళితవాద, స్త్రీవాద కవితల్లో ఈ ఐతిహాసిక ఛాయలు కొత్తకోణంలో దర్శించగలం

దళితవాద స్త్రీవాద కవితలు వర్తమాన కాలంలో కవుల కలాల్లో పుడుతున్న ఒకే జ్వాలకు రెండు ముఖాలు. ఇది వేడివేడిగా - వాడివాడిగా - వడివడిగా వస్తున్న కవిత్వం. సాంఘికంగా, ఆర్థికంగా, వ్యక్తిగతంగా, జాతిపరంగా అణగ దొక్క బడుతున్న మనిషి ఆవేదన, ఆవేశం -ఈ కవిత్వం. తరతరాలుగా చరిత్ర పొరల్లో నిద్రిస్తున్న సంతకాలుగా, సమాధులుగా ఉన్న 'దాచేస్తే దాగని సత్యాల'ను వెలికి తీసి మనిషి మనిషిగా, బుద్ధిజీవిగా మారుతూ ఉన్నాడు. అటువంటి ఈ వర్తమాన కాలంలో. ఈ జ్వాలా ముఖాలు రావలసిన కవితలు-కావలసిన కవితలు. ఆవిర్భావ వికాసాల పరిచయం అవసరంలేని అచ్చమైన కవితలు- స్వచ్ఛమైన కవితలు- చెక్కబడిన కవితలు-చిక్కబడిన కవితలు- పోటెత్తిన కవితలు - పడగెత్తిన కవితలు!!

దళితులను చైతన్యవంతులను చేసే పరమోద్దేశంతో దళిత కవిత్వం పుట్టింది. అది ఎంత 'పదునెక్కి'నా, మన పురాణేతిహాసాలలోని పాత్రలనూ, సన్నివేశాలనూ అవసరానుగుణంగా స్వీకరించింది అదనంగా జవాన్నీ, జీవాన్నీ తన సొంతం చేసుకుంది. దళిత కవిత్వంలో మనకు ఎక్కువగా కన్పించే కొన్ని ఐతిహాసిక పాత్రలు ఇవి-

శంభూకుడు-ఏకలవ్యుడు-ద్రోణుడు-రాముడు-శివుడు-వశిష్ఠుడు-అరుంధతి-మత్స్యగంధి-పరాశరుడు-అంబిక-అంబాలిక-వ్యాసుడు-సైంధవుడు-హిరణ్యాక్షుడు-ధర్మరాజు-హరిశ్చంద్రుడు-కీచకుడు-రావణుడు-శకుని-బలి-వామనుడు-వాలి వంటివారు.

కేవలం ఈ పాత్రలేకాక కొన్ని ఐతిహాసిక సంఘటనలు కూడా దళిత కవిత్వంలో చోటు చేసుకున్నాయి పద్మవ్యూహం- వస్త్రాపహరణం-సంజీవి పర్వతం-మయసభ-దుశ్శాసనపర్వం - గురుదక్షిణ వంటివి వీనిలోకొన్ని

ఈ ఐతిహాసిక పాత్రలనూ, సంఘటనలనూ స్వీకరించిన దళిత కవులు కొన్ని సందర్భాల్లో వాని పట్ల తమ విశ్వాసాన్ని ప్రకటించారు మరి కొన్ని సన్నివేశాల్లో తమ కసినీ, ద్వేషాన్నీ వ్యక్తం చేశారు ఇంకొన్ని సంఘటనల్లో తమ జాలినీ, సానుభూతినీ చూపించారు

దళితవాదం మంచి ఊపునందుకొన్న ఈ కాలంకంటే ముందే దళిత స్పృహతో కొందరు కవులు కొన్ని ఖండికలను ప్రకటించారు అటువంటి వానిలో బోయి భీమన్న రాసిన 'గుడిసెలు కాలిపోతున్నై'(1973) అన్నది ఒక గొప్ప కవితా సంకలనం. ఐతిహాసిక పాత్రలను ఆధునిక జీవితాల ఆవిష్కరణకు అనుగుణంగా ఎంత పదునుగా స్వీకరించవచ్చో బోయి భీమన్న కూడా నిరూపించాడు 'నా వారసత్వపు హక్కులు' అనే ఖండికను పరిశీలిద్దాం-

"విశ్వాన్నే ఆర్యం చెయ్యాలనుకొని
తాను కులం లేని వాడైనా, బ్రహ్మర్షి అయి
నమ్మదగ్గ భార్యకోసం
నానా దేశాలూ వెతుకుతున్న వశిష్ఠుడికి
ఆ మాలమాదిగ పిల్ల అరుంధతే దొరక్కుండా ఉంటే-

ఇద్దరినుండి అద్దరికి తరింప చేస్తూ
మానవ సేవా పరాయణ అయిన మత్స్యగంధి
ఆనాడు అరుంధతి మనుమడైన పరాశరుడు
మోహంతో మీద చెయ్యి వేసినపుడు
కోపంతో మూతి పళ్ళు రాలగొట్టి ఉంటే -

సంతు లేకుండానే వితంతువులై పోయిన
అంబికా అంబాలికా సోదరీ మణులు
అత్తగారి ఆజ్ఞల్ని ధిక్కరించి
పరపురుషుడైన వ్యాసుణ్ణి తిరస్కరించి
పాతివ్రత్యాన్ని ప్రదర్శించి వుంటే-

వేదవ్యాసుడు పుట్టేవాడే కాదు,
మహాభారతానికి కథ ఉండేది కాదు-"

కవి ఈ కవితలో మహాభారతం పుట్టుకకు దారి తీసిన పరిస్థితులను, వ్యక్తులనూ ప్రస్తావించాడు. భారతీయ సంస్కృతికి ఆటపట్టయిన ఒక మహేతిహాసానికి జవాన్నీ, జీవాన్నీ ఇచ్చింది దళితులే అన్న సత్యాన్ని ధ్వనింప చేశాడు.

దళిత కవులు పురాణేతిహాసాల లోని పాత్రలను ఎన్నింటిని తమ కవిత్వం కోసం స్వీకరించినా శంభూకుడు, ఏకలవ్యులపై ఎక్కువ దృష్టి నిలిపారు. వేర్వేరు కాలాలలో , వేర్వేరు సందర్భాలలో రాజుల చేతా, గురువుల చేతా దగాపడిన పాత్రలు ఇవి. తమ సర్వస్వాన్నీ ఫణంగా పెట్టి బంగారు జీవితాల్ని కోల్పోయిన వారు వీరు ఈ పాత్రలను తమ ఆత్మ బంధువులుగా స్వీకరించి, వారితో తాదాత్మ్యం చెంది, తమ జాతి ప్రతినిధులుగా దళిత కవులు కీర్తించారు. ఆ ఐతహాసిక పాత్రలకూ, దళితకవులకూ మధ్య ఉన్న సామీప్య, సాంఘిక నేపథ్యం వల్ల ఇంచుమించు ప్రతి దళిత కవీ తమ కవితలో వీరికి పెదపీట వేశారు.

తరతరాలుగా అణచివేతకు గురౌతున్న దళితుడు భవిష్యత్తును దిద్దుకొనే ప్రయత్నంలో చరిత్ర పుటల్ని తిప్పిచూస్తున్నాడు వర్తమానాన్ని ప్రశ్నిస్తున్నాడు

"ఏలు కోసివ్వడానికి
ఈ రోజు
నేను పిచ్చి ఏకలవ్యుణ్ణనుకున్నావా ?
తలవంచి
తపస్సు చేసుకోటానికి

నేను శంభూకుణ్ణనుకున్నావా?
దొంగ బాణం దెబ్బతో
కిందపడి తన్నుకోటాన్కి
నేను వాలి ననుకున్నావా ?
మనువు మక్కెలిరిచే వాణ్ణి నేను
రంగుల్ని ఉరితీసేవాణ్ణి
నన్ను కుంటోణ్ణి చేసిన
ఈ దేవుళ్ళ చర్మం వలిచేవాణ్ణి" -(ఇద్దరం కలిసె - వరదయ్య)

అని కేవలం ప్రశ్నలను గుప్పించటమే కాక తానెవరో కూడా చెప్పాడు

దళిత కవి ఇంతటితో ఆగలేదు. అత్యంత ఆత్మ విశ్వాసంతో 'నడుస్తున్న చరిత్ర'లో భవిష్యత్తును కలకంటున్నాడు.

"శంభూకుడు పెదాల మీద చిరునవ్వుతో
రాముణ్ణి వధిస్తున్నాడు-
ఏకలవ్యుడు ద్రోణుని బొటన వేలును
గొడ్డలితో నరుకు తున్నాడు-
బలి తన చిరు పాదాలతో వామనుణ్ణి
పాతాళానికి తొక్కేస్తున్నాడు -" -(నడుస్తున్న చరిత్ర - శివసాగర్)

తిరగబడ్డ ఈ చరిత్రను రాయగలిగే నమ్మకాన్నిచ్చింది ఈ నాటి దళిత కవుల చైతన్యం -ఈ చైతన్యం మన రక్తంలో కణాలుగా మారిన ఐతిహాసిక గాథల నుంచే ఎక్కువగా వచ్చిందనడానికి ఇటువంటి ఉదాహరణలు కొన్ని వందలు చూపించవచ్చు

దళిత ఉద్యమానికి ఏ మాత్రం తగ్గకుండా వచ్చిన మరో చైతన్య కెరటం స్త్రీ వాదకవిత్వం. కేవలం సాంఘికంగా ఆర్థికంగా వెనుకబడిన వారు దళితులైతే, వీరిలోనే కాక, అన్ని రంగాల్లోనూ ముందున్న ఉన్నత వర్గాలలో కూడా యుగయుగాలుగా పురుష స్వామ్య విధానాల వల్ల అణచివేయ బడుతున్న వారు స్త్రీలు దళత ఉద్యమం ఈనాడు ఎంత సహజమో స్త్రీవాద ఉద్యమం అంత అవసరం. మహిళాలోకం 'ఊర్మిళ నిద్ర' నుండి లేచిన తరువాత తమకు కావలసిన ప్రత్యేక అవసరాల కోసం, అనుభవాల కోసం,

అనుభూతుల కోసం - ముఖ్యంగా తమ ఉనికిని బతికించుకోవటం కోసం 1980 దశకం నుంచి తెలుగులో స్త్రీవాదం బయలుదేరింది ఈనాడు అది ఒక ఉద్యమ స్థాయికి చేరుకొంది.

స్త్రీవాద కవిత్వాన్ని భరించలేని కొందరు వీరి కవిత్వాన్ని 'వారకవిత్వ'మన్నారు. మరికొందరు 'నీలి కవిత్వ'మన్నారు ఇంకొందరు 'వొళ్ళు బలిసిన కవిత్వ'మన్నారు 'రక్తస్రావ కవిత్వ'మన్న వారు కూడా లేకపోలేదు ఎందరు ఎన్ని రకాలుగా వ్యాఖ్యానిస్తున్నా ఒక సిద్ధాంత ప్రాతిపదిక మీద జాతి అభ్యుదయం కోసం ఎగజిమ్ముకుంటూ వస్తున్న ఈ కవిత్వం ఏనాడూ వెనుతిరిగి చూడలేదు. చండ ప్రచండంగా నిప్పులు కక్కుతున్న స్త్రీవాదులు కూడా తమ అనుభూతులను వ్యక్తం చేసే నేపథ్యంలో దళిత కవులలాగే కొన్ని ఐతిహాసిక పాత్రలనూ, కొన్ని సంఘటనలనూ స్వీకరించక తప్పలేదు

పురాణేతిహాస పాత్రలను చాలావరకు స్త్రీ వాదులు మార్గ దర్శకంగా భావించలేదు. ఒక రకమైన సానుభూతిని ప్రదర్శించటానికి మాత్రమే 'మిథోపోయి'ని తమ కవిత్వంలో అనుసరించారు. స్త్రీవాదులు ఎక్కువగా అభిమానించిన పాత్ర ఐతిహాస కావ్యనాయిక ద్రౌపది నిండు సభలో ఆమెకు జరిగిన అన్యాయాన్నీ , అవమానాన్నీ ఈనాటి స్త్రీవాదులు కూడా తమ కోణంలో ప్రశ్నిస్తున్నారు. వ్యాసుల వారిని కూడా నిలదీస్తున్నారు.

"ఒక్కొక్క పొరా
వొలిచేస్తున్నప్పుడు
ఖచ్చితంగా ద్రౌపది మనసులో ఏం జరిగిందో
భారతం చెప్పదు -

ఏ కీచకుడో జుట్టుపట్టి ఈడ్చినప్పుడు
కణకణ మండిన ఆమె నిలువెత్తు శరీరం
ఐదుగురిని పెళ్ళాడి
ఎంత మోసపోయిందో
వ్యాసుడికి సరిగ్గా అంతుపట్టదు-

ఏం రాస్తే ఏం మునుగుతుందో
పాతివ్రత్యం ఎక్కడ చెదురుతుందో

కథను ధర్మరాజు వైపు నడిపిస్తే సరి -
మహా రాజకీయవేత్త-మహాభారత కర్త
వ్యాసుల వారికి మలుపు తిప్పడం కష్టమా?

అందుకేగా వాళ్ళంతా ఋషులు
వాళ్ళకి పెళ్ళాలుండరు
వాళ్ళకి కూతుళ్ళుండరు
కుండల్లోంచి పుడతారు కదా!
వాళ్ళకి తల్లులూ ఉండరు-"

-(అందుకేగా వాళ్ళు ఋషులు- జయప్రభ)

అయితే - ఆధునిక స్త్రీ ద్రౌపదికి జరిగిన పరాభవాన్ని ఆకళించుకొని మరో అడుగు ముందుకు వెళ్ళింది

"నా అవమానానికి ప్రతీకారం జరిగేంతవరకూ
విడిపోయిన నాజుట్టు ముడివేయకుండా ఒదలడానికి
నేను ద్రౌపదిని కాను" -(విభజన రేఖాగీతం - వసంతకన్నాభిరాన్)

అని ఒక గొంతు పలికింది సాధుమతులూ, సహనవతులూ అయిన చంద్రమతి, సుమతి, కుంతి వంటి అమ్మను తాను కాననీ -

"అనాదిగా నాన్న చేసిన దురాగతంలో
రాటు దేలిన నూతనమ్మని
అరాచక నాన్న అత్యాచారాన్ని
అడ్డకొని ఒడ్డుకెక్కిన ఆగ్రహమ్మని
నాన్న ఎత్తిన చవట చేతిని
చచ్చు బార్చిన సత్యభామని" -(నూతనమ్మ - సుమతి)

అని తన బిడ్డతో మరో స్వరం నినదించింది.

ఇలా ఐతిహాసిక పాత్రలనుంచి స్ఫూర్తిని పొంది అనుభవాలను పంచుకొని, అనుభూతులను కొత్త పద్ధతిలో మలచుకొని, తమదైన గొంతును స్వేచ్ఛగా ఈనాడు ఎందరో స్త్రీవాదులు విన్పిస్తున్నారు. ప్రతినిత్యం వందలాదిగా పురుషభావ దౌష్ట్యంపై విరుచుకు పడుతున్నారు. స్త్రీవాదుల కవితల్లో ఇటువంటి ఐతిహాసిక ప్రతీకలు ఎన్నో..!ఎన్నెన్నో...!!

ఆధునిక తెలుగు కవిత్వంలో కవులు అనుసరించిన ఈ 'మిథోపోయి' పద్ధతి కవిత్వాన్ని పరిశీలిస్తే మరో విషయం స్పష్టం అవుతుంది 'మిథోపోయి' పద్ధతి పాటించటం వల్ల కవిత్వాన్ని ఆత్మాశ్రయత్వం నుంచి దూరం చేయవచ్చు కవులు తమ భావాలను స్వయంగా కాక పురాణేతిహాస పాత్రలకూ, సన్నివేశాలకూ అన్వయం చేసి విశ్లేషించటం వల్ల ఇది సాధ్యమవుతుంది. కవిత్వం వైయక్తికత్వం నుంచి దూరమైనపుడు సార్వజనీన లక్షణం అబ్బుతుంది. ఆధునిక కవిత్వంలో ఇదొక సుగుణం

'మిథోపోయి' పద్ధతిలో మరో ప్రయోజనం కూడా ఉంది పురాణేతిహాసాల లోని పాత్రల పట్ల, సన్నివేశాల పట్ల పాఠకుల్లో కొన్ని అభిప్రాయాలు అప్పటికే స్థిరపడి ఉంటాయి కొన్ని విశ్వాసాలు ముద్రపడి ఉంటాయి కవులు వీనిని ప్రస్తావించటం వల్ల ఆ ముద్రలు విచ్చుకుంటాయి దీనివల్ల అటువంటి కవితల్ని చదవటానికి పాఠకులు ఇష్టపడతారు. అటువంటి కవితల్లో చదివించే గుణం కూడా ఎక్కువగా ఉంటుంది. కాగా పాఠకుల సంఖ్య కూడా బాగా పెరుగుతుంది.

ప్రపంచంలో ఆఫ్రికన్ కవులు ఈ 'మిథోపోయి' పద్ధతిని అత్యంత శక్తివంతంగా అనుసరించారు ఆఫ్రికన్ కవిత్వం, అమెరికా నల్లజాతి కవిత్వం, లాటిన్ అమెరికన్ కవిత్వం గొప్ప పటుత్వాన్నీ, ఆకర్షణనూ కలిగి ఉంటాయి దీనికి కారణం ఆయా కవిత్వాల్లో పాటించిన 'మిథోపోయి' అని సుప్రసిద్ధ విమర్శకుడు జి. లక్ష్మీనరసయ్య అభిప్రాయపడ్డారు.

ప్రపంచంలో - అది ఏదేశమైనా, 'ఐతిహాసికత' అనేది పూర్వులు ఒక సంప్రదాయంగా భవిష్యత్ తరాలకు ఇచ్చిన వారసత్వం . ఎన్ని కేలండర్లు తిరిగి పోతున్నా- ఎన్ని తరాలు గడిచి పోతున్నా- ఎన్ని అనుభవాలు అలిసి పోతున్నా ఐతిహాసిక సంప్రదాయం ఏదో ఒక రూపంలో నిలిచే ఉంటుంది ఏదో ఒక భావనలో తొంగి చూస్తూనే ఉంటుంది. దాన్ని స్తంభింప చేయటం ఎలాంటి ప్రగతి వాదులకు కూడా అసాధ్యం. ఈ విషయాన్ని అగ్నికీలగా వ్యాపిస్తున్న తెలుగులోని అత్యాధునిక కవితా ధోరణులు కూడా నిరూపిస్తున్నాయి

"Men May Come And
Men May Go
But I go on Forever"

అన్నాడు ఓ ఇంగ్లీషు కవి. సంప్రదాయం కూడా అలాంటిదే! అదొక నిరంతర ప్రవాహం సాంఘిక, కాల పరిస్థితులు ఎన్ని మారినా, కొత్త అనుభవాలు, అనుభూతులు ఎన్ని చేరినా శ్రీశ్రీ ఆరుద్రతో అన్నట్టు "సంప్రదాయం నిలిచే ఉంటుంది హమేషా"!

ఐతిహాసికత అనేది చంద్రకిరణాల్లా చల్లదనాన్ని ఇవ్వటమే కాదు, అప్పుడప్పుడూ సూర్య కిరణాల్లా మనల్ని వేడెక్కిస్తుంది. వెన్ను తడుతుంది కర్తవ్యాన్ని కూడా ప్రబోధిస్తుంది అదొక అంతంలేని పరిభ్రమణం. ఎ రచేతిని అడ్డుపెట్టి సూర్యోదయాన్నే కాదు, చంద్రోదయాన్నీ ఆపలేం.

## ఆధార గ్రంథాలు


(1) మహాప్రస్థానం -శ్రీశ్రీ

(2) రుధిర జ్యోతి -శ్రీరంగం నారాయణబాబు

(3) సమగ్ర ఆంధ్ర సాహిత్యం - XIII -ఆరుద్ర

(4) ఆంధ్రజ్యోతి ఆదివారం అనుబంధం - 24 7 1994

(5) గుడిసెలుకాలిపోతున్నై -బోయి భీమన్న

(6) చిక్కనవుతున్న పాట -దళితకవితా సంకలనం

(7) నీలిమేఘాలు -స్త్రీవాదకవితా సంకలనం

(8) ఆధునిక కవిత్వము సంప్రదాయములు ప్రయోగములు -సినారె

(9) కొన్ని ఇతర కవితా సంకలనాలు.




# కుందుర్తి 'హంస ఎగిరి పోయింది'

## ఆధునిక కరుణరసాత్మక మహాకావ్యం

ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు

హంస జీవాత్మకు ప్రతీక "హంస ఎగిరి పోయింది" అంటే "ఆత్మ శరీరాన్ని వదలి వెళ్ళిపోయింది" అని అర్థం. ఇది మరణానికి ప్రతీక కాని కుందుర్తిగారు "హంస"ను తన భార్యకు ప్రతీకగా వాడి "ఎగిరి పోయింది" అనే పదాన్ని ఆమె "మరణించింది" అనే అర్థంలో ప్రయోగించారు.

ఒక వ్యక్తి మరణిస్తే పన్నెండు రోజులు కర్మకాండలు చేస్తారు కాబట్టి ఈ విషయాన్ని ధ్వనింపజేస్తూ పన్నెండు గీతాలు వ్రాశారు. అగ్ని లేకుండానే శరీరాన్ని దహించే దుర్భరమైన ఐదు సంఘటనలలో భార్యావియోగం మొట్ట మొదటిది

"భార్యా వియోగశ్చ, జనాపవాదః, -ఋణస్యశేషః, కుజనస్యసేవా|
దారిద్ర్యకాలే ప్రియదర్శనంచ, -వినాగ్నినా పంచ దహంతి కాయమ్||"
(నీతి శాస్త్రం, ప్రథమభాగం, 17వ శ్లోకం)

ఇటువంటి దుర్భరమైన శోకాన్ని భరిస్తున్న కుందుర్తి తన మనస్సులోని బాధకనుగుణంగా పన్నెండు విచిత్రమైన శీర్షకలు పెట్టారు. ఈ శీర్షికల్లో శోకం యొక్క క్రమోన్మీలనం కూడా కనబడుతుంది. శీర్షికల్ని కుందుర్తిగారు ఈ క్రమంలో ఉంచారు.

1 అదుర్దా, 2. భయం, 3 నిరాశ, 4. కోపం, 5. చింత, 6. చికాకు, 7 బరువు, 8. తపన, 9 భ్రాంతి, 10. విసుగు, 11 బాధ, 12. విరక్తి.

దుర్భర శోకం యొక్క పర్యవసానం విరక్తి కాబట్టి చివరి శీర్షికకు "విరక్తి" అన్న నామం పెట్టి తన మనస్సులోని దుఃఖానికి గొప్ప ముక్తాయింపునిచ్చారు.

### 1. అదుర్దా

హంస నీళ్ళనీ పాలనీ వేరు చేస్తుంది. కుందుర్తి తన భార్యతో కలసి హాయిగా సంసారం చేసిన కాలం పాలు తాగుతున్నట్లుగా గడచింది. ఇపుడామె

మరణంతో ఆయనకు నీళ్ళు మాత్రమే మిగిలాయి.

"బ్రతుకులో వున్న పాలన్నీ గటగటా తను తాగేసి
మిగిలిన నీళ్ళు నాపాలుగా భాగం పంచి
హంస ఎగిరిపోయింది."

ఈ భావంతో ఈ స్మృతి కావ్యం అద్భుతంగా ఇలా ప్రారంభమౌతుంది

తన భార్య చనిపోయిన విషయాన్ని అయన (కవి) నమ్మలేక పోతున్నాడు దిక్కులు చూస్తూ కూచున్న కొడుకుల్ని (అమెను) హంసను వెదకమని తిడుతూ పురమాయిస్తున్నాడు. పత్రికల వాళ్ళను బ్రతిమాల్తున్నాడు. తన బంగారు హంసను పట్టి తెచ్చిన వాళ్ళకు గొప్ప బహుమతి ఇస్తానంటున్నాడు. ఆయన మిక్కిలి పేదవాడు. ఆయనకున్న ఆస్తి కవిత్వం. అందువల్ల ఆయన ప్రకటించిన బహుమతి ఇలా ఉంది.

"పత్రికల వాండ్లూ, ప్రకటించండి బాబూ
బంగారు హంసను పట్టి తెచ్చిన వాళ్ళకు
పదివేల పంక్తుల వచన కవితల వజ్రాల మూట
జలకాలాడిస్తాను నవరసాల పన్నీటి మున్నీట"

కవి కాలం నది ఒడ్డున కూర్చుని పరధ్యానంగా పద్యాలు వ్రాసుకుంటున్నపుడు ఆ నది (కాలం) హంసనెత్తుకు పోయింది నదీ ముఖ ద్వారం దగ్గరున్న జాలర్లను తన హంసను వలవేసి పట్టుకోమని బ్రతిమాలుతున్నాడు.

తన భార్యతో కలిసి జీవించిన రోజులలో తాను దుర్భర దారిద్ర్యాన్ని అనుభవిస్తున్నప్పటికీ తన ధర్మ పత్ని ఉన్నత సాహచర్యం వల్ల ఆయన ఎంత కష్టం వచ్చినా లెక్కలేకుండా హాయిగా బ్రతికాడు. ఈ కావ్యానికి సారాంశమైన ఈ అంశాన్ని కుందుర్తి ఎంతో శక్తివంతంగా చెప్పారు.

"నాతో పాటు చెరి సగంగా బరువు మోసి
నాతో పాటు చెరి సగంగా కరువు మేసి ........."

హంస ఎగిరి పోయింది. తాను అమెకు చాలీ చాలని జీతంతో చీరలు కొనలేక పోయాడు. నగలు చేయించ లేక పోయాడు. తన వద్ద కవిగా కీర్తి తప్ప ఇంకేమీ లేదు. సంసారాన్ని సాగరంతో పోలుస్తారు కాని తన అర్థాంగితో హాయిగా బ్రతికిన అకాలంలో సంసార సాగరం ఆయనకు

మోకాల్లోతు కూడా లేదనిపించింది. ఆ దంపతు లిద్దరూ ఊహల కొండలెక్కారు ఊహల (కోర్కెల) ఉండలు మెక్కారు

ఈ విధంగా తన కవితా శక్తితో తాను భార్యతో గడపిన సంసార జీవితాన్ని తలచు కోవడం కూడా ఆయనకు దుర్భరంగా అనిపించింది అందుకే ఈ మొదటి ఖండిక చివర రసవత్తరమైన రెండు పాదాలు వ్రాశాడు

"ఓ కనిత్యమా! ఎందుకు తవ్వుతావే యింతగా గుండెల్లోకి?
ఎందుకు తోస్తున్నావే నన్ను పాతకాలపు లోతుల్లోకి?"

## 2. భయం

ఆదుర్దా వేరు భయం వేరు పోయిన వస్తువు దొరుకుతుందని ఆశతో ఎదురుచూడడం, కంగారు పడడం ఆదుర్దా పోయిన వస్తువింక దొరకదని నిశ్చయమైనపుడు కలిగే దిగులు "భయం" మొదటి కవితలో కుందుర్తి తన భార్య చనిపోయిన విషయాన్ని నమ్మకుండా "ఆదుర్దా" చెందారు ఈ రెండవ కవిత "భయం" లో ఆమె చనిపోయిందని నమ్మి భయపడ్తున్నారు

భార్య మరణానికి నిశ్చేష్టుడైన కవి పసిపిల్లాడిలా మారిపోయాడు ఒంటరితనం బురద ఒంటి నిండా పూసుకున్నాడు. సిగ్గు లేకుండా దిగంబరంగా బజార్లో తిరుగుతున్నట్టుగా అనుభూతి చెందాడు తనలో తాను కుమిలి దుఃఖిస్తున్నాడు. ఈ విషయాన్ని "నాలో నేను కరగడం నేర్చుకుంటున్నాను" అన్న వాక్యంతో చాలా శక్తిమంతంగా వ్యక్తీకరించాడు.

కాలం పసిపిల్లవాడిలా ఉన్న కవిని మోసం చేస్తుంది ఆయన భార్యతో సుఖంగా గడపిన రోజులు పసిపిల్లవాడికి పరమాన్నం పెట్టినంత ఆనందంగా ఉండేవి. ఆ భార్య చనిపోవడం ఆ పసిపిల్లవాడ్ని బలి ఇచ్చి నట్లున్నది!

తనను బంధించిన కాలాన్ని మోసగించి తప్పించుకు వచ్చేశాడు కవి జీవిత మర్మం తెలుసుకున్నాడు. మనుషులందరూ కలిసిమెలిసి హాయిగా ఉన్నపుడు "మరణం" పాము లా వచ్చి కాటువేస్తుంది. తనకు తోడు నీడగా ఉన్న భార్య మరణించడం చీకట్లో నడుస్తున్నపుడు నీడ కూడా జాడ చెప్పకుండా జారుకున్నట్లుంది. వెలుగున్నపుడే నీడ ఉంటుంది ఆమె ఉన్నపుడు కవికి సుఖ సంతోషాల వెలుగుండేది. చీకట్లో (మరణంతో) నీడ (భార్య) ఉండదు

భార్యా విహీనుడైన కవి ఏకాకిగా దుఃఖిస్తూ ఉన్న తన అవస్థను "కుంటి ఒంటెద్దు బండి మీద కూచుని ప్రయాణం చేస్తున్నాను" అనే వాక్యంతో అత్యద్భుతంగా ప్రదర్శించాడు. భార్యభర్తలిద్దరూ ఉంటే రెండెడ్ల బండి ప్రయాణం. ఒంటరితనం (దుఃఖం) వల్ల కుంటి ఒంటెద్దు బండి తన ఒంటరి జీవితానికి ధ్యేయం లేదు అందువల్ల తాను చేరవలసిన ఊరు, పేరు మరచి పోయానంటున్నాడు భార్యతో సంసారం గడపిన రోజులన్నీ తార్రోడ్డు మీద డీలక్సు బస్సు ప్రయాణంలా ముగిశాయి ఇక నుంచి గడపవలసిన ఒంటరి దినాలు "వంకర టింకర గులక రాళ్ళ డొంకలా" ఉంది

కవికి, భార్య తోడు - నీడ. హంస ఎగిరి పోవడంతో "తోడు" పోయింది. "చావు" అనే చీకటితో నీడ చెరిగి పోయింది తోడు, నీడ లేని కవి ఒంటరి జీవితం ఒక లోతైన పాడు బావిలా ఉంది. దాంట్లోకి తొంగి చూస్తే భయంగా ఉంది. బయటి ప్రపంచంలో ఎన్నో ఆనందాలుండవచ్చు కాని భార్య మరణంతో దెబ్బ తిన్న కవి తనలో తాను కుమిలి పోతున్నాడు. ఈ పరిస్థితిని నాలుగు చిన్న పాదాల్లో అత్యద్భుతంగా వ్యక్తీకరించాడు కవి

"తోడు లేని ఒంటరి గాణ్ణి
తొంగి చూస్తే భయంగా ఉంది
బయట ఏముంటే ఎందుకు?
నాలోపలే నేను కూర్చుంటాను"

### 3. నిరాశ

తన భార్య చనిపోయిందని ధ్రువపరచుకున్నాడు కవి. అతని మనసు నిండా "నిరాశ" వ్యాపించింది. అందువల్ల కాల గతికి మూలమైన సూర్య చంద్రుల్ని ఉపాలంభిస్తున్నాడు. తన అందమైన భార్య చనిపోవడాన్ని కవి అద్భుతంగా ధ్వనింప చేశాడు. సుందరమూ, మధురమూ, మంజులమూ, మనోహరమూ అయిన ఒక చుక్క రాలిపోయిందనీ, పక్షవాతం రాకుండానే తనకొక రెక్క (చేయి లేక పక్షిరెక్క) వాలి పోయిందని చెప్పాడు కవి. సంసారం ఒక పక్షి. భార్యా భర్త లిద్దరూ దాని రెండు రెక్కలు. ఒక రెక్క వాలిపోతే పక్షి ఎగరలేదు. మగ మనిషికి పక్షవాతం వస్తే కుడివైపు కాలుచేతులు పడిపోతాయి. ఏ పనీ చేయలేడు.

సంసార సుఖం ఒక పానకం కుండ. భార్యాభర్తలు రెండు చేతులు కుండలో రెండు చేతులా గ్లాసులు ముంచి పానకం త్రాగేవారు. ఇపుడు

కుడిచేయి (భార్య) పడి పోయింది ఇక "పుర్ర" (ఎడమ) చేత్తో జుర్రుకోవల్సిందే! ఎడమచేత్తో పదార్థం తినడం అసభ్యం, అసహ్యం!

కాలగతిని సూచించేవి పగలు - రాత్రి. పగలు సూర్యుని వల్ల, రాత్రి చంద్రుని వల్ల ప్రకాశవంతమౌతాయి. ఎండ బాధాకరంగా ఉంటుంది కవి యొక్క చీకటి బ్రతుకును అతని భార్య వెన్నెలగా వెలిగించింది మరణించి చితా భస్మమై ఆ వెన్నెట్లో కలిసి పోయింది. భార్య అర్థాంగి అంటే భర్త శరీరంలో సగం భార్యభాగం వెన్నెట్లో కలిసి పోయింది. మిగిలిన భర్త భాగం మీద తెల్లవారి కష్టాల మండుటెండ కాసింది ఈ విషయాన్ని కవి ఎంతో చక్కగా వెల్లడించాడు

"మిస మిసలాడే వెన్నెల్లో మేని సగం కలిసి పోయాక
తెల్లవారితే ఏముంది?
మిగిలిన సగం నెత్తిమీద మిత్తిలా ఎండ!
ఆకాశ సముద్రంలో సూర్యుడూ చంద్రుడూ
సుడిగుండాలే యిద్దరూ
ఇద్దరూ గూండాలే!"

### 4. కోపం

ఎగిరి పోయిన హంస (కవి భార్య) ఇక రాదన్న వాస్తవం తెలుసుకున్న కవి ఆమె శవాన్ని కూడా తనకు దక్కకుండా, శ్మశానానికి తీసుకుపోవడానికి వచ్చిన వస్తువుల మీద "కోప"గిస్తున్నాడు

కవి రాత్రి అంతా శవ జాగరణం చేశాడు తెల్లవారింది సూర్యోదయమైంది.

కవి మనస్సులో రెండు పరస్పరమైన విరుద్ధ భావాలున్నాయి ఒకటి భూతకాలం రెండు వర్తమాన కాలం. భూత కాలంలో భార్యతో గడపిన ఆనందమయ జీవితం ఉంది అది మధురమైన ఊహలతో కూడిన భావ కవిత్వంలా మిగిలి పోయింది. వర్తమానంలో చనిపోయిన భార్యశవం ఎదురుగ్గా ఉంది ఇది వాస్తవం.

సూర్యోదయాన్ని చూస్తున్న కవి మనస్సు పైన చెప్పిన రెండు రకాలుగా స్పందించింది కవి భార్యకు ఆసుపత్రిలో ఏదో పెద్ద ఆపరేషన్ జరిగి ఉండాలి అది విజయవంతం కాక చనిపోయి ఉండవచ్చు అందువల్ల

సూర్యోదయం మొదట "ఎగిరిపోయిన హంస గుండె ఎర్రటి ముద్దై పొడిచినట్లు" కనబడింది. తరువాత కవి మనసు భూతకాలం లోకి పోయింది సూర్యోదయం వాస్తవం. (భార్య మరణం వాస్తవం) దీనికి పూర్వం ఉన్నది రాత్రి. (భార్య మరణానికి పూర్వం ఉన్నది ఆమెతో తాను చక్కగా గడపిన సంసార సుఖానుభవం) కవి ఊహాలోకంలోకి వెళ్ళి పూర్వం భార్య తీర్చి దిద్దుకునే తిలకం బొట్టును, తమ వివాహం జరిగిననాడు తాను ఆమె మెడలో" అప్పుడే కొత్తగా కట్టిన తళ తళల తాళిబొట్టు" ....ను తలుచుకున్నాడు ఈ-ఊహాలలో తేలిపోయేవాడే, తన్ను తాను నిగ్రహించుకుని నేల మీది సంగతులు చెప్పడానికి ఆకాశంలోంచి (ఊహాలోకంలోంచి) దిగివచ్చాడు.

భార్యకు దహన సంస్కారం చేయడానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి దానికి సంబంధించిన వస్తువులు తెచ్చారు. అవి. 1 వెదురు బొంగు, 2 కోరాపేలిక, 3. పూలదండ, 4 కొత్తకుండ, 5. కుంకుమ పంకం, 6. పసుపుకొమ్ములు, 7. చన్నీళ్ళు, 8. మంత్రగానం. ఈ ఎనిమిది వస్తువుల మీద కవికి తీవ్రమైన కోపం వచ్చింది. తన సంసార జీవితానికి ప్రతీక అయిన తనభార్యను తననుండి శాశ్వతంగా విడదీయడానికి వచ్చిన వస్తువులివి అందువల్ల వీటిమీద కవికి కోపం. ఆ కోపంలోంచే విషాదం పొంగి పొర్లి వచ్చింది అందువల్ల ఆ వస్తువులకు తన మనోవేదనను తెలిపే గొప్ప విశేషణాలను కవి వాడాడు

1. వెతలు పొడుగ్గా సాగిన - వెదురుబొంగు
2. తీరని కోర్కెల దారాల్తో అల్లిన - కోరాపేలిక
3. నాలో (కవిలో) నన్ను కాలుస్తున్న - పూలదండ
4. ఇల్లు చిచ్చుపెట్టడాని కన్నట్లు కడుపులో నిప్పులు పెట్టుకొచ్చిన - కొత్తకుండ
5. ఆసుపత్రిలో కారిన రక్తంలాంటి - కుంకుమ పంకం
6 రోకటితో దంచినా నలగని - పసుపు కొమ్ములు*
7 స్పర్శలేని - చన్నీళ్లస్నానం
8. అపశ్రుతులు పలికే శ్రుతివిహిత - మంత్రగానం.

*ఇక్కడ "కొమ్ములు" అనే పదంలోని అర్థవిశేషాన్ని తీసుకొని కవి తనకు గల కోపాన్ని వ్యక్తీకరిస్తూ "పసరానివి" (ఎద్దువి) అని అన్నాడు.

ఈ ఎనిమిది వస్తువులూ కలిసి ఇంకా తనకు భారమై, తన కొడుకు చేతిలో పిడికెడు నువ్వులుగా మారి నట్టు భావించాడు కవి. కోపంతో ఈ వస్తువులన్నింటినీ వెళ్ళిపొమ్మని కవి గద్దరిస్తున్నాడు. "బండెడు కట్టెలు" పిలుస్తున్నాయని, స్మృతులు గుండెను తొలుస్తున్నాయని, కంట్లో కడివెడు కన్నీళ్లు నిలుస్తున్నాయని, మధ్యాహ్నం 12 గంటల్లోకి, మంటల్లోకి వెళ్ళిపొమ్మని కోపంగా అరుస్తున్నాడు కవి.

## 5. చింత

కవి చనిపోయిన భార్యను చేరలేక, చేరడం ఎలాగో తెలీక "వృద్ధాప్యం" అనే అడవిలో ఒంటరిగా బ్రతకలేక "చింతి"స్తున్నాడు.

ఊరికి ఉత్తరాన శ్మశానం ఉంటుంది మన దేశానికి ఉత్తరాన హిమాలయా పర్వతాలున్నాయి కవి తన భార్యను హంసతో పోల్చుకున్నాడు హంసలు హిమాలయాల్లో మానస సరోవరంలో ఉంటాయి ఊరికి ఉత్తరాన శ్మశానాల్లో దహనం చేయబడ్డ తన భార్యను హిమాలయ పర్వతాలలో మానస సరోవరంలో ఉన్న "హంస"గా కవి భావిస్తున్నాడు. మన దేశానికి ఎల్లలు హిమాలయాలు కవి దుఃఖానికి భార్య మరణం ఎల్ల. మంటల్లో కాలిపోయి, తెల్లని "బూడిద"గా మారిన భార్యను రెక్కలు ముడుచుక్కూచున్న "రాజహంస"లా భావించాడు. తనకు చల్లని సంసారాన్ని ప్రసాదించిన భార్య పోవడంతో, తనకు కలిగిన తీవ్రమైన దుఃఖాన్ని "మంచుకొండ మండుతున్నది" అనే ఒక్క వాక్యం చెప్పగలిగాడు కవి!

ఉత్తర దిక్కులో తన హంసను గుర్తించాడు, కాని అక్కడికెళ్ళే మార్గం లేక బాధ పడుతున్నాడు. భార్య లేకుండా (తను అరవైయ్యోపడి జీవితంలో) అరవైయ్యో పడిలో ప్రవేశించిన తన బ్రతుకును "అసంపూర్ణ గ్రంథమ"న్నాడు కవి. తన వార్ధక్యం వెలుగు తెరువు (దారి) లేకుండా చీకటి ఉండలు కట్టిన చెట్లూ, చేమలతో కూడిన "అడవి"గా భావించాడు కవి. ఈ అడవిలో పులులు మరణానికి సంకేతం.

ఈ వృద్ధాప్యంలో తనకేమైనా సుఖం దొరుకుతుందా? అని ప్రశ్నించుకొని, తన హంస (భార్య) లేకుండా సుఖం ఉండదని నిశ్చయించుకొని, తన "బ్రతుకింక గాడిద మీద మైల గుడ్డల బరువు"లా భావించాడు కవి!

"తన అస్తిత్వం ఎక్కడ?" అని ప్రశ్నించు కున్నాడు కవి. మరణంలోనా? లేక బ్రతుకులోనా? ఉత్తర దిక్కు నున్న హిమవత్పర్వతాలు మరణానికి

సంకేతం కొలనులేని, హంసలేని, అడవి తన ముసలి తనపు ఒంటరి తనపు బ్రతుకునకు ప్రతీక, పోయిన వాళ్ళతో ఎవరూ పోరు కావున బ్రతక వలసిందే. కాని కవి పక్షి అయితే ఒక రెక్క విరిగిపోయింది. మనిషి అయితే కుడిచేయి పడిపోయింది. ఇక తన తపస్సు (బ్రతుకు) నీళ్ళు కూడా కరవైన అడవిలో "ఒంటి కాలి మీద, కుంటికాలి మీద చేద్దామని నిర్ణయించుకున్నాడు

"చింత" అనే ఈ గంభీర గీతంలో కవి వర్తమాన దేశ పరిస్థితిని హాస్యంగా చిత్రీకరించడానికి ప్రయత్నించాడు. దేశంలో తరచుగా జరిగే రైలు, విమాన ప్రమాదాల్ని తేలిక ధోరణి (Lighter Vein) లో చెప్పాడు. ఈపాదాలు కవితయొక్క గంభీరత (Seriousness)ను పాడు చేస్తున్నాయి.

**6. చికాకు**

సంప్రదాయాల్ని గ్రుడ్డిగా నమ్మిన బంధువులు తన కర్మకాండ జరిపిస్తుంటే కవి వారిమీద "చికాకు" పడుతున్నాడు. ఆ బంధువులు నిజంగా "ఆస్తికులు" కారు. సంప్రదాయాల్ని గుడ్డిగా అనుసరించే వాళ్ళు మాత్రమే. వాళ్ళ మాటల్లో నిజాయితీ లేదు. కవి మీద వారికి సానుభూతి లేదు శాస్త్రమంతా తమకే తెలిసినట్లూ, కవి నాస్తికుడైనట్టూ భావించుకుని కర్మకాండ జరిపించాలని చూస్తారు. కర్మకాండ చేసే బ్రాహ్మడు కూడా "పాత" సంప్రదాయాల్ని గుడ్డిగా అనుసరిస్తాడు. కొత్తగుడ్డ ఉత్తరించడానికి (కత్తిరించడానికి) మొదట "బ్లేడు" తెమ్మంటాడు. మళ్ళీ గడ్డం గీసుకొనే బ్లేడు పనికిరాదంటాడు. పాతకాలపు ఇనప కత్తిపీటే కావాలంటాడు. ఒక ఇంట్లో చావు వచ్చినపుడు ఇరుగు పొరుగు వారు కూడా సహకరించరు. కారణం, మరణం అపశకునమనే మూఢ విశ్వాసం. పక్కింటి వాళ్ళు ఇనప కత్తి పీట తమవద్ద ఉన్నా ఇవ్వరు. ఈ విషయాన్ని కవి కత్తిపీట "పక్క వాళ్ళింట్లో వుంది గానీ శవాన్ని కోస్తారనుకుని బైటపెట్టరు వాళ్ళు." అనే వాక్యంతో చమత్కరించాడు. కవిచేత కర్మకాండలు తు. చ. తప్పకుడా చేయించాలని పట్టు పట్టే బంధువులు బార్లకెళ్ళి తాగి రావడం, చీట్లాట ఆడడం, అందరితోను పోట్లాడ్డం, సపర్యలు చాలలేదని విసుక్కోవడం, పాత పగలు బయటపెట్టడం చేస్తారు. ఇటువంటి బంధువుల్ని కవి "బంధువులు నిజంగా దయా సింధువులు" అని వెటకారంగా వ్యాజస్తుతి చేస్తాడు. బ్రాహ్మడు కూడ బంధువుల లాంటివాడే. చనిపోయిన ప్రాణి సవాలక్ష పాపాలు చేసినట్లు సంస్కృత పదబంధాలతో పెద్దపట్టీ బట్టీపెట్టి చదువుతాడు. బంధువులు మెచ్చుకుంటారు. అభ్యుదయ భావాలున్నకవి ఆ పరిస్థితిని ఎదుర్కోవాలని చూస్తే అంతా కలిసి అతనిని

"నాస్తికుడని" అపహాస్యం చేస్తారు కవి నిస్సహాయుడై "మహా ఆస్తికతా జనుషాంధువు"లయిన ఆ బంధువుల్నే నమ్ముకుని ఉంటాడు

వెనుకటి అయిదు కవితలలో పోలిస్తే ఈ ఆరవ కవితలో కవిత్వం ఏమీలేదని చెప్పాల్సొస్తుంది కొంత వ్యంగ్యమూ, వక్రోక్తి ఉన్నా, హృదయాన్ని ఆకర్షించే రసభావాలేమీ లేవనే చెప్పాలి

### 7. బరువు

భార్య చనిపోయిన కవి గడచిన తమ "సంసారాన్ని" "కావడి"తో పోల్చి, ఆ కావడిలోని తేనె కుండ (భార్య) పగిలి పోయిందని చెపుతున్నాడు ఆ తేనె కుండ స్థానంలో సమతూకం కోసం "బండ" బారిన తన గుండెను పెట్టుకున్నాడు అది కవికి "బరువై" పోయింది. ఈ కవితలో అడవి, కావడి, తేనెకుండ, నీళ్ళకుండ, గెరిల్లా - అనే ప్రతీకల్ని వాడాడు "అడవి" మానవ జీవితానికి, "కావడి" చక్కగా సమతూకంతో సాగే భార్యాభర్తల అనురాగ జీవితానికి, "తేనెకుండ" తన భార్యకి, "నీళ్ళకుండ" తనకు, "గెరిల్లా" (యముడు) వడిసెల మరణానికి సంకేతాలుగా వాడాడు. కవి తేనె కుండ, నీటి కుండల కావడితో అడవిలో కాలం కాలువ వెంట పరుగెడుతున్నాడు. గెరిల్లా వడిసెల దెబ్బలకి తేనెకుండ ముక్కలయి పోయింది. అతని తూకం చెడి పోయింది తేనెకుండ బదులు "బండ" పెడదామని తెచ్చాడు కాని, తన గుండె తూకం సరిపోయింది. అంటే భార్య మరణంతో కవి గుండె "రాయి"గా మారిపోయిందని (కవి) భావం భార్య తనకు తేనె వంటి సుఖమయమైన జీవితాన్ని ప్రసాదించింది. ఆ సుఖంకోసం మళ్ళీ విఫల ప్రయత్నం చేస్తున్నాడు ఎవరైనా సరే జీవితంలోకి సుఖిద్దామనే ప్రవేశిస్తారు. కాని అందరికీ పూర్తి సుఖం దొరకదు. కొంత సుఖం (తేనె), కొంత నిరాశ (నీళ్ళు), కొంత దుఃఖం (కన్నీళ్ళు) లభిస్తాయి. ఈ విషయాన్ని కవి ఎంతో ధ్వన్యాత్మకంగా చెప్పారు.

> **"అందరూ అడవికెళ్తారు గాని,**
> **పరిపడినంత అందదు తేనె**
> **నీళ్ళతో కడుపు నింపుకోవాలి**
> **కొంత కొంత కన్నీళ్ళతో"**

### 8. తపన

ఆసుపత్రిలో ఆపరేషన్ విజయవంతం కాక చనిపోయిన భార్యను గురించి "తపన" పడుతున్నాడు కవి.

హంస మానస సరోవరంలో ఈదుతుంది. కవి హంస (భార్య) రక్త సముద్రంలో ఈదుతుంది. ఆమె గుండెలో ధమని తెగిపోయింది. రక్తం కొల్లు గట్టింది. ఆదృశ్యం కవి మనస్సులో స్థిరంగా నిలిచి పోయింది సూర్యోదయాన్ని వర్ణించినా, కుంకుమను వర్ణించినా, కాలాన్ని వర్ణించినా కవికి నెత్తురు ముద్దగా మారిన భార్యే జ్ఞాపకం వస్తోంది ఆసుపత్రిలో ఆమెకు సరిగా వైద్యం కూడా జరిగినట్లు లేదు అందుకని ఆసుపత్రిని "ఉత్త అబద్ధాలపుట్ట"లా ఉందని, ఇంకా చావని "శవాలగుట్ట"లా ఉందని వర్ణించాడు. డాక్టర్లు, నర్సులు, యాంత్రికంగా ప్రవర్తించడాన్ని చెప్పాడు కాలం పెద్ద నెత్తురు ముద్దగా మారి తనను ఎర్రగా చూస్తున్నట్టు భయపడ్డాడు ఎర్రటి నెత్తుటి రెక్కలు తప తపా కొట్టుకుంటూ హంస ఎగిరి పోయిందని బాధపడ్డాడు. చితిలో భార్య శరీరం చిటపట శబ్దాలతో పేలుతూ దహించుకు పోవడాన్ని తన హంస పాడిన చివరి పాటగా కవి భావించాడు!

## 9. భ్రాంతి

లేనిదాన్ని ఉన్నదిగా భావించడం "భ్రాంతి" భార్య మరణంతో కవి మనస్సు ప్రకృతిలోని సౌందర్యాని గ్రహించలేక పోతోంది ఆ సౌందర్య స్థానంలో ఒక వికారం, దుఃఖం, కన్నీళ్ళు, నిరాశ, ప్రళయం, ప్రకృతిలో ఉన్నట్టుగా కవి భ్రాంతి చెందుతున్నాడు. ఇది కవి మనసులోని 'భ్రాంతి'.

వాన కురుస్తుంటే ప్రకృతి అందంగా ఉంటుంది. కాని భార్యను కోల్పోయిన కవికి మిన్ను తన వెన్నుమీద తన్నినట్లు, నేల మీదికి పిడుగుల ఆటంబాంబులు పేలుస్తున్నట్లు, మబ్బులు మధురాను భూతుల కన్నీళ్ళు కారుస్తున్నట్లు, స్వచ్ఛమైన వాన నీటిలో ఎవరో విషం కలపినట్లు "భ్రాంతి" కలిగింది ('నగరంలో వాన' అనే అద్భుత కవితను వ్రాసిన ఈ కవి (కుందుర్తి) తన భార్య మరణంతో ప్రకృతిని భిన్నంగా, విషాదంగా చూస్తూ వర్ణించడం ఒక Paradox! కవి మనఃస్థితిని బట్టి వర్ణన ఉంటుందని ఈ విషయం తెలియజేస్తోంది.) భార్య మరణంతో తన ఆశలన్నీ నిరాశలయ్యాయి, అని చెప్పడం కోసం కుమ్మరి (పొయ్యి) "ఆవం"లో కుండలన్నీ పగిలిపోవడం, ఆకాశ హంస ఒంటి మీద నక్షత్రాల పుండ్లు పడడం, ఆసుపత్రిలో జీవన సరసుకు రెండు వైపులా గండ్లు పడడం, నీలి నింగి ఎర్రగా మారి పోవడం అనే ఉపమానాలను వాడాడు కవి. ఆసుపత్రిలో కవి భార్యకు కాన్సర్ ఆపరేషన్ జరిగి, రక్తం ఎక్కువగాపోయి మరణించిన సంఘటన వల్ల ఈ ఉపమానాలు వాడారు. భూమికే యౌవనం తరిగి పోతోందని, ఎందరు

మరణిస్తున్నా మూసీనదిపైనున్న శ్మశానానికి ఆకలి తీరటం లేదని చెప్పడం కని తాత్త్విక మనఃస్థితికి తార్కాణం. (దుర్యోధనాదులు పుట్టినపుడు సత్యవతి అంబిక అంబాలికలతో కలిసి అరణ్యానికి వెళ్లిపోతూ 'మంచి కాలమంతా వెళ్లిపోయింది. చెడ్డకాలం దాపురించబోతోంది' అంటూ, 'పృథివీగతయౌవన' అంటుంది.)

భార్యతో గడపిన సుఖమయమైన కాలాన్ని గూర్చి ఆలోచిస్తూంటే కవి మనస్సు "గజేంద్రుడు"గా మారినట్లు "జ్ఞాపకాల పీడకలలు" కాలు పట్టిన మొసలినట్లు కవి భ్రాంతి చెందాడు (ఇక్కడ "గజేంద్రమోక్షం" పౌరాణిక ప్రతీకను ప్రయోగించాడు కవి) "నింగి వాలినట్లు, నేల కూలినట్లు" అనే పాదాలలో ప్రకృతికి ప్రళయం వచ్చినట్లు కవి భ్రాంతి చెందుతున్నాడు భార్యా విహీనమైన కవి బ్రతుకు శిశిరంలో ఆకులు రాలిన చెట్టులాంటిది గడచిన కాలంలోని కవి మధురానుభూతులు పచ్చని ఆకులు. అవి ఇప్పుడు పండిపోయి, ఎండిపోయి, రాలి పోయాయి. ఆ పండుటాకులు, చెట్టు క్రింద పెట్టిన కవి గుండె కుంపట్లో పడి కాలిపోయినట్లుగా కవి భ్రాంతి.

## 10. విసుగు

చీకటి రాత్రుల దీర్ఘరాత్రితో పడి "విసుగు" చెందుతున్నాడు, కవి

పగలు, వెలుగు సుఖానికి సంకేతాలు. రాత్రి - చీకటి దుఃఖానికి సంకేతాలు. భార్య మరణంతో కవి జీవితం చీకటి ధారల దీర్ఘరాత్రిగా మారిపోయింది. "పగలు చచ్చిన రాత్రి" - "భార్య చనిపోయిన కవి"ని ధ్వనింప చేస్తోంది. పదవనాడు భార్యా మరణంతో బంధువులు స్త్రీలు స్నానాలు చేసి జుట్టు ఆరబెట్టు కుంటున్న దృశ్యాన్ని చూచిన కవి మనసులో - "చెట్లు చీకటికి తడిసిన జుట్లారబెట్టుకుంటున్న రాత్రి" అనే భావచిత్రం (image) రావడం సహజమే. తనకు తోడు - నీడగా ఉన్న భార్యపోవడం, తాను అశక్తుడు, బలహీనుడు కావడం, ఎంతో గొప్పగా చెప్పారు కుందుర్తి. తల ప్రక్కన పెట్టిన దీపాన్ని ఆర్పేసింది చీకటి - గోడమీద నానీడ నిలువు నా కుప్ప గూలిపోయింది" - రాత్రిలో చీకట్లున్నాయి. కవిలో చింత ఉంది. చింత చీకట్లని కౌగలించుకుంది. చింత చీకట్లను కౌగలించుకుంటే, అవి ఉక్కిరి బిక్కిరై ముద్దలు ముద్దలుగా వచ్చి కవి ముఖంలోని దైన్యాన్ని చుంబిస్తున్నట్లుంది చీకటి రాత్రిలో ఇంటి ముందు ఏడుస్తున్న కుక్క కవి మౌననిశ్వాసాల వెలుగుల్ని ప్రతిబింబిస్తున్నట్లుంది.

చీకటి రాత్రి, నిశ్శబ్దంగా ఉన్నట్టు నటిస్తూనే కవి గుండెలో కోటి వేదనల కోలాహలం చేసింది కవి తన యౌవనంలో అమితానందంతో పెళ్ళాడిన భార్య ఇపుడు చితిలో మండి మసైంది ఈ విషయాన్ని కుందుర్తి ఎంతో ప్రతీకాత్మకంగా చెప్పారు. "పల్లకీ బొంగు తగలబడి పడిన బొగ్గుల నుసిగా - నామీద ప్రకృతి పట్టిన కసిగా" -

చీకటిని మరణానికి ప్రతీకగా వాడుతూ ఆచీకటి రహస్యం అందరికీ తెలుసునని, భార్యకు పరిచితమైన ఇంట్లోని వస్తువులకు కూడా తెలుసునని, తనకొక్కడికే తెలియదని కవి వాపోతున్నాడు. ఈ చీకటి రాత్రి తనను ఒంటరి వాణ్ణి చేసిందని బాధపడుతున్నాడు. తనను నిర్దాక్షిణ్యంగా ఈ చీకటి వానలో పడేసిందని బాధ పడుతున్నాడు.

భార్య మరణంతో తాను బాధపడుతున్న బాధని లోకం గుర్తించింది వేకువ జామున చెట్ల మీది పక్షులు చేసే ధ్వనులు దుఃఖంతో ఉన్న కవికి ఏడ్పుల్లా వినబడుతున్నాయి. వృద్ధుడైన కవి జీవితంలో మళ్ళీ సుఖంరాదు భార్య స్మృతిలోనే అతనికి ఆనందం ఉంది. అందువల్ల "ఈ చీకటి రాత్రి ఇలానే ఉండనీ. పగలొద్దు, దిగులే ఉండనీ" అని ప్రాధేయ పడుతున్నాడు కవి భౌతికమైన భార్యదేహం చితిలో మండిపోయినా, ఆమెతో తాను గడపిన మధురమైన సాహచర్యం మాత్రం "దీపం"గా, "ఫోటో"గా, స్మృతిగా, ఈ లఘుకృతిగా, కవితో ఉండిపోయింది.

### 11. బాధ

భార్యా స్మృతుల వల్ల కవి "బాధ" పడుతున్నాడు. ఇందులో ఆస్మృతుల్ని పక్షులతో పోల్చడం విశేషం. ఎంత మరచిపోదామన్నా ఆస్మృతుల్ని మరవటానికి సాధ్యం కావటం లేదు

ఏకాదశీ ఉపవాసమున్నవాడు ఏమీ తినకూడదు. కాఫీ కూడా త్రాగకూడదు. కాని, ఉపవాసమంటే మనవాళ్ళు అన్నం మాత్రం మానివేసి స్పెషల్‌గా టిఫిన్‌లు చేయించుకు తింటారు. భార్యా దుఃఖంతో ఉన్న కవికి భార్యా సంబంధమైన శోకం తప్ప ఇంకేమీ మనసులో ఉండకూడదు. కాని, కవికి భార్యా సంబంధమైన స్మృతులు కడుపునిండా గతాన్ని మేసివచ్చి ఆయన కడుపులో కూచుని కెలుకుతూ ఉంటాయి.

గడచిన కాలంలో కవి భార్యతో ఆనందమైన జీవితాన్ని గడిపాడు. యౌవనంలో ఆమె రంగు రంగుల చీరలు ధరిస్తే ఇతడు ఊహల పల్లకీ

లెక్కేవాడు సుఖ దుఃఖాలతో సంసారం గడచింది. పిల్లలు పుట్టారు వాళ్ళూ పెద్దవాళ్ళయ్యారు.

ఈ జీవిత క్రమ పరిణామాన్ని సూచిస్తూ స్మృతులు పక్షుల్లా ఎగిరి వచ్చి కవి మనసు ముందు పరచిన జ్ఞాపకాల చాప మీద కిచ కిచల కీచు శబ్దాల్తో "కూచుంటాయి". కవి ఆలోచనలో పడతాడు తీయని పాత స్మృతులు ఇప్పుడు అతణ్ణి విపరీతంగా బాధిస్తాయి ఈ విషయాన్ని కుందుర్తి ఎంతో కవితాత్మకంగా చెప్పారు.

"కండ్లు మూసుకుని నాలుగు ధ్యానపు ధాన్యం గింజలు వాటి మొహాన పడేస్తాను. ఏ ముక్కుల్తో ఏరుకు తింటాయో, ఆ ముక్కుల్తోనే నాకండ్లు పొడుస్తాయి, ఈ స్మృతులు".

నిద్రలోను, మెలుకువలోను కూడా ఈ స్మృతులు కవిని బాధిస్తున్నాయి భార్యామరణంతో కొన్ని కొమ్మలు నరికి వేసిన 'బోసిచెట్టు'లా ఉంది కవి మనస్సు. మిగిలిన కొమ్మల మీద ఈస్మృతుల పక్షులు గట్టిగా గూళ్ళు కట్టుకున్నాయి జీవిత సంఘటనలే ఆగూటి నిర్మాణంలో ఉపయోగించిన చిదుగు పుల్లలు

స్మృతుల పక్షులు కవి బుజాల మీద, వీపు మీద, మోచేతుల మీద, మోకాళ్ళ మీద వ్రాలాయి అలా వ్రాలి నందువల్ల అతనికి భారంగా ఉంది. చనిపోయిన భార్యను గూర్చి ఆలోచిస్తూంటే ఆస్మృతులు తన ఒడలు తాను తవ్వుకుంటున్నట్లు అనుభూతినిస్తున్నాయి.

ఇంత వరకూ కవి తన గత స్మృతుల్ని పక్షులతో పోల్చాడు. కాని, తన తీవ్రమైన బాధని సూచించడానికి ఈ ఉపమానం ఇక సరిపోదు పక్షి - స్వేచ్ఛకీ, అందమైన భావానికీ ప్రతీక అందువల్ల కవి తన బాధాను భూతి కనుగుణంగా ఉపమానాలు వాడాడు. కాలి కిందపడి చితికిన చిల్లపెంకు ముక్కలు, తలకు తగిలిన సోడాబుడ్డి పెంకులు, బాణాలు, పిడిగ్రుద్దులు, చరణం మరచిన పాటలు, కన్నీటి ఊటలు, కొరడా దెబ్బలు, ఒళ్ళు కాలి ఉబ్బిన బొబ్బలు - వీటిలా ఉన్నాయట ఆయన స్మృతులు.

భార్య చనిపోయింది. కాని, కవికి ఆమెమీద ఉన్న మమతానురాగాలు చని పోలేదు. అందువల్ల ఆమె స్మృతులు చిరంజీవులై కవిని బాధిస్తున్నాయి

## 12. విరక్తి

భార్య చనిపోయి పన్నెండు రోజులైంది. బంధువులంతా వెళుతున్నారు. ఇక మీదట తాను గడపబోయే ఒంటరి జీవితాన్ని తలచుకుని కవి మొత్తం జీవితం మీదనే "విరక్తి" చెందుతున్నాడు, తాత్విక శిఖరాలపై ఎగిరిపోతున్నాడు. "ఎందుకయ్యా నీకీ విరక్తి? పోయిన వాళ్ళతో పోతామా!" అని బంధువులు ఓదారుస్తూ పలకరిస్తుంటే,

"ఏమో నాకు తెలీదు
ఎవరూ నన్నడక్కండి
మౌనంతోనే మాట్లాడుకుంటాను.
నాతో నేనే పోట్లాడు కుంటాను"

కుందుర్తి అచ్చమైన ఆధునిక కవి. ఆయన ఉపమానాలన్నీ ఆధునిక జీవితంలోంచే పుట్టు కొచ్చాయి "పేకాట్లో సెట్లాట" - ఒక్కడే కూర్చుని ఆడుకోవచ్చు. భార్యా విహీనమైన తన ఒంటరి జీవితాన్ని కవి ఈ ఒక్కడే ఆడే "సెట్లాట"తో పోలుస్తూ ఈ విధంగా అంటున్నాడు -

"మబ్బుల ముక్కలు కలిపి
ఆడుకుంటూ కూచుంటాను
ఒక్కడాడే సెట్లాట."

అలాగే నిష్కల్మషులైన పిల్లలు ఇతర్లతో సంబంధం లేకుండా రబ్బరు బూరతో ఆడుకోవడం, అన్నాలాట ఆడుకోవడం, పెండ్లాట ఆడుకోవడం కవికి నచ్చాయి. తాను కూడా జీవితం మీద విరక్తి చెంది వెనక్కి ప్రయాణం చేసి, బాల్యదశలోకి పోవాలని, ఏకాంతాన్ని వరించాలని అనుకుంటున్నాడు. బంధువులలో ఆయనకు "మంచి" కనబడ లేదు. (సంప్రదాయాన్ని గ్రుడ్డిగా అనుసరించే, స్వతంత్రమైన ఆలోచన్లు లేని బంధువుల్లో ఆయనకు మంచి కన బడలేదు.) ప్రశ్నలతో పలకరింపులతో కంటి చూపులతో వారు ఆయనను పరామర్శించడం ఇష్టపడడం లేదు. ఇకమీద తన ఒంటరి జీవితం. కంట్లో నలుసులా బాధిస్తుందని ఊహిస్తున్నాడు. నీటి ఈత రాకున్నా కన్నీటి ఈత వచ్చు గనుక కవి కాల ప్రవాహంలో పడి కొట్టుకు పోదామని నిశ్చయించుకున్నాడు. మరణ పర్యంతం సరదాగా ఉంటానంటున్నాడు మనుషుల కుచ్చితమైన మనస్సును కనిపెట్టాడు. అందువల్ల పిల్లలతో కలిసి ఆడుకుంటానంటున్నాడు.

మనిషికి ఆజన్మాంతం దుఃఖం నిత్యం అనీ, చావొక్కటే సత్యమనీ, రెప్పపాటు బ్రతుకోసం ఇంత రభస అనవసరమనీ, కవి తనకు తెలీదంటున్నాడు. ఈ తాత్త్విక స్థాయికి ఎదిగే మానసిక స్థితి విరక్తిలో ఉన్న తనకు లేదనని ధ్వనింపజేస్తున్నాడు -

"ఏడుస్తూ పుట్టిన మనిషికి నవ్వెక్కడుంటుందిలే
వాడి వాలిన కొమ్మకింకా పువ్వెక్కడుంటుందిలే"

కవి తన భార్యకు ఎంతో ఖరీదైన మందులు వాడాడు' ఆధునిక జీవితానికి అండగా ఉన్న ఆసుపత్రిలో చేర్పించాడు అయినా ఫలితం దక్కలేదు. మరణం కిరాతుని వంటిది. దాని బాణం దెబ్బకు ఎప్పుడు ఏ పక్షి పడుతుందో తెలీదు.

మృత్యువు, విధి వైపరీత్యం, కాలప్రభావం ఎవరికీ అర్థం కాని ఈ అంశాన్ని కవి "ఏమో నాకు తెలీదు" అని అనడంలో ధ్వనింపజేస్తూ కాల ప్రవాహానికి తలవొగ్గి జీవించడమే మానవుడు చేసే పని ఈ లోకంలో దుఃఖం శాశ్వతం , మానవ జీవతమూ శాశ్వతమే. అందువల్లనే కుందుర్తిగారు ఈ స్మృతి కావ్యాన్ని ముగిస్తూ ఇలా అంటున్నారు.

"ఏమో నాకు తెలేదు
నన్నెవ్వరూ కదిలించొద్దు
ఏదో ఒక మొండిధైర్యం గుండెలో వుండే
శేషంగా మిగిలానేమో తెలేదు.
ఏదో ఒక కావ్యలోకపు వీధుల వెంట తిరుగుతూ
ఏడుస్తుంటానేమో తెలీదు.
ఇలానే యిలానే, యిలానే
చింతాజీవిగా
చిరంజీవిగా .....
ఏమో నాకు తెలేదు
నన్నెవ్వరూ ....
నన్నెవ్వరూ ....
నన్నెవ్వరూ ....

ఉపసంహారం : భార్య వియోగంతో బాధపడి కుందుర్తి ఈ స్మృతి గీతం వ్రాశారు కానీ సంసారం భార్యకు మాత్రమే పరిమితమైనది కాదు

మూలంగా కొడుకులు, కూతుళ్ళు, కోడళ్ళు, అల్లుళ్ళు, మనుమలు, మనవరాండ్రు, ఇలా వంశ వృక్షం విస్తరిస్తూ పోతుంది. ఈ పచ్చని చెట్టుకు మూలం భార్య. భార్య పోయినా సంతానంలో ఆమె ఛాయల్ని చూచుకోవచ్చు మరణం జీవితానికి పూర్ణవిరామం (Fullstop)కాదు అలా అయితే ఈ సృష్టి ఎప్పుడో ఆగిపోయి ఉండాలి. కుందుర్తి ఈ కావ్యంలో ఎక్కడా తన సంతాన ప్రసక్తిని ఆశావహంగా చేయక పోవడం ఒక లోపమేనని చెప్పాలి. సంతానాన్ని చూచి తాను కొంత ఓదార్పు చెందినట్లు చెప్పినట్లైతే శోకతప్తమైన తన సాంద్రమైన అనుభూతి (intense feeling) దెబ్బ తింటుందని కుందుర్తిగారు భావించారెమో తెలీదు.

కుందుర్తి శైలి మొదట్నుంచీ చాలా సరళంగా సాగేది. అలంకారాలు, ...లు, ధ్వనులు తన కిష్టంలేదని చాలాచోట్ల చెప్పుకున్నారాయన. కాని, అలంకారం, ధ్వని లేకుండా కవిత్వం ఉండనే ఉండదు. ఈ విషయాన్ని కుందుర్తి కూడా తర్వాతి కాలంలో గుర్తించారు. శుద్ధవచనం స్థాయికి దిగజారిపోతున్న తన కవిత్వాన్ని తరువాతి కాలంలో రసమయంచేసి పుటం పెట్టిన బంగారంగా తన కవితా శైలిని సంతరించుకున్నారు. ఈ గొప్ప పరిణామం "నాలోని నాదాలు" అనే కావ్యంతో ప్రారంభమై "హంస ఎగిరి పోయింది"తో పతాక స్థాయి నందుకుంది. దీనికి కారణం కవి మనస్సును కల్లోల పరచిన భార్యమరణ సంఘటనయే!

సమాజంలో ఉన్న దారిద్ర్యం, నిరుద్యోగం, అన్యాయం, అక్రమం, దుష్ట రాజకీయాలు, హింస, క్రౌర్యం, మొదలైన లోపాలకు కవి స్పందిస్తాడు. నిజమే! (కుందుర్తి కూడా వీటికి స్పందించారు) కాని, ఒక విధంగా చూస్తే ఇవన్నీ ఎరవు తెచ్చుకున్న అనుభూతులే. స్మృతిగీతాలు అటువంటివి కావు. వీటిలో అనుభూతి సాంద్రంగా ఉంటుంది. మిత్ర వియోగంతో వ్రాసిన స్మృతి గీతాలే ఉత్తమ కవితలుగా ఆవిర్భవించినప్పుడు, మిత్రుని కన్నా లోపలి వలయంలో ఉన్న భార్యా పుత్రాదుల వియోగం కవి గుండెల్ని చీల్చివేసి, "హంస ఎగిరిపోయింది" లాంటి మహోత్కృష్ట కావ్యాన్ని ప్రసాదిస్తుంది అనడంలో ఆశ్చర్యమేముంది?



# తుమ్మల సీతారామమూర్తి - జాతీయత

డా॥ తేళ్ల సత్యవతి

'తను పుట్టిన భూమి మీద, తరతరాల నుండి సాగిస్తున్న సత్సంప్రదాయాల మీద అవ్యాజమైన అభిమానం వుండి, ఒక పాలనా వ్యవస్థకనుగుణంగా మనుగడ సాగించే మానసిక స్థితి జాతీయత' అని హాన్స్‌కోన్ అభిప్రాయపడ్డారు ఒకే జాతికి చెందినవారు భిన్నభిన్న రాజ్యాలలో విడి పోకుండా అందరూ కలసి ఒకే రాజ్యంగా ఏర్పడాలనేది జాతీయ సిద్ధాంతం తమజాతి భవిష్యత్తు తమ చేతిలోనే ఉండాలని కోరుకుంటారు తమ ప్రజల జీవన విధానానికి, స్వేచ్ఛకు ఆటంకం ఉండకూడదని ఆధ్యేయ సాధనకు ఏజాతి కృషి చేస్తుందో ఆజాతి తమ జాతీయత కొరకు పాటు పడుతున్నదని చెప వచ్చు హిందూ దేశం లోని ప్రజలు ఏయే మతాలలో పుట్టినా, ఏయే జా. లలో పుట్టినా వందేమాతరం అంటూ దేశాభిమానాన్ని ప్రకటించడానికి ఏకమౌతారు జాతీయ భావానికి మనసు ప్రధానం గాని మతమూ, భాష కాదు. ప్రాచీన కాలంలో భిన్నభిన్న కాలాలలో భిన్న భిన్న ప్రదేశాలను (రాజ్యాలను) అనేక రాజ వంశాలు పాలించినందు వలన 'మా భారతదేశం' అనే అభిప్రాయం కొరవడింది ఆధునిక కాలంలో (ఆంగ్లేయ ప్రభావంతో) ఈ భావం ఏర్పడింది.

"జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ" అన్నారు ప్రాజ్ఞులు అనేక కష్టనష్టాల కోర్చి తనను పెంచి పెద్ద చేసిన తల్లిని గాని, తాను పుట్టి పెరిగిన జన్మభూమిని గాని ప్రేమించని మానవుడు ఈ జగత్తులో లేడు. జనని, జన్మభూములతో తనకు గల అనుబంధాన్ని పవిత్రంగాను, విలువ కట్టలేనిది గాను, నిరుపమానమైనది గాను ఎంత దుర్మార్గుడైనా అంగీకరిస్తాడు. అనేక సాహస ఔదార్యాలను ప్రదర్శించి మాతృదేశాన్ని శతృదేశాల బారినుండి రక్షించిన మహాత్ములు అన్ని కాలాల లోను అన్ని దేశాల లోను ఉన్నారు మాతృదేశం కోసం తమ సర్వస్వాన్ని అర్పించిన త్యాగమూర్తుల గాధలు తెలుగు సాహిత్యంలో పాటలు, పద్యాలు, కథలు, గాధలు, కావ్యాల రూపంలో లిఖించబడ్డాయి సాహిత్యంలో సామాజిక చైతన్యం ప్రతిఫలిస్తుంది. సమాజాన్నుండి ప్రేరణ పొంది జాతీయతను పెంపొందింప జేయడంకోసం

పాటు పడిన కవులు దేశ కాల ప్రభావంతో తమ వంతు దేశాభిమానాన్ని ప్రకటిస్తూ స్వజాతిలోని తరతమ భేదాలను పోగొట్టడం కోసం, కులమత భేదాలను రూపు మాపడం కోసం కృషి చేశారు.

మాతృ దేశాభిమానాన్ని ఎల్లలు లేని విధంగా తన రచనల్లో చూపించిన జాతీయ కవి తుమ్మల సీతారామమూర్తి చౌదరి "తెలుగు దేశము, తెలుగు భాష, తెలుగు చరిత్ర, తెలుగు ప్రజ, తెలుగు సంస్కృతి అనినంతనే నా యొడలు పులకరించును ఇవి నాకు "ప్రాణ కల్ప విషయము" లని చాటి చెప్పిన మహా మనీషి తుమ్మల. అసహాయోద్యమం లోను, పన్నుల నిరాకరణోద్యమం లోను పాల్గొని జరిమానా, శిక్షలు పొందారు అవధాని, ఆశుకవి అయిన తుమ్మల - ఆత్మార్పణ, రాష్ట్రగానము, పఱిగ పంట, అమరజ్యోతి, ఆత్మ కథ, తపస్సిద్ధి, ఉదయ గానము, శబల, సర్వోదయ గానము, తెనుగు నీతి, గీతాదర్శము, నేను, పైరపంట, సమదర్శి, మహాత్మకథ, నా కథలు, ఎక్కట్లు, హనుమాన్ చాలీసా, గాంధీ గానము మొదలైన రసవత్కావ్యాలను రచించి కనకాభిషేక, గజారోహణ, గండపెండేరాది అనేక సన్మానాలు పొందారు

తుమ్మల సీతారామ మూర్తి గారు జాతీయ కవి, దేశికవి, గాంధీ కవిగా ప్రసిద్ధి చెందారు రైతు కుటుంబంలో జన్మించి యువ హాలికుడుగా పేరుపొంది కండబలం, గుండెబలం, ప్రదర్శించిన రైతన్న గాంధీగారి అడుగు జాడలలో జాతిని నడిపించాలన్న ధ్యేయంతో వీరి స్వగ్రామమైన కావూరులో నిర్మింపబడిన వినయాశ్రమం వీరి జాతీయ భావాలకు కొంత దోహదం చేసింది గాంధీగారి ఉప్పు సత్యాగ్రహ ప్రభావం వీరిమీద ఉంది. ఎంతోమంది కవివరేణ్యులు తమ కవిత్వంలో జాతీయ భావాలను ప్రదర్శించినా తుమ్మల వారిలా మాట, బాట, కట్టు, బొట్టు, కవితల్లో అణువణువునా నిండిపోయిన జాతీయ భావాన్ని ప్రదర్శించి అదే జీవిత ధ్యేయంగా పెట్టుకున్నవారు అరుదు

రాష్ట్రోద్యమ సమరంలో పాల్గొని కమ్మని కవితల ద్వారా రాష్ట్ర ప్రజలకు దేశభక్తి ప్రబోధించిన అభినవ తిక్కన ఈ కవి. నేను తెలుగు వాడననే అహంకారం నాకు ఎక్కువ అని చెప్పుకొన్న తుమ్మల నాజాతి, నాభాష పర తంత్రాలై పోయి పరకీయ సంస్కారాన్నాశ్రయించి ప్రాచీన గౌరవాన్ని కోల్పోయాయని వాపోయారు. ఈ ఆరాటం అతని కవిత్వంలో అణువణువునా చోటు చేసుకొని పాఠకులను స్పందింప జేస్తుంది. తన రచనల ద్వారా ఇతరులను స్పందింపజేసి దేశభక్తికి పురికొల్పిన ఈ కవి ధన్యుడు. రాష్ట్రం

కోసం 'రాష్ట్రగానం' చేశాడు. రాష్ట్రం వచ్చాక 'ఉదయ గానం' చేశాడు. దేవుడంటే మాతృదేశమట. దేవతలే ప్రజలట. యజ్ఞదీక్ష సేవావ్రతనిష్ఠ యట. వీనిని జీవసూత్రాలుగా గ్రహించి ప్రసిద్ధి చెందమన్నారు.

"నీ కొఱకుఁగాక జాతి
శ్రీకొఱకే డస్సి డస్సి జీవింపు మయా !
నీ కీర్తి విరియు వెన్నెల
ప్రాఁకి దెసల్ - కొసలు చివురు పట్టి రహింపన్"

జాతి శ్రీ కోసం డస్సి డస్సి జీవించ మనడం వీరిమాతృదేశ భక్తికి తార్కాణం.

ఆంధ్ర రాష్ట్రోద్యమ సమయంలో ప్రత్యేక సీమగా కావాలని రాయలసీమ వారు కోరిన కోరికను నిరసించి తన ఆవేదన వ్యక్తం చేశారు "లుకలుకలైరి నేఁటికి ఁదెలుగులు, పొంగిన మచ్చరాలతో దెకతెక లైరి" అని ఆవేదన పడి వారంతా కలసి మెలసి జీవించాలని కాంక్షించారు. విశాలాంధ్ర కోసం తపించి పోయారు. "తనజాతిన్ దన పల్కును దన సంస్కృతినుద్ధరించు తగులము వలయున్" అని కోరుకున్నారు. తనవలె తెలుగు ప్రజలంతా తెలుగు తల్లికి వాసి చేకూర్చాలని ప్రబోధం చేశారు. ఆంధ్రుడిగా జన్మించి, ఆంధ్రత్వాన్ననుభవించి, ఆంధ్రుడి గానే మరణించాలనీ, ఆంధ్రత్వము లేని బ్రతుకునాశించవద్దని రాష్ట్రాభిమానంతో ఎలుగెత్తిచాటిన తుమ్మల వారే జాతీయాభిమానంతో -

"మనకాంధ్రత్వము ప్రాణము,
తనువు సుమీ భారతీయ ధర్మము, యావ
న్మనుజాభ్యుదయ ప్రణవత
మనుజా ! విను వజ్రకవచమై దిటవొసగున్"

అంటూ తన సర్వస్వాన్ని విశ్వశ్రేయస్సు కోసం సమర్పించుకొన్న మహామనీషి. దేశభాషతో పాటు జాతీయభాష, ఆంధ్రత్వం తోపాటు భారతీయత్వం కలగలుపు కొంటె సర్వతోముఖాభివృద్ధి కలుగు తుందని చాటి చెప్పారు.

మాతృదేశం అన్యులచేత జిక్కి. స్వాతంత్ర్యాన్ని కోల్పోయి తన జాతీయతను బాసి, నీచ దాస్యంలో మునిగి దారిద్ర్యంతో దిక్కులేక శోకిస్తున్నప్పుడు ఆమె మొరనాలకించి కొంచెమైనా ఆమెకు తోడ్పడలేని బిడ్డ బ్రతుకు ఎందుకు? ధాత్రికి బరువుచేటు అని ఉప్పు సత్యాగ్రహ

సమయంలో అన్నారు. శత్రువులను చీల్చి చెండాడిన అభిమన్యుడు ఏ తల్లి అంకమందు ఎక్కాడో, చిచ్చర పిడుగైన బాల చంద్రుడు ఏ తల్లి జోలపాట మెచ్చాడో, శత్రువుల గుండెల్లో గాలమైన శివాజి ఏ జననిని కొల్చాడో, జగదేకవీర ప్రశస్త తేజో రాశి జవహర్ ఏ తల్లిపాలు తాగాడో ఆ మహాసాధ్వి, సకలలోకైక జనని భారతమాత నేడు దాస్యంతో మగ్గిపోతూ చింతతో విలపిస్తుంటే నీవు ఉపేక్షిస్తావా విద్యార్థీ! అన్నలకు మెచ్చుతేబోకు మని విద్యార్థి లోకాన్ని హెచ్చరించాడు మాతల్లి విపత్తు మాన్పి పరితాపాలార్పి దురంత దాస్యపు వేళ్లను పెకల్చి లోకంలో వీరులుగా తలెత్తడానికి మాసర్వసుఖాలు, సిరులు, తనువులు తృణాలని "పట్టాభిషేకం" లో పేర్కొన్నారు. భరత మాతను వర్ణిస్తూ చతుర్వేద ఋక్కులను వెన్నతోనే పంచిపెట్టిందనీ, రాళ్లు విత్తితే వరాల గుత్తులు పండే అవని అనీ, సంపదలకు పాత్రమైన తటినులు పూదండలుగా భారత మాతకున్నాయనీ, మూడు సంద్రాలు, నగరాజు మోకరించి ఈ మహాశక్తిని, ఎల్లదిక్కులను అర్చిస్తారని స్తుతించారు.

పండితుల కోసం కాకుండా పామరులకోసం, వారికి అర్థమవడం కోసం సులభ శైలిలో తెలుగుదనాన్ని మూర్తీభవింప జేసిన రచన తుమ్మలది. గాంధీగారి జీవిత చరిత్రను వీరు రచించారు గాంధీజి బోసినవ్వుల ముత్యాల పంటలు ప్రజా హృదయ దారిద్ర్యాన్ని పోగొడతాయని, తన చూపు జిగి రసాతల తమః కూపంలోని జంతు కోటికి తెలివి సంశరింప జేస్తుందని, తన పలుకులు ఉపనిషత్సార నిష్యందులై సమతా మనోజ్ఞ సస్యాన్ని పెంచుతాయనీ, తన బాటయైన సత్యాహింసలు తరుచ్ఛాయలై పాంధుల శ్రమ పోగొడతాయని పేర్కొంటూ ఇలాంటి భారతం కావాలని కాంక్షించారు. గాంధేయ వాదియైన పొట్టి శ్రీరాములు త్యాగ ఫలంగా సంక్రమించిన ఆంధ్ర రాష్ట్రం సత్యదీక్షను కవచంగా, అహింసను అస్త్రంగా, చీకు చింత లేని క్రాంతిని గమ్యంగా పెట్టుకొని గాంధేయ పథంలో నడిచి అఖండజయాన్ని చేకూర్చాలని కోరారు. ఖద్దరు ధరించడం, సత్యాహింసలు, దేశభక్తి, ఇంద్రియ నిగ్రహం మొదలైన గాంధీగారి లక్షణాలన్నీ ఆచరణలో మూర్తీభవింప జేసిన తెలుగు దనాన్ని చక్కగా తీర్చి దిద్దారు.

అలనాటి కులమత భేదాలు ఈనాడు సమాజంలో చోటు చేసుకోవడం మంచిది కాదనీ, వాటిని త్వరగా రూపుమాపకపోతే అవి బెడిసి కొడతాయనీ తుమ్మల అన్నారు. ప్రస్తుత సమాజంలో కులమత భేదాలు మందులేని వ్యాధిగాను, దొంగతనం, దొరతనం, పేదతనం మహామారిలాగా సంఘాన్ని

పట్టి పీడిస్తున్నాయని వారు వాపోయారు. బాల చంద్రుడు ఆడుతున్న పైడి బొంగరం ఒక వైశ్యాంగనకు తగలగా ఆమె కోపించింది ఆమె మాటలు విన్న బాల చంద్రుడు పౌరుషంతో ఇలా అన్నాడు "నిరుపమ విక్రమ క్రములు, అనింద్యులు, అఖండ యశోనిధులని ప్రసిద్ధి చెందిన వీర శేఖరులు పలనాటి వారు అలాంటి వారిలో ఒకడినై పుట్టి కత్తి చేతపట్టి యుద్ధభూమిలో కాకుండా ఇక్కడ నిలబడితే కాంతలు నవ్వడంలో వింత ఏముంది?" అని మాతృ దేశ రక్షణ కోసం నిద్రాణమైన యువశక్తికి పలికిన మేలు కొలుపే ఈ సందేశం ఈ యుద్ధంలో దేశ దాస్యాన్ని తెంచడానికి వెలమలు, కమ్మ వీరులు, విప్ర కుమారులు, రెడ్డి యోధులు, తెలగలు కరవాల హస్తులయి సంగ్రామంలో పాల్గొన్నారని, కులభేదం పాటించని జాతీయత ప్రదర్శించారని తుమ్మల అన్నారు. అంటరాని తనాన్నిగురించి వివరిస్తూ 'ఆత్మవత్సర్వభూతాని' అనే ధర్మ సూత్రంలో గల మర్మం తెలియదా? పెడదారి పడతారెందుకు? మనం మన వారిని ఇలా అవమాన పరచి గట్టి బానిసపు తాళ్లతో కట్టి వేయడం న్యాయమా?, అని భారత పుత్రులను వీరు ప్రశ్నించారు. మాలలనంట రాదు కసుమాలపుజాతియంటూ వారిని బహిష్కరించి, దక్షిణాఫ్రికా దురాత్ములు హిందువులను నీచులుగా పరిగణిస్తున్నారని విచారిస్తావెందుకు సోదరా? అంటూ అంటారనితనాన్ని పాటించే వారిని నిలదీశారు. నూఱు మతాలు, ఐదువందల కులాలు, వేయి తెగలు, రెండువేల నడతలు, ఐదువేల బానిసలు, ఆరువేల వేసాలు లేని పండుగ కావాలని, జాతి కుల మత విచక్షణ లేని స్వతంత్ర భారతం కావాలంటే 'నేను విడచి మనము'పై నిచ్చ నిడనిచో దేశమెక్కిరాదు లేశమేని' అన్నారు. నేను అనే భావాన్ని వదలి మనం అనే భావం పెంపొందించాలని సర్వోదయ గానంలో తుమ్మల పేర్కొన్నారు.

"పొగలపెల్లున సెగలు పెంపున
యుగయుగమ్ములు పెరిగి పేరిన
పగలు మానిపి హిందు ముస్లిం
బాటదిద్దితివా"

అని హిందూ ముస్లిం ఐక్యతకోసం కృషిచేసిన 'నేతాజి' లోని సర్వమానవ సమానత్వాన్ని చూపారు

స్వార్థం, తలబిరుసు, ఈర్ష్య, దురభిమానం, కుట్ర రాజ్యమేలుతున్న కాలంలో ప్రేమ, వినయం, పాపభీతి, మర్యాద మొదలైన సద్గుణాలు పలాయన మంత్రం పఠిస్తాయే తప్ప ఎంత మంది మహాత్ములైన ఈ మూకను మార్చలేరని

జాతిలోని నీతి లేని మూకను గురించి తుమ్మల బాధపడ్డారు. జాతి జనులు నీతిని మరిచిపోకూడదని వీరి అభిప్రాయం నీతి నియమాలు తప్పితే జాతి వినాశం తప్పదని వీరి హెచ్చరిక

తెలుగుదనాన్ని మూర్తీభవింపజేసే పండుగలను వర్ణించడం మరచి పోలేదు. వ్యవసాయమే ప్రధాన వృత్తిగా గల ఆంధ్రులకు ముఖ్యమైన పండుగ సంక్రాంతి. ఈ సంక్రాంతి వేడుకలలో కూడా జాతి పౌరుష పరాక్రమాలను, జాతీయతను నింపడం తుమ్మల మరచి పోలేదు కోడి పందాలలో జాతి శౌర్యాన్ని, రంగ వల్లికలలో తెలుగు స్త్రీల కళాధీన బుద్ధిని, గొబ్బి సంబరాలలో ఆంధ్రుల ధర్మభిక్షను, రుచిర పాయసాన్నాలతో, లేత జంటల తొలి వలపులతో తెలుగు దనాన్ని మూర్తీభవింప జేశారు. సంక్రాంతి పంటలు, వంటలు, గాంధీస్తుతి, సంఘంలోని ఈర్ష్య, అసూయలు, దురాచారాలు మొదలైన విషయాలను గూర్చి ఇద్దరు వ్యవసాయదారులు ముచ్చటించు కోవడం 'సంక్రాంతి ముచ్చటలు' లో కన్పిస్తుంది ఆర్థిక బలమే కాదు, నైతిక బలం కూడ తుమ్మల కావాలన్నారు "నీతి నియమాలు దిగ జాఱె జాతిలోనఁ బొలము పండినఁ జాలునా? బుద్ధికూడఁబండ వలయు ఁగదా?" అన్నారు గడియారపు నడక ననుసరించి జీవించే ఉద్యోగ జీవితాన్ని అసహ్యించు కొన్నారు.

స్వధర్మమైన సేద్యాన్ని మాని ఉద్యోగం చేయడానికి వెళ్లినందుకు తుమ్మల బాధ పడ్డారు. ఉద్యోగ నిర్వహణ సంతృప్తిగా లేనందుకు కారణాలు చెప్పాడు వరశుల్కపు చదువువారు విద్యార్థులట. విద్యార్థులను పరీక్షలో గట్టెంకించడమే ప్రథమ లక్ష్యంగా కన్పిస్తున్నదట. సంతృప్తి సున్న గనుక ఉద్యోగం కన్నా రైతుగా శ్రమ పడుతూ తాను పండించే పంటను ఇతరులకు కొంత పంచి పెడుతూ సంతృప్తి పడటమే మిన్నయని "సంక్రాంతి తలపులు" లో భావించారు బిచ్చగాడు లేని, ముచ్చు లేని, కటారి లేని, దొర తనమ్ము లేని, కుట్ర లేని, నీరసమ్ములేని, దేశావధి లేని పండుగ కావాలని తుమ్మల ఆశించారు. మేడ ప్రక్కన గుడిసె, మేలిమి బంగారు పట్టు వస్త్రం ప్రక్కన పాతగోచి, తనివి చెంత ఇంత తరుగని కన్నీరు లేని పండుగ జరగాలన్నారు. ప్రజలందరి హృదయాలలో ప్రేమ ప్రవాహం పొర్లగల కొత్త సంక్రాంతి కావాలని వీరు కాంక్షించారు.

కోవెలలో, గంగానది రేవులలో, రామకోటి రేఖలలో భగవంతుడు లేడనీ, ఎవని హృదయం కరుణకు ఆలవాలమో అతని యందే హరి నివసిస్తాడని మానవుడే మాధవుడనే భావాన్ని తుమ్మల ప్రదర్శించారు దేశభక్తునిలోను, దీనునిలోను, చెమటోడ్చి బ్రతికే జీవిలోను, కరుణ, సత్యము కలవానిలో వాసు దేవుణ్ణి చూసేవాడే సుకవి అని సుకవి లక్షణాలు పేర్కొన్నారు

తెలుగు జెండాకెదురు లేదని, తెలుగు నాటికి సాటిలేదని, తెలుగు రక్తము పొంగి పొరలేటట్లు నిలిచి పలుకమని తుమ్మల ప్రబోధం చేశారు భారతీయుడ నేను అని పల్కరించు మనుజుడున్నంత వరకు మాసిపోని కీర్తి గల శూరులని "శబల"లో పలికారు ఆంధ్ర సోదరులు చావునకు భయ పడరని, నీచులకు మొక్కరనీ చిక్కరనీ, విశిష్ట యశోభిరతులని, జీవాన్ని, ధనాన్ని స్వతంత్రతా సేవకే ధార పోస్తారని మెచ్చుకున్నారు తెలుగు కాంత కూడ యుద్ధ రంగంలో వెను తిరిగి వచ్చిన భర్త మనసు గాయం చేసి పౌరుషం తెచ్చి రణ రంగానికి సాగనంపుతుందని గర్వంగా తుమ్మల చాటిచెప్పారు. బెబ్బులికి అబ్బయైన తెలుగు బిడ్డ మగటిమి బొబ్బిలి కోటలోనుబికి పొంగి పరాసుల ముంచి తబ్బిబ్బొనరించి శత్రువుల పొగడ్తలనందుకున్నదని కవి గర్వపడ్డారు.

మహాత్ముని ఆస్థానకవి, అభినవ తిక్కన వంటి ప్రశంసలు, బాలకవి, అవధాన పండిత, సరస కవిశేఖర, జాతీయ కవిబ్రహ్మ, విద్వత్కవి సమ్రాట్టు మొదలైన బిరుదులు తోసిపుచ్చి 'తెనుగులెంక'గా ప్రకటించుకొని తుమ్మల సంతృప్తి చెందారు. 'లెంక' అంటే సేవకుడు తుమ్మల తెలుగు భాషకు, తెలుగు తల్లికి, తెలుగు సంస్కృతికి సేవకుడు. కులమతాలు పెంచే కుళ్ళులేని, మత పిశాచాల మనుగడలేని, ధనవంతులు దరిద్రులనే భేద ఛాయలేని, పరుల కూటికి మూగు బదనికలు లేని, విద్యావిహీనుల్లేని జీవత్సమాజం సృష్టింపబడిన స్వతంత్ర భారతం కావాలని తుమ్మల కాంక్షించారు.

**"జాతి యొకటె లక్ష్యమొకటె**
**నేత యొకటె దేశమునకని"**

నేతాజి ఖండ కావ్యంలో చాటి చెప్పారు. ఎంత జాతీయ కవియైనా, అంతర్జాతీయ కవియైనా ఇంతకన్నా ప్రజలకు ఎక్కువ జాతీయతను ఎలా ప్రదర్శించగలరు?



# స్త్రీ సంప్రదాయ శృంఖల ఛేదనం - 'సహజ'

డా॥ కొలకలూరి మధుజ్యోతి

అత్యాధునిక కాలంలో తీవ్ర ఉద్యమ స్థాయిలో సాగుతున్న స్త్రీ వాద సామాజిక అవసరాన్ని నొక్కి చెప్తున్న సాహిత్యం సామాజికావసరాలకు దర్పణం అన్నది అక్షర సత్యం. సమాజం సంతరించుకోవలసిన మార్పును, అభివృద్ధిని సమకాలీన రచనలు ప్రతిబింబిస్తాయి. మనిషిలో ఏయే అంశాలు మారాలో అవి సమాజానికి ఏ రకంగా అవసరమో ఈ రచనలు సూచించటమే కాదు, ఏ విధంగా మార్పు ఉండాలో కూడా తమ పరిధిలో తాము నిర్దేశిస్తాయి. సమాజం దేన్ని మార్చుకోవాలన్నది సాహిత్యం సూచిస్తుంది. సమాజ వేదనను తొలగించే మార్గాన్నికూడా అది స్ఫురింపజేస్తుంది.

స్త్రీవాదం దానికి భిన్నం కాదు. దీనికి స్త్రీ అస్తిత్వాన్వేషణ ప్రధాన లక్ష్యం. సామాజికంగా కుటుంబ పరంగా స్త్రీలపై అణచివేత ఉంది. స్త్రీ పురుషుల అసమానత ఉంది. అనాగరికమైన హింస, దోపిడి ఉన్నాయి. స్త్రీల స్వాతంత్ర్యంపై నియంత్రణ ఉంది. ఆలోచనలపై, భావాలపై తరతరాలు రుద్దుతూ వస్తున్న కూపస్థ మండూక తత్త్వం ఉంది. వ్యక్తిత్వం ఎదగనీయని వికసించనీయని సామూహిక ప్రయత్నముంది. ఇన్నింటి మధ్య స్త్రీ ఒక వస్తువుగా నిల్చిందే కాని ప్రాణమున్న మనిషిగా కనిపించలేదు సమాజానికి. గుర్తింపు పొందలేదు. ఈ అన్నింటిని వ్యతిరేకిస్తూ తనను తాను గుర్తు చేసుకోవటానికి, గుర్తింప చేసుకోవటానికి సమాజంలో భాగం కావటానికి స్త్రీవర్గం చేస్తున్న సాహిత్య పోరాటమే స్త్రీవాదం. స్త్రీవాద దృక్పథంతో వస్తున్నదే స్త్రీవాద సాహిత్యం.

కవిత్వం కథానిక నవలా ప్రక్రియలలో స్త్రీవాదం బాగా వెలువడుతూ ఉంది. స్త్రీవాద ప్రచారానికి పూనుకొన్న ఓల్గా - కవిత్వం, కథానికలు బాగా వెలువరించింది. ఈమె రాసిన 'సహజ' నవల స్త్రీవాదాన్ని బాగా రూపు కట్టిస్తుంది. భావ నైశిత్యం,తీవ్రత స్పష్టత ఈమె రచనలకున్న మేలి గుణం. సాధారణ ఆలోచనను కొత్త కోణంలో చూపించడమే కాదు, ఎవరూ గుర్తించని మానవ మనస్తత్త్వ కోణాన్ని చూపించి, ఆలోచింప చేయటం ఈమె ప్రత్యేకత. ఈ గుణం ఈమె కథానికల్లోనూ నవలల్లోనూ సుస్పష్టం.

'సహజ'- కథ కోసం కాదు. తాను నమ్మిన సిద్ధాంతాల వ్యక్తీకరణకు రూపకల్పన సామాజిక నిర్మాణంలో మూడు విభిన్న మనస్తత్వాలు పాత్రలను గ్రహించి ఒక స్త్రీవాది సమాజాన్ని సంస్కరించే ప్రయత్నం ఈ రచనలో కనిపిస్తుంది ఇది స్త్రీవాదం పోరాడుతున్న సామాజిక లక్షణాల కోసం సృష్టించిన పాత్రల చుట్టూ అల్లుకొన్న కథ

చదువులయిన పిమ్మట 'సహజ' ఉద్యోగరీత్యా వేరై, ఐదేళ్ళ తర్వాత తన నేస్తాలను కలుసుకొనే ప్రయత్నంతో కథ ఆరంభమవుతుంది తన నేస్తాల వల్ల చదువుకొనే రోజుల్లో సంగీత, సాహిత్య, చిత్రలేఖన కళల పట్ల అభిరుచిని పెంచుకొంది నలుగురూ తమ ఇష్టం - పిచ్చి - వెర్రి అభిమానం అన్నింటిని కలిసి పెంచుకొన్నారు. పంచుకొన్నారు తనకు లేని ఇష్టాలను సహవాసం వల్ల తనలో లీనం చేసుకొన్న సహజ ఐదేళ్ళ తర్వాత ఆ ఇష్టాల పిచ్చి నేస్తాలను చూసి చెప్పలేని విస్మయం చెందింది ఇంతమార్పుకూ వివాహం ఒక్కటే కారణం ఎలా అయిందో తెలుసుకొని తల్లడిల్లింది మార్చాలని, జాగృతం చేయాలని యత్నించింది. స్థూలంగా ఇదీ కథ దీన్ని అందించటంలో సందర్భానుసారంగా విభిన్న సమస్యలను చొప్పించటంలో, వైవాహిక బంధాల మాటున దాగిన అమానుష అకృత్యాలను చాటటంలో కృతకృత్య అయింది రచయిత్రి

దాంపత్యం ఇద్దరి మధ్య స్నేహంలా ఉండాలే కాని, ఎక్కువ తక్కువలు ఉండకూడదని, పొరపొచ్చాలు లేకుండా, పురుషాధిక్యం లేకుండా సంపాదన పరులిరువురు కలిసి జీవించటం అందమైన కల అని నమ్మి, తాను కోరుకొన్న, తనకు తగిన వాడిగా ప్రసాద్‌ని ఎంచి వివాహం చేసుకొంది సహజ సంపాదనలోనే కాదు, ఇంట్లో శ్రమనూ విభజించుకొన్నారు. అదో ఒప్పందం గానో, ఆదర్శ ప్రదర్శనంగానో కాక ప్రేమపూర్వకంగా ఉండటం సహజ ప్రసాద్ దంపతులలో ఉంది.

సంప్రదాయానికీ పురుషాధిక్యానికీ ప్రతీకలు శారదా రామారావులు. రామారావుకు ఇష్టం లేనిది ఆ ఇంట్లో జరగటానికి వీల్లేదు. భార్య కుక్కిన పేనులా పడి ఉండాలి ఇష్టాన్ని ప్రదర్శించ కూడదు దీంతో శారద పెయింటింగ్ పట్ల ఉన్న ఆసక్తిని చంపుకొంది సంసార విచ్ఛిత్తి భీతితో ఆ ఆలోచననూ దరిచేర నివ్వదు ఈ కారణంగా శారద సంసారంలో ఎంత అవమానమైనా భరించింది. స్ప్రింగ్‌ని ఎంత అణచినా చేయి తీయగానే

రెండింతలు పైకెగసి పడుతుంది నేస్తాలిచ్చిన ధైర్యం వల్ల శారదలో భయం పోయింది. దేన్నీ లెక్క చేయకుండా వివాహ బంధం నుంచి బయటపడింది

సనాతన ధర్మం - భర్త ఎటువంటి వాడైనా కలిసి ఉండాలని బోధిస్తుంది వ్యక్తిత్వం వికసించి అభీష్టాలు స్పష్టంగా తెలిసిన వ్యక్తి, ఒక మనిషికి ఒక మనిషి అనే నైతిక సూత్రం పాటిస్తూ జీవిస్తున్న సమాజంలో తన ఉనికి అవహేళనకు గురైతే భరించటం కష్టం. ఉనికిని కాపాడుకోవటానికి చేసే ప్రయత్నంలో ప్రాచీనతను కాలదన్నే స్థితి నీతియుక్తమే అదే జరిగింది ఉష విషయంలో. ఉష సాహిత్యాభిమాని. భర్త శేషగిరికి సినిమాలే లోకం. ఇష్టాలు ముడిపడ లేదు. కలవని అభీష్టాలతో ఉష వైవాహిక బంధంతో రాజీపడి జీవితం నడుపుతున్నా, తృప్తిపడని శేషగిరి తన ఇష్టాలకు సరిపడిన మరొకరిని వెతుక్కొని వివాహం చేసుకొన్నాడు అతను తిరిగి వస్తాడేమోనని ఎదురు చూడమన్న కుటుంబాన్ని ఎదిర్చి, సమాజం తననే నిందలు వేసి తప్పు పట్టినా సరే, అతని నుంచి విడాకులు పొంది ఆత్మాభిమానం నిలుపుకొంది ఉష.

సంగీతం అంటే వెర్రి అభిమానం ఉన్న రమ వివాహం అయ్యాక ఆ ఇష్టం ఏం చేసిందో సహజకు తెలియలేదు. ఒకప్పుడు ప్రాణం కంటే మించి ఇష్టపడ్డ పాటలపిచ్చి ఇప్పుడు ఒక పిల్లాట ఇప్పుడు రమకు ఆయన, పిల్లలు, సంసారం, ఫర్నిచర్, పిల్లల చదువులు, డాంబికాలు, భేషజాలు - ఇవే ప్రపంచం. వివాహం స్త్రీని ఇంతగా మారుస్తుందా? ఒక మనిషిలో ఇంకో మనిషి పరకాయ ప్రవేశం చేసినట్టు కనిపిస్తున్న రమలో మార్పు తేవాలని కదిపిన సహజ, రమ ఆగకుండా వాదించిన తీరుకు దిమ్మెర పోయింది సమాధానం చెప్పలేని స్థితిలో పడింది. రమకు సహజ మాటలు, చేష్టలు అన్నీ పిల్లతనంగానే కనిపించాయి వీరి సంభాషణ రెండు విభిన్న శక్తుల ఘర్షణగా కనిపించింది. రమ వాగ్ధాటికి, మూర్ఖత్వానికి, తన అస్తిత్వం తన కుటుంబమే అనుకొనే ధోరణికి సహజ చీకాకుపడి మళ్ళీ మార్చే ప్రయత్నానికి పూనుకోలేదు. మనిషిలో బాగుపడాలనే తపన లేకపోతే మారాలనే కోరిక రాకపోతే ఏమి చేయాలన్నా అసాధ్యమే అవుతుంది

సహజ సంపూర్ణంగా అభ్యుదయాన్ని పొంది, అందరికీ చేయి అందించే పాత్ర. ఉషది మంచీ చెడూ తెలిసిన తత్త్వం అవసరమైనప్పుడు ఏనిర్ణయం తీసుకోవటానికి వెనుకాడ లేదు శారద సమాజానికి, కుటుంబానికి వెరచే

ఎంతో ధైర్యం కల్పించిన పిమ్మటే తనకు జరుగుతున్న అవమానాల నుంచి, ఇంటి నుంచి బయట పడగలిగింది. ఉష, శారదల్లో ఉన్న గుంజాటన వారి ముందడుగుకు దోహదమయింది. రమలో ఇదిలేదు.

పసివాడితో పెద్దవాళ్ళ పరుగుపందెం రాణించదు. అంగవైకల్యం కలిగిన వ్యక్తితో సర్వాంగాలు సక్రమంగా ఉన్న మనిషి పోటి అసమంజసం వారి వారి శక్తులు వేరవుతాయి ఏ స్థాయి వారిని ఆ స్థాయిలో చూసి పరిస్థితి బేరీజు వేసి చర్య చేపట్టాలి. అందరిని ఒకే గాటికి కట్టి సమస్యను చూడకూడదు ఉష, శారదలు అవగాహన ఉన్నవారు, మార్పు గ్రహించారు. కాని రమ అలా కాదు. రమ లాంటి వారు ఉష, శారద లాంటి వారితో పోలిస్తే ఎక్కువ. తామేంటో తెలియకుండా, తెలుసుకోకుండా సాగిపోయే స్త్రీలు చాలామంది తమది కాని అబద్ధపు బ్రతుకులో ఉన్నామని వారికి తెలియదు అది వారికి తెలియాలి. వీరందరినీ జాగృతం చేయాలి. అందుకు సహజలాంటి వాళ్ళు పూనుకోవాలి. కేవలం ఉష, శారద వంటి వారే కాదు, రమ లాంటి వాళ్ళూ భాగమయినప్పుడే ఉద్యమం అందరికీ చేరువయినట్లు. ఉష, శారదలకు ఇచ్చినట్టు మానసిక స్థైర్యం ఇవ్వటమే కాదు, రమ లాంటి వాళ్ళకు మానసిక చైతన్యం కలిగించటమూ ఉద్యమ లక్ష్యమే రమ పాత్ర చిత్రణ వల్ల వ్యవస్థలో కూరుకొని వేళ్ళూనుకొన్న సమస్యను సందర్శించినట్టు అయింది. సమస్యను చూపడమే కాక, పరిష్కారం చూపే ప్రయత్నం కూడా జరిగి ఉంటే మరింత సమర్థనీయంగా ఉండేది.

స్త్రీ సమస్యను ఒక్క సాంఘిక రంగానికే పరిమితం చేయకుండా దానికి సంబంధించిన అన్ని పార్శ్వాలనూ దర్శించటం, ఆర్థిక రాజకీయ అవగాహన కలిగి ఉండటం సహజలో కనిపిస్తుంది. రచయిత్రిలో, తనకు ఉన్న మార్క్సిస్టు నేపథ్యం నుంచి సమస్యను జీర్ణించుకొని, ఆకళింపు చేసుకొని, ఆర్థిక కోణాన్ని రాజకీయ పరిణామాలతో కలిపి దర్శించి ప్రదర్శించి అంగీకరింపచేసే గుణం ఉంది.

ఇంతటి విశాల దృక్పథంతో ప్రతిపాదించిన నూతన భావాలు 'సహజ'లో స్పష్టంగా రూపుదాల్చి సహేతుకతను, ఆవశ్యకతను బోధిస్తున్నాయి. స్త్రీవాద పురోగమనానికి 'సహజ' మరోమెట్టుగా సాహిత్యంలో నిలుస్తుంది.



# ఆధునిక భాషా సంప్రదాయాలు

ఆచార్య ఎస్. అక్కిరెడ్డి

శాసన భాషతో ప్రారంభమైన తెలుగు భాష ఆధునిక తెలుగు వరకు అనేక మార్పులకు గురి అవుతూ ఎదిగింది జీవద్భాషకు మార్పు సహజం. మార్పు లేదంటే ఆ భాషలో ఎదుగుదల లేదని భావించాల్సి వస్తుంది. సంస్కృత భాషలో ఎటువంటి మార్పులు లేవు గనుక అది మృత భాషగా పరిగణింప బడుతుంది. ప్రాచీన తెలుగు భాషకు - ఆధునిక తెలుగు భాషకు అనేకమైన మార్పులు కన్పిస్తాయి ఈ మార్పులు ధ్వని, వర్ణ, నిర్మాణ, అర్థ సంబంధమైన అంశాల్లో స్పష్టంగా కన్పిస్తాయి.

ఏ భాషకైనా ఒక మరియాద అంటూ ఉంటుంది. ఆ మరియాదనే సంప్రదాయం అని అంటున్నాం. నన్నయ నుండి నారాయణరెడ్డి వరకు వచ్చిన సాహిత్య భాషను పరిశీలిస్తే, తెలుగు భాష క్రమపరిణామం చెందినట్లు గమనించ గలం. వ్యాకరణ బద్ధంగా భాషను ప్రయోగించడం, పండిత భాషను ప్రామాణికంగా స్వీకరించడం ప్రాచీన సాహిత్య భాషా సంప్రదాయంగా తేలింది ఆధునిక సాహిత్య భాషలో పండిత ప్రయోగాలే గాక పామరుల ప్రయోగాలు కూడా చోటు చేసుకోవడం మనకు తెలిసిన విషయం. ఆకలి జ్వాల లాంటి ప్రయోగాలు వ్యాకరణ విరుద్ధ ప్రయోగం కావచ్చు. కాని అది వ్యావహారిక భాషా వ్యవహర్తకు దోషంగా కన్పించదు. ఆధునిక భాషా సంప్రదాయాలకు ప్రాచీన భాషా సంప్రదాయాలకు వర్ణ, పద, వాక్య స్థాయిల్లో భేదం కన్పిస్తుంది. ప్రాచీన భాష కానివ్వండి, ఆధునిక భాష కానివ్వండి అది తప్పక ప్రజల భాషై ఉంటుంది. నన్నయాది కవుల భాషను పండితులు ప్రాచీన భాష అని, గ్రాంథిక భాష అని వ్యవహరిస్తున్నారు. ఆనాటి ప్రజల భాషనే నన్నయాది కవుల ప్రయోగించారు. ఏ భాష అయినా అది ఒకప్పుడు వ్యావహారిక భాష అయి ఉండాలి. వ్యావహారిక భాషా సంప్రదాయమే ఆధునిక భాషా సంప్రదాయం అయి ఉండాలి.

ఆధునిక భాషకు - ప్రాచీన భాషకు వర్ణాల విషయంలో భేదం కన్పిస్తుంది. మూల ద్రావిడ భాషలో అ, ఆ; ఇ, ఈ; ఉ, ఊ; ఎ, ఏ; ఒ, ఓ; అనే (10) అచ్చులూ, క, చ, ట, త్ర, త, ప, ఞ, ణ న్ర, న, మ, య, వ, ర, ళ, ల,

(17) అనే హల్లులు మాత్రమే ఉండేది ఇది మూల ద్రావిడ భాషకు సంబంధించిన వర్ణ విజ్ఞాన సంప్రదాయం

ప్రౌఢ వ్యాకరణ సంప్రదాయాన్ని అనుసరించి ఆంధ్ర భాషకు వర్ణాలు 55. అవి -

అ, ఆ, ఇ, ఈ; ఉ, ఊ, ఋ, ౠ; ఌ, ౡ, ఎ, ఏ, ఐ, ఒ, ఓ, ఔ, అం, అః (అచ్చులు)

క, ఖ, గ, ఘ, ఙ; చ, ఛ, జ, ఝ, ఞ; ట, ఠ, డ, ఢ, ణ; త, థ, ద, ధ, న, ప, ఫ, బ, భ, మ, య, ర, ల, వ, శ, ష, స, హ, ళ (హల్లులు)

ఆధునిక తెలుగు భాష సంప్రదాయం ప్రకారం వర్ణాలు - అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఎ, ఏ, ఒ, ఓ, (అచ్చులు) ప, ఫ, బ, భ, త, థ, ద, ధ, ట, ఠ, డ, ఢ, క, ఖ, గ, ఘ, చ, ఛ, జ, ఝ, ఫ్ర, స, ష, శ, హ, మ, న, ణ, ల, ళ, ర, వ, మ లు. ఆధునిక భాషలో వర్ణస్థాయిలో ఆంగ్లభాషకు సంబంధించిన ధ్వనుల్ని కూడా స్వీకరించే సంప్రదాయం ఏర్పడింది.

ఇక పదస్థాయికి సంబంధించిన సంప్రదాయాన్ని పరిశీలిద్దాం - ప్రాచీన భాషలో, కావ్య భాషలో, ఆధునిక భాషలో, కన్పించే పద రూపాల్ని పరిశీలిస్తే ఆధునిక సంప్రదాయం ఎలా ఉందో తెలుస్తుంది. ఉదాహరణకు -

ఇస్తిమి (శాసన రూపం), ఇచ్చితిమి (కావ్య రూపం), ఇచ్చాము (ఆధునిక రూపం)

ఏం భాయ్ (శాసన రూపం), ఏబది (కావ్యరూపం),

యాభై (ఆధునిక రూపం).

తొంభ (శాసనరూపం) తొంబది (కావ్యరూపం), తొంభై (ఆధునిక రూపం) ఆధునిక భాషా రూపాలు వ్యావహారిక రూపానికి దగ్గరగ ఉన్నాయి. అంటే ఆధునిక భాషా సంప్రదాయం వ్యావహారిక భాషా సంప్రదాయం అని చెప్పవచ్చు

ప్రాచీన భాషా సంప్రదాయానికి, కావ్యభాషా సంప్రదాయానికి, ఆధునిక భాషా సంప్రదాయానికి నిర్మాణ, అర్థ సంబంధమైన భేదాలు ఎక్కువగానే కన్పిస్తున్నాయని చెప్పవచ్చు. కాని వాక్య స్థాయిలో ప్రాచీన భాషా సంప్రదాయానికి, కావ్య భాషా సంప్రదాయానికి, ఆధునిక భాషా సంప్రదాయానికి చెప్పుకోదగ్గ భేదం కన్పించదు.

తెలుగు భాషకు కర్తరి ప్రయోగం సహజం. కర్మణి ప్రయోగం అసహజం ప్రాచీన, కావ్యభాషల్లో కర్మణి ప్రయోగాలు లేక పోలేదు ఉదా:- "తొల్లి నాచే వరియింపం బడిన భార్య" అని నన్నయ ప్రయోగం ఇలాంటి ప్రయోగాల్లు తెలుగు భాషలో అరుదు. ఆధునిక భాషలో మాత్రం, అందునా అనువాద వాక్యాల్లో ఎక్కువగా కర్మణి రూపాలు కన్పిస్తున్నాయి. ఉదా: రాముడు రావణుని సంహరించెను అనెడి వాక్యాల కంటే "రామునిచే రావణుడు సంహరింప బడెను" వంటి వాక్యాలు ఎక్కువగ ఆధునిక భాషలో కన్పిస్తున్నాయి. కర్మణి ప్రయోగం ఆధునిక భాషా సంప్రదాయమేమోనన్న భ్రాంతి తెలుగు వ్యవహర్తలో ఉంది. ఈ కర్మణి ప్రయోగ వ్యాప్తికి కారణం అనువాద ప్రక్రియ అని చెప్పక తప్పదు

ఆధునిక భాషా సంప్రదాయం వ్యావహారిక భాషా సంప్రదాయమే కానీ ఆధునిక యుగంలో కూడా వ్యావహారికంలో కాక, గ్రాంథికంలో కూడా వచన రచన చేసే కవులున్నారు.

ఉదా :"మృగ తృష్ణ కన్పట్టి! కనువిందు ఏడ్పించును,
మృత్యువు కాన్పించకయే కడతేర్చును జీవితేచ్ఛ.
(పాండురంగారావు 8 - 43)

గుండెపూడి పూర్ణచంద్ర రావు (8 - 3 - 13) ముక్కామల (1 - 6 - 24) గార్ల రచనల్లో గ్రాంథికం కన్పిస్తుంది ఛందో బద్ధ కవిత్వంలో శుద్ధ వ్యావహారిక భాషను ప్రయోగిస్తున్నా, ఈ రోజుల్లో కూడా అచ్చమైన వచన కవితల్లో గ్రాంథిక భాషను వాడడం ఆధునిక భాషా సంప్రదాయానికి విరుద్ధంగా ఉంది.

ఆధునిక కవిత్వంలో కొన్ని వికృత రూపాలు కన్పిస్తున్నాయి. వాటిని ప్రమాణ రూపాలుగా గ్రహించడం ఆధునిక సాహిత్య భాషా సంప్రదాయం.

"అపిమాహం మహం కుర్వాత్ చందోభంగం నకారమేత్" అని పెద్దలు ఛందో బద్ధమైన కవిత్వంలో ఛందో భంగం కలగకుండడానికి కొన్ని పదాలకు కొత్త రూపాలను కల్పించడం పరిపాటి. ఉదాహరణకు -

"వ్యయమై పోయె మహాంధ్ర పౌరుషము నీనాదాలవల్లన్" అనే పద్య పాదంలో నినాదం అని ప్రయోగించక 'నీనాదం' అని ప్రయోగించడం ఈ కోవలోకి వస్తుంది. ఇలాంటి వికృత రూపాలు ఛందో బద్ధమైన కవితల్లో

కంటే వచన కవితల్లోనే ఎక్కువగా కన్పించడం గమనార్హం. ఇలాంటి పద ప్రయోగం చేయడానికి కారణం వ్యావహారిక భాష పేరుతో స్వేచ్ఛను ఎక్కువగా స్వీకరించడం

వర్ణాల మార్పిడి : కొన్ని సందర్భాల్లో 'శ' కారానికి 'ష' కారం 'శ' కారానికి 'స' కారం రాయడం కన్పిస్తుంది ఉదా - కర్కశం = కర్కషం, శైత్యో పచారం - సైత్యోపచారం గాను ప్రయోగిచడం కన్పిస్తుంది.

ఇవి ఒక మాండలిక యాస భాషలో రచింపబడిన కవిత్వంలో కన్పించే రూపాలు కావు చందస్సౌలభ్యం కోసం పదాలకు కల్పించిన కొత్త రూపాంతరాలు కావు అంటే ఆధునిక భాషలో శ, ష, స, ల భేదం క్రమంగా నశిస్తున్నట్లుంది

వైరి సమాసాలు : వైరి సమాస ప్రయోగం ఆధునిక భాషా సంప్రదాయంగ కన్పిస్తుంది. "వర్ధమాన రేపు" (భావన్ 12-5), మనోపొది (బాలాజి 10-4), కుహనా గుండె (నవ్యశ్రీ 18-2), ఆధ్యాత్మకాలని (రమేష్ చంద్ర 8-6-5) అవహేళనా గాలుల్ని; మహాకావ్యతుది అక్షరం (సూర్యనారాయణ రాజు 1-4) రుధిరడుగు జాడలు (నవ్యశ్రీ 18-3), అస్తవ్యస్త మాటలు (లలితా ప్రసాద్ 9-2-28) లాంటి వైరి సమాసాలు ఎబ్బెట్టుగా ఉన్నా; రామ్మోహన రాజు (2-2-2) ప్రయోగించిన మహాజాతర వంటి ప్రయోగాలు వ్యవహారానుగుణంగా ఉన్నాయి. వైరిసమాస రచన ఆధునిక భాషా సంప్రదాయం.

వాక్యనిర్మాణం : వాక్యనిర్మాణంలో ముఖ్యంగా క్రియాపద ప్రయోగాలలో కవులు శ్రద్ధ చూపక పోవడం ఆధునిక భాషా సంప్రదాయంగా కన్పిస్తుంది.

ఉదా : 1. "రెండు జెళ్ళ రమణినాలో గులాబీల్ని పూస్తుంది.
(సుమనశ్రీ 6-6-8)

2. "ప్రకృతి మాతలు ............. నలిగి పోకున్నాయ్ .........
ఆలోచిస్తూనే ఉన్నాయ్" (ప్రేతాత్మ 5-6-20)

3. "అణుశక్తి లోకాన్నే అంతరించుమనన్న భయం"
(కృష్ణారెడ్డి 5-4-11)

4. "వెల్లుబికిన పెనుకేకను! అనాగరికపు కూతగా?
అభివర్ణించినప్పుడు" (యాదగిరి 10-6)

5. "ఇన్నాళ్ళుగా మనస్సులో! దాగివున్న మౌన గీతాలు?
ఎందుకనో ఈ నాడు! సితార తీగలపై
పలికిస్తున్నాయి" (పద్మజ 8-4-24)

6. "ఆలమందల మేపుతూ అలసి సొలసిన నీకు!
ఏ నీల జలదం! ఆత పత్రంగా సేవించిందో"
(పాపయ్య శాస్త్రి 10 - 6)

అన్యదేశ్యాలు . 'ఆరునెలల తెలుగు కవితలు ఒక పరిశీలన' అనే గ్రంథంలో సూర్యదేవర రవికుమార్ 1149 కవితలను పరిశీలించారు. అందులో 36 కవితలకు ఆంగ్లశీర్షికలు, మూడు కవితలకు ఉర్దూశీర్షికలు ఉన్నాయి ఇది అన్యభాషా ప్రభావానికి నిదర్శనం. అన్యదేశ్యాలను స్వీకరించడం ఆధునిక భాషా సంప్రదాయం.

తెలుగులో ఉన్న ఆంగ్ల పదాల్ని పరిశీలిస్తే ఆంగ్ల పదాల్ని తెలుగు భాషా సంప్రదాయాలకు అనుకూలంగా మార్చుకొని, ఆంగ్ల పదాలు తెలుగు పదాలేనన్న భావనను కలుగజేస్తాయి.

రెండు భాషలకు సన్నిహిత సంబంధం ఏర్పడ్డప్పుడు. ఒక భాష మరో భాషను ప్రభావితం చేయడం సహజం. తెలుగు భాషకు సంస్కృత, ఉర్దూ, ఆంగ్ల భాషలతో సన్నిహిత సంబంధం ఏర్పడ్డంవల్ల ఆయాభాషల నుండి తెలుగు పదజాలాన్ని స్వీకరించింది. సంస్కృతం నుండి తెలుగు ఎన్నో పదాల్ని స్వీకరించింది కాని వాటిని అన్యదేశ్యాలు అనక తత్సమ, తద్భవాలుగా స్వీకరించారు.

ఆధునిక యుగంలో ఆంగ్లభాషా ప్రభావం వల్ల తెలుగు అనేక ఆంగ్ల పదాల్ని స్వీకరించింది. తెలుగులోని ఆంగ్ల పదాలు అన్యదేశాలుగా స్ఫురించక దేశ్య పదాలుగానే తెలుగు వ్యవహర్తలచేత భావింప బడుతున్నాయి అన్యదేశ్యాలను స్వీకరించి వాటిని దేశి పదజాలంగా పరిగణించడం ఆధునిక భాషా సంప్రదాయం అయింది.

తెలుగులో 'ఇంచు' అనే క్రియా ప్రత్యయాన్ని సంస్కృత, హిందుస్థానీ ధాతువులకు చేర్చి క్రియారూపాల్ని సాధించడం ప్రాచీన భాషా సంప్రదాయం.

ఉదా : భుజ్ + ఇంచు = భుజించు
బాధ + ఇంచు = బాధించు
బోధ + ఇంచు = బోధించు

కాని 'ఇంచు' ప్రత్యయాన్ని ఆంగ్ల ధాతువులకు కూడా చేర్చి వ్యవహరించడం ఆధునిక భాషా సంప్రదాయంగ తెలుస్తుంది.

ఉదా. సౌండు + ఇంచు = సౌండించు
విష్పర్ + ఇంచు = విష్పరించు (శ్రీశ్రీ- మూడు యాభైలు)

నూతన ప్రక్రియా వ్యామోహంగల ఆరుద్ర సైంటి ఫిగ్గా, సిస్టమేటిగ్గా లాంటి ఆంగ్లపదాలను వాడడంతో పాటు 'ఇంచు' ప్రత్యయంతో క్రియారూపాలను ప్రయోగించినట్లు క్రింది ఉదాహరణలు నిరూపిస్తాయి

1. పెరిష్ + ఇంచు = పెరిషించు
2. ఇన్వేడ్ + ఇంచు = ఇన్వేడించు (త్వమేవాహం)

'గా' ప్రత్యయంతో కూడిన క్రియా జన్య విశేషణ ఆంగ్ల రూపాలు తెలుగులో కన్పిస్తున్నాయి

ఉదా. సడన్గా, స్లోగా, ఘూర్గా మొదలైనవి

బహువచనం పైన బహువచన ప్రత్యయంతో కూడిన ఆంగ్ల రూపాలు కూడా తెలుగులో కన్పించడం ఆధునిక భాషా సంప్రదాయం సూక్ష్మంలో మోక్షం అనేది తెలుగువాడి సిద్ధాంతం అందుకనే ఆంగ్ల భాషలో విస్తృత వ్యాప్తిలో ఉన్న కత్తిరింపు పదాల వ్యవహారం ఆధునిక తెలుగు భాషా సంప్రదాయంగా మారింది.

ఉదా : ఎయిడ్స్ (AIDS = Acquired immuno deficiency syndrome)
గ్యాట్ (GATT - General agreement on Trade and Tariff)
ఇస్రో (ISRO - Indian - Space Research Organisation)

ఇలా శాసన భాషతో ప్రారంభమైన తెలుగు భాష వివిధ మార్పులకు గురిఅయి మారుతూ వచ్చి ఆధునిక స్వరూపాన్ని సంతరించుకుంది. ఒక్క మాటలో చెప్పాలంటే ఆధునిక భాష ఏ పండిత వ్యాకరణాలకు లొంగక ప్రజల వ్యవహారంలో బాగా నలిగిన భాషా రూపాల్ని తనలో కలుపుకొని ఒక వినూత్న సంప్రదాయాన్ని అనుసరిస్తూ పరిపూర్తి నొందిందని చెప్పవచ్చు



# తెలుగులో బహువచన రూప నిర్మాణం

డా|| జి. రాధాకృష్ణ

1.0 భాషలో ఒకదానికి, ఒకదానికంటె ఎక్కువకు గల భేదాన్ని తెలిపే రూపాన్ని వచనం (Number) అంటారు తెలుగులో వచనాన్ని రెండు రకాలుగా వర్గీకరించవచ్చు. 1. ఏకవచనం (Singular Number) 2. బహువచనం (Plural Number)

ఒక దానిని గురించి తెలిపేరూపాన్ని ఏకవచనం అంటారు. ఉదా అత్త, అన్న, ఆవు, చెట్టు, పుట్ట మొదలైన రూపాలు. ఒక దాని కంటె ఎక్కువ వానిని గురించి తెలిపే రూపాన్ని బహువచనం అంటారు.

తెలుగు భాషలో -కులు, -రు/ఱు, -ల్/లు/ళ్/ళు అనే బహువచన ప్రత్యయాలు కన్పిస్తున్నాయి. -ళ్ ప్రత్యయం శాసన భాషలో చూడవచ్చు ఉదా :ప్రసాదంబు -ళ్, సంవత్సరంబు -ళ్ మొదలైన రూపాలు తెలుగులో బహువచన రూప నిర్మాణం ఈ క్రింది విధంగా ఉంది

నామ (కేవలనామ/సర్వనామ/సంఖ్యావాచక నామ) ధాతు ప్రాతిపదికకు బహువచనప్రత్యయం చేరినపుడు బహువచనరూపం ఏర్పడుతుంది.

**1.1** **కేవలనామ ధాతుమూలకం :** కేవల నామ ధాతు ప్రాతిపదికకు బహువచన ప్రత్యయం చేరినపుడు బహువచనరూపం ఏర్పడుతుంది.

**1.11** **అభేదపరివర్తన :** ఆధారధాతువు, ప్రత్యయం రెండింటిలోనూ ఎలాంటి మార్పు లేకపోవడం

1. - లు ·- అన్న అన్నలు

తెలుగు ప్రాతిపదికలు (పుం మా). అన్న, కొడుకు, తాత, మామ, బావ ;

(స్త్రీ. మా): అక్క, అత్త, అవ్వ, కూతు (రు); (ఉ. మా). చుట్టము, పెద్ద , (పుం. జం): ఆంబోతు, ఎద్దు, దున్నపోతు, మేకపోతు , (స్త్రీ. జం): ఆవు ; (ఉ. జం): ఎలుక, కప్ప, కుక్క, చిలుక, దున్న ; (ఇ) ఊరు, ఏగుట, ఏడు/

ఏండు, కంచె, కుండ, కుదురు, గొళ్లెము/గొళ్ళెము, గోగు, చిగురు/చివురు, చెరుకు, చేట, జాము, తుట్టె, తేనె, నోరు, పండు, పళ్లెము/పళ్ళెము, పువ్వు/పూవు, పేరు, బండ, మాట, మీసము, ముచ్చట, మూట, మ్రాను, రేగు; సంస్కృత ప్రాతిపదికలు: (పు. మా). అయ్య, (స్త్రీ మా) కుమారి, కుమార్తె, వనిత; (ఉ. మా) గురువు, దాత, బంధువు, శత్రువు, (స్త్రీ. జం)· ధేనువు,

పర్షియో - అరబిక్ ప్రాతిపదికలు ·(ఉ మా) జమీందారు, తహసీల్దారు, రౌతు, (ఇ). జవాబు, జిల్లా, తారీఖు, సరదా ;

ఆంగ్లప్రాతిపదికలు : (స్త్రీ. మా) ఆంటీ; (ఇ) నైటీ, పిన్ను, బస్సు, లారీ, తెలుగు -(డు ప్రత్యయాత్మక సాంస్కృతిక ప్రాతిపదికలు : (పుం మా) దుండగీఁడు, రేఁడు; తెలుగు -ము ప్రత్యయాత్మక సంస్కృత ప్రాతిపదికలు· (ఇ.) ద్వారము, మంత్రము, రాజ్యము.

-ల్ :- చుట్టము చుట్టముల్

తెలుగు ప్రాతిపదిక : .(ఉ. మా) : చుట్టము

**1.12** స్వరలోపం : ఆధారధాతుగత స్వరం లోపం చెందడం

1) - అ ఁలోపం

1. -లు :- ముచ్చట ముచ్చట్లు

తెలుగు ప్రాతిపదిక (ఇ.). ముచ్చట

2) - ఇ ఁలోపం

1. - లు :- చీకటి చీకట్లు

తెలుగు ప్రాతిపదికలు : (ఇ) చీకటి, కాండి, బండి

3) - ఉ ఁలోపం

1. - రు :- అల్లుండు అల్లుంద్రు

తెలుగు ప్రాతిపదికలు : (పుం. మా) : అల్లుండు, కుర్రవాండు, చిన్నవాండు, మగవాండు, విలుకాండు , తెలుగు -కాండు ప్రత్యయాత్మక సంస్కృత ప్రాతిపదికలు : (పుం. మా) : జీతగాండు, మోసగాండు ; తెలుగు -0డు ప్రత్యయాత్మక సంస్కృత ప్రాతిపదికలు (పుం. మా) : గండండు, మిండండు

2. -లు - కాటు కాట్లు

తెలుగు ప్రాతిపదికలు ·(ఇ.). కాటు, గీటు, పాటు , ఏండు, గుండు, తూండు, పండు ; గోరు, నోరు, పేరు ; పర్షియో-అరబిక్ ప్రాతిపదికలు .(ఇ) : జమీందారు, తహసీల్దారు, ఆంగ్ల ప్రాతిపదికలు (ఇ) ఓటు, కోటు, నోటు ; కారు, వైరు.

**1.13 అక్షరలోపం : ఆధారధాతు గతాక్షరం లోపం చెందడం.**

1. -రు/ఱు:- అల్లుఁడు అల్లురు/అల్లుఱు

తెలుగు ప్రాతిపదికలు :(పుం. మా): అల్లుఁడు, గగ్గులకాఁడు, విలుకాఁడు, వేటకాఁడు; తెలుగు -డు ప్రత్యయాత్మక సంస్కృత ప్రాతిపదికలు : (పుం మా): గోపాలుఁడు, పగతుఁడు, , బాలుఁడు, మల్లుఁడు

2 - లు :- తమ్ముఁడు తమ్ములు

తెలుగు ప్రాతిపదికలు :(పుం మా): తమ్ముఁడు, మగఁడు, మనుమఁడు, తెలుగు -ఈఁడు ప్రత్యయాత్మక సంస్కృత ప్రాతిపదిక : (పుం. మా) : దుండగీడు ,తెలుగు - ఁడు ప్రత్యయాత్మక సంస్కృత ప్రాతిపదికలు .(పుం మా): దాసుఁడు, పండితుఁడు, మల్లుఁడు, సుతుఁడు.

- ల్ :- సుతుఁడు సుతులు

తెలుగు - ఁడు ప్రత్యయాత్మక సంస్కృత ప్రాతిపదిక (పుం. మా): సుతుఁడు

2) - ను లోపం

1 - కులు - కెలను కెలకులు

తెలుగు ప్రాతిపదికలు .(ఇ.) కెలను, కొలను, గవను, నెఱను, మ్రాను

2 - లు :- పేను పేలు

తెలుగు ప్రాతిపదికలు :(ఉ. జం) పేను, మీను :(ఇ.): చేను

3) - ము లోపం

1 - లు .- చుట్టము చుట్టలు

తెలుగు ప్రాతిపదికలు ·(ఉ. మా): చుట్టము ;(ఇ.) జాము, మోసము

4) - యి లోపం

1. - లు :- రాయి రాలు

తెలుగు ప్రాతిపదిక :(ఇ) రాయి

5) - వు లోపం

1. - లు :- ఆవు ఆలు

తెలుగు ప్రాతిపదికలు . (స్త్రీ జం) ఆవు , (ఇ) పూవు , సంస్కృత ప్రాతిపదికలు (ఉ. మా) గురువు, బంధువు, శత్రువు , (స్త్రీ జం) ధేనువు

1 14 ఆదేశాత్మకం · ఆధారధాతుగత వ్యంజనం మరోవ్యంజనంగా ఆదేశం చెందడం

1) ర్ - ళ్ కావడం

1. - లు :- ఊరు ఊళులు

తెలుగు ప్రాతిపదికలు . (ఇ.)ఊరు, చివురు

1.15 మూర్ధన్యీకరణం:ఆధారధాతుగత దంత్య మరియు దంతమూలీయవ్యజనం మూర్ధన్యం కావడం.

1) ల్ - ళ్ కావడం.

1. - లు :- ఒడలు ఒడళులు

తెలుగు ప్రాతిపదికలు (ఇ.) ఒడలు, కాలు, తోలు, పగలు, వ్రేలు

**1.16** స్వరదీర్ఘకరణం : ఆధారధాతుగత హ్రస్వస్వరం దీర్ఘం కావడం

1) ఇ - ఈ కావడం.

1. - లు:- దాసి దాసీలు

సంస్కృత ప్రాతిపదిక : (ఉ. మా) : దాసి.

**1.17** స్వరపరివర్తన : ఆధారధాతు గతస్వరం మరోస్వరంగా పరివర్తన చెందడం

1) ఇ - ఉ కావడం

1. - రు .- ధీశాలి ధీశాలురు

సంస్కృత ప్రాతిపదిక · (ఉ మా) : ధీశాలి.

2. -లు ·- పెనిమిటి పెనిమిటులు

తెలుగు ప్రాతిపదికలు · (పుం. మా) : పెనిమిటి, మరిది ; (స్త్రీ మా). ఇంతి, చెలి ; (ఉ జం) నల్లి, పిల్లి, పులి, బల్లి ; (ఇ.) : ఊపిరి, కూరిమి, కొడవలి, పందిరి, గాలి, గుడి, చీకటి, చెవి, తావి, పచ్చడి, బడి, ముడి,

మూతి; సంస్కృత ప్రాతిపదికలు : (పుం. మా): తండ్రి ; (స్త్రీ. మా): తల్లి, సవతి ; (ఉ మా): ధీశాలి, మానిసి ; (ఇ.) మతి, రాత్రి, సిరి.

**1.18 సహపరివర్తనలు :** రెండు లేదా మూడు లేదా నాలుగు సహపరివర్తన ప్రక్రియలు కూడా జరగడం.

ఎ) స్వరలోపం, ఆదేశాత్మకం

1) ఇ లోపం, డ్ - ళ్ కావడం.

1. -/ళు :- కోడి కాళ్లు/కోళ్ళు

తెలుగు ప్రాతిపదికలు : (ఉ. జం) : కోడి (ఇ) గుడి, బడి ముడి, పచ్చడి.

2) ఇ లోపం, య్ - ళ్ కావడం.

1. - లు/ళు :- రాయి — రాళ్లు/రాళ్ళు

తెలుగు ప్రాతిపదిక : (ఇ.) : రాయి.

3) ఉ లోపం, డ్ - ళ్ కావడం

1. - లు/ళు :- అల్లుడు అల్లుళ్లు/అల్లుళ్ళు

తెలుగు ప్రాతిపదికలు : (పుం మా) : అల్లుడు, తమ్ముడు ; (ఇ.) ఏడు, కూడు, గూడు, నాడు, పేడు, వీడు, చప్పుడు, పెరడు.

4) ఉ లోపం, ర్ - ళ్ కావడం

1. - లు/ళు :- కూతురు కూతుళ్లు/కూతుళ్ళు

తెలుగు ప్రాతిపదికలు : (స్త్రీ. మా) : కూతురు; (ఇ.) ఊరు, పేరు, నోరు, కుదురు, చివురు

బి) స్వరలోపం, మూర్ధన్యీకరణం

1) అ లోపం, ల్ - ళ్ కావడం

1. - లు/ళు:- సంకెల సంకెళ్లు/సంకెళ్ళు

సంస్కృత ప్రాతిపదిక : (ఇ) సంకెల

2) ఇ లోపం, ల్ - ళ్ కావడం

1. - లు/ళు :- మొసలి మొసళ్లు/మొసళ్ళు

తెలుగు ప్రాతిపదికలు : (ఉ. జం) మొసలి ; (ఇ.) కౌగిలి, గొడ్డలి, చెక్కిలి, నాగలి.

3) ఉ లోపం, ల్ - ళ్ కావడం

1 - లు/ళు :- కోడలు

తెలుగు ప్రాతిపదికలు : (స్త్రీ. మా) · కోడలు, చెల్లెలు, పేరంటాలు, మరదలు; (ఉ. జం) కుందేలు, తాబేలు, తోడేలు ; (ఇ) కాలు, వేలు, పగలు, పగులు, సంస్కృత ప్రాతిపదిక : (ఉ మా) · పంతులు; ఆంగ్ల ప్రాతిపదికలు : (ఇ.) జైలు, రైలు, బాటిలు, సైకిలు.

సి) స్వరలోపం, కంఠ్యీకరణం (ఆధారధాతుగత దంత్యమరియు దంతమూలీయ వ్యంజనం కంఠ్యం కావడం)

1) ఉ లోపం, న్ - ఙ్ కావడం

1 - కులు :- కెలను కెలఙులు/కెలంకులు

తెలుగు ప్రాతిపదికలు · (ఇ) కెలను, కొలను, గవను, నెఱను, మ్రాను

డి) స్వరలోపం, అద్విరుక్తీకరణం (ఆధారధాతుగత ద్విరుక్త వ్యంజనం అద్విరుక్తం కావడం)

1) అ లోపం, డ్డ్ - డ్ కావడం

1. -లు .- గడ్డ గడ్లు

తెలుగు ప్రాతిపదికలు : (ఇ.) గడ్డ, గుడ్డ.

2) ఇ లోపం, ట్ట్ - ట్ కావడం

1. -లు :- ఉట్టి ఉట్లు

తెలుగు ప్రాతిపదిక : (ఇ) . ఉట్టి

3) ఇ లోపం, డ్డ్ - డ్ కావడం

1. -లు :- దొడ్డి దొడ్లు

తెలుగు ప్రాతిపదికలు (ఇ.) దొడ్డి, ముడ్డి

4) ఉ లోపం, ట్ట్ - ట్ కావడం.

1. - లు .- కట్టు కట్లు

తెలుగు ప్రాతిపదికలు · (ఇ.) కట్టు, చెట్టు, తిట్టు, ; ఆంగ్ల ప్రాతిపదికలు· (ఇ.) చిట్టు, జాకెట్టు, టికెట్టు, రాకెట్టు, లాకెట్టు, సిగరెట్టు.

5) ఉ లోపం, డ్డ్ - డ్ కావడం.

1 -లు :- గొడ్డు గొడ్లు

తెలుగు ప్రాతిపదికలు ·(ఉ. జం) గొడ్డు ,(ఇ.) గుడ్డు/గ్రుడ్డు, తెడ్డు, దుడ్డు, బొడ్డు , ఆంగ్లప్రాతిపదికలు (ఇ) బెడ్డు, షెడ్డు.

6) ఎ లోపం, ట్ - కావడం

1 -లు ·- తుట్టెతుట్లు

తెలుగు ప్రాతిపదికలు :(ఇ) తుట్టె, ముట్టె

ఇ) వ్యంజనలోపం (ఆధారధాతుగత వ్యంజనం లోపం చెందడం, స్వరదీర్ఘకరణం

1) మ్ లోపం, అ - ఆ కావడం

1. - లు :- చుట్టం చుట్టాలు

తెలుగు ప్రాతిపదికలు (ఉ. మా). చుట్టం ;(ఇ.) మోసం ; సంస్కృత ప్రాతిపదికలు ·(ఇ.) ద్వారం, రాజ్యం

2) మ్ లోపం, ఎ - ఏ కావడం.

1 - లు ·- కళ్లెం/ కళ్ళెం కళ్లేలు/కళ్ళేలు

తెలుగు ప్రాతిపదికలు : (ఇ.) కళ్లెం/కళ్ళెం, గొళ్లెం/గొళ్ళెం, పళ్లెం/ పళ్ళెం.

ఎఫ్) అక్షరలోపం, నాదీకరణం (ప్రత్యయ అద్యశ్వాస వ్యజనం నాదం కావడం)

1) - ను లోపం, క్ - గ్ కావడం

1. -కులు ·- గోను గోగులు

తెలుగు ప్రాతిపదికలు :(ఇ.)· గోను, రేను.

జి) అక్షరలోపం, ఆదేశాత్మకం

1) - డి లోపం, ణ్ - ళ్ కావడం.

1. - లు/ళు :- తిండి తిళ్లు/తిళ్ళు

తెలుగు ప్రాతిపదికలు :(ఇ): తిండి, బండి.

2) - డు లోపం, ణ్ - ళ్ కావడం.

1. -లు/ళు :- గుండు గుళ్లు/గుళ్ళు

తెలుగు ప్రాతిపదికలు :(ఇ) గుండు, పండు

హెచ్) స్వరపరివర్తన, ఆదేశాత్మకం

1.) ఇ - ఉ, య్ - త్ కావడం.

1. -లు :- గోయి గోతులు

తెలుగు ప్రాతిపదికలు : (ఇ.). గోయి, చేయి, నూయి, నేయి.

ఐ) అంత్య మరియు మధ్య స్వరపరివర్తనలు

1) ఇ - ఉ, ఇ - ఉ కావడం.

1 -లు :- కలికి కలుకులు

తెలుగు ప్రాతిపదికలు : (ఇ.). కలికి, చెలిమి, పోడిమి, విడిది, సంస్కృత ప్రాతిపదిక : (ఉ. మా) : మనిషి

జె) స్వరలోపం, ఆదేశాత్మకం, ఆగమాత్మకం

1) ఉ లోపం, ల్ - ణ్ కావడం, డ్ ఆగమం

1. -రు - ఆలు ఆండ్రు

తెలుగు ప్రాతిపదికలు : (స్త్రీ. మా) ఆలు, కోడలు, చెలియలు/చెల్లెలు, పేరంటాలు.

2) ఇ లోపం, ల్ - ణ్ కావడం, డ్ ఆగమం.

1 -లు :- కొడవలి కొడవండ్లు

తెలుగు ప్రాతిపదికలు : (ఇ.) కొడవలి, గొడ్డలి.

కె). స్వరలోపం, అద్విరుక్తీకరణం, మూర్ధన్యీకరణం

1) ఉ లోపం, ల్ల్ - ళ్ కావడం

1. -లు/ళు :- ఇల్లు ఇళ్లు/ఇళ్ళు

తెలుగు ప్రాతిపదికలు : (ఇ) ఇల్లు, పల్లు, ముల్లు

ఎల్) స్వరలోపం, కంఠ్యీకరణం, నాదీకరణం

1) ఉ లోపం, న్ - ఙ్, క్ - గ్ కావడం

1. -కులు :- గోను గోఁగులు/గోంగులు

తెలుగుప్రాతిపదికలు : (ఇ.) గోను, రేను

ఎమ్) వ్యంజనలోపం, స్వరపరివర్తన, స్వరదీర్ఘకరణం

1) మ్ లోపం, ఎ - ఆ కావడం

1. -లు :- కళ్లెం/కళ్ళెం కళ్లాలు/కళ్ళాలు

తెలుగు ప్రాతిపదికలు : (ఇ.) : కళ్లెం/కళ్ళెం, గొళ్లెం/గొళ్ళెం, పళ్లెం/పళ్ళెం

ఎన్) స్వరలోపం, అద్విరుక్తీకరణం, ఆదేశాత్మకం, ఆగమాత్మకం

1) ఉ లోపం, ల్ల్ - ణ్ కావడం, ద్ ఆగమం

1. - లు :- ఇల్లు ఇండ్లు

తెలుగు ప్రాతిపదికలు : (ఇ.) : ఇల్లు, పల్లు, ముల్లు.

ఒ) స్వరలోపం, అద్విరుక్తకరణం, మూర్ధన్యీకరణం, ఆగమాత్మకం.

1) ఉ , న్న్ ణ్ , డ్ ఆగమం

1. -లు :- కన్ను కండ్లు

తెలుగు ప్రాతిపదికలు . (ఇ.) : కన్ను, పన్ను

**1.19 ఇతరం :**

1). ఏకవచన రూపం, బహువచన ప్రత్యయం (-లు/ళు) నడుమ 'ఇల్లు రూపం చేరి బహువచన రూపం ఏర్పడవచ్చు.

ఎ). 'పెండ్లి' అనే తెలుగు లేదా 'రాత్రి' అనే సంస్కృత ఏకవచన రూపానికి తెలుగు 'ఇల్లు' రూపం చేరినపుడు స్వరాదేశం (ఇ+ఇ ——>ఇ) వల్ల ఏర్పడిన రూపానికి బహువచన ప్రత్యయం - లు/ళు చేరినపుడు స్వరలోపం (ఉ లోపం), అద్విరుక్తీకరణం మరియు మూర్ధన్యీకరణం (ల్ల్ - ళ్ కావడం), సహపరివర్తన ప్రక్రియలు కూడా జరగవచ్చు.

పెళ్లి/పెళ్ళి + ఇల్లు పెళ్లిల్లు/పెళ్ళిల్లు+లు/ళు పెళ్లిళ్లు/పెళ్లిళ్ళు/పెళ్ళిళ్లు/పె

రాత్రి+ఇల్లు రాత్రిల్లు+లు/ళు రాత్రిళ్లు/రాత్రిళ్ళు

బి). 'పెండ్లి' అనే తెలుగు లేదా 'రాత్రి' అనే సంస్కృత ఏకవచనరూపానికి తెలుగు 'ఇల్లు' అనే రూపం చెరినపుడు స్వరాదేశం (ఇ+ఇ——>ఇ) వల్ల ఏర్పడిన రూపానికి బహువచన ప్రత్యయం -లు చేరినపుడు స్వరలోపం (-ఉ లోపం), అద్వరుక్తీకరణం మరియు ఆదేశాత్మకం (ల్ల్ - ణ్ కావడం), ఆగమాత్మకం ('డ్' ఆగమం) సహపరివర్తన ప్రక్రియలు కూడా జరగవచ్చు.

| | | |
|---|---|---|
| పెండ్లి+ఇల్లు | పెండ్లిల్లు+లు | పెండ్లిండ్లు |
| రాత్రి+ఇల్లు | రాత్రిల్లు+లు | రాత్రిండ్లు |

ii) కేవల నిత్య బహువచన రూపంపై బహువచన ప్రత్యయం చేరవచ్చు
ఎ) స్వరలోపం, ఆదేశాత్మకం
1) ఉ లోపం, ర్ - ళ్ కావడం
1. -లు/ళు :- నీరు నీళ్లు/నీళ్ళు
తెలుగు ప్రాతిపదికలు : (ఇ.) : నీరు

iii) బహువచన ప్రత్యయాత్మక నామరూపంపై మరలా బహువచన ప్రత్యయం చేరవచ్చు.

ఎ). **అభేదపరివర్తన :** ఆధారధాతువు, ప్రత్యయం రెండింటిలోనూ ఎలాంటి మార్పు లేకపోవడం.
1 -రు .- ఇల్లాండ్రు ఇల్లాండ్రురు
తెలుగు ప్రాతిపదికలు . (స్త్రీ. మా) ఇల్లాండ్రు, పేరంటాండ్రు
2 -లు ·- వేటకాఱు వేటకాఱులు
తెలుగు ప్రాతిపదిక (ఉ. మా) · వేటకాఱు

**1.2 సర్వనామధాతుమూలకం :** సర్వనామధాతు ప్రాతిపదికకు బహువచన ప్రత్యయం చేరినపుడు సర్వనామ/సార్వనామిక బహువచనరూపం ఏర్పడుతుంది

**1.21 స్వరలోపం :** ఆధారధాతు గతస్వరం లోపం చెందడం
1) ఉ లోపం
1 -రు :- వాండు (పుం మా) వాండ్రు (ఉ. మా).
వీండు (పుం మా) వీండ్రు (ఉ. మా)

**1.22 అక్షరలోపం :** ఆధారధాతుగతాక్షరం లోపం చెందడం.
1) - డు లోపం
1 -రు :- ఎవడు/ఎవ్వడు (పుం. మా) ఎవరు/ఎవ్వరు (ఉ మా)
వాడు (పుం. మా) వారు (ఉ. మా)
వీడు (పుం. మా) వీరు (ఉ. మా)
2) -ది/ద్ది లోపం.
1. -వి/వ్వి :- అది/అద్ది (స్త్రీ. మా) అవి/అవ్వి (స్త్రీ. మా)
అది/అద్ది (ఉ. జం) అవి/అవ్వి (ఉ జం)
అది/అద్ది (ఇ.) అవి/అవ్వి (ఇ.)

3) -ను లోపం.

1 -ము :- ఏను (ఉ. మా) ఏము (ఉ మా)

తాను (ఉ. మా) తాము (ఉ మా)

2 -రు :- తాను (ఉ మా) తారు (ఉ మా)

4) -వు లోపం.

1 -రు .- ఈవు (ఉ. మా) ఈరు (ఉ. మా)

1.23 సహపరివర్తనలు : రెండు సహపరివర్తన ప్రక్రియలు కూడా జరగడం

1) అక్షరలోపం, ఉభయోష్ఠీకరణం (ఆధారధాతు ఆద్యదంత్య మరియు దంతమూలీయ వ్యంజనం ఉభయోష్ఠ్యం కావడం)

1) -ను లోపం, న్ - మ్ కావడం.

1. -ము :- నేను (ఉ. మా) మేము (ఉ. మా)

2) -వు లోపం, న్ - మ్ కావడం.

1 -రు :- నీవు (ఉ. మా) మీరు (ఉ. మా)

1.24 సార్వనామిక బహువచన రూపంపై బహువచన ప్రత్యయం చేరవచ్చు.

ఎ) అభేదపరివర్తన : ఆధారధాతువు, ప్రత్యయం రెండింటిలోనూ ఎలాంటిమార్పు లేకపోవడం.

1 -రు ·- వాండ్రు (ఉ. మా) వాండ్రురు (ఉ. మా)

బి) స్వరపరివర్తన : ఆధార ధాతుగత స్వరం మరోస్వరంగా పరివర్తన చెందడం

1) ఉ - అ కావడం.

1. -లు :- మీరు (ఉ. మా)మీరలు (ఉ. మా)

వారు (ఉ. మా) వారలు (ఉ. మా)

వీరు (ఉ. మా) వీరలు (ఉ. మా)

సి) సహపరివర్తనలు : రెండు సహపరివర్తనలు కూడా జరగడం.

i) స్వరలోపం (ఆధారధాతుగతస్వరం లోపం చెందడం), ఆదేశాత్మకం (ఆధారధాతుగత వ్యంజనం మరోవ్యంజనంగా ఆదేశం చెందడం)

1) ఉ లోపం, ర్ - ళ్ కావడం.

1. -లు/ళు .- వారు (ఉ. మా) వాళ్లు/వాళ్ళు (ఉ. మా)

వీరు (ఉ. మా) వీళ్లు/వీళ్ళు (ఉ. మా)

**1.25** సార్వనామిక బహువచన రూపంపై బహువచన ప్రత్యయం చేరి ఏర్పడిన సార్వమిక బహువచన రూపంపై మరలా బహువచన ప్రత్యయం చేరవచ్చు.

ఎ) స్వరపరివర్తన : ఆధారధాతుగత స్వరం మరోస్వరంగా పరివర్తన చెందడం.

1) ఉ - అ కావడం.

1. -రు :- వారలు (ఉ. మా) వారలరు (ఉ. మా)

వీరలు (ఉ. మా) వీరలరు (ఉ. మా)

**1.3 సంఖ్యావాచకనామధాతుమూలకం :** సంఖ్యావాచకనామధాతు ప్రాతిపదికకు బహువచన ప్రత్యయం చేరినపుడు సంఖ్యావాచక బహు వచనరూపం ఏర్పడుతుంది.

**1.31 అభేదపరివర్తన :** ఆధారధాతువు, ప్రత్యయం రెండింటిలోనూ ఎలాంటి మార్పు లేకపోవడం

1. -లు :-

తెలుగు రూపాలపై : అయిదు/ఐదు అయిదులు/ఐదులు

నాలుగు నాలుగులు

సంస్కృత రూపాలపై లక్ష లక్షలు

వంద వందలు

**1.32 స్వరలోపం :** ఆధారధాతుగత స్వరం లోపం చెందడం

1) -ఇ లోపం.

1. -లు :-

తెలుగు రూపంపై ఒకటి ఒకట్లు

సంస్కృత రూపంపై : కోటి కోట్లు

2) ఉ లోపం.

1. -లు :-

తెలుగు రూపాలపై : ఆరు ఆర్లు

నూరు నూర్లు

రెండు రెండు

**1.33 అక్షరలోపం :** ఆధారధాతుగతాక్షరం లోపం చెందడం

1) యి లోపం.

1 -లు .- వేయి వేలు

**1.34 స్వరపరివర్తన:** ఆధారధాతుగతస్వరం మరోస్వరంగా పరివర్తన చెందడం.

1) ఇ - ఉ కావడం

1 -లు - ఎనిమిది ఎనిమిదులు

తొమ్మిది తొమ్మిదులు

పది పదులు

**1.35 నూరు ఆకు, వంద విస్తరి రూపాలలో నూరు, వంద బహువచన బోధక సంఖ్యావాక రూపాలు. ఆకు, విస్తరి రూపాల తర్వాత బహువచన ప్రత్యయ లోపాన్ని గమనించవచ్చు.**

**1.4 నిత్యైక వచన రూపాలు :** తెలుగులో కనిపించే నిత్యైకవచన రూపాలను క్రింద చూడవచ్చు.

1) తెలుపు, నలుపు, పసుపు మొదలైన వర్ణవాచకాలు 2) చమురు, నూనె, నేయి మొదలైన ద్రవవాచకాలు 3) జీలకఱ్ఱ, బియ్యము మొదలైన ధాన్యవాచకాలు 4) ఇంగువ, ఉప్పు, చింతపండు, పసుపు మొదలైన సంభారవాచకాలు 5) దూది, ప్రత్తి మొదలైన సస్యవాచకాలు, 6) ఇత్తడి, కంచు, బంగారు, వెండీ మొదలైన లోహవాచకాలు 7) అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడు, నిన్న, మొన్న, మాపు, రేపు మొదలైన కాలవాచకాలు 8) అచ్చట, ఇచ్చట, ఎచ్చట, అట, ఇట, ఎట మొదలైన స్థలవాచకాలు 9) కేలు, ఇరులు మొదలైన ఇతర వాచకరూపాలు.

**1.5 నిత్య బహువచనరూపాలు :** తెలుగులో కనిపించే నిత్య బహువచన రూపాలను క్రింద చూడవచ్చు

1) కందులు, కొఱ్ఱలు, జొన్నలు, పెసలు, మినుములు , రాగులు, వడ్లు సెనగలు మొదలైన ధాన్యవాచకాలు 2) అచ్చనగాయలు, ఓమనగుంటలు, గుజ్జనగూళ్ళు, గొబ్బిళ్ళు, చల్లుడు పిచ్చెలు, దాగుడు మూతలు మొదలైన క్రీడావాచకాలు 3) అందరు, ఇందరు, ఎందరు, కొందరు మొదలైన సంఖ్యేయార్థక వాచకాలు 4) ఆగచాట్లు, కురులు, గుగ్గిళ్ళు, పులకలు, పేలాలు మొదలైన

రూపాలు 5) ద్రవవాచకాలు: తెలుగు రూపాలు - పాలు, నీరు ; ఆంగ్లరూపా
కాఫీ, టీ.

## సంక్షిప్తరూపాల వివరణ

(ఉ. మా) స్త్రీ, పురుషోభయ సామాన్యలింగ మానవ బోధకం

(పుం మా) పుంలింగమానవ బోధకం.

(స్త్రీ. మా) స్త్రీలింగ మానవ బోధకం

(ఉ. జం) స్త్రీ, పురుషోభయ సామాన్యలింగ జంతు బోధకం

(పుం. జం) పుంలింగ జంతు బోధకం

(స్త్రీ. జం) స్త్రీలింగ జంతు బోధకం

(ఇ.) స్త్రీ, పురుషేతర లిగ బోధకం.

## ఉపయుక్త రచనలు

1. అనంతరామ శాస్త్రి, నేతి -'శ్రీనాథ భాషా పరిశీలన."
2. కృష్ణమూర్తి, భద్రిరాజు (సం) -'తెలుగు భాషా చరిత్ర.'
3. చిన్నయసూరి, పరవస్తు -'బాలవ్యాకరణము'
4. బ్రౌన్, చార్లెస్ ఫలిప్ -'తెలుగు-ఇంగ్లీష్' నిఘంటువు.
5. రామచంద్రరావు సి -'తెలుగు వర్ణం కొన్ని ప్రక్రియలు'
6. రామారావు, చౌకూరి -'తెలుగులో బంగువచన రూప నిష్పత్తి' వ్యాసం
7. వేంకటేశ్వర్లు, వజ్ఝల -'ఆధునిక ప్రామాణికాంధ్ర వ్యాకరణం.'
8. శివరామమూర్తి, ఎన్ -'ఆధునిక తెలుగు వ్యాకంణం'
9. సుబ్రహ్మణం, పి.యస్-'ద్రావిడభాషలు'



# తెలుగుపదాల ఫ్రీక్వెన్సీ డిక్షనరీ ఆవశ్యకత

డా॥ డి.సి. రెడ్డి

**1.0. పదజాలం పెరుగుదల:**

ఏ భాషలోనయినా అప్పటికి అవసరమయినంత వరకే పదజాలం ఉంటుంది. ఇది మొదట దేశీయ పదజాలంగానే ఉంటుంది కొత్తరంగాలూ, శాస్త్రాలతోనూ, కొత్త ప్రాంతాలతోనూ పరిచయాలు కలగడం వల్ల ఇతర భాషా పదాలనుకూడా వాడుకోవడం జరుగుతుంది. ఆ విధంగా మొదట సంస్కృత పదజాలం తెలుగు సాహిత్యంలో చేరి, కొన్ని పదాలు ప్రజల దిన వ్యవహారంలోకి కూడా వచ్చాయి పాలకుల కారణంగా ఇంకా ఉర్దూ, పోర్చుగీసు, ఫ్రెంచి లాంటి భాషాపదాలు కూడా తర్వాత కాలంలో కలుస్తూ వచ్చాయి. 20వ శతాబ్దం నుంచి ఇంగ్లీషు పదాలు లెక్కలేనన్ని తెలుగు వాళ్ళ దిన వ్యవహారంలో చేరిపోతున్నాయి. ఇటీవల కాలంలో ఈ చేరడం మరీ ఎక్కువయ్యింది. కానీ రచనల్లోకి వచ్చేటప్పటికి సంస్కృత పదాలనే ఎక్కువగా వాడుతున్నారు. దీనికి కారణం: 1) దేశీయ భాషల్లో మొదట కలిసినవి సంస్కృత పదాలు; 2) సంస్కృతం నుంచే ఇండియాలోని భాషలు అన్నీ పుట్టాయి అనే భావన చాలకాలం ఉండేది; 3) సంస్కృతం మనది, ఇంగ్లీషు ఇతరులది, పైగా మనల్ని బానిసలుగా చూసిన వాళ్ళది - అనే భావాలు ఉండటం అయినా తెలుగువాళ్ళు అన్నిటినీ ఆహ్వానిస్తారు కాబట్టి మొదట సంస్కృతం, మధ్యకాలంలో ఉర్దూ, ఫ్రెంచి, పోర్చుగీసులాంటి భాషల పదాలూ, ఇప్పుడు ఇంగ్లీషు పదాలను తీసుకొని తెలుగు భాషను సుసంపన్నం చేశారు. దీనివల్ల తెలుగులో పదజాలం పెరిగింది.

**2.0. పర్యాయపదాలు :**

ఇతర భాషాపదాల్ని తీసుకోవడం వల్ల తెలుగులో పర్యాయపదాలు ఎక్కువయ్యాయి. జి.యన్. రెడ్డిగారు తయారుచేసిన తెలుగు పర్యాయపద నిఘంటువు చూస్తే తెలుగులో పర్యాయపదాల రాశి ఎంత ఎక్కువగా ఉందో తెలుస్తుంది. ఔచిత్యం, సాభిప్రాయం, పునరుక్తి నివారణ, ఛందో నియమంలాంటి కారణాల వల్ల సాహిత్యంలో పర్యాయపదాల వాడుక

అధికంగానే చోటుచేసుకుంది. కానీ విమర్శలో మాత్రం పర్యాయపదాలు వాడటం చాలా తక్కువ. భావ వినిమయం కోసం సామాన్య ప్రజలు భాషను వాడుకుంటారు కాబట్టి పర్యాయపదాల జోలికి పోరు. అది వాళ్ళకు తెలియదు కానీ ఎదుటివ్యక్తి అంతస్తు, చదువు, హోదా, వయస్సు, సందర్భం లాంటి సామాజిక కారణాలవల్ల వాళ్ళు వాడే మాటల్లో కొంత తేడా చూపిస్తారు వీట్ని సరయిన సమానార్థకాలుగా చెప్పడానికి లేదు.

**3.0.** పదనష్టం :

వాడుకలో ఉన్న భాషలోకి ఇతరభాషా పదాలు వచ్చి చేర్తునట్లుగానే, ఉన్న పదాలు కూడా నష్టానికి గురవుతుంటాయి. సంస్కృత పదాలు రావడం వల్ల కొన్ని తెలుగు పదాలు నశించాయి, నశిస్తున్నాయి

ఉదా . దినం, అన్నం, భుజం, జీర్ణం, భయం, కోపం లాంటి సంస్కృత పదాలు రావడం వల్ల

పొద్దు, తిండి, రెక్క, అరగడం, అదురు, అలుగు లాంటి తెలుగు పదాలు నశించిపోవడమో, అర్థవిపరిణామానికి గురి కావడమో జరుగుతోంది

తరువాతి కాలంలో ఇంగ్లీషు పదాలు వచ్చి అంతవరకు వాడుకలో ఉన్న తెలుగు పదాలనే కాకుండా, సంస్కృత పదాలను కూడా వాడుకలో నుంచి తరిమేస్తున్నాయి.

ఉదా: హోటల్, టైం, స్పీడ్, స్లో, లేట్, పేపర్, ప్లేట్, నంబరు లాంటి చాలా పదాలు వాడుకలోకి వచ్చి -

భోజనశాల/పూటకూళ్లఇల్లు, సమయం/పొద్దు, వేగం/త్వరితం, నిదానం, ఆలస్యం, కాగితం,కంచం/గిన్నె, సంఖ్య/అంకె - లాంటి పదాలను వాడుకకు దూరం చేశాయి.

ఒక మాండలిక శైలికి గౌరవమూ, గుర్తింపూ రావడం వల్ల ఇతర మండలాల పదాలు నాశనమవుతున్నాయి. కోస్తా మాండలికం వల్ల ఇతర మండలాల్లోని తెలుగు పదాలు నశించడం చూడవచ్చు.

ఉదా: చీపురు, చీర, తాళం, బట్ట, కొట్టు, వంద, వెళ్ళు - లాంటి పదాలను వాడుకుంటూ

పొరక, కోక, బీగం, గుడ్డ, అంగడి, నూరు, పోవు -లాంటి రాయలసీమ పదాలను వదిలిపెడుతున్నారు

**4.0. వాడుకలో ఎక్కువ ఉన్న పదాలు :**

వాడుకలో ఉన్న భాషలో కొత్తగా పదాలు చేరడమూ, ఉన్న పదాల్లో కొన్ని ఎక్కువగానూ కొన్ని తక్కువగానూ వాడటమూ, కొన్నియితే అసలు వాడుకలో లేకుండా పోవడమూ జరుగుతుంటుంది. కానీ, ఫలానా పదం ఎక్కువగా, ఫలానా పదం తక్కువగా వాడుకలో ఉంది - అని ఖచ్చితంగా చెప్పడానికి ఇప్పటికి వీలులేదు. ప్రయత్నిస్తే మాత్రం వీలవుతుంది. ప్రింటయిన పుస్తకాల నుంచి ఇంగ్లీషు పదాలను సేకరించి `ఇంగ్లీషు వర్డ్ ఫ్రీక్వెన్సీ డిక్షనరీ' ని 15 సంవత్సరాలకు పూర్వమే తయారు చేశారు అమెరికాలో. ఇదీ అసమగ్రమనే చెప్పాలి. ఎందుకంటే చదువురాని వాళ్ళూ, భాషాభిమాన, దురభిమానాలు లేని వాళ్ళూ, భేషజాలు లేనివాళ్ళే సమాజంలో అధికం. వీళ్ళ భాష రచనల్లో ప్రతిఫలించదు. అందుచేత ఆ భాషా సమాజంలో అన్ని వర్గాల ప్రజల నుంచి కథలు, సంభాషణలు, వర్ణనలు, దినచర్యలు, వృత్తి సంబంధాలు లాంటి రకరకాల అంశాల గురించిన విషయ సేకరణ టేపుల్లో రికార్డు చేయాలి. తర్వాత వీటినుంచి పదాలను సేకరించి, ఏ పదం ఎన్నిసార్లు వచ్చిందో లెక్కకట్టాలి. ప్రతిపదం పక్కన అది ఎన్నిసార్లు వచ్చిందో రాయాలి. ఈ పదాలకు అక్షర క్రమములో కాకుండా హైయస్ట్ నుంచి లోయస్ట్ అనే ఆర్డర్‌లో డిక్షనరీని తయారు చెయ్యాలి. ఈ డిక్షనరీని చూస్తే ఎక్కువ మంది ఏ పదాల్ని వాడుతున్నారో, తక్కువగా వాడబడే పదాలు ఏవో తెలిసిపోతుంది. జనరల్ డిక్షనరీ పరిష్కరించలేని కొన్ని ముఖ్యమయిన సమస్యల్ని, వర్డ్ ఫ్రీక్వెన్సీ డిక్షనరీ లాంటి స్పెషల్ డిక్షనరీలు సులభంగా పరిష్కరిస్తాయి ముఖ్యంగా ప్రైమరీ, అడల్ట్ ఎజుకేషన్‌లకు రాసే టెక్స్ట్‌బుక్స్‌లో వాడదగిన పదాలను ఎన్నుకోవడంలోనూ, లిటరసీ పెంచడానికి రాసే పుస్తకాల్లో వాడే పదాలకూ, ట్రాన్స్‌లేషన్ సందర్భంలోనూ ఈ రకం డిక్షనరీ బాగా అవసరమవుతుంది.

**5.0. లిటరసీ రేటు పెంచడం :**

20వ శతాబ్దం మొదట్లో చదువు వచ్చినవాళ్ళు నూటికి ఒకరిద్దరికంటే ఎక్కువ ఉండి ఉండరు. బ్రిటీషువాళ్ళు స్కూలు చదువులు ప్రారంభించిన

తర్వాత లిటరసీ రేటు పెరగనారంభించింది. ఒక క్రమ పద్ధతిలో చదువులు చెప్పడం, చదివితే ఉద్యోగాలు రావడం, గ్రామాల్లో స్కూళ్ళు పెట్టడం - లాంటి కారణాలు దీనికి దోహదం చేశాయి 1947 తర్వాతి ప్రభుత్వాలు లిటరసీ రేటు పెరగడానికి శ్రద్ధ చూపడం అధికం చేశాయి. కానీ ఇన్ని సంవత్సరాలయినా ఇంకా 50శాతం దగ్గరే లిటరసీ రేటు ఉంది డ్రాప్‌అవుట్స్ లేకుండా చూడటానికి స్కూల్లో పిల్లలకు మధ్యాహ్న భోజనపథకం, నెలకు 3-5 కేజీలు బియ్యం ఉచితంగా ఇవ్వడం, ఫ్రీగా పుస్తకాలూ, వీలయితే జేబు ఖర్చులకు డబ్బులు ఇవ్వడం కూడా చేసి లిటరసీ పెంచడానికి ప్రయత్నాలు చేస్తున్నాయి తల్లిదండ్రులది ఆర్థిక సమస్య అయితే, పిల్లలది భాషా సమస్య ఈ సమస్య పిల్లవాడికి పరిమితం. ఈ సమస్యను పరిష్కరించే ప్రయత్నం ఎవరూ చెయ్యడం లేదు నిజానికి ఈ సమస్య భాషదికాదు పుస్తకాలు రాసే పండితులు కల్పించింది

**5.1 పదాల బరువు :**

భాషా సమస్యల్లో పిల్లలకు ఎదురయ్యేది పదాలకు సంబంధించింది మామూలుగా తాము ఎప్పుడూ, ఎక్కడా వినని పదాలు పుస్తకాల్లో కనిపిస్తే వాటిని చదివే పిల్లలకు అవి బరువుగా అనిపిస్తాయి (మాతృభాష) చదువుకోవడంలో మొదటి పని - `రాయడాన్ని'నేర్చుకోవడం. తన భాషలోని బేసిక్ పదజాలమూ, నిర్మాణమూ స్కూలుకు వెళ్ళే పిల్లవాడికి తెలిసి ఉంటుంది. కొత్త ధ్వనులతో వేరే భాషనుంచి వచ్చిన పదాలూ, కొత్త నిర్మాణంలోనివీ, అబ్‌స్ట్రాక్ట్ పదాలూ ఆ వయస్సు పిల్లవాడికి బరువు అవుతాయి. ఇలాంటి పదాలను ఒకే సమయంలో - రాయడమూ నేర్చుకోవాలి, అర్థమూ చేసుకోవాలి ఇది డబుల్ బరువు. ఆ స్థాయికి, ఆ సమయంలో ఈ తెలియని పదాలను కాకుండా తెలిసిన పదాలను వాడితే పిల్లవాడికి సగం బరువు తగ్గించినట్లుంటుంది సులభంగా రాయడం నేర్చుకుంటారు. కానీ పుస్తక రచయితలు దీన్ని గుర్తించడం లేదు. తమ పాండిత్యాలతో పుస్తకాలు రాసి పిల్లల్ని అదరగొట్టేస్తున్నారు ఉదా :2వ క్లాసు తెలుగు పుస్తకంలోని పదాల్ని చూడండి.

ఝంకారం, ఖగం, వేదపఠనం - 3వ పాఠం

ఛురిక, ఝషం - 4వ పాఠం,

తువ్వాయి, రవ్వలహారం - 8, కప్పీ, పప్పుదప్పళం, పుప్పొడి -11, లెస్స -12, వాఙ్మయం, విజ్ఞత, యజ్ఞం - 14, మర్కటం, చక్రం, ఆదర్శం, అర్హత, సప్తస్వరాలు, పూర్ణం, గద్యం - 15, జ్యోత్స్న, పార్శ్వం - 17, తెలుగు నెలలు, తిథుల పేర్లు - 25వ పాఠం.

ఇలాంటి పదాలు పలకలేకా, రాయడానికి తెలియకా, అర్థంకాక, తికమకలకు గురవుతారు పిల్లలు. తోటి పిల్లలు ఎగతాళి చేస్తారని ఫీల్ అవుతారు అసలే ఈ చదువులు వల్ల లాభం లేదు నష్టం తప్ప - అని తల్లిదండ్రులు కొందరు అనుకుంటున్న కాలంలో ఇలాంటి బరువు పదాల వల్ల, నేర్చుకొనే పిల్లవాడికి కూడా, మూలిగే నక్క పైన తాటికాయ పడ్డట్లు - అవుతుంది. చదువుల నుంచి పారిపోతాడు. ఈ రకం డ్రాప్ అవుట్స్ వల్ల లిటరసీ రేటు పెరగడం జరగదు

**5.2. ఫ్రీక్వన్సీ డిక్షనరీ సాయం:**

లోయర్ క్లాసు టెక్స్ట్ పుస్తకాలు రాసే ముందు ఆ పుస్తకం చదివే పిల్లవాని శక్తిసామర్థ్యాల్ని గుర్తుపెట్టుకోవాలి. గ్రామ ప్రాంతాల్లో లిటరసీ తక్కువ. పెద్దవాళ్ళకు చదువులు రావు వీళ్ళకు చదువులు ఆసక్తికరంగా ఉండాలంటే తెలిసిన పదాలనే పుస్తకాల్లో వాడాలి. ఈ పదాలను ఏరుకోవడానకి వర్డ్‌ఫ్రీక్వన్సీ డిక్షనరీ బాగా పనికొస్తుంది లోయర్ క్లాసు పుస్తకాల్లో హై ఫ్రీక్వన్సీ పదాలను వాడుకుని, క్లాసూ, వయస్సూ పెరిగేకొద్దీ తర్వాత ఫ్రీక్వన్సీలో ఉండే పదాలను కూడా వాడుకోవచ్చు. అప్పటికి అతనికి రాయడం వచ్చేసి ఉంటుంది కాబట్టి కొత్తపదాన్ని అర్థం చేసుకోవడం అన్నది ఒక్కటే బరువు దీన్ని మోయ్యగలడు పదాలను ఎంచుకోవడంలో పుస్తకరచయితల అభిమాన దురభిమానాలకు, ఇష్టాయిష్టాలకు చోటివ్వకుండా ఈ డిక్షనరీ పదాలను అందిస్తుంది.

**6.0 ట్రాన్స్‌లేషన్‌లో :**

తెలుగు అకాడెమి ఏర్పడ్డి 1968 నుంచి తెలుగు మీడియంలో టెక్స్ట్ పుస్తకాలు తయారు చేసి అందిస్తోంది. అప్పటి నుంచే ట్రాన్స్‌లేషన్‌కు ఒక గుర్తింపూ, గౌరవమూ వచ్చింది. దీని ఉద్దేశం ఏమిటంటే - తెలుగు వాళ్ళకు ఇంగ్లీషు అర్థం కాదు కాబట్టి తెలుగులో పుస్తకాలు వెయ్యాలనుకున్నారు. కానీ మేధావులంతా కూర్చొని ఆ పుస్తకం చదివే వాడికి ఆ తెలుగుభాష

అర్థమవుతుందా లేదా అన్నది ఆలోచించకుండా మొత్తంగా తెలుగులోకి మార్చే ప్రయత్నం చేశారు. భాషలోని సామాన్య పదాల్ని దాదాపు తెలుగులోకి మార్చారు. ఇది బాగానే ఉంది. కానీ ఇంగ్లీష్ టెక్నికల్ పదాలకు తెలుగులో సమాన పదాలులేవని వాటిని సంస్కృతంలోకి మార్చి పదనిఘంటవులు తయారు చేశారు అర్థమయ్యే ఇంగ్లీషు పదాల చోటులో అర్థంకాని, వినని, నోరుతిరగని పదాలు వచ్చాయి

ఉదా · సర్క్యులర్ - గస్తీపత్రం

బ్యాక్ నంబర్ - వెనుక పడ్డ నంబరు

వ్యవసాయ కూలీకి కూడా తెలిసిన యూరియా, కాంప్లెక్స్, ఫాస్పేట్ ఎరువుల పేర్లు - నత్రజని, భాస్వరం గా మారాయి

రిక్షా, భిక్షగాళ్ళకు కూడా తెలిసిన బస్టాండు - ప్రయాణప్రాంగణం అయ్యింది.

ఇంకా · ఆఫీసు - కార్యాలయం, స్కూలు - పాఠశాల

బిల్డింగ్ -భవనం, కాలేజి - కళాశాల

లాంటి పదాలను రాతలోనూ, కొంతమంది ఉపన్యాసాల్లోనూ మాత్రం చూస్తాం. కొన్ని సోషల్ సైన్సస్, సైన్స్ పుస్తకాలు చదివితే అయోమయంగా ఉంటుంది. తెలిసింది కూడా తెలియదు, అర్థం కాదు

ఈ మధ్య ఒకాయన 'బిలియార్డ్స్' అనే పదానికి `పీతస్థత్రికందుక కాష్ఠతాడిత క్రీడ' (దీన్ని 'పీత్రికా క్రీడ' అనొచ్చుట) అనీ, `కంప్యూటర్' పదానికి `ధీ యంత్రం' అనీ ట్రాన్స్‌లేట్ చేశానని చెప్పుకున్నారు. ఇందులో క్లుప్తత, సరళత, ఉన్నాయా? చచ్చిన తర్వాత పేరు బాగాలేదని మార్చినట్టుంది ఈపద్ధతి. ట్రాన్స్‌లేషన్ ఉద్దేశ్యమే నీరుగారి పోయింది. ఇలాంటి ట్రాన్స్‌లేషన్ పదాలను విలువ కట్టేది ప్రజలు. ఆ ప్రజలు ఏ పదాలకు పట్టం కట్టారో మనకు తెలియజేసేది పద ఫ్రీక్వెన్సీ డిక్షనరీలు.

గురజాడ, గిడుగుల ఉద్యమం ప్రజల భాషను రచనల్లోకి తేవడానికి ప్రయత్నించి, దాదాపు సఫలం అయ్యింది. వాడుక భాష, రచనా భాష దగ్గరయ్యాయి. కానీ ట్రాన్స్‌లేషన్‌లో అభివృద్ధి వ్యతిరేక ధోరణులు వచ్చి

వాడుకలోని పదాలకు, రచనల్లోని పదాలకు అంతరం ఏర్పడింది ఈ అంతరం పోవాలంటే ఫ్రీక్వెన్సీ డిక్షనరీ అవసరం. హై ఫ్రీక్వెన్సీ ఉన్న పదాల్ని లోయర్ క్లాసు టెక్స్ట్ పుస్తకాల్లో, ప్రజా సంబంధ నోటీసుల్లో, సర్టిఫికెట్లు, అప్లికేషన్లు, జాబులూ, సమాచార పత్రాల్లో వాడితే ఎక్కువ మందికి అర్థమవుతుంది. ఉపయోగముంటుంది పదాలు ఏ భాషవయినా, అర్థమయితే వాటినే వాడాలి. అచ్చం, మిశ్రమం అనే భావం ఇతరత్రానేకాదు, భాషలో కూడా ఉండకూడదు అభివృద్ధికి అన్నీకావాలి. గిరి గీసుకుంటే బయటకురాలేం. సుఖపడలేం. అనుకున్నది సాధించలేం

## ఈ పేపరు రాయడానికి ఆధారాలు

1. జి.యన్. రెడ్డి గారి తెలుగు పర్యాయ పద నిఘంటువు
2 తెలుగు అకాడెమి తయారు చేసిన పారిభాషిక పదకోశాలు.
3. A.P గవర్నమెంట్, ప్రిన్సిపల్ సెక్రటరీ, నాయర్ గారి టి.వి. ఇంటర్వ్యూ.
4 వార్త, ఈనాడు దినపత్రికల్లో వస్తున్న అనువాదాలు
5. ఇంగ్లీష్ వర్డ్ ఫ్రీక్వెన్సీ డిక్షనరీ - హెరిటేజ్ ప్రచురణ, అమెరికా.



# వ్యవసాయపు పొడుపు కథలు

డా॥ మాళిగ వ్యాసరాజ్

ప్రాచీన, ఆధునిక సాహిత్య, భాషా శాస్త్రాల్లో జరిగినట్లు ఈనాడు జానపద విజ్ఞాన రంగంలో కూడా బహుముఖంగా పరిశోధన సాగుతూ ఉంది.

సామాజిక కార్య కలాపాల్లో ప్రాముఖ్యత వహిస్తున్న జానపద విజ్ఞానానికి మూలమైన సాంప్రదాయక వృత్తులను కూడా సాకల్యంగా పరిశీలించ వలసి వుంది అనాదిగా వ్యవసాయం అనేక సమాజాల్లో సంప్రదాయ వృత్తిగా వస్తూవుండడం వల్ల వ్యవసాయ సాంస్కృతిక విజ్ఞాన రంగంలో వర్ణనాత్మక పరిశోధనలు, విశ్లేషణాత్మక చర్చలు జరగవలసి వుంది

మనది వ్యావసాయక దేశం. అందువల్ల మన గ్రామీణ సంస్కృతి యావత్తూ వ్యవసాయం చుట్టే అల్లుకొని పోయింది అందుచేత వ్యవసాయం, సేద్య కార్య క్రమాలు, ఋతువులు - అదును, గ్రామీణులపాత్ర, వ్యవసాయ - సాంస్కృతిక సంబంధాలు, వ్యవసాయం - జానపద విజ్ఞాన బహుముఖ తలాలు మొదలైన అంశాల మీద పరిశోధన సాగవలసి వుంది

జానపద విజ్ఞానంలో పొడుపు కథలు ఓ ప్రధాన భాగం కాబట్టి మోట కట్టడం, దుక్కిదున్నడం, నారు పోయడం, నాటడం, కలుపు తీయడం, పంట కోయడం, కుప్పలూడ్చడం మొదలైన సేద్యపు పనులు, అరక, గోర, దంతె, దబ్బ, మాను, గొర్రు, బొక్కెన, పార, గడ్డపార, కొడవలి, గొడ్డలి మొదలైన వ్యావసాయికోపకరణాల నిర్మాణం, ఉపయోగాలను సూచిస్తూ ఆలోచనలను ప్రేరేపిస్తూ వ్యవసాయ పొడుపు కథల్ని సంకలనం చేసి, విశ్లేషిస్తే అదొక బృహద్గ్రంథ మౌతుంది అందువల్ల ఈ వ్యాసాన్ని వ్యవసాయ పొడుపు కథల్లో ఒక భాగమైన పనిముట్లు, వృక్షాలు, పళ్లు, కాయగూరలు, ధాన్యాలమీద ఏర్పడిన పొడుపు కథలకే పరిమితం చేయడమైంది.

వ్యవసాయపు పని ముట్లలో కొన్ని పొలాన్ని తీర్పు తీర్చడానికి వుపకరిస్తాయి. మరికొన్ని పొలంలో వుపయోగ పడతాయి ఫొలాన్ని

వ్యవసాయానికి అనుకూలంగా రూపొందించడంలో నరికే, తవ్వే, చదునుచేసే సాధనాలు సహకరిస్తాయి. గొడ్డలి నరికే సాధనం. పెకలించే సాధనం గడ్డపార. తవ్వే సాధనం పార పొలంలో వుపయోగించే పనిముట్లు కోతకు ముందు భూమిని దున్నటానికి, నీరు తోడటానికి సాధనాలుగా వాడుతారు. కొన్ని సాధనాలు కేవలం దున్నేవికాగా మరికొన్ని విత్తేవి. జడ్డిగం విత్తే సాధనం. కొన్ని భూమిని దున్నేవైతే మరికొన్ని దుక్కిని దున్నేవి నాగలితో భూమిని దున్నుతారు. విత్తనం వేసేవేళ గొర్రుతో దున్నుతారు. కపిల పశువుల సాయంతో నీరు తోడటానికి పనికొచ్చే సాధనం. లోతు బావుల్లోంచి ఏతంతో, లోతు లేని వాటినుంచి గూడతో పశువుల సాయం లేకుండా రైతులు నీళ్లు తోడుతారు

ఈ సాధనాల నిర్మాణం, వాటి పని తీరు, వాటి చుట్టూ అల్లుకొన్న పొడుపు కథలు, ఆ కథల్లోని స్వారస్యం, అన్వయాలు, చింత, టెంకాయ వంటి చెట్లకు; అరటి, పనస, రేగి, తాటి, పనస వంటి పళ్లకు, బెండ, గుమ్మడి, పొట్ల, ముల్లంగి, మునక్కాయ వంటి కాయగూరలకు; వరి, రాగులు, జొన్నలు, నూగులు, ఉద్దులకు సంబంధించిన పొడుపు కథలు సంక్షిప్తంగా ఈ వ్యాసంలో అనుశీలింప బడతాయి

ఆది మానవుడు అడువుల్ని నరికి పోడు వ్యవసాయం చేయడం ప్రారంభించినపుడు చెట్లను కొట్టడానికి గొడ్డలి అనే సాధనాన్ని కనిపెట్టాడు.

చేను అనేది పొదలతో నిండి వుంటుంది. గొడ్డలి అనే ఇనుప పనిముట్టు ముళ్ల పొదలు, చెట్లు మొదలైన వాటిని కొట్టేందుకు వుపయోగ పడుతుంది. కనుక వ్యవసాయంలో చెట్టు చేమలను నరికి పొలాన్ని తయారు చేసేందుకు తొలి పనిముట్టుగా గొడ్డలిని వుపయోగించ వలసి వుంటుంది. ఈ పనిముట్టు పిచ్చ గొడ్డలి, గొడ్డలి, గండ్ర గొడ్డలి అనే పేర్లతో వివిధ పరిమాణాల్లో భిన్న రూపాల్లో వుంటుంది. పశువుల్ని నరక డానికి ఉపయోగించేది గండ్ర గొడ్డలి. పరశురాముని ఆయుధం గండ్ర గొడ్డలి దీనితో చెట్లు నరకరు. పిచ్చ గొడ్డలికే పాల గొడ్డలి, చెప్ప గొడ్డలి అని పేర్లున్నాయి. చెట్టెక్కి గుబురుగా వున్న కొమ్మల్ని దీనితో నరుకుతారు గొడ్డలితో చెట్లను, వాటి కొమ్మల్ని కొడతారు. లావుపాటి మొద్దుల్ని చీల్చడానికి, తుండులు చేయడానికి కట్టెలు కొట్టేవారు గొడ్డలిని వాడుతారు.

గొడ్డలికి సంబంధించి ఎన్నో పొడుపు కథలు ప్రచారంలో వున్నాయి వీటిలో ఏ ఒక్కటీ గొడ్డలి నిర్మాణాన్ని ప్రత్యక్షంగా సూచించేవిగా లేవు కొన్ని పొడుపుకథలు గొడ్డలి పనిని పరోక్షంగా స్ఫురింప జేస్తున్నాయి

1. - 'అడవిలో అబోతు రంకె వేసింది'

2 - 'అలాము కొండకు సలాము కొట్టు'

3. - 'గుంపు చెట్లలో గుబాదెబా'

4 - 'పొడిపొడి చెట్లల్లో పొట్టెద్దు రంకె వేసింది'

కొన్ని పొడుపు కథలు గొడ్డలి నిర్మాణాన్ని పరోక్షంగా, దాని పనిని ప్రత్యక్షంగా తెలుపు తున్నాయి

5. - 'గుబులు గుబులు చెట్టల్లో గూనెద్దు రంకె వేసింది'

6. - 'వేలెడంతోడు లేడిని కొట్టాడు'

3, 4, 6 పొడుపుకథలు చిన్నగొడ్డలిని మిగిలినవి పెద్దగొడ్డలిని సూచిస్తున్నాయి. చిన్న గొడ్డలి పొట్టెద్దు తోనూ, పెద్దగొడ్డలి అబోతు తోను పోల్చ బడింది గొడ్డలి వేటు పొగరుబోతు ఎద్దు రంకెగా ఉపమించబడింది

గొడ్డలితో చేనులోని పొదల్ని నరికిన తర్వాత వాటి భూమిలోని మొదళ్లను గడ్డపారతో పెళ్ళగిస్తారు. ఇది పొడవుగా వుండే పనిముట్టు దీనితో గుంతలు లోడుటకు గాకుండా, పెద్ద పెద్ద రాళ్లను, దుంగలను దొర్లిస్తారు గడ్డపారను - గడ్డపార, గడారు, గడ్డ పలుగు, గడ్డ పొగడ, గునపం అని భిన్న ప్రాంతీయులు వ్యవహరిస్తున్నారు

1. చక్కని మానుకు చెక్కలులేవు.

2. చిన్నదానికి చిన్నబొక్క,
పెద్దదానికి పెద్దబొక్క,
దాని అక్కకు బొక్కేలేదు.

మొదటి పొడుపుకథ గునపం నిర్మాణాన్ని గురించి తెలుపుతుంది ఇది నిటారుగా వుంటుంది. పక్కలకు ఏమీ వుండదు. అందువల్లే చక్కని మానుకు చెక్కలులేవు' అని అనడం.

సూది, దబ్బనం, గడ్డపార ఈమూడింటి అకృతి ఒక్కటే. కాని పరిమాణం క్రమంగా ఎక్కువ సూది దబ్బనాలకు పై భాగాన రంధ్రాలుంటాయి. గునపానికి వుండవు. ఈ అంశాన్ని రెండో పొడుపు కథ సూచిస్తోంది. ఈ పొడుపుకథ బూతు పొడుపు కథేమో అన్న అపోహకూడా కలుగుతుంది. విడుపు మాత్రం అశ్లీలంగా లేదు.

వ్యవసాయదారుడు నేలను పైపైన తవ్వటానికి వుపయోగించే సాధనం పార. ఇనుముతో చేయబడ్డ దీనికి చెక్కతో చేసిన కాడ వుంటుంది. దీనితో నీటి మడవలు తిప్పుతారు; చేనిలోని మూలలు తవ్వుతారు, గనిమలు అండ తీస్తారు, గట్లు ఎగవేస్తారు, రైతు నీళ్లు కట్టడంలో దీనిని వాడటం వల్ల 'చిన్నోడు నీళ్లు కట్టె' అనే పొడుపు కథ ఏర్పడింది. చిన్నోడు అనే పదం అరిగిపోయిన గొణ్ణాం పారను సూచిస్తోంది. రాగి, మిరప పైర్లకు నీళ్లు కట్టేటప్పుడు మాత్రం ఈ గొణ్ణాం పారను వాడతారు.

పశువులకు వరిగడ్డి లేనప్పుడు రైతులు బీళ్లలోవున్న పచ్చగడ్డిని పారతో చెక్కుతారు. దానిని చెక్కుడు పార అంటారు. దానికి సంబంధించి 'మారు ఎల్లప్ప నేల గీరప్ప' అనే పొడుపు కథ పుట్టింది.

చేనిలో పారతో పని పూర్తి అయిన తర్వాత దానిని యింటికి తెచ్చి చూరుకు తగిలిస్తారు. అందుకే, 'చేనులో ఎక్కుతాడు, చూరులో ఇరుక్కున్నాడు' అనే పొడుపు కథ ఏర్పడింది.

మడకకు నాగలి అని ప్రాంతీయ వ్యవహార భేదం వినిపిస్తోంది. మడక - దున్నే సాధనం ఆకారాన్నీ, ప్రయోజనాన్నీ, దున్నే నేలను బట్టి విశేషణ పదాలు దీనికి చేరుతూ వుంటాయి. ఉదాహరణకు తోకనాగలి, మెట్టనాగలి, బురద నాగలి, దబ్బనాగలి మొదలైనవి. నాగలికి నాగెల, నాగేలీ, నాంగలి అనే రూపాంతరాలు కనిపిస్తున్నాయి. నాగలి బలరాముని ఆయుధంగా కూడ పురాణాలలో వర్ణించ బడింది

'ముగ్గురు మొగుళ్లకు ఒకటే పెళ్లాం' - ఈ పొడుపుకథ కర్రు, మేడి, నొగ, అనే మూడు భాగాలు నాగలిలో వుంటాయనే విషయాన్ని సూచిస్తోంది 'మాయింటి వెనకాల గూనోడు' - నాగలి వంకరగా వుంటుంది. కాబట్టి గూని వాడితో పోల్చబడింది. రైతులు సాధారణంగా తమ పశువుల్ని తమ

వ్యవసాయపు పనిముట్లను ఇంటివెనుక వుంచుతారు. ఈ పొడుపు కథ మడక ఆకారంతోపాటు దాని వునికిని తెలియ చేస్తోంది కాని ప్రయోజనాన్ని గురించి ప్రస్తావించడం లేదు.

'తలలు మూడు కాళ్లు పది
మూడు తోకలు ఆరు కన్నులు
నాలుగు కొమ్ములు రెండు చేతులు

- అనే విచిత్రమైన ఈ పొడుపు కథకు విరుపు - అరక మడక వేరు, అరక వేరు. ఎద్దులను కట్టి సిద్ధ పరచిన నాగలిని అరక అంటారు

తలలుమూడు =జోడెద్దుల తలలు రెండు+రైతు తల ఒకటి

కాళ్లు పది =జోడెద్దులకాళ్లు ఎనిమిది +దున్నేవాడి కాళ్లు రెండు

మూడు తోకలు=జోడెద్దుల తోకలు రెండు+ములుగర్ర జాటి ఒకటి/దున్నేవాని గోచి ఒకటి

ఆరు కన్నులు =రెండెద్దులవి నాలుగు+దున్నేవాడివి రెండు

నాలుగు కొమ్ములు =రెండెద్దులవి

రెండు చేతులు =సేద్యగాడివి

'పోయే పోయే పిడికిడి ముక్కిడి పట్నమంతా గుల్ల చేసింది' ఈ పొడుపుకథ నాగలి నిర్మాణాన్ని, విధిని తెలుపుతుంది. చాలు చక్కగా సాగేందుకు మేడి ఉపయోగ పడుతుంది. నొగను కాడికి కట్టి ఎద్దుల మెడపై వుంచుతారు. ఎద్దులు ముందుకు పోతే నాగలి ముందుకు సాగుతుంది. 'పిడికిడి' అనే పదం పరిమాణాన్ని తెలియ జేస్తుంది.

ముక్కిడి =ముక్కులేనిది (ముక్కు తదభావ ద్యోతకంబై యిడి వర్ణకంబగు - బాలవ్యాకరణం). ఇక్కడ ముక్కు అంటే అరిగిపోయిన నాగలి అది పట్నమంతా అంటే పొలాన్నంతా గుల్ల (దుక్కి) చేస్తుంది. పిడికిడి ముక్కడిని తిరుత్తణి ప్రాంతంలో గొణ్ణాం మడక అని వ్యవహరిస్తారు.

ముప్పై రెండు కుంటల భూమిని గొర్రు అంటారు. గొర్రెడు అనే ప్రయోగం శాసనాల్లో కూడ కనిపిస్తోంది. అయితే ఈ కొలమానార్థంలో కాక

విత్తే పనిముట్టుగా కూడ గొర్రు వ్యవహారంలో వుంది. శ్రీకాకుళం, విశాఖపట్నం ప్రాంతాల్లో ఈ పనిముట్టు వాడకం లేదు

'మూడు కాళ్ల ముసలమ్మ నీళ్లు తాగి కొయ్య మింగుతుంది'. విత్తనాలను వరుసలో వేసేందుకు వుపయోగించే చెక్క పనిముట్టు గొర్రు. గొర్రుకు కింది భాగాన మూడు/నాలుగు/ఎనిమిది కొయ్యలుంటాయి. మూడు కొయ్యలు వుండే గొర్రును వాడే ప్రాంతంలో పై పొడుపుకథ పుట్టి వుంటుంది ముసలమ్మ రెండు కాళ్లతో సరిగా నడవలేక మూడవ కాలుగా ఊత కర్రను వుపయోగిస్తుంది. అందువల్ల మూడు కాళ్ల గొర్రు ముసలమ్మతో పోల్చబడింది.

విత్తనాలను 'వర పదును' (సరిపడే తేమ భూమిలో లేకుండటం) వున్నప్పుడు నీళ్లలో తడిపి జడ్డిగంలో వేస్తారు. కొయ్యగొర్రు తడిసిన విత్తనాలను మింగుతుంది. ఈ గొర్రు నిర్మాణాన్ని, ఈ విత్తే ప్రక్రియను పై పొడుపు కథ సూచిస్తుంది.

విత్తనాలు వేసే గరాటు వంటి సాధనం జడ్డిగం. దీనిని గొర్రుపైన అమరుస్తారు. గొర్రుకువుండే మూడు కొయ్యలకు మూడు రంధ్రాలుంటాయి జడ్డిగం నుంచి మూడు వెదురు బొంగులు ఈ రంధ్రాలకు కలపబడి వుంటాయి జడ్డిగంలో వేసే విత్తనాలు ఈ మూడు వేరు వేరు వెదురు బొంగుల గుండా కొయ్య రంధ్రాలనుంచి పొలం చాలుల్లో పడతాయి

'ముగ్గురు అన్నదమ్ములకు ఒకటే ఇల్లు' అనే పొడుపు కథ పై విషయాన్ని వ్యక్త పరుస్తోంది. ఏడాదిలో రెండుసార్లు మాత్రమే వేరుశెనగ విత్తనాలు విత్తుతారు. అప్పుడు మాత్రమే జడ్డిగం అవసరం వుంటుంది. మిగతా సమయంలో దీనిని రైతన్న అటక మీదికి ఎక్కిస్తాడు అంచేత -'అటకెక్కిన అల్లుడు ఆర్నెల్లయినా దిగడు' అనే పొడుపు కథ పుట్టింది

ఎద్దులకు కట్టి బావి నుంచి పొలాలకు నీరుతోడే సాధనం కపిల. కపిలకు కపిలె/కపిలి, కబల/కవిల అనే శాబ్దిక రూపాంతరాలు కన్పిస్తున్నాయి. మోట పర్యాయ పదం. తోలు/ఇనుప భానకు తోలుతో తయారు చేసిన తొండాన్ని తగిలించి జోడెద్దుల సహాయంతో రైతు కపిలతో బావినుంచి నీళ్లు తోడి పొలం సాగుచేస్తాడు 'మనిషి దిగని బావిలో నెమలి నీళ్లు తాగుతుంది' ఈ పొడుపుకు విడుపు - కపిల. మనిషి దిగని బావి అంటే

మెట్లుండే దిగుడు బావి కాదు మెట్లులేని మామూలు బావి. బాన నెమలి పురిలా, తొండం నెమలి మెడలా వుంటుంది అందుచేత ఈ పొడుపు కథ పుట్టింది.

'తెల్లవారితేనే పోయి నల్ల కుక్క బావిలోపడె'
'నల్లని పిల్లోడు బావిలో దుంకు'
'పొద్దున్నే పోయి నల్లోడు బావిలో పడె'
'మబ్బులోనే లేచి మొద్దోడు బావిలోపడె'

పై పొడుపు కథల్లో - తెల్లవారితే /పొద్దున్నే / మబ్బుతోనే అనే పదాలు కపిల తోలే కాలాన్ని సూచిస్తాయి. కపిల బానను కుక్కతోను, నల్లపిల్లోడు / నల్లోడు, మొద్దోడుతోను పోల్చడం జరిగింది

'దూలాలు కదిలాయి తుమ్మెదలు కదిలాయి
అల్ల నేరెడు పండు ఆడుతూవచ్చె'

దులాయి కదిలాయి = కపిలతోలే రైతు కాళ్ల కదలికలు
తుమ్మెదలు కదిలాయి = కపిలను లాగే నల్లని ఎడ్ల కదలిక
అల్ల నేరెడు పండు = నల్లని తోలు తిత్తి/బాన
ఆడుతూ వచ్చె = బావిలోనుంచి ఊగుతూ పైకి రావటం

కపిల బాన బావిలో నీళ్లు నింపుకొని పైకివచ్చే దృశ్యాన్ని (slow motion లో) దృశ్యీకరిస్తూ జానపదుడు ఈ పొడుపును అల్లాడు ఇదే అంశాన్ని తీసుకొని 'అల్లనేరెడు కాయలు ఆడుతూ పాడుతూ వస్తే దూలాలు స్తంభాలు కదలుతూ వస్తాయి' అంటూ కొంత పాఠ భేదంతో మరో పొడుపు కథగా అల్ల బడింది. బావిలో నుంచి పైకి వచ్చిన కపిల బానలోని నీళ్లు తొండం ద్వారా దోనె లోకి పడే దృశ్యాన్ని, 'నిండుమనిషి నిల్చుని వుచ్చపోయు' అనే పొడుపు కథగా మలచబడింది.

పొలాలకు నీళ్లుతోడే ఏటవాలు యంత్రం ఏతం. 'ఏతము తనుతా వంగిన - పాతాళము నీరు దెచ్చు' అని ఓ అజ్ఞాత కవి వర్ణించాడు 'అతీ గతీ లేని అడవిలో ఏనుగు ఘీంకరిస్తూంది'. అతీ గతీ లేని అడవి అంటే పొలంలో బావి దగ్గర ఏతాంతో నీళ్లు తోడేటప్పుడు ఒక విధమైన శబ్దం

వస్తుంది. ఈ పొడుపు పొడిచిన వాడికి ఆ శబ్దం ఏనుగు ఘీంకారంలా వినిపించింది

'కాళ్లు పంగటించి కమ్మంగ దించి
ఎత్తెత్తి కొట్టంగ ఏరు పారు తుంది'

ఈ పొడుపుకథ ఏతాం వాడకాన్ని తెలియ చేస్తోంది ఏతాన్ని వుపయోగించి నీళ్లు ముంచి పోసే వ్యక్తి తన కాళ్లను ఎడంగా పెడతాడు ఏతాం గడకు తగిలించిన బానను నీటిలోకి ముంచుతాడు. నీటిని ఎత్తెత్తి పోస్తాడు. అప్పుడు నీరు చిన్న ఏరులా పారుతుంది. ఈ పొడుపు బూతులా విన్పించినా విడుపు మాత్రం ఏతాం పని తీరును చాలా సరసంగా తెలుపుతోంది

గూడ నీళ్లు తోడే సాధనం. ఇది శంఖాకారంలో వుంటుంది దీనిని వెదురు బద్దలతో చిక్కగా అల్లుతారు. కొన్ని ప్రాంతాల్లో ఇనుప గూడలను కూడా వాడడం కద్దు. ఈ గూడకు రెండు వైపులా వుండే రెండేసి తాళ్లను ఇద్దరు మనుషులు చెరొకవైపు పట్టుకొని పల్లంలో నుంచి మిట్టమీదికి నీళ్లను తోడుతారు.

'బావికి గట్టుకి బంగారు పాప' - ఈ పొడుపుకు విడుపు - గూడ. నీళ్లను ఎత్తి పోసేటప్పుడు ఈ గూడ దాదాపు ఊయలలా ఊగుతూ వుంటుంది. ఉయ్యాలలా దీనికి నాలుగు తాళ్లు వుంటాయి. ఉయ్యాల పాప అంటే బంగారంలా అందరికీ అభిమాన పాత్రమే.

చిన్న చిన్న గుంటల్లోంచి, చెలమల్లోంచి నీళ్లను తోడేటప్పుడు ఈ గూడ నీళ్లలో ఆడుకొనే పిల్లాడిలా అనిపిస్తుంది. అందుకే 'గుంతలోని పిల్లాడు గంతులేయు' అనే పొడుపు కథ పుట్టుకొచ్చింది.

కొడవలి కోత సాధనం. దీనిని ఇనుముతో కానీ ఉక్కుతోకానీ తయారు చేస్తారు. 'వీపేమో గూని ఒళ్లంతా పళ్లు' - కొడవలి వంపుగా వుంటుంది. కాబట్టి దీని వీపు గూనిగా వర్ణించ బడింది. లోపలి వైపు అంచున రంపపు పళ్లు (కక్కులు) వుంటాయి. కాబట్టి ఒళ్లంతా పళ్లు అని చెప్పబడింది. దీనినే 'వంకర గాడిగి వంద మెట్లు' అనే మరో పొడుపు కథగా జానపదుడు మలిచాడు.

'ఊరికి పోరా అన్నా, అడవికిపోరా అన్నా, చేనికిపోరా అన్నా, (కర్ర, కత్తి, కొడవలి) ఊరికి వెళ్లేటప్పుడు కర్రను పట్టుక పోతారు అడవికి వెళ్ళేటప్పుడు వెంట కత్తిని తీసుకు పోతారు. చేనుకు పోయేటప్పుడు సాధారణంగా వ్యవసాయదారులు కొడవలిని పట్టుక పోతారు 'చేనులో చెన్నేగాడు మానులో మన్నేగాడు' - చేనులో పని చేసేటప్పుడు నేలమీద, మానులో అంటే చెట్టుపై మణేగాడిలా అంటే మన్నెదొరలా అగ్రభాగాన వుంటాడని ఈ పొడుపు కథకు తాత్పర్యం.

'జయమును విజయునకీయవె
హయముల ములుకోల మోపి అదలించి మహా రయమున'

- అంటూ నృసింహకవి కృష్ణ శతకంలో ములుకోల శబ్దాన్ని ప్రయోగించాడు ఎడ్లను పొడిచే మునికోల అని నైఘం టికార్థం. దీనికే ముల్గర్ర అని కూడా వ్యవహారం. బొటన వ్రేలిమందం, దాదాపు మీటరు పొడవుండే వెదురు కర్ర, చివరన ఇనుప ముల్లు (చీల/మేకు) వుంటుంది.

'ఒంటి గొల్లవాడు ఇద్దరిని పొడుచు' - ఈ పొడుపుకు విరుపు - ముల్లుగర్ర 'ఇద్దరిని' అన్న మాట జోడెద్దులను సూచిస్తుంది ఇది నిర్మాణాన్ని తెల్పడం లేదు. దానిని వుపయోగించే తీరును మాత్రమే వ్యంజిస్తోంది. దీనిని ప్రధానంగా మడక దున్నేటప్పుడు వాడతారు. చాలు క్రమం తప్పక దున్నేందుకు, ఎద్దులను ఈ కర్రతో పొడుస్తారు. మడక నడిపే వ్యక్తి మడక వెనుక వుంటాడు. మడక ముందు ఎద్దులుంటాయి. ఎద్దులకూ, వాటిని నడిపే వ్యక్తికీ మధ్య కొంత దూరం వుంటుంది. కాబట్టి ఈ ములుగర్ర ఆదూరంలో వుండే ఎద్దుల్ని తోలేందుకు పొడవుగా వుంటుంది. ఈ పొడుపులో 'ఒంటి గొల్లవాడు అంటే ములుగర్ర. ఇద్దరిని పొడుచు' అంటే ఒకే కర్రతో జోడెద్దుల్ని పొడవడం అని అర్థం. ఒకప్పుడు సారథులు రథానికి పూన్చిన గుర్రాల్ని వేగంగా, సరైన దిశలో నడపటానికి ములుగోలలను వాడే వారు ప్రస్తుతం ఈ పనిముట్టు వ్యవసాయానికే పరిమితమైంది.

వ్యవసాయంలో భాగంగా రైతులు చింత, టెంకాయ వంటి చెట్లను; అరటి, పనస,రేగి, తాటి వంటి పళ్లను, బెండ, గుమ్మడి, పొట్ల, ముల్లంగి,

మునక్కాయ, వంకాయ వంటి కాయగూరలు; వరి, రాగులు, జొన్నలు, ఉద్దులు వంటి ధాన్యాలను పండిస్తారు.

చెట్లలో బాగా చేవైన చెట్టు చింతచెట్టు. ఇది యింటి కలపకు పనికిరాదు. కట్టెకు బాగా పనికి వస్తుంది చింతకాయలు, చిగురు వంటకు ఉపయోగిస్తారు. చింతకు సంబంధించిన సామెతలు లోకవ్యవహారంలో వినిపిస్తాయి 'చింతలేనమ్మకు సంతలో గూడ నిద్ర. చింత చచ్చినా పులుపు చావదు. అతని కళ్లు చింత నిప్పుల్లా వున్నాయి. చింతచెట్టు చిగురుచూడు చిన్నదాని పొగరుచూడు' అని సినిమా పాట. చింతకు, చింతకాయలకు సంబంధించిన పొడుపు కథలు.

**ఆకారానికి పెద్దవి ఆకులేమో చిన్నవి.**

**కన్నవారంతా కోణంగులు - చింతమాను**

**ఆకాశంలో వేలాడే కొడకళ్లు - చింతకాయలు.**

టెంకాయ చెట్టులో నిరుపయోగమైంది ఏదీలేదు నేడు టెంకాయ మాను యింటి దూలాలకు, మట్టలు, మొద్దులు పొయ్యికి పనికి వస్తాయి. కొబ్బరిపీచు, కొబ్బరి, కొబ్బరి నీళ్లు ఎన్ని రకాలుగా ఉపయోగ పడతాయో చెప్ప పని లేదు.

వేసవిలో నీళ్ల తాపాన్ని అణచే కల్తీ లేనిది కొబ్బరి బొండాం. దీనికి సంబంధించి పొడుపు కథలు అనేకం కనిపిస్తాయి.

**తాగడానికి నీరు తానమాడే దానికి నీరులేదు - టెంకాయ**

**అబ్బారెడ్డి భార్యకు డెబ్బైమంది బిడ్డలు**
**బిడ్డ బిడ్డకి తవ్వపాలు - టెంకాయ**

మానవుడు ఆహారం అవసరార్థం కూరగాయలు పండించాడు. ఆ పంటలో భాగమైన వాటికి సంబంధిత పొడుపు కథలు ఎన్నో వెలువడ్డాయి.

**పచ్చని పెట్టెలో పదిసరాల ముత్యాల దండ**
**చూడొచ్చుగాని కూర్చలేము - బెండకాయ**

**అదిగో అసురుని తల**
**అంతరాళంలో వేలాడు తుంది - దిష్టి గుమ్మడి**

పచ్చని పాము రాయి మోస్తుంది - పొట్ల
తెల్లని గుర్రానికి పచ్చని తోక - ముల్లంగి

చిటారు కొమ్మలో నిటారు పుల్ల - మునక్కాయ
తోకతో నీరు తాగుతుంది తలతో గుడ్డు పెడుతుంది - వంకాయ

'వింటే భారతం వినాలి తింటే గారెలే తినాలి' అనేది ప్రసిద్ధ నానుడి ఆంధ్రులకు గారెలు ఎంత యిష్టమో ఈ నానుడిని బట్టి తెలుస్తుంది బలహీనంగా వున్నవారికి, కొత్త అల్లుళ్లకు బలంకోసం సున్నుండల్ని, గారెల్ని పెట్టడం పరిపాటి. ఉద్దులను రాతితో విసిరిన తర్వాత పొట్టు పోను మిగిలేది పప్పే.

నల్లని గుర్రం తెల్లని గుర్రం నదికి పోయింది.
నల్లనిగుర్రం నదిలో కలిసింది.
తెల్లని గుర్రం యింటికి వచ్చింది = ఉద్దిపప్పు.

ఈ పరిశోధన వ్యాసంలో వ్యవసాయపు పనిముట్లు, చెట్లు, పళ్లు, కాయగూరలు, ధాన్యం, వంటి వ్యావసాయిక సంబంధమైన అంశాలను గురించి వచ్చిన పొడుపు కథల్ని పరిశీలించడం జరిగింది కొన్ని పొడుపు కథలు పనిముట్ల నిర్మాణాన్ని గురించి తెలియజేస్తే మరికొన్ని పొడుపు కథలు అవి నిర్వహించే పాత్రను ఆవిష్కరిస్తాయి. కొన్ని చెట్లు, కాయలు, పళ్లు, ధాన్యపు కంకులు మొదలైన వాటి రూపాన్ని చిత్రిస్తే, మరికొన్ని వాటి ఉపయోగాన్ని తేట పరుస్తాయి. పొడుపు కథలు జానపదుల మేధస్సుకు, వారి ఆలోచనా విధానానికి అద్దం పడతాయి. శ్రద్ధగా గమనిస్తే వీటిలో గూడ కవిత్వ సౌందర్యం, కమనీయిత గోచరిస్తాయి.



# తెలుగు సంస్కృతికి కాకతీయుల దోహదం

ఆచార్య హరి శివకుమార్

ఆంధ్ర దేశచరిత్రలో కాకతీయయుగం స్వర్ణయుగం శాతవాహనుల తరువాత ఆంధ్ర దేశాన్ని, ఆంధ్ర జాతిని సమైక్యం చేసి ఏకచ్ఛత్రాధిపత్యం క్రిందికి తెచ్చిన ఘనత కాకతీయులదే. నాడు 'ఆంధ్ర నగరి' అని పేరు పొందిన ఓరుగల్లును రాజధానిగా చేసుకొని, సమస్త ఆంధ్ర సామ్రాజ్యాన్ని పాలించటమే కాక తెలుగు సంస్కృతికి వారు ఎంతో దోహదం చేశారు. సాహిత్యము, సంగీతము, నృత్యము, శిల్పము వంటి అన్ని రంగాలకు వారు ఎనలేని సేవ చేశారు.

ఫయర్ జోర్డానెస్ (1323 - 1330) తన 'వండర్స్ ఆఫ్ ది ఈస్ట్' అన్న గ్రంథంలో నాటి తెలుగు దేశ వైభవాన్ని గురించి ఇట్లా వ్రాశారు- "తిల్లింగ్ రాజ్యంలో ధాన్యం, చక్కెర, మైనం, తేనె, పప్పులు, గొఱ్ఱెలు, గేదెలు, పాలు, వెన్న, అనేక రకాల నూనెలు, ఎన్నో రుచికరమైన పండ్లు, ఇండీస్ లో మరెక్కడా లేనన్ని ఉన్నాయి."- అని అట్లాగే 1323లో ఓరుగల్లును ముట్టడించిన ఉల్లాఖాన్ నగర సౌందర్యాన్ని మెచ్చుకుంటూ వ్రాశాడు- ఓరుగల్లు కోట గోడ మీద ఎక్కి నిలుచుంటే ఆయనకు ఎటు చూసినా నీరు చిమ్ముతున్న బుగ్గలు, మామిడి-అరటి-పనస మొదలైన పండ్ల తోటలు, సంపంగి-జాజి మొదలైన పూల తోటలు కన్పించాయట. ఇది అనాటి ఆంధ్ర దేశ సౌభాగ్యము

ఆ కాలం నాటి ఆంధ్ర దేశం ఎంతటి భోగ భాగ్యాలతో తుల తూగిందో అనాటి చరిత్ర కారుల రచనలను బట్టి విశద మవుతోంది. కాకతీయ ప్రభువులలో చివరివాడైన ప్రతాప రుద్రుడు 1309-1310 సంవత్సరాలలో అల్లాఉద్దీన్ సైన్యాలకు లొంగిపోయి, 300 ఏనుగులను, 7000 గుఱ్ఱాలను, అపారమైన ధన కనక రాశులను సమర్పించుకొన్నట్లు తురుష్క చరిత్రకారులే వ్రాశారు. ఆ తరువాత కొంతకాలానికి అల్లాఉద్దీన్ సేనాధిపతి మాలిక్ కాఫర్ ప్రతాపరుద్రుని సేనలను ఓడించి, 612 ఏనుగులనూ, 20,000 గుఱ్ఱాలనూ, 9,600 మణుగుల బంగారము, మణులు, నగలను ఢిల్లీకి తరలించుకొని పోయాడని, "ఆయా సంపదల బరువుకు వెయ్యి ఒంటెలు దడదడ లాడి పోయా" యని జియా ఉద్దీన్ బరానీ వ్రాశారు. ఆ తరువాత మరో రెండేళ్ళకు మళ్ళీ దండెత్తి, 512 ఏనుగులు, 5,000 గుఱ్ఱాలు,

500 మణుగుల బంగారము, నగలు, మణులు తీసుకొని పోయాడట ప్రతాపరుద్రుడు సాలుసరి కప్పం కట్టకపోయే సరికి 1318లో సుల్తాన్ కుతుబుద్దీన్ ముబారక్ ఓరుగల్లు మీద మరొకసారి దాడి చేయగా, ప్రతాపరుద్రుడు లొంగిపోయి, తాను సుల్తానుకు చెల్లించ వలసిన కప్పం చెల్లించటమే కాక, ఆయనను "తృప్తిపరచి పంపి"నట్లు ఇసామీ వ్రాశాడు మొత్తం మీద - బరాన్, అమీర్ ఖుస్రో, ఇసామీల వ్రాతలను బట్టి ఆనాడు కాకతీయ సామ్రాజ్యం ఎంత సుభిక్షంగా ఉండిందో ఊహించు కోవచ్చును అందువలననే కాకతీయులు సాహిత్య-సాంస్కృతిక-కళారంగాలకు ఎనలేని సేవ చేసి, ఆంధ్రదేశ పుటలలో తమ పేరును చిరస్థాయిగా నిలుపుకున్నారు.

**1. సాహిత్యము :** కాకతీయ రాజులలో కొందరు గొప్ప కవులు, పండితులు కూడా. మరికొందరు కవిపండితులను పోషించి సాహిత్య సమారాధన చేశారు. కాకతీయ రాజులేకాక, వారివద్ద మంత్రులుగాను, దండనాయకులుగాను, సామంతులుగాను పనిచేసిన వారుకూడా స్వయంగా కవి పండితులు- కవి పండిత పోషకులు. 12 వ శతాబ్దపు ఉత్తరార్థంలో కాకతీయ సామ్రాజ్యాన్ని పాలించిన రుద్రదేవ మహారాజు 'విద్యాభూషణ' చిరుదాంచితుడు ఆయన 'నీతిసార' మనే గ్రంథాన్ని వ్రాశాడు. గణపతిదేవ చక్రవర్తి రాజాధిరాజేకాక - నృత్తగీతవాద్య విజ్ఞాన రహస్యవేత్త. అంతేకాక - వాటిలో మార్గ-దేశి భేదాలను వివరించ గల మంచి నేర్పరి అని జాయప రచించిన నృత్తరత్నావళిని బట్టి విశదమవుతుంది. గణపతి దేవుని బావమరిది - గజ సాధనికుడు అయిన జాయసేనాని 'నృత్తరత్నావళి' అనే నాట్యశాస్త్ర గ్రంథాన్ని వ్రాశాడు అది కాకతీయుల కాలపు నృత్త సంప్రదాయాలకు అద్దం పట్టే గొప్ప గ్రంథం. జాయసేనాని నృత్త రత్నావళినే కాక, 'గీత రత్నావళి-వాద్య రత్నావళి' అనే మరి రెండు గ్రంథాలను కూడా వ్రాసినట్లు తెలుస్తున్నది. కాని అవి అలభ్యములు. గణపతి దేవ చక్రవర్తి వద్ద మహా మంత్రిగా ఉండిన శివదేవయ్య 'పురుషార్థసారము' అనే ఒక నీతి గ్రంథాన్ని, 'శివదేవ ధీమణీ' అనే ఒక నీతి శతకాన్ని రచించాడు. గణపతి దేవ చక్రవర్తికి దీక్ష నిచ్చిన గురువు, గోళకీమతాధిపతి అయిన విశ్వేశ్వర శివదేశికులు 'శివ తత్త్వ రసాయన' మనే గ్రంథాన్ని రచించాడట. కాని అవి నేడు లభించటం లేదు. విశ్వేశ్వర శివదేశికుని కుమారుడు నృసింహకవి 10 రూపకాలను, 'మలయవతి' అనే వాక్యాన్ని, ఋగ్వేద వ్యాఖ్యను వ్రాశాడట. అంతేకాక, ఒక్కరోజులో 8 సర్గలున్న

'కాకతీయ చరిత్ర' వ్రాశాడట. ఆయన వ్రాసిన కాకతీయ చరిత్ర లభించి ఉంటే అది ఎంతో ఉపయోగకరంగా ఉండేది నృసింహ కవి వ్రాసిన పై గ్రంథాలేవీ లభించటం లేదు. కాని, ఆయన వ్రాసిన 'సిద్ధోద్వాహం' అనే 63 శ్లోకాల లఘు కావ్యం ఈనాటికీ ఓరుగల్లుకు 7, 8 కిలోమీటర్ల దూరంలో ఉన్న ఉర్సుగుట్టమీద చెక్కబడి కనిపిస్తున్నది శిలమీద చెక్కిన కావ్యం ఇదొక్కటే ఇది ఒక అపూర్వమైన ప్రయోగంగా నేటికీ నిలిచి ఉన్నది.

కాకతీయులకు సామంతుడైన బద్దెభూపాలుడు 'నీతి శాస్త్రముక్తావళి-సుమతి శతకము'లను వ్రాయగా, మరొక సామంతుడైన గోనబుద్దారెడ్డి, ఆయన కుమారులు కలసి 'రంగనాథ రామాయణము'ను వ్రాశారు.

గణపతి దేవ చక్రవర్తి కాలంలోనే తిక్కన సోమయాజి నెల్లూరి నుండి ఓరుగల్లుకు వచ్చి, ఆయనకు భారతం వినిపించి, గణపతిదేవుని సహాయంతో తన ఏలిక అయిన మనుమసిద్ధి మహారాజుకు రాజ్యం తిరిగి ఇప్పించినట్లు ప్రతీతి. తిక్కన సోమయాజి శిష్యుడైన మారనకవి తన 'మార్కండేయ పురాణము'ను ప్రతాపరుద్రుని సేనాని అయిన నాగయ గన్నయకు అంకితం చేశాడు.

రుద్రమదేవి కాలంలో మంత్రిగా ఉండిన ఇందులూరి అన్నయ మంత్రి వంశంలో ఐదవ వాడైన కొలని గణపతి దేవుడు 'శివయోగసారము, మనోబోధలు' అనే గ్రంథాలు వ్రాశాడు

కాకతీయ రాజులలో చివరి వాడైన ప్రతాప రుద్రుడు గొప్పకవి, పండితుడు. ఆయన సంస్కృతంలో 'యయాతి చరిత్ర' అనె నాటకాన్ని వ్రాశాడు. తెలంగాణా సాహిత్య చరిత్రలో నాటక రచన కాకతీయుల కాలంలోనే ప్రారంభమైంది. ఈ నూతన సంప్రదాయానికి దోహదం చేసిన ఘనత కాకతీయులకే దక్కుతుంది

ప్రతాప రుద్రుని ఆస్థానంలో ఉండిన మహా విద్వాంసుడు, లాక్షణికుడు అయిన విద్యానాథుడు 'ప్రతాపరుద్రీయమ్' అనే ఒక లక్షణ గ్రంథాన్ని వ్రాశాడు. ప్రతాప రుద్రునికి సమకాలికుడైన గణపనారాధ్యుడు 'స్వర శాస్త్ర మంజరి' అనే ఒక యోగ శాస్త్ర గ్రంథం వ్రాశాడు

అట్లాగే కాకతీయుల కాలంలో వెలువడిన - మల్లికార్జున పండితారాధ్యుని 'శివతత్త్వ సారము', పాల్కురికి సోమనాథుని 'బసవ పురాణ-పండితారాధ్య

చరిత్రాది గ్రంథాలు' ఆనాటి సామాజిక-సాంస్కృతిక స్థితి గతులను ప్రతి బింబిస్తున్నాయి. తిక్కనకు సమకాలికుడైన కేతన వ్రాసిన 'విజ్ఞానేశ్వరీయము' ఆనాటి న్యాయవ్యవస్థకు అద్దం పడుతున్నది ఇదే కాలంలో వెలసిన పావులూరి మల్లన వ్రాసిన 'గణిత సారము' ఆనాటి కొలతలు-తూనికలు వంటి విషయాలు తెలుసుకోటానికి ఉపయోగపడుతున్నది.

ఈ విధంగా కాకతీయ రాజులు, వారి రాజోద్యోగులు సాహిత్యసేవ చేసి తెలుగు సంస్కృతిని పునరుద్ధరించారు

**2.** శిల్పము : 11 - 13 శతాబ్దాల మధ్య కాలంలో ఆంధ్ర దేశంలో ప్రభవించి వికసించిన శిల్పరీతికి 'కాకతీయ శిల్పరీతి' అని పేరు భారతదేశంలో ఈనాడు ఎన్నో రకాల శిల్ప రీతులు కన్పిస్తాయి. వాటన్నింటిలోను- "ఇది కాకతీయ శిల్పం" అని చూపించటానికి వీలుగా ఒక విశిష్ట రీతిని నాటి కాకతీయ శిల్పులు ప్రదర్శించారంటే, వారు తమ శిల్పకళా చాతుర్యాన్ని ఎంత ప్రతిభావంతంగా ప్రదర్శించారో మనము గ్రహింప వచ్చును.

కాకతీయులు నిర్మించిన దేవాలయాలు ఈనాడు ఆంధ్ర దేశమంతటా కన్పిస్తున్నాయి వరంగల్ జిల్లాలోని - వరంగల్, హనుమకొండ, కొరవి, అయినవోలు, ఘనాపూర్, జాకారం వంటి ప్రదేశాలలోను; నల్ల గొండజిల్లా లోని- పానగల్లు, పిల్లలమర్రి, కొలనుపాక, వాడపల్లి వంటి ప్రదేశాలలోను, కరీంనగర్ జిల్లాలోని - నగునూర్, మంథనిలలోను; మెదక్ జిల్లాలోని- బెజ్జంకిలోను, మహబూబ్ నగర్ జిల్లాలోని బూదపూర్, ఉమామహేశ్వరముల లోను, గుంటూరు జిల్లాలోని- దుర్గి, కారెంపూడి, మోటు పల్లి, మాచెర్లలోను, కర్నూలు జిల్లాలోని త్రిపురాంతకంలోను - ఇంకా ఎన్నో చోట్ల కన్పిస్తాయి అయితే- వరంగల్‌లోని శిల్పరీతి అయినా, నల్లగొండ లోని శిల్పరీతి అయినా, కరీంనగర్ లోని శిల్పరీతి అయినా- అన్నీ ఒకే పద్ధతిలో కన్పిస్తాయి అదే కాకతీయ శిల్ప ప్రత్యేకత అని చెప్పవచ్చును

ఈ దేవాలయాలు కాకతీయుల రాజధాని నగరమైన ఓరుగల్లులోనే కాక, ఆంధ్ర దేశంలోని నలుమూలలా విస్తరించి ఉండడటం గమనించ దగిన విషయము. బహుశః శత్రువుల విధ్వంసానికి ఒకేసారి గురి కాకుండా ఉండటానికి గాను, వారు వివిధ ప్రదేశాలలో దేవాలయాలు నిర్మించినట్లు అనిపిస్తుంది. కాకతీయ సామ్రాజ్య పతనానంతరం దాదాపు 150 సంవత్సరాలకు వెలసిన ఏకామ్రనాథుని 'ప్రతాపరుద్ర చరిత్ర'లో వందలసంఖ్యలో నాడు

దేవాలయాలు ఉండినట్లు నిదర్శనం కన్పిస్తుంది. అవి చాలా వరకు కాల గర్భంలో కలిసిపోయి నప్పటికీ, మిగిలి ఉన్న దేవాలయాలు నాటి సంస్కృతీ సంప్రదాయాలకు అద్దం పడుతున్నాయనటం అతిశయోక్తి కాదు

కాకతీయులు అవలంభించిన కొన్ని విశిష్ట పద్ధతుల ద్వారా అవి కాకతీయ నిర్మాణాలే అని తేలికగా గుర్తించవచ్చు అవి:- విశిష్టమైన రీతిలో చెక్కి నిలబెట్టిన స్తంభాలు; ముందుకు పొడుచుకొని వచ్చిన పైగుమ్మాలు- క్రింది గుమ్మాలు; ప్రత్యేక రీతిలో నిర్మించిన నందీశ్వరుడు, గర్భాలయ ద్వారాల పైన కన్పించే గజలక్ష్మి-వినాయకులు, గర్భాలయం పై కప్పులో కన్పించే రాతి చక్రాలు, దేవాలయాల లోపలిభాగంలో పై కప్పుకు చెక్కిన పద్మదళాలు; ఒకే పద్ధతిలో చెక్కిన పూర్ణకుంభాలు; సింహాల-పద్మాల-లతల వరుసలు, చిన్న చిన్న గర్భాలయ ద్వారాలు- ఇవన్నీ అవి కాకతీయ నిర్మాణాలో కావో నిర్ణయించటానికి సహకరిస్తాయి.

ఈ దేవాలయాలలో మరొక విశిష్టత ఏమిటంటే- వాటిని ఎవరు నిర్మిస్తే, ఆయా దేవతలకు తమ పేర్లనే వారు తగిలించారు. రుద్రదేవ మహారాజు ప్రతిష్ఠించిన ఈశ్వరుడు రుద్రేశ్వరుడు; బేతరాజు ప్రతిష్ఠించిన ఈశ్వరుడు బేతేశ్వరుడు; ఎఱకసానమ్మ ప్రతిష్ఠించిన ఈశ్వరుడు ఎఱకేశ్వరుడు- మొదలైనవి

ఆకాలంలో శైవ-వైష్ణవ మతాలకు పరస్పర స్పర్ధలు తారాస్థాయిలో ఉండినాయి అందువలననే ఆనాటి రాజులు- కవులు మత సామరస్యానికి విశేష కృషి చేశారు తిక్కన హరిహరనాథ తత్త్వము, పోతన-శ్రీనాథాది మహాకవుల రచనలలోని అద్వైత భావములు శైవ వైష్ణవ మత సామరస్యానికి చేసిన ప్రయత్నాలే! అట్లాగే కాకతీయులు శిల్పకళలో కూడా అలాంటి ప్రయత్నాలే చేశారు అందుకోసం వారు ఒకే దేవాలయ ప్రాంగణంలో శివ-కేశవ మూర్తులను నిలిపారు. అంతేకాదు- అంతకన్న మరొక అడుగు ముందుకు వేసి, శివ సంబంధమైన పానవట్టం మీద విష్ణు సంబంధి విగ్రహాలను ప్రతిష్ఠించారు

కాకతీయుల శిల్పకళ పరాకాష్ఠనొందినది - ఓరుగల్లులోని రుద్రేశ్వరాలయము, పాలంపేటలోని రామప్ప దేవాలయములలో కాకతీయ శిల్పకళా వైభవానికి ఈ రెండు దేవాలయాలూ ప్రతీకలు ఈ రెండు

ఆలయాలలోనూ లోపలి భాగంలోని ప్రతి అంగుళంలోను కాకతీయ శిల్ప వైశిష్ట్యం కన్పిస్తుంది. ముఖ్యంగా రామప్ప దేవాలయంలో- ఆనాటి నృత్య సంప్రదాయాలు గోచరిస్తాయి. అవే సంప్రదాయాలు జాయసేనాని వ్రాసిన నృత్తరత్నావళిలోను కన్పించటం విశేషం మరొక విశేషం ఏమిటంటే- రామప్ప దేవాలయ మంటపం చుట్టూ ఉన్న విగ్రహాలు దేవతా మూర్తులు కావు అవి ఆనాటి స్త్రీ మూర్తులవి. అంటే- సాధారణ స్త్రీ మూర్తులకు దేవాలయాలలో స్థానం కల్పించిన ప్రథములు కాకతీయులే! ఇలాంటి సత్సంప్రదాయాన్ని ప్రారంభించిన వారు కాకతీయులే!

మరొక విశేషం- ఈ దేవాలయాల మీద బరువు లేకుండా ఉండటానికి చిన్న చిన్న గోపురాలను మాత్రమే నిర్మించారు అవి కూడా బరువుగా ఉండకుండా ఉపయోగించిన ఇటుకలు ప్రత్యేకమైనవి అవి నీళ్లల్లో వేస్తే తేలుతాయి. అలాంటి ఇటుకలు నేటికీ లభిస్తాయి

ఇలాంటి శిల్ప కళా విశేషాలు కాకతీయ శైలిలో ఇంకా ఎన్నో కన్పిస్తాయి

**3. సంగీతము :** గణపతి దేవ చక్రవర్తి బావ మరిదియైన జాయపసేనాని రచించిన గీత-వాద్య-రత్నవాళాలు లభించి ఉంటే సంగీత కళారంగానికి కాకతీయులు సేసిన సేవ తెలిసేది. కాని అవి లభించక పోయినప్పటికీ పాల్కురికి సోమనాధుని బసవపురాణ-పండితారాధ్య చరిత్రలు ఆలోటును పూరిస్తున్నాయి. సోమనాథుని రచనలలో ఎందరో సంగీతజ్ఞులు ప్రస్తావింప బడినారు బసవేశ్వరుని- 'గాన రస ప్రవాణ', 'నాదకళా వినోద', 'అపూర్వ గీతగాంధర్వ' అని సోమన ప్రస్తుతించాడు. బసవన్నను దర్శింప వచ్చిన అల్లమ ప్రభువు కూడా గాంధర్వ పండితోత్తముడే! సకలేశ్వర మాది రాజయ్యా 'అకలంక నాదవిద్యా పండితుడు, సకల వీణాకళాకోవిదుడు. ఆయన వివిధ వీణలపైన- మొగచాళము, నవతాణము, సవతాణము, తాళపట్టి, కత్తరి, చోళవళి, సారణ- వంటి అనేక రాగాలతో ఈశ్వరుని కీర్తించేవాడట. బహు శ్రుతులు, ధ్వనులు, గమక సప్తకములతో, స్థాయిత్రయంలో, లయబద్ధంగా దేశిరాగాలు వాయించేవాడట! (బసవ -పు.207, 208) పండితారాధ్య చరిత్రలో ఒక బ్రాహ్మణుడు- మొసలి చంపిన తన కొడుకును బ్రతికించుకోటానికి- తాళము వేసి, సప్తస్వరోదాత్త బంధుర ధ్వనితో పాటపాడి, ఈశ్వరుని అనుగ్రహంతో తన తనయుని పొందినట్లు సోమన వర్ణించాడు.

